# శ్రీ రామాయణ కాల నిర్ణయ పట్టిక.

వైవస్వత మన్వంతరమున

పంచమ త్రేతాయుగమున

నాలుగవభాగమున — 30000 వ సంవత్సరము.

| ముఖ్యవిషయములు | సంవత్సరము | మాసము | | తిథి |
|---|---|---|---|---|
| శ్రీరామజననము | విళంబి | చైత్రము | శు | ౯ |
| ,, ఉపనయనము | పరాభవ | ,, | శు | ద్ధము |
| కౌశిక యజ్ఞ సంరక్షణము | సౌమ్య | మాఘ | బ | ౫/౧౦ |
| అహల్యాశాపవిమోచనము | ,, | ,, | ,, | ౧౪ |
| శివ ధనుర్భంగము | ,, | ,, | ,, | ౩౦ |
| సీతాకళ్యాణము | ,, | ఫాల్గుణ | శు | ౧౫ |
| పరశురామగర్వభంగము | ,, | ,, | బ | ౧౦ |
| శ్రీరామవనాగమము | దుందుభి | చైత్రము | శు | ౫ |
| దశరథనిర్యాణము | ,, | ,, | శు | ౧౦ |
| పాదుకాప్రదానము | ,, | వైశాఖ | శు | ౧౦ |
| శ్రీరామదండకవనప్రవేశము | ,, | ,, | శు | ౧౫ |
| సీతాపహరణము | యువ | జ్యేష్ట | శు | ౧ |
| వాలివధము | ,, | ఆషాఢ | శు | ౧౫ |
| లంకాదహనము | ,, | ఫాల్గుణ | శు | ౧౪ |
| శ్రీరామయుద్ధయానము | ,, | ,, | శు | ౧౫ |
| సేతుబంధనము | ,, | ,, | బ | ౪/౮ |
| ఇంద్రజిత్తు మరణము | ,, | ,, | బ | ౧౩ |
| రావణ సంహారము | ,, | ,, | బ | ౩౦ |
| శ్రీరామపట్టాభిషేకము | ధాతు | చైత్రము | శు | ౨ |

శ్రీరస్తు

# శ్రీ రామాయణ గానము



గ్రంథకర్త

## వంగిపురం వెంకట రంగాచారియర్

కాకినాడ (తూ. గో.)

---

"ఆపదామపహర్తారమ్ దాతారం సర్వసంపదామ్.
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమమ్యాహమ్".



" శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం ।
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం ।
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం ।
రామం నిశాచర వినాశకరం నమామి."

---

కాకినాడ శ్రీ పట్టమట్ట శేషగిరిరావుగారి జార్జిప్రెస్ యందు

ముద్రితము

(1955)

# కృతిసమర్పణ.

ధరను మంగళాద్రియ్యంగారికి ♦ ధర్మపత్నివగుచు
గరిమతోడ చూడమ్మను పేరట ♦ కాపురమొనర్చుచు
పుట్టినిల్లుయగు బేతవోలు పుర ♦ ముదుంబ వారికిని
మెట్టినిల్లు వంగిపురం వారికి ♦ మెప్పుగన్న జననీ!
అమ్మా! ననునీరత్నగర్భమున ♦ అనేకశ్రమలబడి
తొమ్మిది నెలలును మోసిగంటివహా ♦ తొలుతదనగచూడి,
బాలార్కునివలె నీయుండను నే ♦ పాలుగుడిచి మాతా!
కాలుదృష్టి బడకను బెరిగితి నీ ♦ కడుపు చలవచేత.
నాకు నాయురారోగ్య సంపదలు ♦ చేకురదీవించి
సాకుతునున్నా వనేక సూక్తులు ♦ చక్కగ బోధించి
తల్లీ! నీఋణముం దీర్పగ నా ♦ తరముగాదు గాని
వల్లనైనటుల శ్రీరామునికథ ♦ వ్రాసితి నిద్దాని
నంకిత మొసగుచు నుంటిని నీకిదె ♦ అమ్మా గైకొనుము
వెంకటరంగాచార్యుడ, తనయుడ ♦ వినుమిదె వందనము.









కృతి స్వీకర్త్రి :

## శ్రీమతి వంగిపురం చూడమ్మగారు

( గ్రంథకర్తకు తల్లిగారు )

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః



శ్రీ రఘురామ హరేరామహరే। సీతారామహరే

తారకనామ హరేరామహరే। దశరథరామహరే॥

## —: శ్రీ రామాయణగానము :—

(బా ల కా ం డ ము)

శ్రీమహాలక్ష్మి పదపద్మంబులు ♦ చిత్తంబున దలచి
శ్రీ మదర్క కులజుల కిలవేల్పగు ♦ శ్రీరంగనిగొలచి
శ్రీరాముని చరితంబును దెలిపెద ♦ చేరి దీనివినుడీ
కారుణ్యాలయ భక్తవరద శ్రీ ♦ కాంతుని కృపగనుడీ
శ్రీరఘురాముని సీతాకాముని ♦ చింతన జేయండీ
సారరహితసంసారము నీదెడు ♦ సాధన మనుకొండీ
రఘురాముని భజియించుచు మీామీా ♦ యఘములబాయండీ
అఘటిత ఘటనా ఘటితుండాతని ♦ యండను జేరండీ
చరాచరాత్మకుడాతని గొలుచుచు ♦ సంపదలొందండీ
నిరామయుడు నిర్వికారుడాతని ♦ నిరతము తలవండీ.

ఇహపరసౌఖ్యము, లనుగ్రహించెడు ♦ పెద్దడ యతడండీ
మహామహుం డాతని శ్రీపదప ♦ ద్మంబులనమ్మండీ
అండపిండ బ్రహ్మాండనాయకుం ♦ డాతని గొలువండీ
అండజవాహను డతనికి మీరలు ♦ దండము బెట్టండీ
రామ రామ శ్రీసీతారామా ♦ రామ రామ యనుడీ
'రామ' యనెడు తారక మంత్రామృత ♦ రసముగ్రోలి మనుడీ
'రా' యనునది జీవాక్షరంబు నా ♦ రాయణ మంత్రమున
'మ' యనునది జీవాక్షరంబు శివ ♦ మంత్రంబునను ఘన
శివ - మాధవమంత్రంబుల గల యీ ♦ జీవాక్షర ద్వయము
శివయ 'రామ' యను తారకమయ్యెది ♦ ఘనము కలుషహరము
శ్రీరాముడు 'హరి' సీత 'లక్ష్మియే' ♦ 'శేషుడె' లక్ష్మణుడు
గారెభరతశత్రుఘ్నులు 'శంఖుచ ♦ క్రాంశులు' గ్రహింపుడు.
అలవైకుంఠపురంబున జయ విజ ♦ యులు సనకాదిమునీ
శుల శాపంబున రాక్షసజన్మము ♦ గలవారై భువిని
రావణుడన కుంభకర్ణుడన నై ♦ రము హరితోగలుగ
దేవవిప్రతాపసాదులను బా ♦ ధించిరి క్రూరముగ.
రావణు బాధల నోర్వలేక తమ ♦ రక్షణకై హరిని
దేవేశజరుద్రాదులు వేడగ ♦ శ్రీవిభుండె భువిని
తరణి కులోద్ధారకుడై బుట్టెను ♦ దశరథసూనుండై
ధరను ధర్మసంస్థాపన జేసెను ♦ ధరణిజా విభుండై.
లీలతోడ తద్రామచరిత వా ♦ ల్మీకిముని రచించి
బాలులైన కుశలవులకు తానది ♦ బాగుగ బోధించి
శ్రీరాముడు మున్నశ్వమేధమును ♦ జేయుచున్న తరిని
ఆ రామాయణ మట బాడుండని ♦ ఆజ్ఞనిడెను వాని.
కుశలవులంత నయోధ్యాజనములు ♦ గూడి పొగడ మిగుల
విశదముగా శ్రీరాముని చరితము ♦ వినిపించిరి యిటుల,

# శ్రీరామావతారము

"శ్రీరఘురామ హరేరామహరే ♦ సీతారామహరే."

"తారకనామహరే రామహరే ♦ దశరథరామహరే"

ధరనయోధ్యయన గలదుపురవరము ♦ సరయూతటమందు.
పురమేదియు సమమైనది దానికి ♦ పుడమిని లేదెందు
అవనిని కోసలరాజ్యంబునకది ♦ అగును రాజ్యధాని
రవికులరాజుల పాలెముపట్టై ♦ ప్రసిద్ధమగు దాని
శమరపురియె సామ్యంబననొప్పును ♦ అరయ శోభకరము
రమా యుమా శారదలకు నిలమై ♦ రంజిలు తత్పురము
బర్మహర్మ్యములు కర్మాగారములు ♦ భవనంబులు వెలయు
నిర్మలమగు నెలతావుల కయ్యది ♦ నిలయమగును మరియు
కనకగోపుర ప్రాకారంబులు ♦ కందకములు గలవు
వనవాపీకూప తటాకంబులు ♦ వాడలందుగలవు.
చాతుర్వర్ణంబులతో నగరము ♦ ఖ్యాతినొందుచుండు
నీతినియమములు గలిగి జనావళి ♦ నృపుని గొల్చుచుండు
బుధకవిగాయక వైతాళికులతో ♦ పూజ్యంబగుచుండు
రథగజతురగ పదాతిసైన్యములు ♦ అధికంబుగనుండు
ఆపురినేలుచునుండెను దశరథు ♦ డనెడురాజు మున్ను
తాపసశ్రేష్ఠు వశిష్ఠు గూడుకొని ♦ ధర్మముతప్పకనూ.
అష్టమంత్రులను ఆలోచించుచు ♦ నవనినేలుచుండు
శిష్టరక్షణము దుష్టనిగ్రహము ♦ జేయు దశరథుండు
కష్టసుఖంబుల గనుచు జనంబుల ♦ కాపాడుచునుండు
నిష్ఠురంబుబడకాతడు ప్రజలకు ♦ ఇష్టుండైయుండు.
సర్వసుగుణసంపన్ను డుదారుడు ♦ సత్యభాషణుండు
గర్వరహితు డాశ్రితజనపాలుడు ♦ కారుణ్యాకరుడు.

అతనికి ముప్వురు భార్యలు కౌస ♦ ల్యాసుమిత్రకైకల్
పతివ్రతలు భారతి రమ యుమలకు ♦ జతలనదగు ప్రతిమల్
ఇట్టుల నరువదివేలేడులు ధర ♦ నేలు డేలెగాని
పట్టపురాణులు ముప్వురెవ్వరును ♦ బడయరు నొకసుతుని
అఖిల భాగ్యభోగ్యంబుల కాస్పదు ♦ డయ్యును యెల్లపుడు
సుఖకాజాలక చింతిలుచుండెను ♦ సుతులులేక యతడు
ఎంతగల్గినను ఏమిఫలము భువి ♦ సంతానములేక
అంతరించు గద ఇనకులమింతట ♦ అపుత్రకుడ గనుక
దానధర్మ జపతపోహోమములు ♦ చాలజేసినాడ
కాని గలుగడొక సుతుడైనను స ♦ ద్గతులకు తావునిడ
అపుత్రకుల కిలగతులులేవనుచు ♦ నార్యులు బల్కెదరు
కృపరాదుగదా కులదైవము రం ♦ గేశున కొకమారు.
అనుచు నిరంతర చింతాక్రాంతుం ♦ డై దశరథు డుండ
అనియె సుమంత్రుండిట్టుల నృపునకు ♦ 'మును లనుకొనుచుండ
మునువింటిని నే ఋష్యశృంగఘన ♦ మునినిట గొనివచ్చి
ఒనర పుత్రకామేష్టియాగమును ♦ యొనరింపగ మెచ్చి
ఇనకులోద్భవుల నల్వురుతనయుల ♦ నిచ్చును హరినిజము
ఘనుడు ఋష్యశృంగమహామునిచే ♦ నొనరింపుము మఖము
చిత్తగింపుమా యుత్తమమునికథ ♦ చిత్తరంజకంబు
నెత్తిపైనియొక శృంగముగల దత ♦ నికి మహాద్భుతంబు
స్త్రీపురుషాది వివక్షత నెఱుగని ♦ స్థితినుండెడివాడు
తాపసవంద్యుడు రోమపాదనృపు ♦ తనయ శాంతవిభుడు.
తనయుడు విభాండకునకు కశ్యపుడు ♦ తాతగు నాతనికి
అనుపమానమగు యంగదేశమే ♦ యాతని కిపుడునికి.
రోమపాదుడేలంగ దేశమున ♦ క్షామముగలుగ మును
భూమిపాలుం డాలోచనజేసెను ♦ బుధులెల్లరతోను

ఘనుని ఋష్యశృంగుని మనదేశము ♦ గొనివచ్చిన యెడల
అనుకూలించును క్షామంబరుదగు ♦ ననుచును కామినుల
పలువురశృంగారించి మునిని తే ♦ బంపిరతని కడకు
కులుకుచు వారలు యాశ్రమంబరిగి ♦ నిలిచిరి మునికొరకు
అంత ఋష్యశృంగుండు వారిగని ♦ యాత్మ సంతసించి
ఎంతటి ఘన మును లగుదురో వీరని ♦ ఎంచి గౌరవించి
యుచితాసనములు నర్ఘ్యపాద్యములు ♦ రొసగి సత్కరించి
అచట లభించెడు కందమూలముల ♦ నందర కర్పించి
వారలు దెచ్చిన భక్ష్యభోజ్యముల ♦ నారగించి మెచ్చి
వారు ధరించిన చీనాంబరయా ♦ భరణంబుల గాంచి
వారి వయోలావణ్యరూపముల ♦ వైఖరి గమనించి
వారల స్త్రీలని యెఱుగక యమముని ♦ వరులని భ్రమియించి
'మీరు ధరించిన నారవస్త్రములు ♦ మృదువు లయ్యెమిగుల
మీరలు దాల్చిన తులసిపూసలహా మెరయుచుండె చాల
ఏయాశ్రమ వాసులు మీరెవ్వరు ♦ ఎచ్చట మీతావు
మీయాకృతి గనఘనులసిదోచెడు ♦ మీయెదపై గలవు
రెండు శృంగములు ! నాకొక్కటియే ♦ యుండె నుదిటిపైన
దండి మానులతి ధన్యులు మీరలు ♦ తప్పక ధరలోన'
అనుచు ముగ్ధతం బలికెడు అమాయ ♦ కునికనె వారపుడు
'మునివరేణ్య మా యాశ్రమమిచ్చటి ♦ కనతి దూరముండు
అచ్చట మాకన్నను ఘనులున్నా ♦ రిచ్ఛగించితేని
వచ్చి వారలను జూచి తిరిగిరా ♦ వచ్చు' ననగమాని
వారి వెంటజని నంగదేశమున ♦ పాదంబిడె నంత
పైరులు ఫలించె వర్షంబులు బడి ♦ బాసెకరువు వింత !
ఆముని పుంగవు నాహ్వానించుచు ♦ రోమపాదనృపుడు
ప్రేమతో నతనికి తనసుత శాంతను ♦ బెండ్లి జేసెనపుడు

అతఁడు యంగదేశంబున యుండెను । యాతని నర్థించి
సుతులను బడయఁగ నిష్టిని జేయుము ♦ శుభంబగును మించి
అనుచు సుమంత్రుఁడు దెల్పిన దశరథు ♦ డానందముతోడ
ఘనుని ఋష్యశృంగుని దోడ్తెచ్చెను ♦ శాంత శాంతతోడ.
సరయూతటమున యజ్ఞంబున కొక ♦ శాలను నిర్మించి
బరగ వసంతంబగు నాటికి సం ♦ భారంబుల గూర్చి
వశిష్ట భారద్వాజ కశ్యప ♦ ప్రముఖుల రావించి
దశరథు డొనర్చె నశ్వమేధ యా ♦ ధ్వరమును ధృతిమించి.
పిదప ఋష్యశృంగధ్వర్యము నడి ♦ పింప దశరథుండు
ఒదిగి పుత్రకామేష్టి యథావిధి ♦ యొనరించెను యపుడు
దివ్యభూషణుఁడు పీనవక్షుఁడును ♦ దినకర తేజుండు
భవ్యాకారుడు కృష్ణవర్ణుఁడును ♦ పరమోదారుండు
ప్రాజాపత్యనరుండును రక్తాం ♦ బరుఁడు పావనుండు
పూజనీయుఁడును పృథులాంశుం డగు ♦ పురుషు డొక్కరుండు
పావక గుండమునందుఁ యుండి యొక ♦ భర్మపాత్రమునను
దేవదత్తమగు పాయసముం గొని ♦ దెచ్చి నృపున కనెను
'మనుజనాథ ! యిది క్రతువు ఫలము గై ♦ కొనుమీ పాయసము
తిన నీసతు లిది పుట్టును నల్వురు ♦ తనయులు నిశ్చయము'
అనుచు దశరథున కొసఁగి దాని యత ♦ డంతర్హితుడైన
తనజన్మము సఫలత నొందెనఁ యసి ♦ దశరథుడటుపైన
సగము పాయసము కౌసల్యకును ♦ మిగిలిన సగమునను
సగము సుమిత్రకు ఆ శేషంబున ♦ సగంబు కైకకును
మిగిలిన యష్టమభాగము మరల సు ♦ మిత్రకొసగ ప్రీతి
మగువలు ముగ్వురు దాని భుజించిరి ♦ మగడిచ్చినరీతి.
దేవ నిర్మితంబగు పాయసమును ♦ తినిన పిదప సతులు
మూవురు గర్భంబుల దాల్చిరి స ♦ మ్మోదమున ప్రతివతలు॥

శిశువులులోనన్ బోదల సతులకును ♦ చిట్టుమ్ములుబుట్టె
విశదంబై చూలులోకి లింతలు ♦ వింతగ గన్పట్టె
కుచాగ్రంబులు న్కరులును నలుపై ♦ కోర్కెలు మెండయ్యె
రుచియయ్యెను మస్నత్తులు తెలుపై ♦ రూపులు స్ఫుటమయ్యె
నిర్భరానందమునను దశరథుడు ♦ నిరీక్షించుచుండ
గర్భవతులకును నవమాసంబులు ♦ గడచె ముదమునిండ
ఇంతులకును నీళ్ళాడ ప్రొద్దులని ♦ యెంచగ జనులెలమి
అంతట విళంబివత్సర చైత్రము ♦ నందు శుద్ధనవమీ
పునర్వసూనక్షత్రయుక్తమగు ♦ పుణ్యాదినమునందు
ఘనముగ మధ్యాహ్నంబునందు క ♦ ర్కటకలగ్నమందు
రాసులనైదుగ్రహంబు లుచ్చలో ♦ రంజిల్లుచునుండ
కౌసల్యాసతిగనె శ్రీరాముని ♦ కష్టములేకుండ
కైక 'భరతు'గనె పుష్యమియందున ♦ గనెను సార్పభమున
ప్రాకటముగ 'లక్ష్మణశత్రుఘ్నుల' ♦ పడతి సుమిత్ర విన.
కొమరుల నల్వురగని సతీపతులు ♦ కొదువదీరె ననిరి.
క్షమ తమజన్మలు సార్థకమయెనని ♦ సంతుష్టినిగనిరి.
తరణి వంశవృక్షంబు ఫలించెను ♦ తత్పూర్వులుమెచ్చ
సురనరకిన్నర గరుడోరగవా ♦ నరులు సంతసించె.
రావణాదిరక్కసుల మనముల ♦ ప్రగుణమయ్యె వినగ
జీవకోట్లెలను బ్రహ్మానందము ♦ జెందెను అమితముగ.
లేకలేక తనకిన్నాళ్ళకు గ ♦ ల్గిన శిశువులగాంచి
లోకసహజముగ దశరథనృపుండు ♦ లోలత్వముమించి
లక్షణంబుగా జాతకర్మ మొద ♦ లైనవి గావించి
పక్షపాతమినుమంతయు లేకను ♦ బాలకులను బెంచి
సకాలమున యన్నము ముట్టించియు ♦ చౌలాదులజేసి
సకలవిద్య పరిపూర్ణులజేసెను ♦ చదువులబడవేసి.

ఉపనయనంబులు జేసెను వారికి ♦ యుక్తవయస్సునను
సఫలమనోరథు దశరథ నృపునకు ♦ సాటిగలరె ధరను
దశరథు డట్టుల రాజ్యం బేలెడు ♦ తరుణ మొక్కనాడు
కుశిక నందనుడు విశ్వామిత్రుడు ♦ ఋషికులోత్తముండు
అరుదెంచిన గని నర్ఘ్యపాద్య యుచి ♦ తాసనంబు లొసగి
అరసి కుశల మత్యాదరమున యి ♦ ట్లనె దశరథు డెఱిగి.
అపరబ్రహ్మవు నీవు రాక బ్ర ♦ హ్మానందము శుభము
తపసిమిన్న ! నే ధన్యుడనైతిని ♦ తరించె నాకులము
ఊరక రారు మహానుభావు లిటు ♦ యున్నదె యెద్దేని
కోరిక మారాడక నిచ్చెద నది ♦ కోరుడనగ మౌని,
'చేయుచుంటి నేయజ్ఞంబొక్కటి ♦ జెరుపుచుండె దాని
న్మాయావులు మారీచ సుబాహులు ♦ మత్సరంబు బూని
సాయము బాపుము రాముని నాతో ♦ జంప వారినిపుడు
ప్రాయము నాలోచింపకు వెఱుపకు ♦ పరమాత్ముం డతడు
అను మునిపల్కులవిని దిగులొందుచు ♦ ననె దశరథు డిటుల
మునికులతిలకా, ముసలితనంబున ♦ గనినాడను సుతుల
అందు రాము ప్రేమింతు మిగుల నే ♦ నతని విడువజాల
జెందుదుమృతి ధ్రువముగ రాముడు నా ♦ చెంతలేని యడల
విల్లమ్ములు చేబట్టలేడు కడు ♦ పిన్నవయసువాడు
అల్లరక్కసుల జంపగరాముని ♦ వల్లగాదు యిపుడు
సుందరు డతిసుకుమారుం డసురుల ♦ జూడ భయముజెందు
వందనంబు శ్రీరాముని కోరగ ♦ వలదు వేడుకొందు.
జనుమా, దనుజుల జంపెద నేనే ♦ సబలంబుల తరలి'
అనవిని అవనీధవునిం గని ముని ♦ యనె మనమున కనలి
'ఆడియు దప్పనివాడవనుచు నే ♦ నడిగితి రాఘవుని
బాడియె నీవిట్లాడగ భూవర ♦ పౌరుషమును మాని.

దుష్టరక్కసుల జంపగజాలరు ♦ స్రష్టయు శివులైన
ఇష్టమైన శ్రీరాముని బంపుము ♦ ఏగెద లేకున్న
అనవిని గురువువశిష్టు డడ్డుబడి ♦ యనె దశరథ నృపుతో
'అనుపుము రాముని మునివరు వెంటను ♦ అనుజలక్ష్మణునితో
భద్రింబగు శ్రీరామభద్రునకు ♦ భయములేదు ఏ యు
పద్రవంబు రాజాలదు; గలుగును ♦ పరమయశము మరియు
రాముడు జగదభిరాముడు సుగుణ ♦ స్తోముడమిత బలుడు
రామున కసాధ్యకార్యము గలదే ♦ రాక్షస కులహారుడు
రాముని జన్మరహస్య మెరుగుదుము ♦ రాణ్మునియును, నేను
శ్రీమన్నారాయణ నీసుతుడై ♦ క్షితిపై బుట్టెవిను'
నావిని నంతట రామలక్ష్మణుల ♦ నరపతి బిలిపించి
పోవనాజ్ఞనిడె గాధేయునితో ♦ దీవన గావించి
తల్లిదండ్రి గురుదైవంబులకును ♦ దండము లర్పించి
ఎల్లరి శుభయాశీస్సుల గాంచి వి ♦ హితములను గ్రహించి
సురుచిరముగ వాద్యంబులు మ్రోయగ ♦ సురలు వినుతిచాయ
శరచాపంబులు వెలయ హారములు ♦ యురములందు మెరయ
ప్రజ్ఞమీర మారీచ సుబాహు ♦ ప్రముఖుల వంచించి
యజ్ఞము సంరక్షింపగ జనకుని ♦ యాజ్ఞ ననుసరించి
ధర్మము సంస్థాపన మొనరింపగ ♦ ధరభరమును దీర్ప
బర్మహర్మ్యములు బాసి విపినముల ♦ పర్యటనము సలుప
అడుగుల నడుగులు నిడుచును గాధే ♦ యుడుజన హర్షముతో
వెడలెను రాముడు లక్ష్మణయుతుడై ♦ వెనువెంటను మునితో
పురము విడిచి మువ్వురుంకొంత ద ♦ వ్వరిగిన యమ్మౌని
పరమ విద్యలను రెంటిని "బలాతి ♦ బలల"ని యెదువాని
నుపదేశించెను రామున కక్షు ♦ త్పిపాసములు తొలగ
అపజయ, అపాయ, ఆయాసము లరు ♦ దై విజయము గలుగ

ఊహాపోహోత్సాహ యుక్తిప్రయుక్తు ♦ లుద్భవములుగాగ
కృపయు దయయు దాక్షిణ్యకీర్తులు ♦ కృతజ్ఞతతో వెలుగ
వినయ విద్య విజ్ఞాన విన్ననువు ♦ విక్రమములు గలుగ
అనుప మాయురారోగ్య మహిమలును ♦ ఐశ్వర్యము గలుగ.
ఘనవిద్యల నివి గ్రహించి రాముడు ♦ కళకాంతులు గప్ప
అనుజయుతుండై కామాశ్రమమున ♦ జనుచు మౌని జెప్ప
ఆ యాశ్రమవృత్తాంతం బచ్చట ♦ హరుడు తపము తొల్లి
జేయుచునుండగ దానిని భంగము ♦ జేసెననని ఎల్లి
కాము డీశ్వరుని కంటిమంట ♦ దగ్ధంబగు చరితమును
ఆమూలాగ్రంబుగ విని జనుచును ♦ అటవి నొకటిగనెను
'ఆవన మెవ్వరి' దను శ్రీరామున ♦ కనెనిట్టు మునివరుడు
సావధాన చిత్తుండవై వినుము ♦ 'జనపథములు రెండు
గలవు సంపదలబొదలి నిటమలద ♦ కరూశంబులనగ
కలిసు కేతుడను యక్షుండిట మును ♦ నలువ మనసుగరుగ
తపము జేసిగనె సహస్రగజబల ♦ తాటకయను సుతను
అవలాపంబున సుందున కొసగెను ♦ ఆలిగ కొమరితను
సుందుడు తాటకయం దొక మారీ ♦ చుండను సుతుగాంచి
జెందెను మృతి తాటక తనయునితో ♦ జేరి యనుగమించి
అగస్త్యమౌనిని మ్రింగ దలంచిన ♦ అలిగి మునివరుండు
తగశాపంబిడ దానవులైరిట ♦ తాటకయును సుతుడు.
అది మొదలుగ యివ్వనమున తాటక ♦ అల్లాడుచునుండు
క్షుదగొని జనముల భక్షించుచు కడు ♦ క్షోభ బెట్టుచుండు'
అనునంతలో పెనుబొబ్బల నిడుచును ♦ కనుల నెఱ్ఱజేసి
తనువు దూల వడి దాపుకు వచ్చెను ♦ తాటక, రాకాసి.
'ఆవచ్చెడిదే తాటక గనుమా ♦ అనెముని రామునితో
నీవు విల్లునమ్ముల సంధించుకు ♦ నిలువుము ధైర్యముతో

స్త్రీవధ నింద్యంబనక మదాజ్ఞను ♦ శీఘ్రమె వధియింపు
మీవిధి దుష్టస్త్రీలనుజంపిరి ♦ ఎందరో గనమునుపు.
దేవేంద్రుడు మును విరోచనసుతను ♦ దెగటార్చెను వినుము
శ్రీవిభుండు భృగుపత్నినిజంపెను ♦ సిద్ధము లేదఘము'
నావిని రాముండేసె తూపొకటి ♦ నాట దానియెదను
జీవరహితయై తాటకగూలెను ♦ క్షితితాళమువలెను.
దేవదుందుభులు మ్రోగెను, జేసెను ♦ దేవేంద్రుడు నుతులు
ధీవరుడౌ శ్రీరాముని బొగడిరి ♦ ద్విజులును మునివరులు
ఆవనమునగల జీవకోటి బ్ర ♦ హ్మానందమునొంద
మూవురువెడలిరి; మార్గమందు రా ♦ మునకు పలాని వివిధ
అస్త్రములుపదేశించెను ఉపసం ♦ హారంబులతోడ
అస్త్రములన్నియునేర్చెను రాముడు ♦ అనుజునకునుగూడ.
అంతలోన సిద్ధాశ్రమంబునకు ♦ నరిగిరి మువ్వురును
సంతసమందిరి వారలగని యా ♦ శ్రమమున నెల్లరును.
ఆయాశ్రమముననే కౌశికముని ♦ యజ్ఞంబగుచుండె
ఆయాగమురక్షింపగ రాముని ♦ యటకుదెచ్చియుండె
వచ్చియున్న శ్రీరామలక్ష్మణుల ♦ హెచ్చరించి మునులు
మ్రుచ్చులైన మారీచసుబాహులు ♦ అచ్చటి కెపుడెటులు
వచ్చెదరో తమయాగంబునకు ♦ న్వారుజేయు హాని
చెచ్చెరదెల్పిన రామలక్ష్మణులు ♦ జేతుల విలులూని
ఒప్పుగ విశ్వామిత్రుని దీవన ♦ లొందుచు ధృతితోడ
ఎప్పుడుదానవు లొత్తురోయనుచు త ♦ దేకదృష్టితోడ
అహర్నిశంబులు ఏమరులేకను ♦ అనిమిషులైయుండి
సహస్రాక్షులతో గాచుచుండిరా ♦ జన్నం బటనుండి.
వేదవిహితముగ కౌశికు డగ్నిని ♦ వ్రేల్చ వేదియందు
ఐదుదినంబులు గడచెను అటుపై ♦ నారవదినమందు

పావకు డాజ్యాహుతులం గొనుచును ♦ ప్రజ్వరిల్లుచుండ
గావలిగ్గా చెడు రామలక్ష్మణులు ♦ కళవళబడుచుండ
మింటను కోలాహలమయె నదిగని ♦ వెంటనె రాముండు
'కంటివె! లక్ష్మణ యాకసమున ర ♦ క్కసుల యొక్కదండు
వచ్చుచుండె బహువేగముతో మన ♦ వైపున కేవారు
తెచ్చుచుండిరదె రక్తమాంసములు ♦ తృటిలో రాగలరు
మారీచుండు సుబాహువు లరిగో । మధ్యను అధిపతులు
వారలగూడిన వారలనేకు ల ♦ వార్య శౌర్యయుతులు
వచ్చిన రక్కసులక్కలు దూరగ ♦ వ్రక్కలించి వైతు
చెచ్చెర బాణపరంపర వారల ♦ జీల్చి చెండివైతు
ధనుర్బాణముల తోడ నిలువుమిట ♦ ధైర్యము పెంపొంది'
అనుచు నారిటంకారము జేసెను ♦ యాగగ్రిహమును జెంది
అంతలోన మారీచసుబాహువు ♦ లసురగణముతోడ
చెంతకరిగి మునియజ్ఞము విఘ్నము ♦ జేయుగ జూచు నెడ
మానవాస్త్రమును వైచెను రాముడు ♦ మారీచుని మీద
దానమారార్చబడె శతయోజనములు ♦ దాటినొంది బాధ
వెంటనె రాముండాగ్నేయాస్త్రము ♦ వింటను సంధించి
కంటకుడైన సుబాహు బాహువుల ♦ రెంటి నడుమజూచి
విడువతచ్ఛరము తగిలి సుబాహువు ♦ బడెధరపై జచ్చి
తడయక నొక యస్త్రంబున దక్కిన ♦ దనుజుల దెగటార్చి
విజయుండై శ్రీరాముడు నిలచెన ♦ నుజునితో విలుడించి.
అజరుద్రిమహేంద్రాదులు బొగడిరి ♦ యతనిశక్తి మెచ్చి
తానొనరించిన యజ్ఞసఫలతకు ♦ ధన్యవాదు లొసగి
వేనోళ్ళను గొని యాడెను రాముని । విశ్వామిత్రుడాగి.
మరుదినమున గాధేయుడు రామల ♦ క్ష్మణులతో ననెనిటులు
'దరిలోగల దొకపురము మిథిలయన ♦ దాని జనకుడేలు

ఆయూరను గల దొక విల్లదియును ♦ హరుచె విడువబడెను
ఆవిలునెత్తగ లేకుండిరి భువి ♦ యావరకెవ్వరును
ఆపురాధిపునకుంగల దొకసుత ♦ అవనిజాత సీత.
"ఏపురుషుం డిలనైన యావిలును ♦ ఎక్కిడి పైకెత్త
జాలిన నాతని కొసగెద సుత"నని ♦ జనకనృపాలుండు
జాలము సేయకపోవుద మచటికి ♦ చాపము గనరండు
జనకుని శపథము విని పెక్కురు శివ ♦ ధనువెత్తగ వచ్చి
జనిరి భంగపడి దాని కదల్పగ ♦ జాలక మదినొచ్చి
రామా ! నీకా ధనువుసాధ్యమగు ♦ నేమో యెవడెరుగు
భూమి జాతతో నీకిల పరిణయ ♦ మొదవిన బహుబాగు.
మునిపల్కుల కానంద మొంది రా ♦ ముండు లక్ష్మణుండు.
మునివరువెంటను పయనం బయ్యిరి ♦ జనకుని పురికపుడు.
దారిని శోణాతటము జేరిముని ♦ దశరథ తనయులకు
చారిత్రంబు లనేకము దెల్పుచు ♦ శ్రమంబు దీరుటకు
తన చరిత్ర తన తండ్రి తాత ము ♦ త్తాతల చరితలను
తనరగ తద్దేశస్థితి గతులను ♦ తానట నుండుటను
వివరంబుగ వినిపించి 'గంగ' గని ♦ వెడలిరటకు ఘాడి
భువనత్రయముల బాఱు 'గంగ' జల ♦ ములను స్నానమాడి
రామలక్ష్మణులు శ్రద్ధతో భాగీ ♦ రథి మాహాత్మ్యమును
శ్రీమహావిష్ణుపదముల బుట్టుచు ♦ క్షితికి వచ్చుటయును
సగరుని చరితము సాగరజననము ♦ భగీరథుని తపము
నగజావిభు, డిలదిగిన గంగ తన ♦ శిగనుంచిన విధము
మొదలగు కథలను వివరంబుగ రా ♦ ణ్ముని దెల్పగ వినుచు
కదలిరి మిథిలకు మార్గమధ్యమున ♦ కాననముల గనుచు
జనశూన్యంబగు వని నొకచోగని ♦ మునికనె రాఘవుడు
వినిపింపుము యివ్వన వృత్తాంతం ♦ బన యనె కౌశికుడు.

'సృష్టముస్ను తనచతురత శక్తియు ♦ సామర్థ్యము దనర
సృష్టించెనునొక కన్యకామణిని ♦ క్షితి యహల్యపేర,
ఈసుందరి, మా యుమాశారదల ♦ నీసడించు నారి
ఆసించగదగు నందచందములు ♦ అమరిన సుకుమారి.
'భూప్రదక్షిణంబులు ముమ్మారులు ♦ ముందొనర్చువారు
నాప్రియసుత కాహల్యకు పతియగు' ♦ నన నజు డొకరొకరు
వారిజాసనుడు సృష్టించిన త ♦ ద్వనితామణి గోరి
వారివారి వాహనములనెక్కుచు ♦ వసుధజుట్ట జనిరి.
అందుల ముఖ్యుం డిందుృడుజనె తన ♦ ఐరావతమెక్కి
సుందరి నాహల్యను యెటులైనను ♦ బొందగ వలపెక్కి
కడువేగంబుగ నిందుృం డటుజన ♦ గాంచి నారదుండు
వడివడి గౌతమమునికడకుంజని ♦ నుడివెను యిట్లపుడు
'మౌనివర్య ! యాహల్యను వివాహ ♦ మాడ నెందరోను
పూనికతో పయనంబై వెడలిరి ♦ భూమిజుట్టగాను
గానసీవు యొకయుక్తి నహల్యను ♦ గాంచెద వదివినుము
స్నానమాడి యొక ద్విముఖగోవునకు ♦ సలుపు ప్రదక్షిణము
ముమ్మా రందునభూమిని జుట్టిన ♦ పుణ్యము గననగును
పొమ్మువడిగ నెవరైనను ముందుగ ♦ పోవుటకును మున్ను.
ఒక్కమారు ద్విముఖంబగు గోవుకు ♦ నొసర ప్రదక్షిణము
మొృక్కుచుజేసిన భూప్రదక్షిణము ♦ ముమ్మారగు ఫలము
గలదని వేదంబులు ఘోషించెడు ♦ గాన "ఈను" గోవు
గల దిందొక్కటి వడిదానికి ప్రద ♦ క్షణము సల్పుమీవు'
నావిని గౌతముడా గోప్రదక్షి ♦ ణంబుల ముమ్మారు
వేవేగముగావించి ముందుజని ♦ విడసెనజున కెదురు
ఇంతలో వసుధనుజుట్టివచ్చె దే ♦ వేంద్రుడు ధృతిమించి
అంతమునుపె వచ్చినగౌతము ♦ నారసి చింతించి

వెడలెను నప్పటి నుండి యహల్యను ♦ వీలగు నెడ జెరుప
చెడుతలంపుతో నుండెను దేవేం♦ ద్రుడు దుష్టుడు పిదప
సంగతెరిగి నజుడంగ నామణి కొ ♦ సంగె గౌతమునికి
అంగరంగ వైభోగంబులను చె ♦ లంగగ వారిటకి
వచ్చి యిచ్చటనె హెచ్చుకాలమును ♦ ముచ్చటగా గడుప
జొచ్చిరి; ఇదియే గౌతమాశ్రమము ♦ జూడుండా పిదప
ఇటుల గడువ నొక యర్ధరాత్రమున ♦ ఇంద్రియలోలుండై
ఇటకు వచ్చి" కుక్కు-రొకోయి" యనె ♦ నింద్రుండొక కోడై
తెల్లవారెనని ఇంద్రుని కపటము ♦ దెలియక గౌతముడు
ఎల్లెను వెలి స్నానార్థంబదిగని ♦ మెల్లగ నింద్రుండు
కృత్రిమ గౌతమ వేషధారియై ♦ కోర్కె తీర్పమని ప
విత్రి నహల్యను గూడగ వేడిన ♦ విపరీతము దోప
సుమతి యహల్యా కపటము గ్రహించి । సూక్తుల బోధించి
కుమతి నింద్రు వారించె నతనికది ♦ గూడదని వచించి
పరదారా గమనంబు దోషమను ♦ పరిమితిని చర్చించి
పరిభావన మొనరించి హితము ని ♦ ష్ఫలమాట గ్రహించి
సామదానముల నింద్రుని బంపగ ♦ సమకట్టెను గాని
కామాతురుడై దేవేంద్రుడు కడు ♦ కర్కోటక మూని
బలిమి నహల్యను బట్టనెంచ, సతి ♦ ప్రతిఘటించి నిలచి
చలియింపక యాతని వలపున నా ♦ క్షణమొనర్చిమించి
నయభయంబు లాతనియడవ్యర్థం ♦ బయినది యోచించి
స్వాయముగ నింద్రుని శపింపగల్గియు ♦ శాసించక విడచి
మానరక్షణకు వేరొక మార్గము గానక పుడు తనకు
తానే శపించుకొనియెను నిట్టుల ♦ "ధరనే నీవరకు
ధర్మము తప్పక యుండిన; గౌతమ ♦ తపసికి సతినైన
ధర్మదేవతయె యిచట కరిగినను ♦ తాకెడు వరకు ఘన

శిలారూపమును దాల్తుగాక నా ♦ శీలము గాపాడ !
బలాత్కరించిన యింద్రుని యత్నము ♦ భగ్నం బవనియెడ !
అనుచు బుభుక్షుడు తన్నంటక ము ♦ న్నహల్య శిలయయ్యె
తనయత్నము విఫలంబవ నింద్రుడు ♦ జనపయనంబయ్యె
ఇంతలో గౌతముడేగుదెంచి తన ♦ యింట నింద్రుగాంచి
అంతయుగ్రహించి జౌడుగరచి కడు ♦ నాగ్రహించి మించి
'ఎంతటిపని కొడిగట్టితివౌరా ! ♦ ఇంద్రా ! ఛీ పలువ !
అంతరమెరుగక కులసతి జెరుపగ ♦ యత్నించితె ? తులువ !
పాతివ్రత్యము భంగపరుపగా ♦ ప్రయత్నించితివిగా !
నీతినియమములు విడనాడితివా ♦ నీచా ! పొగరణగ
ఈతీరున మమ్మొకరినొకరి నిల ♦ నెడబాపిన నీకు
స్వాతిశయంబణగించెద నిలువుము ♦ శపింతు పోబోకు
పండువంటిసంసారము జెరిపిన ♦ పాపీ ! దురాత్మక
దుండగీడ ! నీవండద్వయరహి ♦ తుండవు యాగాక !
అని సంయమి ఘనశాపంబిడగా ♦ జనె నింద్రుడు వినుమా
గనుక నో యఖిలధర్మస్వరూప ♦ ఇనకులాబ్ధిసోమా !
ఆ శాపవిమోచన గావింపుము ♦ అనఘా నీవిపుడు
ఈశిలయే యాహల్యసతీమణి ♦ ఇట్లయ్యెను అపుడు
తవపదరజ మహిమంబున యీశిల ♦ తరుణియు గాగలదు
అవతారుండవు నీవెరుగని దిల ♦ నావంతయులేదు'
అనుచు ముగించె నహల్య చరిత్రం ♦ బంతయు నమ్మౌని
విని శ్రీరాముడు తనపాదంబును ♦ యునిచెను శిలపైని.
చూచుచుండ తచ్ఛిలువకరిగి యొక ♦ సుందరియై నిలచి
లోచనంబులు న్మీలితములుగను ♦ లోచని కేల్మోడ్చి
రామచంద్రునకు మ్రొక్కెడి యహల్య ♦ ప్రస్తుతించె నిటుల
'శ్రీమనోహరా ! శేషశయన ! ఆ ♦ శ్రితజనపరిపాల !

పురాణపురుషా ! ముకుందమాధవ ! మునిహృదయానంద !
పరమపురుష పాల్కడలిశయన ! కరి ♦ వరదా ! గోవింద !
నిరుపమశుభకర ! నిగమగోచరా ♦ నిఖిలలోకపాల !
సరసిజనయన ! పరాత్పర ! శ్రీహరె ♦ సామగానలోల !
శ్రీనివాస ! సంకర్షణ ! కేశవ ! శ్రీకరపరమేశ !
మౌనిపోష ! శ్రీమన్నారాయణ ♦ మధుసూదన ! శ్రీశ !
దానవభంజన ! దశరథనందన ♦ దైవరాయ ! శౌరీ !
దీనవరద ! రఘురామా ! అజరు ♦ దేవేంద్రనుతమురారి !
మునుమత్స్యమవై ఘనముగ వేదం ♦ బుల నొసగిన స్వామి !
వనధిని కమఠంబై మందరగిరి ♦ వహియించిన స్వామి !
వరాహమై మును హిరణ్యాక్షుని ♦ న్వధియించిన స్వామి !
నరకేసరివై హిరణ్యకశిపుని ♦ బరిమార్చిన స్వామి !
ధరనుగొలచి బలినణచిన వామన ♦ వరరూప స్వామి !
పరశువుగొని భూపతులను చెండిన ♦ పరశురామస్వామి !
ననుపాలింపగ నడచివచ్చితి వ ! వినతాసుతగమన !
నినుగని నేఁడు ధన్యనైతినని" ♦ అనియెడు సమయమున
గౌతమమహర్షి వచ్చి యహల్యను ♦ గాంచి సతిని గలసి
రాతిని నాతిగ జేసిన శ్రీరఘు ♦ రాముని నుతిజేసి
కౌశికమునీశ్వరుని గొనియాడెను ♦ కౌతుకంబు మీరి.
దాశరథియు లక్ష్మణుడు మ్రొక్కెముని ♦ దంపతులకు జేరి.
అచట నుండి యామువ్వురు మిథిలకు ♦ హరునివిల్లు జూడ
విచిత్రదృశ్యంబులు పలు గాంచుచు ♦ వెడలె వేడ్కతోడ
జనకనృపాలుడు కౌశికరామల ♦ క్ష్మణుల గౌరవించి
అనువుగ సత్కారంబుల జేయుచు ♦ నర్ఘ్యాదుల నిచ్చి
వచ్చిన రాజకుమారు లెవ్వరన ♦ వచించె మునియిటులు
"దెచ్చితి నయోధ్యనుండి వీరలను ♦ దినకర వంశజులు

దశరథతనయులు, రామలక్ష్మణులు ♦ ధైర్య శౌర్యయుతులు
వశులుగారు రాముని వర్ణింపగ ♦ శశిధర వాక్పతులు
మారీచ సుబాహులు నేజేసెడు ♦ మఖము జెరుపగాను
శ్రీరాముని యర్థించి దెచ్చితిని ♦ వారల జంపగను
వచ్చుచు మార్గమునందున రాముడు ♦ వధించె తాటకను
హెచ్చరికతో రక్షించెను జన్నం ♦ బే నొనరింపగను
అహల్యశాపవిమోచన జేసెను ♦ హరువిలు జూడగను
సహజునితో నన్నంటివచ్చె నిట ♦ జనకనృపా!" యనెను.
జనకపురోహితు డహల్యాతనయుడు ♦ శతానందమౌని
జననిజనకులగు యహల్య గౌతమ ♦ సంయోగంబు విని
ఇనకులోద్భవుని పవిత్రపాద మ ♦ హిమంబు దలచుకొని
తనువు పులకరింపగ రామునిచరి ♦ తంబును దెలసుకొని
ఘనుడు కౌశికునివల్లను యీయుప ♦ కారము జరిగెనని
వినిపించెను శ్రీరామచంద్రునకు ♦ విశ్వామిత్రముని
జననచరిత్రము వశిష్టమునితో ♦ జగడంబాడుటయు
ఘనముగ తపస్సుజేసి బ్రహ్మఋషి ♦ గావుటయును మరియు
దేవదత్తమగు మోహినివలచుట ♦ త్రిశంకుస్వర్గమ:యు
చావగనున్న శునశ్శేపునిమును ♦ సంరక్షించుటయు
మొదలగు మునివృత్తాంతములెల్లను ♦ మోదంబొదవగను
పిదప రాణ్ముని, రామలక్ష్మణుల ♦ వేమరు నుతించెను.
రాముని ధైర్యస్థైర్య ప్రజ్ఞలకు ♦ భూమీశుడు మెచ్చి
భూమిజకాతడు వరుడైనను కడు ♦ పూజ్యంబనియెంచి
హరునికార్ముకము గొనిరా బనిచెను ♦ అంతిపురమునుండి
బరువగు ధనువునుదెచ్చిరి పలువురు ♦ బలవంతులుగూడి
గొనివచ్చిన యాధనువును శ్రీరా ♦ మునకుజూపి నృపుడు
అనఘా! వినుమని జెప్పదొడంగెను ♦ ఆ విలుకథ యపుడు

"మును నిర్మించెను విశ్వకర్మ ఘన ♦ ధనుద్వయము, కోరి
గొనిరా ధనువుల ఇరియొక్కటి హరి ♦ యును హరుడును జేరి
హరిహరులకు బల తారతమ్యముల ♦ నరయగోరి సురలు
పరమేష్టిచే, గల్పించిరి కలహము ♦ బిరబిర హరిహరులు
ఘోరంబుగ బోరాడగ చివరకు ♦ శౌరి విజయుడైన
గౌరీశుడు దేవరాతునకు తన ♦ కార్ముక మొసగిచన
నాటనుండి మాయింటనుండెనది ♦ నరవర! వినవోయి
పాటిగ నాసుత కూటముగోరిన ♦ పై కిదెత్తవోయి
అమరసిద్ధ యక్షాసుర చారణు ♦ లైన యెత్తలేరు
ప్రముఖు లెందరో గనవచ్చి పరా ♦ భవము జెందినారు
ధనువు తనయలకు సంబంధము యే ♦ మన జెప్పెదవినుము
ధనువునెత్తగల వీరునకొసగెద ♦ తనయను, ఇది వ్రతము.
మున్నొకజన్నము జేయగ భూమిని ♦ దున్నెడుసమయమున
మన్నులోన యొకపేటిక దొరకెను ♦ కన్నెయుండె లోనా
చిన్నదానినే సాకగసాగితి ♦ సీతయనెడు పేర
కన్నకుమారితకన్న మిన్నగా ♦ నెన్ని ప్రేమమలర
మొన్న మొన్న నవలీలగా యీవిలు ♦ యున్న చోటనుండి
పన్నుగ నెత్తెను మాజానకి యొక ♦ పనియేదోయుండి
ఎవరుకదల్పగజాలకున్న యీ ♦ ఈశుని చాపంబు
అవలనునిచె నవలీలయ బలసుత ♦ అరయ నద్భుతంబు
ఇట్టిసుతకు నే తగువరుగూర్పగ ♦ నెంచి వితర్కించి
పట్టితినొక శపథంబిటు జానకి ♦ పరిణయమునుగూర్చి
"హరుని కార్ముకము నెక్కిడువాడే ♦ ధరణిజవరు" డనుచు
ధరణీ వీరవరులందర బిలచితి ♦ దద్విషయము వినుచు
అంగవంగ దేశాదుల వీరులు ♦ ఎందరొనిట జేరి
అంగజారివిలు నెత్తగజాలక ♦ శృంగభంగులైరి.

## సీతాకళ్యాణము

ఏలబట్టితీ అసాధ్య ప్రతినను ♦ ఇలనెవ్వండైన
శూలి కార్ముకము నెత్తగజాలునె ♦ బాలకు బెండ్లగునా ?
అనుచు నిరంతర చింతాక్రాంతుడ ♦ నైయుంటినిగాన
ఇనకులసోమా ! శ్రీరఘురామా ! ♦ ఇద్దిసాధ్యమైన
ఎక్కిడి మత్సుత సీతను బడయుము ♦ ఇహపరసుఖవగుము
నిక్కంబుగ యిది నీకొరకై యే ♦ నియమితమో ! లెమ్ము"
అనిన రాఘవుడు లజ్జాపౌరుష ♦ యానందంబులతో
మునికి మ్రొక్కి మునియాజ్ఞాదీవన ♦ లను గైకొని ధృతితో
సురాసురులకును దుర్భరమగు యా ♦ హరువిలు నవలీల
శరములనెత్తుచు నెక్కిడగా నది ♦ విరిగిపడెచు నేల.
చదలఃవిరిగినటు శబ్దంబయ్యెను ♦ చాపంబటు పగుల
కదలెను ధారుణికడలులు పొంగెను ♦ గర్జెనుధ్వని దిశల
గ్రహములుబెదరె నగంబులదరె ది ♦ క్కరులు మ్రొగ్గ మిగుల
స్పృహలఃతప్పి కడుచికాకునొందెను ♦ జీవరాసులెల్ల
దశరథాత్మజులు రామలక్ష్మణులు ♦ ధరణిజాత సీత,
కుశికనందనుడు, జనకుడుగాకను ♦ కొలువులోని మిగత
జనము లులికిబడి విగతచేష్టులై ♦ క్ష్మాతలమునబడిరి
ఘనముగరాముని కౌగలించుకొన ♦ జనకు డతని జేరి.
అంత జనకుడనె మునితో, "రాముడు ♦ హరునివిల్లు విరచె
సంతసమాయె రాముప్రజ్ఞగన నా ♦ శపథంబు ఫలించె
రాముడు జగదభిరాముం డినకుల ♦ సోము డమితబలఃడు
భూమిజ నాతనికొసగి పరిణయం ♦ బొనరించెద నివుడు"
అనిమొడు జనకుని పలుకులవిని ముని ♦ అనె ముదముననిటులు
'అనువుము దశరథనృపునకు శుభలే ♦ ఖన మాహ్వానములు

వడిగా సంభారంబుల గూర్పుము ♦ వైవాహికమునకు"
జడధారిట్లన జనకుడు దశరథ ♦ సాన్నిధ్యంబునకు
తగువారలనపు డయోధ్యబంపెను ♦ తర్లి రాగ వేగ
నగరం బలంకరింపగ జేసెను ♦ నవనాగరికముగ
సకలంబును సంసిద్ధము చేసిరి ♦ జానకి పెండిలికి,
ప్రకటన పత్రికలంపిరి బందుగు ♦ ప్రజలకు నందరకి
ఇంతలోన దశరథనృపుండు తన ♦ హిత సుతబంధుగులు
ఇంతులు మంత్రిలు పురోహితులు సా ♦ మంతులు మరిభటులు
రథగజతురగపదాతి సైన్యములు ♦ రా, నయోధ్యనుంచి
మిధిలకు నరుదెంచిన గని జనకుడు ♦ మిగుల సంతసించి
ఎదురుకోల జని పూజలొనర్చుచు ♦ ఎఱిగి క్షేమమరసి,
ముదమొదవగ దోడ్కొనిచని సౌధం ♦ బుల వసింప జేసి,
దశరథ, కౌశిక రామలక్ష్మణులు ♦ తారసిలగ జూచి
కుశధ్వజుండను తమ్ముని నాతని ♦ కూతుల బిలపించి
మరుదినమున నొక సభను నేర్పఱచి ♦ మంత్రిల రప్పించి
గురు పురోహితులమొడ దశరథ నర ♦ వరుతో సంప్రతించి
దశరథాత్మజుల నల్వురకును తన ♦ తనయ ననుజసుతల
నొసగి వివాహంబొనరుప నెంచెను ♦ యుత్సహించి మిగుల
క్రమముగ శ్రీరఘురామలక్ష్మణభ ♦ రతశత్రుఘ్నులకు
విమలలు సీతాయూర్మిళామాండ ♦ విశ్రుతకీర్తులకు
పరిణయమొనర్ప నిశ్చయించి రొయిం ♦ డొరులు సమ్మతించి
స్థిరతాంబూలంబులగొని ముహూర్త ♦ స్థిరములు గావించి
జనకదశరథులు తెల్పిరిద్ది తమ ♦ తనయుల తనయులకు
ఘనతరసంభారంబుల గూర్చిరి ♦ కళ్యాణంబులకు
అలంకరించిరి మిథిలాపురమును ♦ అలకాపురివలెను
అలంకృతుల చేసిరి అందరివధు ♦ వుల నందముగాను.

సకలయంగ సౌష్ఠంబులచేతను ♦ చక్కదనంబునను
ఒకరికొకరు నేవిధమున దీయక ♦ నొప్పిరియందరును
దిక్కులనడుమను చుక్కలరాయుని ♦ రీతిగబడె సీత
ఒక్కరైన లేరామెకీ డిల, న ♦ యోనిజ సంజాత !
చుక్కలరాయుని ధిక్కరించునా సుందరి వదనంబు
చెక్కు లద్దముల నాగచెల్లు న ♦ చ్చలి నేత్రద్వయంబు
కలువరేకులను గేరుచుండెనా ♦ కలికి కంటిబొమలు
నలువుగల్గి విలువలెను వంగె నలి ♦ నాక్షి మేను హొయలు
తళుకుబెళుకు నవమృదుల తమంబగు ♦ తమలపాకుబోలు
మిళుకుమిళుకుమని మెరయుదంతములు ♦ మేలగు ముత్యములు
కలవాణివేణి చెలరేగిపారు ♦ యళిబృందము గేరు
పొలుపారగ శ్రీకారంబన దగు ♦ పొలతి చెవులతీరు
చంపకమన తగు నాశికంబు కడు ♦ సొంపెసగుచు నుండె
కెంపుల ఛాయను దొండపండువలె ♦ కెమ్మోవియు యుండె
గళము సొంపు శంఖంబన నొప్పును ♦ గనపిడికెడు కౌను
గోళార్ధములనదగు కుచములు ఘన ♦ వ్యాళహస్తములును
అతివ యూరువులు అరటికంబములు ♦ హంసగమన, బోటి
పతితుల బోవగ బుట్టినయీ భూ ♦ సుతకు 'లక్ష్మి' సాటి.
సీతారాముల కళ్యాణం బని ♦ సేవింపగ జనులు
ప్రీతికోడగొని దెచ్చినొసంగిరి ♦ విరివిగ కట్నములు
పందిళ్ళెన్నియొ గట్టివానికిసి ♦ పచ్చని తోరణముల్
అందమలర జుట్టించి జేసిరట ♦ అలంకారశతముల్
ఒకచో హరికథ లొకచో భజనలు ♦ యొకచో గానములు
ఒకచో గంభీరోపన్యాసము ♦ లొకచో నాట్యములు
ఇట్టి వైభవంబులతో నిండెను ♦ పట్టణమంతయును
చెట్టబట్ట సమకట్టగ రాముడు ♦ సీతను ధరణిజను.

అందున వశిష్టగాధేయ శతా ♦ నందాదులు గలసి
చందన కుంకుమ ఫలపుష్పాదుల ♦ సమకూర్పగ జేసి
అగరు ధూపదీపంబులు హారతు ♦ లక్షతలను గూర్చి
సొగసుగ నగ్నిని వేల్చివేది నొక ♦ చోటను నిర్మించి
వధూవరుల గూర్చుండ బెట్టిరి వి ♦ వాహామంటపమున
యథావిధిగ గావించుచుండిరట ♦ యాజ్ఞీకంబుగన
సురలు మింట పుష్పంబులు జల్లుచు ♦ చోద్యంబుగ జూడ
నరులు సాష్టాంగముగ ధరపైబడి ♦ నమ్రితతో వేడ
వనితలు హారతులొసగ ధరామర ♦ వరులు స్వరముతోడ
ఘనజట లమరగ వేదాధ్యయనము ♦ గావింపుచునుండ
ఒకయెడ వేశ్యలు నృత్యగానముల ♦ నొడ లెరుగకయుండ
సకలమైన మంగళవాద్యంబులు ♦ చదలంటుచునుండ
గాయకులొకచో కర్ణపర్వముగ ♦ గానము జేయంగ
ఆయురారోగ్యములకై పెద్దలు ♦ యాశీశ్శులనొసగ
సుముహూర్తంబున రామచంద్రునకు ♦ సుదతి సీతనొసగి
సముచిత కన్యాదాన మొనర్చెను ♦ జనకనృపుండోదిగి
బరగనులక్ష్మణునికి నూర్మిళనూ ♦ భరతుకు మాండవిని
మురిపెంబుగ శత్రుఘ్ననకు స్తుది ♦ ముదితశ్రుతకీర్తిని
ఇచ్చి యెల్లరకు పరిణయ మొనర్చె ♦ నచ్చట ముచ్చటగ
మెచ్చి యెల్లరును దీవనలొసగిరి ♦ మేదిని సుఖులవగ
జనకుడు విద్యుక్తంబుగ, వివాహ ♦ ముల జేసినపిదప
ఘనముగ సంతర్పణలను జేసెను ♦ జనులతృప్తి సలుప
అంతట దశరథుడయోధ్యజనుటకు ♦ నాజ్ఞనొసగ వేడ
దంతి తురగ రథ గోధన దాసీ ♦ దాస జనులతోడ
ఆడుబిడ్డలను అల్లుండ్రను వి ♦ య్యంకుని చుట్టముల
వేడుకతో సాగనంపె జనకుడు ♦ విలపించుచు చాల

సతులు, సుతులు, కోడండ్రు పురోహిత ♦ హితమంత్రులఁగూడి
క్షితిపతి దశరథుఁడయోధ్య కరుదెం ♦ చెడుమొడదారినడి
నలుముకొనియె చీకట్లెల్లెడలను ♦ అపశకునములయ్యె
గలిగెదుర్నిమిత్తంబులు పథములు ♦ గానుపింపవయ్యె.
దండిమీఱ కోదండంబును దో ♦ ర్దండంబును బూని
దండధరుండో దానవుండో యన ♦ తనదు పరశువుగొని
కళవళబడి గడగడవడకుచు ధర ♦ కళబడ దశరథుఁడు
ప్రళయకాల రుద్రునిచందంబున భా ♦ ర్గవరాముండు
వచ్చి దశరథ వశిష్టాదులగని ♦ వచించె నిట్లపుడు
"ఎచ్చట గలండు మీరాముడు వడి ♦ ఎరుగబల్కుడీవుడు
రాము డనెడు వాడింకొక డుండగ ♦ రాదిల నేనుండ
భూమీశుల మును చెండాడిన విధ ♦ మున రామునికండ
కావరమణచెద నిక్కుచుండె శివ ♦ కార్ముకమును విరచి"
నావిని రాఘవు డేగుదెంచి యనె ♦ నగుచు శిరమువంచి
'రాముడ నేనే, దండము, భార్గవ ♦ రామా ! గైకొనుము
ఏమియొ యనుచుంటివి నాతోపని ♦ ఏమి యానతిమ్ము'
నావిని భార్గవరాముడు, రాముని ♦ దీవనగావించి
ఏవగింప దొడగెను రాముని యి ♦ ట్లెసగి యాగ్రహించి
'గాజులు ధరించిదాగిన దశరథ ♦ రాజ తనయ! రామా!
రాజులనెల్లర వధియించిన "భా ♦ ర్గవరాముడ" విను మా
రామనామ మింకొకనికి యుండగ ♦ రాదు నాకుదక్క
కామవైరి విలువంచితి నను కడు ♦ గర్వమొంది నిక్క
తగదు తగదు నీమాత్రపు వీరుడు ♦ ధరలేడను కొనకు
ప్రగల్భంబులాడక నావిల్లును ♦ బట్టుము యిదివరకు
నీవు విరచినది జీర్ణంబైనది ♦ నిటలాక్షునిది యది
ఈవిలుఘనమైనది యెత్తగలే విందిరేశుని దిద్ది

మునుహరి హరులీ విలులరెంటిగొని ♦ పోరిన శివుడోడి
తన విలునొసగెను దేవరాతునకు ♦ తదాదిగానుండి
అది జనకునిచే పూజింపగబడె ♦ అది విరచితివీవు
ఉదధిజపతి, విజయుండై ఋచీకు ♦ కొసగెను తన ధనువు
తనయున కీయగ ఋచీకుండు, యా ♦ తనివలనే గొంటి
గనుమదియే యిది దీననృపుల నిల ♦ గడదేర్చుచునుంటి
ఓరీ ! నీవా విలువిరచితి నని ♦ యుబ్బకు గర్వమున
నారిగూర్చి యీవిలుతో బోరుము ♦ నాతో యుద్ధమున
ననుగెలచిన నిను 'రాముండ'నియెద ♦ నరవరగాకున్న
నినుబరిమార్చెద మును క్షత్రియులను ♦ దునిమిన విధంబున''
అనుచువిల్లు నొసగంగ దానిగొని ♦ యంబును సంధించి
అనియె రాఘవుడు భార్గవరాముం ♦ డడలగ కోపించి
"పరశురామ ! నీవేమన్నను యీ ♦ వరకు యూరకుంటి
శరమును విడచిన, జచ్చెదవటంచు ♦ సంశయించుచుంటి
కంటులేని బ్రాహ్మణుండవని నిను ♦ కనికరించుచుంటి
కంటివె వైష్ణవబాణ మమోఘము ♦ వింట గూర్చియుంటి
కావున యీయస్త్రంబున కెర,వడి ♦ గను బరువుము యిపుడు"
నావిని శ్రీరఘురాముని కనియెపి ♦ నమ్రిత భార్గవుడు
'మును నార్జించితి తపమున లోకం ♦ బుల వానినిగూల్చి
ననురక్షింపుము శ్రీరఘురామా ♦ నాపై దయదాల్చి
ఇంత పరాక్రమవంతుడ వని ని ♦ న్నెరుగనైతి రామా' !
అంతరమెరిగితి తొలగెన జ్ఞాన ♦ సంతమసము వినుమా
శ్రీమన్నారాయణుండవని దెల ♦ సికొంటి నినునేను
ఏమన మానవు లెక్కిడలేరిది ♦ ఇది గాకుండగను,
స్మరణ కొచ్చెమును బాల్యంబున తప ♦ మాచరింపనేను
హరిపరిసన్నుడై బల్కెన్ను దశరథ ♦ ఆత్మజుడై తాను

"అవతరించి శ్రీరాముండన యా ♦ హల్యను బ్రోతునని
అవనిజ నాలిగగొని మరుదర్శన ♦ మనుగ్రహింతునని"
ఇపుడు దెలసె'హరి' వీవేరామా ♦ అపరాధముగాచి
కృప ననుగనుమా "రామా" యని పలి ♦ కిన, శరమునువిడచి
గరిమతోడ రాముండుగూల్చె భా ♦ ర్గవలోకంబులను
అరిగె భార్గవుండంతట మహేంద్ర ♦ గిరిని వసింపగను.
మిన్నుముట్టు మంగళవాద్యంబులు ♦ మెయిమఱపు మనుండ
కన్నులపండువుగా పురంబుకల ♦ కలలాడుచునుండ
జయజయ ధ్వనులతో జనములు పుష్పా ♦ క్షతలు జల్లుచుండ
వయోవృద్ధు లాశీశ్శుల బల్కగ ♦ వారకాంతలాడ
అంగనామణులు రంగుమీరగను ♦ మంగళములు బాడ
పొంగుచు దశరథు డయోధ్య జేరెను ♦ పుత్రాదులతోడ.
సతులు సుతులు కోడండ్రితోడను ♦ క్షితిపతి దశరథుడు
అతులితమా భాగ్యభోగ్యములతో ♦ అలరారుచునుండు.
ఇంతవరకు ఇదిబాల కాండమట ♦ ఎవ్వరైననుదీని
స్వంతతంబు వినవ్రాయ చదువ మో ♦ క్షంబుగల్గు భువిని.
"రామరామ శ్రీసీతారామా ♦ రామ రామ యనుడి.
రామయనెడు తారకమంత్రామృత ♦ రసముగ్రోలి మనుడి
శ్రీరామహరే రఘురామహరే ♦ సీతారామహరే
తారకనామహరే రామహరే ♦ దశరథరామహరే"



(అయోధ్యాకాండము)

చిరకాలము దశరథుండు రాజ్యము ♦ క్షేమకరంబుగను
పరిపాలించియు నెంచె రామునకు ♦ పట్టముగట్టగను
వశిష్ఠమౌనిని యష్టమంత్రులను ♦ పౌరులబిలపించి
విశదంబుగ తద్విషయముదెల్పిన ♦ విని యెల్లరుమెచ్చి
రామ యౌవరాజ్యాభిషేకమును ♦ రయమొనర్ప వేడ
సామిబల్కెనిటు సంశయాత్ముడై ♦ సభాసదులతోడ
'శ్రీరఘురాముని యువరాజునిగా ♦ జేతుననగమీరు
చేరిమారుబల్కక 'సరి'యంటిరి ♦ చిత్రముమీతీరు
అవనిజపతి పరిపాలనకై మీ ♦ రాత్రమంద నేల?
అవకటముగ రాజ్యంబేలితినా? ♦ అవనిని నే జనుల
నవమానించితినా? లేకనుమరి ♦ అఘములచేసితినా?
అవలేపముజెందితినా? లేకను ♦ అసత్యమాడితినా?
తప్పుడుకార్యంబుల జేసితినా? ♦ ధర్మముదప్పితినా?
జెప్పుడువెరువక నదిగాకుండిన ♦ క్షితి నేలగలేనా?
అనినవారలిట్లనిరి దశరథుం ♦ డానందముజెంద
'మనుజనాథ! మీపరిపాలనమున ♦ మాకులేదు బాధ
వినను శ్రీరఘురామునందుగల ♦ యాసక్తిని వినుడీ
భానుకులీనుడు శ్రీరఘురాముని ♦ పాలన కాశపడి
యుంటిమి మోహితులైతిమి యాతని ♦ యుదారగుణములకు
కంటిమి వింటిమి రామచంద్రు ఘన ♦ కార్యము లీవఱకు
రాముని సద్గుణజాలమెన్న ఫణి ♦ రాజైనను తగడు
రాముడు సద్గుణధాముడు సీతా ♦ రాముడధికయశుడు
సర్వభూతముల తనవలెజూచుచు ♦ సంచరించువాడు
గర్వముజెందడు యెగ్గుతలంపడు ♦ కరుణామయుడతడు

పరభామల తనతల్లులవలె మది ♦ భావించుచునుండు
పరవిత్తంబుల కపేక్షజెందడు ♦ పరమసాత్వికుండు
సకలధర్మముల నెరిగిన శీలుడు ♦ సత్యపాలకుండు
అకళంకుం డాశ్రితజనరక్షకు ♦ డస్త్రశస్త్ర ఘనుడు
ఇట్టిఘనున కీపట్టముఁగట్టగ ♦ నిచ్ఛగల్గెగాని
ఎట్టితప్పులును మీయెడ లేవని ♦ ఎఱుగబల్కనవిని
పట్టరానిసంతోషము జనింప ♦ ప్రభువు దశరథుండు
పట్టాభిషేకమునకు ముహూర్తము ♦ పెట్టించెను యపుడు.
పట్టణమలంకరింపగ జేసిరి ♦ స్వర్గతుల్యముగను
గట్టిరితోరణములు పందిళ్ళకు ♦ కలకలలాడగను.
రాజీవాక్షుని రఘురాముని దశ ♦ రథుండు రప్పించి
రాజకీయవిషయంబు లతని కే ♦ ర్పడనుపదేశించి
ప్రకటముగ శ్రీరామచంద్రునకు ♦ పల్కెముదముతోడ
"నీకు యౌవరాజ్యాభిషేకమును ♦ నిశ్చయించినాడ
తనయ! నీవు రాజ్యంబుచేయుటకు ♦ జనులు గోరుచుండె
వినుము నీవు రాజ్యంబుజేయ మది ♦ వేగిరబడుచుండె
అదియుగాక చిరకాలంబేలితి ♦ యవనిని రాజ్యంబు
ముదిమినిజెందితి దృష్టిదొరంగెను ♦ పోయె నాబలంబు
కావున నీవీ భూభారంబును ♦ గైకొనంగవలయు
నీవు సీతతో నిరశనవ్రతమును ♦ నేడు జేయవలయు
రేపటి యుదయము అభిషేచన మొన ♦ రించెదరిట నీకు
తాపసి వశిష్టుడువచ్చి నినునియ ♦ తస్థునిజేయుటకు
త్వర యీశుభమును దెలుపుము సీతకు ♦ తల్లులమువ్వురకు
భరతశత్రుఘ్నులిట లేకుండుట ♦ కొరతగల్గె మనకు
అనవిని రఘురాముండరిగెను తన ♦ యంతఃపురమునకు
అనువగుసంభారంబులగూర్చిరి ♦ అభిషేచనమునకు

ఈవిభవంబును గని మంధరయను ♦ ఇంతి కైకదాసి
పాపి! తొత్తు, గయ్యాళిగంప, తన ♦ దేవిని వడిగలసి
కైకమనంబున యీర్ష్యజనించెడు ♦ కైవడియనె నిటుల
'నీకొకింతయును తెల్వి లేదహహ ♦ నిర్భాగ్యవు మిగుల
నేటితోడ నీసుఖములు తొలగెను ♦ నీచత్వము గలిగె
కూటికిగుడ్డకు కరువౌదువు నీ ♦ గొప్ప కాటికరిగె
ఏమియున్నదిక మోసపోయితివి ♦ హీనదశ ఘటించె
రామునకు రాజ్యాభిషేకమట ♦ రాజు జేయనెంచె
మురియుచునుంటివి మగడు మగడనుచు ♦ మోసమెరుగలేక
త్వరితము పట్టము గట్టుచునుండెను ♦ భరతు డింటలేక
రాము డఖిలభోగంబుల నొందుచు ♦ రారాజైయుండ
భూమీశుని పదసేవకుడగు నీ ♦ పుత్రుండతని కడ
రామచంద్రునకు కౌసల్యాసతి ♦ రాజమాత వినుము
ఆమె కూడిగము జేయవలెను నీ ♦ వమ్మాయిది నిజము
భరతునకే రాజ్యం బొసగుటకై ♦ ప్రయత్నించి చూడు
నిరోధించు మెటులైనను యీశుభ ♦ నిర్ణయంబు నిపుడు
నీకు యిట్టిదుస్థితిఘటిల్లింపగ ♦ నేనోర్వగజాల
నీకుమారుని శుభంబు గోరెనే ♦ నివేదించి తిటుల
అనుమంధర పల్కులచే రాముని ♦ అభిషేచనమెఱిగి
మన ముప్పొంగగ కైకభూషణము ♦ మంధరకొక టొసగి
రామపట్టాభిషేకము దూరగ ♦ రాదని వారించి
రామునిపైగల వాత్సల్యమున వి ♦ రాజిలె మై మఱచి
వినను మంధరదుష్టబోధచే ♦ అట్టి ప్రేమతొలగి
బూనెనీర్ష్య కైకేయి రాఘవుని ♦ పైని కరము యలిగి
రాముని యడవులబంపి భరతునకు ♦ రాజ్యమొసగ నెంచి
భూమీశుండా రాత్రిని యంతః ♦ పురమరుగుటయెంచి

మంథరతో తనవాంఛిత మొందెడు ♦ మార్గముతర్కించి
అంధకారమయమగు కోపగృహ ♦ మందుబ్రవేశించి
శిఖముడివిడగను యొడలురక్కుకొని ♦ జీర్ణవస్త్రములతో
ముఖము కరద్వయమందుననిడుకొని ♦ ముక్కుచు మూల్గులతో
వేషభూషణ వివర్జితయై కడు ♦ విషాదంబుతోడ
రోషకషాయితలోచనియై ధా ♦ రుణిబడె నృపువేడ.
కైకయిటులబడియుండగ ధరణీ ♦ కాంతుండరుదెంచి
కైకకోపమోదార్పగ నెంచెను ♦ కనలియుంటగాంచి
వచ్చిన కాంతునివిదళించెడు మగు ♦ వనుగని దశరథుడు
"ఇచ్చెద నీకెద్దైనను కోరుము ♦ ఇంతీ! నీతోడు
వగవకు నీవాంఛితములుదీర్చెద ♦ వచియింపుము"యనగ
మగువకైక తెగువరియై యనెనిటు ♦ మగనిమనము కలగ
"వినుము తొల్లి శంబరునియుద్ధమున ♦ విపత్సమయమందు
అనుగ్రహించితివి రెండువరములు ♦ అవ్వి వేడుకొందు
ఇప్పుడెగావలయును వానిని నీ ♦ విచ్చెదవా"యనగ
'తప్పకనిచ్చెద నడుగుమ'నుచు నా ♦ దశరథనృపు డడుగ,
నివేదించెనిటు కైకవరంబుల ♦ నృపునకు నిర్భీతి,
అవధరింపుమన్నాథ! వరంబుల ♦ వివరంబులరీతి.
"భరతునికే రాజ్యాభిషేక మే ♦ ర్పడగజేయుటొకటి!
బరగరాము పదునాల్గేండ్లడవికి ♦ బంపుట మరియొకటి!
జడలుదాల్చి వల్కలములధరించి ♦ జనవలెరాముండు
అడిగితి యిమ్మావరముల రెంటిని ♦ యనగ దశరథుండు
విస్మయమొందుచు కైకకనెను నీ ♦ వృత్తి దెలసుకొంటి
అస్మత్సతివని నమ్మితి దుర్మతి ♦ వనుచు నరయకుంటి
కూరవ్యాఘ్రమవు దెచ్చుకొంటినిను ♦ కొంపముంచుకుంటి
శ్రీరాముడు నీకెట్టియపకృతి ♦ జేసెనె? ♦ నీవంటి

జ్యేష్ఠను జేర్చిలిఎంచి మంచిదని ♦ చిచ్చుబెట్టుకొంటి
భ్రష్టురాల! దుర్బుద్ధిని విడువుము ♦ బ్రతిమాలుచునుంటి
రాముని విడువగజాలనునే నీ ♦ రాజ్యమైన విడతు
కామిని! వేరొకవరమును వేడుము ♦ కాదనకను యిత్తు
అనుచు మూర్ఛితుండై దశరథ నృపు ♦ డవని కొదిగెగాని
కనికరించ దణుమాత్రింబైనను ♦ కైక కఠినమూని
తెప్పరిల్లి దశరథ నృపుడామెను ♦ తిర్గి వేడెగాని
ఎప్పటివలె తనపట్టును విడువక ♦ యింతికైకవిభుని
దెప్పుచు మదినొప్పింపగ దూరుచు ♦ తిట్టసాగె నిటుల
"తప్పకవరముల నిచ్చెదనని శప ♦ థంబుజేసి మరల
వెనుదీయుట ధర్మంబె మొదట యటు ♦ విర్రవీగనేల!
ఇనకులోద్భవు లసత్యవాదులని ♦ యెంచనైతి చపల
చిత్తుడవై యిట్లాడగతగునే ♦ ఛీ! ఛీ! క్షితిపాల
పొత్తుపొసగదిక నీకును నాకును ♦ పొమ్ముపొమ్ము యవల
వేడినవరముల నిచ్చెదవా? నను ♦ వెడలి పొమ్మనెదవా?
ఆడియు తప్పని వాడవగుదువా ♦ అపయశ మొందెదవా?"
అనుచు నిష్ఠురంబులు బల్కెడియా ♦ యతివకు విభుడనెను
'మనగజాల శ్రీరాము విడచియే ♦ మాత్రింబీ ధరను
రాముని నెడబాసిన పిమ్మట యీ ♦ రాజ్యమేల నాకు
రామునితోనే నడవికి జనియెద ♦ రాజ్యమిచ్చి నీకు
భరతునిగూడి యయోధ్యను పాలిం ♦ పవే కపటురాలా!
తిరిగినిన్ను బ్రతిమాలెద పదముల ♦ కెఱగెదనే యబల
కరుణింపుము శ్రీరాముని బంపకు ♦ కారడవులలోకి
ధరలో నాకపకీర్తిని దేకుము ♦ దయయుంచుము కలికి
వినుము నాదువిన్నపమాలింపుము వేఱువరము వేడు'
అనుచు వేడి నిష్ఫలమాటంగని ♦ అవనీనాథుండు

పడతి యడుగులను బడుచు స్వేదవుల ♦ దడుపుచు వడకుచును
ఎడనెడ మూర్ఛిల్లుచు లేచుచునట ♦ గడపెను నిశి తాను.
అంతలోన యరుణోదయమాయె న ♦ నంతకాంతితోడ
మంతువుయగు శ్రీరాముండని జన ♦ మంద రెదురుజూడ
వశిష్టముని – కశ్యప గౌతమ జా ♦ బాలి వాసుదేవ
ఋషులగూడి రాజ్యాభిషేక ఘన ♦ ఋతిరొనర్చబోవ
వచ్చి రాజగృహమందుజొచ్చి పరి ♦ వారంబులబిలచి
వచ్చి వేచియున్నట్టి జనములకు ♦ వసతులనేర్పరచి
అభిషేచనమునకటవలయు పదా ♦ ర్థంబులన్నిగూర్చి
ప్రభువు దశరథుడు రాకుండుటచే ♦ ప్రబలినరోదదీర్చి
కైకగృహంబున నృపునిజాడెరిగి ♦ కబురుబంపనెంచి
ప్రాకటముగ దోడ్కొనిరా సూతుని ♦ పనిచె హెచ్చరించి
తపసియాజ్ఞ సూతుండు కైకయం ♦ తఃపురంబుజొచ్చి
అపకృతుడగు దశరథునకు వశిష్టు ♦ నాజ్ఞదెలపి నిలచి
బదులుపలుకకను కదలక మెదలక ♦ బడియుండిన నృపుని
వ్యధకు కారణంబెరుగకయుండిన ♦ పరికించుచు దరిని
కైకయాజ్ఞనిడె రామునటకు త ♦ క్షణంబుగొనిరాగ
"ఊఁ"కొట్టెను దశరథుడు తదాజ్ఞకు ♦ యువిదవరములొసగ.
తక్షణంబు రాముండు సూతునిచె ♦ తద్విషయంబెరిగి
స్వక్షేత్రంబును విడచియు లక్ష్మణ ♦ సహితుండైయరిగి
జనని కైకకును జనకుడు దశరథ ♦ జనపాలురకెఱగి,
దును కొందుచు దృక్కులక్కగనకడు ♦ దుఃఖాంబుధి మునిగి
తనతో నేమియుబల్కకున్న తన ♦ తండ్రివిధము గాంచి
వినయంబున కైకేయికియిట్లని ♦ విన్నవించె మించి
'ఏమి మునిగెనోయమ్మ జనకుడిటు ♦ నేడ్వకారణంబు
ఏమి పాపమొనరించియుంటినో ♦ యెందుకు కోపంబు

తప్పుడుపను లేమైన జేసితినో ♦ దబ్బరలాడితినో
తప్పితినో ధర్మంబెద్దైనను ♦ తగవుల దెచ్చితినో
తినయానతిమీరితినో లేకను ♦ తల్లులదిట్టితినో
జనులకు నపకృతిసల్పియుంటినో ♦ యనుజులదూరితినో
పరదారావిత్తంబుల హరించి ♦ బాముల బెట్టితినో
గురుద్రోహం బొనరించినాడనో ♦ కులంబుచెడినానో
కానక నన్నరనిమిమంబైనను ♦ గడువని జనకుండు
కానదేమినను కనులవిచ్చి నా ♦ ఖర్మమేమినేడు
తల్లీ! నీవువచింపుమమ్మయిక ♦ తడవుచాయకమ్మ
తల్లడిల్లి దగ్ధంబగుచుండెను ♦ యుల్లము గనవమ్మ
తల్లీ! నావల్లనెయిట్టివిషా ♦ దంబుగల్గెనేని
ఇల్లువిడచి పొమ్మన్నపోయెదను ♦ యిష్టంబగునేని
అగ్నిలోనబడుమన్నను బడియెద ♦ అంబుధిలోనబడి
మగ్నమయ్యెదను ఆజ్ఞయైన మరు ♦ మాటాడకవినుడి
జననీ! తలిదండ్రులకును సంతో ♦ షంబుగూర్పనేను
తనువర్పించెద ఆడినప్రతిజ్ఞ ♦ తప్పవాడగాను
అనుచు దీనుడైబల్కుచున్న రా ♦ మునకనె నిటుకైక
'తనయ! లేదునీదోషంబణుమా ♦ త్రంబునిందు; వెనుక
ఆచరించి సమరంబు శంబరని ♦ శాచరునితో తాను
నాచేరక్షితుడయ్యె మూర్ఛబడి ♦ నాధుండదిగాను
కోరుకొమ్మనియె వరములరెంటిని ♦ కోరక యపినాడు
కోరితినేడవి యందొక్కటి నా ♦ కొమరుడు భరతుండు
నీకుబదులురాజగుట; రెండవది ♦ నీవుదాల్చి జడలు
ప్రకటముగ వల్కలములధరించి ♦ పదునాల్గబ్దములు
దండకాటవి నివాసముండుటయు ♦ తనయా! కోరితినీ
రెండువరంబుల; వానిదెల్పుటకు ♦ రేడు బిడియమూని

చెప్పజాలకున్నాడు నిన్నుగని ♦ చిన్నబోవుచేత
ఇప్పింపుము తద్వరద్వయమునా ♦ కినకులసంజాత !
సత్యవాక్యపరిపాలునిజేయుము ♦ జనకునిశ్రీరామా !
పరిత్యయుతుడవై పితృవాక్యపరి ♦ పాలుడవైమనుమా
ఈపడివికి వడిబోయి భరతునకు ♦ ఇమ్మారాజ్యంబు
ఈవిజూపి గల్పింపుస్థిమిత మవ ♦ నీకుకు శీఘ్రింబు
వావిని శ్రీరఘురాముండనియెను ♦ నగుచు కైకకిటుల
భూవిభుడీ స్వల్పంబునకైయిటు ♦ పొగిలిపొక్క-నేల
నీవడిగినవరముల గొనుమమ్మా ♦ నేనరిగెద వనికి
ఆవాహనమంపుడు భరతునకై ♦ అధిపుజేయ పురికి
అనుమానంబు నొకింతవలదు మీ ♦ యాజ్ఞకుబద్ధుడను
జనకునిజాగ్రతగా గాపాడుము ♦ జననీవేడెదను
సీతా కౌసల్యలకీవిషయము ♦ జెప్పితిరిగివత్తు
జోతలుగైకొనుమమ్మా నీకును ♦ జ్ఞాతి కివియెజేతు
అనుచు, తండ్రి, "హా రామా" "రామా" ♦ యనుచు నేడ్చుచుండ
జనెను జననికౌసల్యను రాముడు ♦ గనగననుజుతోడ
అంతజనని కెరిగింప రాఘవుం ♦ డవనీశునియాజ్ఞ
చింతిల్లుచు ధారుణిబడి మూర్ఛను ♦ జెందెను కౌసల్య
కొంతవడికి తెల్వొంది రాముగని ♦ కుందికుములుచుండ
వంతవలదనుచు రాముడుధైర్యము ♦ వచియింపుచునుండ
అంతవరకు శాంతంబుగనుండిన ♦ అనుజలక్ష్మణుండు
దంతంబులు పటపటగొరుకుచుయనె ♦ తండ్రిదశరథుండు
కాంతాలోలుండై శ్రీరాముని ♦ కాంతారముబంప
కాంతకైక యెవరమ్మా? ధరణీ ♦ కాంతుడెవడు ? తలప
అంతకుండ నాకోపంబెరుగరు ♦ అవనిలోనయెవరు
అంతరాయమును గల్పించెదువా ♦ రంత యెందగలరు

మంతువుగానే జేసెదరాముని ♦ మహిశంతకు నిపుడు
చింతదొరగు మహ్మాయను తమ్ముని ♦ జీరి రాఘవుండు
'అంతటివాడవె నీవు తమ్ముడా! ♦ అరయనె నీశక్తి
ఇంతకోపమూనంగ తగునె నే ♦ నెరుగుదు నీభక్తి
తామసంబునను తామసియగు నని ♦ తలపవె లోకోక్తి
కామాదరిషడ్వర్గ విజయమును ♦ గలుగువాడె వ్యక్తి
తల్లిదండ్రులాజ్ఞదైనను సరె ♦ తగదు దూషణంబు
యుల్లంఘింపక పాటించుటయే ♦ యుత్తమధర్మంబు'
అనుచుననుజు శాంతింపజేసి తన ♦ జననిని యోదార్చి
జనెను రాఘవుడు సీతకు దెలుపగ ♦ వనమరుగుట గూర్చి
వినిపించుచు తద్విషయంబెల్లను ♦ విపులంబుగ సతికి
అనెను రాముడశ్రుల నీరొల్కగ ♦ జనియెదనే వనికి
పదియునాల్గువత్సరము లడవిని ని ♦ వాసంబొనరించి
పిదప వచ్చెదను మజ్జనకుని సం ♦ ప్రేషము పాలించి
అంతవరకు నీవత్తమామలకు ♦ యణకువగాయుండి
శ్రాంతవై ప్రశాంతంబుగ గడుపుము ♦ జానకి! యిటనుండి'
నావిని జానకిరామున కనెనిటు ♦ నన్ను విడచిపోవ
జీవితేశ్వరా! భావ్యంబే వ ♦ చ్చెదనిను వని గొలువ
నీవు వనంబేగిన పిమ్మట యిట ♦ నిమిషముండ గలనా!
పావనమగు నీపదపంకజ సే ♦ వనువిడి మన గలనా!
సతికిపతియెగతి పతితోడను సతి ♦ సతతముండవలయు
పతితో సమముగ సుఖదుఃఖంబులు ♦ సతియు బొందవలయు
అనెడు సతికి రాముండనె నిట్టుల ♦ అయ్యోవినవుగదా
వనములోన నీవిడుముల బడలే ♦ వరయ వచటిబాధ
పులులు సింగములు ఖడ్గమృగంబులు ♦ పులుగులు తోడేళ్లు
ఎలుగులు రేచులు ఎనుబోతులు మ ♦ త్తేభంబులు తేళ్లు

పాములు కోతులు కొండముచ్చులును ♦ పందులు కుందేళ్ళు
దోమలు చీమలు మండ్రిగబ్బలును ♦ దుప్పు లెర్రితేళ్ళు
వసియించును తద్వనమున నవిగని ♦ భయమొందెదవీవు
కసవుకంటకాదులు గలపథముల ♦ కాలనడవలేవు.
అదియుగాక తద్వని నివసించెడ ♦ రసురులుపెక్కుండ్రు
బెదరించెదరె గ్గొనరించెదరతి ♦ భీకరులగువాండ్రు'
అనుచు నెన్నియోవిధముల వారిం ♦ చిన. నేమియువినని
జనకజనుంగొనిపోవ రాముడొన ♦ గెను తనసమ్మతిని.
అంతలక్ష్మణుం డన్నకు మొక్కుచు ♦ ననెను "నేనుగూడ
కంఠం తంబగువరకు నటవిలో ♦ గడిపెదనీతోడ
సీతారాముల నిత్యసేవనా ♦ జీవనంబుధరను
పాతను భ్రాతను భవద్వియోగము ♦ భరియింపగలేను
సన్నుతాంగ నీవేగిన నయోధ్య ♦ శ్మశాన సమమగును"
నన్నుగూడగొనిపొమ్మ యన్నా ♦ నిన్నర్థించెదను'
అనుచు వేడు తమ్మునితనతో ర ♦ మ్మనమని జానకితో
ధనువు లమ్ములనుగొని వెనునడచెను ♦ అనుజు లక్ష్మణునితో
వనమునుగుటవిని కనులనీరునిడు ♦ వశిష్టసూతులతో
జని రాముడు కైకేయిగృహమునకు ♦ ననెనిటు జనకునితో
'జనకా! దండప్రణామంబులివె ♦ గొనుము జేయుచుంటి
జనకజ సౌమిత్రులతోడను నే ♦ వనికి నేగుచుంటి
ఎనిమిదారు వత్సరములుగడిపిన ♦ వెనుకవత్తు మిటకు
వనమునుగుట మాకనుజ్ఞనొసగుము ♦ వ్యథనొందగబోకు'
అనుచుండగ కైకేయి వల్కలము ♦ లచటికిగొనివచ్చి
జనకజకును రఘురామునకును ల ♦ క్ష్మణునకు నవియిచ్చి
మునివేషంబులధరించి యరణ్య ♦ మునకు వెడలుమనిన
కనలి వశిష్టమునీశుండనెనిటు ♦ "కైకా! యిదితగునా

జనకజకును వల్కలముల నొసంగ ♦ సమంజసముగాదు
అనుగామినినై నడచెడు సాధ్వికి ♦ అవియివ్వరాదు
తొలుతరాము మాత్రించె వల్కలము ♦ తొడవనికి వెడల
బలికి జానకికి కూడ నొసగనివి ♦ బాడియె యిదిమేలా?
వలువలు సొమ్ములు జానకి కొసగుడు ♦ వలసినంత వరకు
"వలదు," జానకీ! ధరింపకుము వ ♦ ల్కలమువద్దు నీకు".
నావిని ధరించె నన్నదమ్ములా ♦ నారవస్త్రములను
భూవిభుండు తద్దృశ్యము గనుగొని ♦ పొగలిదుఃఖమునను
రామా! రవికులసోమా! తారక ♦ నామా రిపు మథన!
కామిని కైకకు వరముల నొసగితి ♦ కామాంధత్వమున
తప్పజాలకున్నాడ వరంబుల ♦ ధర్మము విడజాల
తప్పొనరించితి నీవడవికి జన ♦ తనయా! మనజాల
అటవికి వచ్చెదనేనుగూడ నిలు ♦ మనుచు సతినిగాంచి
కటకట! ఘోర మొనర్చితివే నీ ♦ కన్నతలినిమించి
కేకయభూపతి యింట బుట్టితివి ♦ కాకోలము వలెను
నాకుమృత్యువై యిట బెరిగితివే ♦ నాలిముచ్చు వలెను
కైకా! నీవీ భోగభాగ్యములు ♦ గట్టికొనుము తలను
నీకొమరునికే, రాజ్యము నొసగుము ♦ నే వనికరిగెదను
అనెడు జనకునకు ననియెరాముడిటు ♦ 'అయ్యా యిది తగునా
అనుభవింప గావలె విధివ్రాతను ♦ హరిహరేంద్రులైనా!
జననికైక నివుడేమనిన వ్రియో ♦ జనములేదు గాన
కినియకు, నీవిచ్చటనే యుండుము ♦ క్లిష్టమోర్పుమ"నిన,
కనులనీరములు యొల్కగ తనయుని కౌగలించి, "రామా!
ఇనకుల సోమా! సురక్షితంబుగ ♦ ఏగి వనికి రమ్మా
మునులసేవనము తప్పకుమా వన ♦ మున సుఖవై మనుమా
తనయా! సర్వశుభంబుల గనుమా ♦ ననుమది మరువకుమా."

అనెడు దశరథునియాజ్ఞనుగొని కై ♦ కమ్మకెరగివడిగ
జనె సీతారామలక్ష్మణులు కౌ ♦ సల్యసెలవుగొనగ
శ్రీరాముని పట్టాభిషేకమటు ♦ చెడిన విషయమెరిగి
జేరిపౌరజలు కైకమ్మనుదూరిరి ♦ చింతాబ్ధినిమునిగి
జనకునాజ్ఞ పరిపాలింపగ రా ♦ జ్యంబునువిడచి వని
కనుగమింప సతియును తమ్ముండును ♦ జనదలచిన సుతుని
గని విశ్లేషము భరింపజాలక ♦ కౌసల్యాదేవి
కనులనీరునిడి సర్వసౌఖ్యములు ♦ గాంచవాడు భావి
మాపురనాశీర్వదించి సముచిత ♦ ముగాను జనిజనక
భూవరసుత సీతకు ధర్మంబులు ♦ బోధించెను; వెనుక
ముగ్గురువెడలి సుమిత్రకు దెలిపిరి ♦ మొక్కుచు విషయమును
దగ్గరదీయుచు దీవించె సుమి ♦ త్రాసతి వారలను
పిదప లక్ష్మణున కనియెను సుమిత్ర ♦ ప్రీతితోడ నిటుల
"వదినను యన్నను కనిపెట్టుము వని ♦ సదా వేయికనుల
తనయా! శ్రీరఘురాముని యికనీ ♦ తండ్రిగ గనుగొనుము
వనమయోధ్యగా, వదినను ననుగా ♦ గనుగొని సుఖవగుము
మంతువు, గురు, దైవంబనిరాముని ♦ మరువకెపుడు యెందు
ఇంతకంటె నీకిహపరసాధన ♦ మింకొక్కటిలేదు
ఇంతిసీత 'రమ' ఈతడు 'శ్రీహరి' ♦ ఏగుమిది గ్రహించి"
అంతట సీతారామలక్ష్మణులు ♦ అరద మధిష్టించి,
సుశ్శకునంబవకౌ సల్యాదులు ♦ శోకింపుచునుండ
ఇన్నీ విధియిటు వ్రాసెనాయనుచు హితు ♦ లడలుచునుండ
వశిష్టాది మునిపుంగవు లాశీ ♦ ర్వాదులాడుచుండ
దశరథుండు 'హారామా'యని మది ♦ తల్లడిల్లుచుండ
దురుసుగ కైకను దూరుచు యెల్లరు ♦ దురపిల్లుచునుండ
పురజనుల రదము వెంబడి బడి వడి ♦ బరువెత్తుచునుండ

సీతారాములకును లక్ష్మణునకు ♦ జేజే లనుచుండ
సూతుడు సుమంత్రు డరదమువడి వల ♦ కడకునడుపుచుండ
'మడుగు డడవిజన నుడుగు'డనచు జను ♦ లడలుచు విలపింప
వెడలిరయోధ్యను విడనాడుచు కా ♦ రడవిని వసియింప.
రాముడుసతితో నడవికిజను కా ♦ రణమున నెల్లరును
ఏమియుదోచకయుండి రయోధ్యను ♦ ఎచ్చటజూచినను
జడతగల్గి జనులెల్లరుపుడమిని ♦ బడిరి దుర్భరంబు
కడలులుపొంగినవిధ మయోధ్యలో ♦ గన్పడె చలనంబు
హోతలగ్నిహోత్రంబుల వేల్వరు ♦ యుత్సాహము లేక
పాతివ్రతలును భర్తలయెడబడె ♦ పరాకుమతిలేక
రహిరహితంబై 'రామ' 'రామ'యని ♦ రాత్రింబవళ్ళునూ
గృహకృత్యంబుల మరచియుండిరహ ♦ గృహిణిగృహస్థులునూ
పాలుగుడువ రేడ్వరు మూల్గరు పసి ♦ బాలు రద్భుతంబు
పాలనుసీయవు పచ్చిక మేయవు ♦ పశువులు చోద్యంబు
కళాహీనమై పురముకాడువలె ♦ గానుపించుచుండె
కళలుదప్పి రిన సోములు గ్రహములు ♦ కాంతిదొరగియుండె
ఆకసమునను విశాఖమలినమై ♦ ఆపదసూచించె
చీకటులలమగ దొరగె దిశలు ము ♦ ల్లోకములుచలించె
దశరథు డరదము వెడలగ గనుగొని ♦ తద్దయుచింతించి
వశముదప్పిమూర్ఛిల్లి తెప్పరిలి ♦ వల కడదిలకించి
"హా రామా! హా లక్ష్మణ! సీతా! ♦ అడవికి వెడలితిరా
క్రూరకర్మకుడ, కడుదుర్మార్గుడ ♦ కుత్సితుండను ధర
అయోగ్యుండ నిన్నడవికిపంపితి ♦ నవనిజేశరామా!
అయయోభరింపజాలను నేనీ ♦ యవమానము వినుమా
నన్నడవికి గొనిపోవైతివిగద ♦ కన్నతండ్రి! రమ్మా
నిన్నుజూచుభాగ్యంబు లేదుమర ♦ ణించుచుంటినమ్మా

రామరామ శ్రీసీతారామా ♦ రామా రఘురామా!
మోముజూపి సమ్మోదంబుగ నొక ♦ ముద్దునొసగి పొమ్మా"
అనుచునేడ్చి భ్రమరినవిభు కౌస ♦ ల్యాది సతులుగాంచి
గొనిచని రంతఃపురి కుపచారము ♦ లొనరింపగనెంచి
సతి కైకను దరిరానీయక కౌ ♦ సల్యసుమిత్రలచే
క్షితిపతి యోదార్పగబడి వారల ♦ సేవల గొనజొచ్చె.
అట రామాదులు తమసానదికడ ♦ కారాత్రికియరిగి
తటిని యుపవసించుచు నిద్రించిరి ♦ కటికనేలనొరిగి
కొంతవడికి తమ్ముని సీతను మే ♦ ల్కొలిపి సూతుగాంచి,
ఎంతజెప్పినను వెనుకకుమరలక ♦ యే యయోధ్యనుంచి
తేరు గూడపరు విడుచును వచ్చిన ♦ పౌరులు నిదురింప
వారి నేమరచి వడిబోవుదమని ♦ శ్రీరాముడు దెలుప,
రామాదుల మువ్వురగొని సూతుడు ♦ రథమునడిపె మరల
ఆమరు దివసంబున వేదశ్రుతి ♦ గోమతాది నదుల
దాటి కోసలము గడచి సంధ్యవడ ♦ దర్శించితిరి "గంగ"
నాటికి పయనము చాలించుడమని ♦ నదికడ నిలువంగ
బహుపరాక్రముడు శృంగిబేర పురపాలకుండు ఘనుడు
గుహుడను నిషాద విభుడు రామభ ♦ క్తుండు వైష్ణవుండు
సీతానుజులతో రాముండరుదెం ♦ చెను యని దెలుసుకొని
యాతనికొసగగ భక్ష్యభోజ్యలే ♦ హ్యాది కానుకలగొని
వచ్చిమువ్వురకు మ్రొక్కుచు కానుక ♦ లిచ్చిబల్కెనిటుల
"ఇచ్చదారగా నేధన్యుడనైతిని ♦ ఇనకులేశ మిగుల
ఇచ్చటికిపు డిట్లరుగనేల మీ ♦ రీ మునివేషముల
ప్రచ్ఛన్నంబుగ నుండవచ్చితిరో ♦ పదభ్రష్టతవల
కాకను మీకెవ రైనయపకృతి ♦ గావించిరో విపుల
నాకుతా! మీరాక కారణము ♦ గ్రహియింపగజాల"

అననగిరాముడు గుహున కుదంతం ♦ బంతయు నెరిగించి
అనుజగుహులు సేవింపగ యానిశి ♦ నచ్చటనిద్రించి
మరునాడట జడలను తానును ల ♦ క్ష్మణుడును ధరియించి
ధరణిజానుజులతో గంగానది ♦ దాటనిశ్చయించి
బరగ మూవురును గుహుడేర్పరచిన ♦ బడవ నధిష్టించి
అరదముతోవడి సూతు నయోధ్యకు ♦ తిరుగగ నియమించి
తలిదండ్రులతో తమయాగమనము ♦ దెలుపగ బ్రార్థించి
సెలవునుగొని సూతునికడ గంగా ♦ జలము లనుగమించి
గుహునియాజ్ఞచే మార్గముచూపుచు ♦ కూడను యరుదెంచు
సహచరినితో ముచ్చటలాడుచు వన ♦ సౌభాగ్యముగనుచు
శర కార్ముకధరుడై కాననముల ♦ ధరణిజ నడువంగ
యరిగె వత్సదేశంబానాటికి ♦ ఆదిత్యుడు కృంగ.
అచ్చటనొక వృక్షాశ్రమమున వా ♦ రారాత్రిని గడపి
ముచ్చటలాడుచు మూవురు మరుదిన ♦ మున పయనముసలిపి
గంగా యమునలు సంగంబౌయెడ ♦ గని యచ్చోట ముని
పుంగవుడు భరద్వాజుని యాశ్రమ ♦ ముండుటెరింగి, జని
భరద్వాజముని కెరగిన యాతడు ♦ వారల దీవించి
అరసి వారివృత్తాంతంబును ముద ♦ మార సత్కరించి
ఆరేయచ్చట నుండుండన వా ♦ రచ్చట నిద్రించి
సూరోదయమున లేచి భరద్వా ♦ జుకు నమస్కరించి
తా పుడవిని వసియింప యోగ్యమగు ♦ తావుజూపుమనిన
ఆమహనీయుడు జూపె చిత్రకూ ♦ టాద్రి సమీపమున
అంతట సీతారామ లక్ష్మణులు ♦ అరుగుచు నగమునకు
చెంతను పర్ణకుటీరము నిర్మిం ♦ చిరి వశియించుటకు
అట వాల్మీకమునింగని యాతని ♦ యాశీస్సులబడసి
కుటీర వాసము సల్పుచుండి రే ♦ కొదవలేక, కలసి.

అట, రామునిచే సూతుడు గంగకు ♦ నద్దరి విడువబడి
కటకటబడుచును, కైకను దూరుచు ♦ కన్నులనీరునిడి,
రాముడు గంగను దాటినపిమ్మట ♦ రథముతోడ మరలి
రామునివృత్తాంతము దెల్పెను దశ ♦ రథునికడకు వెడలి.
అదివిని దశరథకౌసల్యసుమి ♦ త్రాదులు రాఘవుని
న్నుదతిజానకిని, సౌమిత్రిని దల ♦ చుచు దుఃఖాంబుధిని
మునిగియున్నతరి కౌసల్యకు మె ♦ ల్లనయనె విభుడిటుల
"తనయులవియోగమును సహించుచు ♦ ధరనికమనజాల
కాలముతీరెను కర్మము పరిప ♦ క్వంబయ్యెను నేడు
బాలకుడొకడైనను లేడహ నా ♦ ప్రారబ్ధముజూడు
నలువురుసుతులున్నను కడనొకడై ♦ నను లేడయ్యయ్యో!
తలప మానిశాపం బీనాటికి ♦ తటస్థమయెనయ్యో
వినుము తొల్లి యౌవనమున నేవని ♦ వేటకుబోవు నెడ
వినబడె 'బుడబుడ'రవమొక నదికడ ♦ వెంటనె గురితోడ
అటనొకకరి నీరుద్రావుచున్నది ♦ యని నేభ్రమియించి
చటుకున విడచితి శబ్దభేధియను ♦ శరము వింటనుంచి.
అంతట "చచ్చితి"నను యొకమానవు ♦ నార్తారవమువిని
చెంతకరిగి నేజూతునుగద ముని ♦ చిఱుతడొకడు ధరణి
బడియుండెను నటబాధబడుచు నా ♦ బాణంబెదతగుల
గడగడవడకుచు కనులనీరమొ ♦ లుకగ నంటెనియిటుల
'అయ్యో నీవిట నీరుముంపగా ♦ నైన రవంబువిని
ఇయ్యెడ నీరముగ్రోలుచు నొకమ ♦ త్తేభంబుండెనని
భ్రమపడి నీపై శరమువిడచితిని ♦ పాపమొనర్చితిని
క్షమియించుము నన్నెరుగుము దశరథ ♦ క్ష్మాతలనాథుడని
భూసురవర నీవృత్తాంతము దె ♦ ల్పుమనుయన నాతండు
దాసోహంబిక సల్పెద నన్నాతో ♦ తడబడుచిటులపుడు

ధరణీశ్వర నీవెరుగక జేసిన ♦ తప్పు తప్పుగాదు
ధరామరుండనుగాను బ్రహ్మహ ♦ త్యాదోషము లేదు
నేను శూద్రివనితకు వైశ్యునకు జ ♦ నించితి కరణుండ
నేనిచ్చోట జననీజనకులతో ♦ నివసించెదు వాడ
కనులులేని వృద్ధులు నాజననీ ♦ జనకులు యిచ్చోట
మునివృత్తిని యున్నారిక వారల ♦ ముప్పుగడువ దకటా !
జననిజనకులట దప్పికగొననే ♦ జలమును గొనవచ్చి
జనపాలా ! యిట్లైతిని నీవీ ♦ జలము వారికిచ్చి
దప్పికదీరిచి తదుపరి నావృ ♦ త్తాంతము వారలకు
జెప్పుమనుచు తమనెలవును జూపిం ♦ చెను 'నే' బోవుటకు
హరినామ స్మరణంబును జేయుచు ♦ యామునిబాలుండు
శరము బెరుకమన, బెరికితినంతట ♦ మరణించె నతండు
అంతట యాజలమును కరములగొని ♦ అటముని దంపతుల
చెంతకరిగి వారికి నీరంది ♦ చ్చిన వారలుమ్రోల
నిలచియున్ననను తమ తనయునిగా ♦ దలచి బల్కిరిటుల
అలిగితివా జలముల గొనివచ్చుట ♦ కన్నా జాగేల
యొనరించితివి కుమార నినువిడచి ♦ యొక నిమిషంబైన
మనజాలము మాపై నీకాగ్రహ ♦ మా ? యను మొదలైన
నిష్ఠురంబులాడియు, నేపలుకక ♦ నిలువగ ననుగాంచి
దుష్టుడవీ వెవ్వడవో మాకిట ♦ ద్రోహంబొనరించి
మమువంచింపగ వచ్చితివయ్యో ♦ మాటాడవదేమి
కుమారుండవేమైన మమ్మిటుల ♦ కుందజేతువేమి
ఎన్నడు కోపించదు మాకొమరుడు ♦ ఏడీవాడేడి
నిన్నుశపింతుము జెప్పకున్న యన ♦ నే నిర్ఘాంతబడి
వారికి మ్రొక్కుచు నిట్లంటిని నే ♦ వడిగ భీతితోడ
ధారుణి నేలు యయోధ్యాపాలకుడ ♦ దశరథుడనువాడ

నేను నిశిని మీతనయుని దెలియక ♦ నీరు ముంచుచుండ
ఏనుగయని భ్రమియించి చంపితిని ♦ హీనుడ, క్రూరుండ
అపరాధము క్షమియింపుడనుచు నే ♦ నార్తితోడఁ బలుక
తపసి దంపతులు కడుశోకింపుచు ♦ తమతనయుడు లేక
తమ జీవితములు నిరర్థకంబని ♦ త్వరితంబుగ నన్ను
కొమరుడు బడియున్నటి తావునకుఁ ♦ గొనిపొమ్మనుమ నెను.
తనయుని శవమునుజూప వార ల ♦ ద్దానిని తడవుచును
"తనయా ! మరణించితివా దశరథ ♦ సునిశితశరమునను
హా కుమారకా ! హా కులవర్ధన ! అయ్యో పోయితివా !
మాకు దిక్కెవరు మము గన్నయ్యా ! మమ్ముల మరచితివా !
మాతో నొక పలుకైన వలుకవా ! మము గన్నులఁజూడు
నీతో మము గొనిపొమ్ము వచ్చెదము ♦ నిక్కము నీతోడు"
అనుచు వారలాత్మజునకు నట నం ♦ త్యక్రియలను జేసి;
'నను' గని యోరీ ! నరనాయక మా ♦ నందను నెడబాసి
మనజాలము భువి మాకీ దుర్గతి ♦ యొనరించితివోర !
అనలమునంబడి మగ్నమయ్యెదము ♦ తనయు నిపుడు జేర
మేము పుత్రశోకంబున తపించి ♦ మృతిజెందినయటుల
భూమీశా నీవుఁగూడ మరణము ♦ బొందగలవు యువల'
అని నను శపించి, చితిలోఁబడి వా ♦ రసువుల గోల్పోయె:
మునిదంపతులిడు శాపకారణం ♦ బున నిపుడిట్లాయె.
కొడుకులు బుట్టకయున్న నేను య ♦ ప్పుడు తచ్ఛాపమున
అడలియు యలరితి తనయులు గల్గెద ♦ రనియెడు తలంపున
శరణునిజంపుట నా మరణంబుకు ♦ కారణమయ్యె నిల
తరుణీ, నేనీ పుత్రవియోగము ♦ భరియింపగజాల
హా రామా ! హా వైదేహీవర ! హా కుమారతిలక !
రారా నను గనవేరా ! నాపై ♦ ఏరా నీకలుక !

రామరామ శ్రీసీతారామా ♦ రామా రఘురామా !
రామరామ రఘురామ పరాత్పర ♦ రఘుకులాబ్ధిసోమా !
కాలహరణమును గానీయకురా ♦ కన్నతండ్రి రారా
హాలక్ష్మణ ! భరతా ! శత్రుఘ్నా ♦ అయ్యో యిటలేరా
తనయులార కడసారి తండ్రినిటు ♦ దర్శింపగరండు
అనుచు పుత్రిశోకంబున పొగలుచు ♦ అకటా దశరథుడు
కనులమూసి ప్రాణంబుల విడచెను ♦ కాంతలెరుగకుండ
గనుగొని మరుదినమున యంతఃపుర ♦ కాంత లేడ్చుచుండ
వశిష్టాదులరుదెంచి నృపునిగని ♦ వారల నోదార్చి
దశరథుశవమును కడుజాగ్రతతో ♦ తైలద్రోణి జేర్చి
మరుదినమున నొకసభను నేర్పరచి ♦ మంత్రిలరప్పించి
భరతునికై, కబురంపిరి 'రమ్మని' ♦ భటులను బంపించి
అచ్చట భరతుడు కబురునందుకొని ♦ అనుజునితో గూడ
వచ్చెనయోధ్యకు విషయంబెరుగక ♦ వడియాత్మతతోడ
జనని కైకకడ కరిగి ఎఱిగియునె ♦ జననీ ! పురమేమొ !
గనబడుచుండెను కళాహీనమై ♦ కారణాంతమేమొ
సందడి వినరాకుండెను యెచ్చట ♦ జనకుం డగుబడడు
అందరు కుశలమె ? ఎడమనేత్రి మయొ ♦ అదరుచుండె నేడు
ఏవిపత్తు రానున్నదొ తల్లీ ♦ ఎవ డెఱుంగగలడు
నా విని యనె కైకేయి భరతునకు ♦ నాధుడు దశరథుడు
శ్రీరాముని పలుమారు దలంచుచు ♦ జెందెను మరణంబు
భారమణుడవై అయోధ్యనేలుము ♦ పుత్రి ! తక్షణంబు
అనిన దుఃఖమున భరతుండనెనిటు ♦ అమ్మా ! దుర్భరము
జనకుడు మరణించినయపుడన్నను ♦ స్మరింప కారణము
ఏమిగల్గె ? నే రాజ్యంబేలుట ♦ ఏమిటె ? అనఘుండు
రాముడు లేడా మాజనకుడు ని ♦ ర్యాణమొందునపుడు

మమ్ముబాసిచనె జనకునిభాగ్యము ♦ మాకికలేదాయె
అమ్మా జనకుండేరుగ్మతచే ♦యసువులగోల్పోయె ?
ఎంతటి విపరీంతబుగల్గె నే ♦ నిటలేనపు డనుచు
చింతిలు భరతునకనె కైకిట్టుల ♦ సిగ్గులేక నగుచు
'నాకొసగినవరములు రెండుండగ ♦ నాథుని కోరితిని
నీకురాజ్యమును రామున కరణ్య ♦ నివాసమివ్వమని
రాముడు సీతాలక్ష్మణయుతుడై ♦ రాజధానివదలె
భూమీశుండిట పుత్రశోకమును ♦ బొంది దివికివెడలె
నీకొరకై యీరాజ్యముగొంటిని ♦ నిందలకొడిగట్టి
శోకమునొందక రాజ్యంబేలుము ♦ సుతుడా చేబట్టి
జనకున కంత్యక్రియలనుజేయుము ♦ తనయా సత్వరము
వినదెద్దియో యైనదందులకు ♦ ఆలోచింపకుము
అను కైకనుగని భరతుండనె కడు ♦ యాగ్రహమున నిటుల
'ఇనకులమున కపకీర్తిదెచ్చితివి ♦ హీనచిత్తురాల
జనకున కివ్విధి పుత్రశోకమును ♦ చావుదెచ్చినావు
జననివిగా విలపాపీ ! గోముఖ ♦ శార్దూలంబీవు
అన్ననువదినను అనుజలక్ష్మణుని ♦ యంపితి వడవులకు!
ఎన్నడైన నేనాశబడితినటె ♦ యీరాజ్యముకొరకు?
రాముడొనర్చిన తప్పిదమేమే ♦ రాష్ట్రిము బాయుటకు?
రాముడు నీ కేమడ్డమొచ్చెనే ♦ రాజ్యముకోరుటకు?
అయోధ్య పరిపాలించెదనని యెడి ♦ యాశజెందబోకు
అయయో యెంతపకీర్తిదెచ్చితివి ♦ అవనిలోననాకు
రామచంద్రుడే కోసలమున కిల ♦ రాజవతగువాడు
ఆమహనీయుని పదభృత్యుడనై ♦ అనుసరింతునెపుడు
కుకర్మురాలవు క్రూరమానసవు ♦ కుత్సితవీవవని
అకార్యకరణము నయ్యనుజంపితి ♦ వన్ననుబంపితివని

రాముని గన వనికేగెద నీవిక ♦ రాజ్యమేలు మించట
నీమొగంబునే జూడగజాలను ♦ నిలువకునాయెదుట
అనుచు భరతుడనుజునితో కౌస ♦ ల్యను గన జనుదెంచి
వినయముతో యామెకు వందనమిడ ♦ తనయుల దీవించి
అనెనిటు కౌసల్యాసతి భరతున ♦ "కయ్యాదశరథుండు
తనువువిడచి దివికరగెను, అటవికి ♦ జనియెను రాముండు
ఆతనితో లక్ష్మణుడును సీతయు ♦ అరిగిరి వనమునకు
నాతీరిట్లయె అనాధనైతిని ♦ నాకెవ రిలదిక్కు-
ఇన్నిటికిని నీతల్లియె మూలము ♦ ఏమైనను యేమి
కన్నకుమారుని పైగల ప్రేమము ♦ కన్న మిన్న యేమి
భరతా నీకై యీరాజ్యము సం ♦ పాదించెను కైక
స్థిరముగ రాజ్యంబేలుము తండ్రీ! ♦ క్షితినియడ్డులేక"
నా విని భరతుండనియెను "తల్లీ! ♦ నన్నరయగలేక
ఈవిధముగబల్కగ బాడియె కైకకు ♦ ఏను సుతుడగనుక
ఈపనినటు నాతల్లియెమూలము ♦ ఏనేమియు నెరుగ
నావల లేదణుమాత్రము దోషము ♦ నమ్ముము నిక్కముగ
నాదుతల్లి కైకేయి వరంబులు ♦ నాధునికోరుటయు
ఆ దశరథుడవి యొసగుట రాముడు ♦ అరణ్యమేగుటయు
భూమీశుడు తత్ఫలముగ మరణము ♦ బొందుటయును నాకు
ఏమియు దెలియవు నీవును నా త ♦ ల్లిపుడు జెప్పువరకు
ఏనీవిషయంబుల నేమైనను ♦ ఎరిగియున్నయెడల
నానావిధపాపంబుల జేసిన ♦ నరాధమునియటుల
రౌరవములబడిపోవుదు నే దు ♦ ర్మరణమొంది నిజము
(శ్రీ)రామునియెడ ద్రోహంబొనరిం ♦ చెదనని తలపకుము;"
అనుచునుండగా వశిష్టముని యట ♦ కరిగి భరతుగాంచి
జనపాలుని మరణంబుదలచి యా ♦ తనిని యాదరించి

ఆలి యనుజాలతో రాముఁ డడవికి ♦ యరుగుట వినిపించి
తైలద్రోణియం దుంచిన దశరథు ♦ తనువును జూపించి
జనకున కంత్యక్రియలఁ జేయుమన ♦ విని యా భరతుండు
జనకు మృతకళేబరము శిబికయం ♦ దునఁగొని చని యపుడు
సరయూతటమున దహన మొనర్చెను ♦ శత్రుఘ్నునిఁగూడి
జరిపెను జలతర్పణములు తదనం ♦ తరము స్నానమాడి
అవల దశాహద్వాదశాహ్నములు ♦ యథావిధిగ జరిపి
అవనీసురులకు గోధన భూదా ♦ నాదికములు సలిపి
భూవిభు నిర్యాణంబునకై కడు ♦ పొగలుచు దుఃఖముతో
భావికర్తవ్య మాలోచించెను ♦ భరతుఁడు తమ్మునితో
అప్పుడు భరతుండామాత్య వశి ♦ ష్ఠాదుల రప్పించి
చెప్పదొడంగెను వారికివ్విధము ♦ చేతులుజోడించి
"తప్పొనరించెను నాదుతల్లి నా ♦ తత్వ మరయలేక
ముప్పుదెచ్చె యినకులమున కివ్విధి ♦ మూర్ఖురాలు కైక
ఎప్పుడు నేనీ రాజ్యంబునకై ♦ ఇచ్ఛగించలేదు
ఇప్పుడైన నాతల్లి నిర్ణయం ♦ బొప్పుకొనను; వలదు
రామచంద్రు నెట్లయిన నిటకుగొని ♦ రాదలచితి నేను
ఆ మహనీయుని యర్థించుటకై ♦ అటవికి జనియెదను
శ్రీరాముని యొప్పించి రాజ్యమును ♦ స్వీకరింపఁ జేతు
శ్రీరాముడు రాకున్న యతనితో ♦ చేరివనివసింతు
దాశరథికిని నాకస్తి మశకభే ♦ దంబుగలదు తలువ
'శ్రీశు' డతడు నేదాసుడ నతనికి ♦ క్షితిని సేవసలుప
భరింపజాలను నేనీరాజ్యము ♦ కరముదుర్భరంబు
హరింపజాలను శ్రీరఘురాముని ♦ హక్కగు రాజ్యంబు
తోడునీడగా మీరెల్లరు నా ♦ తోడ వనికిరండు
వేడుద మన్న నయోధ్యకురమ్మని ♦ వేగపయనముగుడు

సకలమైన సంభారము గూర్పుడు ♦ చనగ రాముకడకు
ప్రకటిత మొనర్పుడీ విషయంబును ♦ ప్రజలకు నందరకు"
అనుచు భరతుడాజ్ఞాపించుచు వన ♦ మరుగ నిశ్చయించి
అనుజునితో తల్లుల మువ్వురితో ♦ అరదమధిష్ఠించి
అరదగజాశ్వపదాతి బలంబులు ♦ అమరి కదలుచుండ
పురజనులెల్లరు రామభజన స ♦ ల్పుచు నడచుచునుండ
ఆమాత్యవశిష్టాదుల గూడుకొ ♦ నయోధ్యనెడబాసి
రామునిగొని రా వెడలె, లభ్యమగు ♦ రాజ్య మవలత్రోసి.
పోయిపోయి గంగానది జేరిరి ♦ ప్రొద్దుగుంకు సరికి
ఆయెడలంగల గుహుండు భరతుగని ♦ అరిగి వారిదరికి
భరతుని యాగమనంబును యాతని ♦ బలంబులను గనుచు
ధరణిజపతి కాతం డపకారము ♦ తలచివచ్చె ననుచు
అరగలినొందుచు భరతున కనెనిటు ♦ "అయ్యోయిది తగునా
పరిభవింపబడి యున్న రాఘవుని ♦ పై బడజన నగునా
కైకయొనర్చిన యపకృతి చాలదొ ♦ కాననుండ నియవా?
కాక రాముకడ దేర్చి అడ్డులే ♦ కను ధరనేలెదవా?
రామున కణుమాత్రంబు నయోధ్యా ♦ రాజ్యకాంక్ష లేదు
భూమిజపతిపై నీవింతటివగ ♦ బూనగాను తగదు
రామున కేమాత్రంబపకారము ♦ రానీయను వినుమా
నీమూర్ఖత విడనాడి మగుడుమిక ♦ నిలువక వడిపొమ్మా"
అనుచు నిష్ఠురంబల్కెడు గుహునకు ♦ అనెనిటు భరతుండు
"నినుదెలసితి శ్రీరామభక్తునిగ ♦ నిషాదవర జూడు
నన్నరాతిగా భావింపకుమా ♦ నాపైవల దలుక
అన్నకు నాతలిజేసిన యెగ్గును ♦ హర్షింపగలేక
రామచంద్రునకు తిరుగ నయోధ్యా ♦ రాజ్య మొసగబూని
ఆమహనీయుని అర్థించుటకై ♦ అటవికి వచ్చితిని.

రామచంద్రునకు అపకృతి సల్పగ ♦ రాలేదిచ్చటకు
రామునిజాడెరిగింపగ మాతో ♦ రమ్మాతనికడకు"
అనెడు భరతునకు అన్న పైనిగల ♦ అనురతిగమనించి
తన యవివేకంబునకై గుహుండు ♦ తద్దయు చింతించి
క్షమార్పణంబును వేడి, రాముడట ♦ శయనించిన తావు
దమమున రాముం డనుజుతో జడలను ♦ దాల్చినట్టి తావు
మొదలగు స్థలముల జూపిన భరతుడు ♦ పొగులుచు దుఃఖించి
వదలిదుస్తు లనుజునితో జడలను ♦ వల్కలములదాల్చి
అరడలనెక్కుచు గుహుఁడుకూడ జన ♦ పరి జనవృతుడగుచు
మరుదినమున గంగానదిదాటెను ♦ మరల పయనమగుచు
జనిజనివారలు భరద్వాజ యా ♦ శ్రమంబునకు నేగి
మునిపుంగవునింగని సాగిలబడి ♦ మ్రొక్కిన నయ్యోగి
వారల నాశీర్వదించి భరతుడు ♦ వచ్చిన యాచూకి
అరసి విందులనొనర్చి దెలిపెను ♦ శ్రీరాముని యునికి
శ్రీరఘురాముడు సీతానుజులతో ♦ చిత్రకూటగిరిని
చేరి యచట నొక పర్ణశాలను వ ♦ సించుచుండుట విని
భరతాదులు అటనుండి పయనమై ♦ పర్ణశాలకడకు
అరుగుచుండ చదలంటు ధూళి దో ♦ సరశబ్దంబులకు
బెదరి వనచరములెల్లను చెల్లా ♦ చెదరై బరులిడగ
ఇదమిద్ధంబని తెలియని రాముడు ♦ అది యేదియొ నెఱుఁగ
అనుజు నంపగా నాతండొక వృ ♦ క్షాగ్రంబునకెక్కి
గనుగొని పరిజనవృతుడగు భరతుని ♦ కనలి, క్రిందకురికి
అనియె నిటుల శ్రీరఘురామునితో ♦ "అన్నా! భరతుండు
మనపైకిట దండెత్తివచ్చుచుం ♦ డెను కడుదుష్టుండు
తనయుడుగాడా తల్లి కైకకీ ♦ తడు శిష్టుండగునా!
వనములనైన వసింపనివ్వడా ♦ వానికి బుద్ధి దగునా!

తనకులభించిన రాజ్యంబునకై ♦ తగవుబెట్టలేదే !
తనకేమైనను యుపకృతిసల్పగ ♦ తలపనైనలేదే !
అనుజ్ఞనొసగుము భరతునిజంపెద ♦ అరియతండు మనకు.”
అనులక్ష్మణునకు అనియెరాముఁడిటు ♦ “ఆగ్రహింపబోకు
భరతుని హృదయంబెరుగక నీవీ ♦ భంగి పలుకవలదు
అరయగనాపై ఆతమ్మునకే ♦ అధికభక్తి గలదు.
తల్లియొనర్చినతప్పు సహింపక ♦ తల్లడిల్లి మనల
నెల్లర నయోధ్యగొనిపోవగ మది ♦ నెంచివచ్చెనిటుల
తమ్ముడ ! నీవిటు కోపమూనగా ♦ తగదు భరతునెడల
రమ్మని వడి గలియబోవుదమాతని ♦ రాకకెదురుకోల.”
అనునంతలో భరతుండు సేనలను ♦ అవలను విడియించి
అనుజామాత్య వశిష్టాదులతో ♦ అరగి రాముగాంచి
పరిణమిల్లుచు దుఃఖంబున పొగలుచు ♦ బాష్పంబులువిడువ,
కణములనొత్తుచు లేవనెత్తి కా ♦ రణమేమనుచును, వా
త్సల్యమొప్పగా రాముండడిగిన ♦ తడబడి భరతుండు
“శల్యమేమనగ వినుమన్నా ! మన ♦ జనకుడు దశరథుడు
నిన్నెడబాసి కృశించి దుఃఖమున ♦ నిర్జీవుండయ్యె
అన్నా ! అన్నివిపత్తులకును మా ♦ యమ్మ మూలమయ్యె.”
అనవిని రాముం డవనిమూర్ఛబడి ♦ అనుజులెత్త లేచి
కనులనీరుగార్చుచు తనతమ్ముల ♦ గౌగలించి వగచి
జనకుని దలచుచునేడ్చి యేడ్చి ల ♦ క్ష్మణుని, సతినిగూడి
జని మందాకినియందు శుద్ధికై ♦ స్నానంబులనాడి,
జలతర్పణముల నొనర్చి జనకుని ♦ స్మరించుచును, యవల
కలిపి పిండములుగా పిణ్యాకము ♦ గారరేగుబండ్ల
పిండప్రదానములు గావించెను ♦ పితరుశాంతికొరకు
వెండి పర్ణశాలకుజని యేడ్చిరి ♦ విధివియోగమునకు.

అన్నదమ్ములొకరొకరు గట్టుకొని ♦ అడలుచు విలపించు
చున్న సమయమున కౌసల్యాదులు ♦ శోకహృదయులగుచు
వచ్చిన, సీతారామలక్ష్మణులు ♦ వారెల్లర కెఱగి
ముచ్చిరుచుండిరి, మొగములకొంగిడి ♦ ముగ్ధజనులభంగి
తనయులగని ముప్పురతల్లులు యా ♦ తల్లులగని సుతులు
జనకజ కౌసల్యాదులగని యా ♦ జానకిగని సతులు
వారలెల్లరంగని పరిజనములు ♦ వాపోవుచునుండ
ఊరార్చిరి సూతవశిష్టాదులు ♦ చేరి వారి దండ
అత్తరి భరతుడు శ్రీరామునకనె ♦ ఆర్తితోడ నిటుల
"చిత్తగింపుమన్నా నామనవిని ♦ శ్రితజనపరిపాల
దుష్టురాలునాతల్లి కైక యీ ♦ దోసగొనర్చె మనకు
అష్టకష్టముల పాలొనర్చె ని ♦ న్నంపి విపినమునకు
జనకునకు స్సుర్మరణముగూర్చెను ♦ జనించె శనివలెను
జననికైక యపరాధములన్నియు ♦ క్షమింప వేడెదను
అన్నా! నేనీరాజ్యంబునకై ♦ ఆశజెందలేదు
ఎన్నడు తల్లితో దీనినినాకు గ్రి ♦ హింపమనగ లేదు
కామాతురుడై వరములనొసగెను ♦ కైకకు దశరథుడు
ఏమాత్రింబవి చెల్లవు విను నా ♦ కిష్టము లేనపుడు
ఆమెనిర్ణయంబున కిప్పుడు నే ♦ ననుమతింపలేదు
రామా పెద్దవు నీవుండగనే ♦ రాజ్యమేలతగదు
ఈవయోధ్యనేలగ తగువాడవు ♦ ఏ నీసేవకుడ
నీవులేని యాయయోధ్య కాడగు ♦ నిశ్చయంబుజూడ
తలప నీకు నాక స్త్రీమశకభే ♦ దంబు గలదుగాన
ఇల పాలింపగ ఈవెసమర్థుడ ♦ వెన్నగ మనలోన
పరస్వమును నేపరిగ్రహింపను ♦ బ్రహ్మాత్వంబైనా
అరాజకంబైయుండెను రాజ్యము ♦ అయ్యలేని కతన

రమ్మిపుడయోధ్య కన్నా వేడెద ♦ రాజ్యంబేలుటకు
అమ్మ కైకయును సమ్మతించె ని ♦ న్నధిపుని చేయుటకు."
అని పాదంబులబడి ప్రార్థించెడు ♦ అనుజు లేవనెత్తి
అనియెను రాముండిటు భరతునితో ♦ "అరసితి నీభక్తి
అన్నియుదెలసినవాడవు నీవి ♦ ట్లాడ తగునె భరత
నన్నడవికి బొమ్మనె జనకుండది ♦ నాదునుదుటి వ్రాత
నిన్నయోధ్యపాలింపగ జనకుడు ♦ నియోగింపలేదా !
మన్నన జేయగవలదే తదాజ్ఞ ♦ మనకిది మర్యాదా !
ధర్మవిరుద్ధము తండ్రిపల్కులను ♦ దబ్బరచేయునెడ
నిర్మింపగబడియున్న నాదువిధి ♦ నెరవేర్చెడువాడ
అడవినేను పదునాల్గబ్దంబులు ♦ గడపివత్తు తిరుగ
జడలను వల్కలముల విడనాడుము ♦ జను మయోధ్య వడిగ
తల్లినిదూరగవలదు తమ్ముడా ♦ ధాతవ్రాత మనకు
వల్లగాదు యుల్లంఘనజేయగ ♦ వ్రాతల మార్చుటకు."
అనుచుండగ జాబాలి వశిష్ఠులు ♦ అనేకధర్మములు
వినిపించుచు రాముని రాజ్యము గై ♦ కొనుమని వేడి, పలు
విధముల బల్కిన శ్రీరాముండని ♦ వినక భరతుగాంచి
వ్యథనొందకు రాజాలనయోధ్యకు ♦ విధివిధానమెంచి
వ్రతమునుబూనితి భంగమొనర్పగ ♦ వాంఛించుట తగునా
పితరువాక్య పరిపాలనజేయుట ♦ సుతులధర్మమన్నా
జనకునాజ్ఞ మన్నించుటయగు నే ♦ ననివర్తుడనైన
ఇనకులజులకు కళంకమురాగ స ♦ హింపజాలగాన
వహియింపుము యీరాజ్యభరము నే ♦ వచ్చెదునంతాక
సహోదరా ప్రజలను పాలింపుము ♦ క్షామాదులులేక
తల్లులమువ్వుర దయతోగొలువుము ♦ తమ్ముని మరువకుము
ఎల్లరియెడ సమభావము జూపుము ♦ ఏగుము సుఖివగుము

## పాదుకా పట్టాభిషేకము

అనుచు రాజనీతులు ధర్మంబులు ♦ యనేకంబు బలుక
అనెను భరతుడిటు రామచంద్రునకు ♦ ఆజ్ఞమీరలేక
"ఈ వెరుగని ధర్మంబుగలదె యిల ♦ ఇనకులాబ్ధిసోమ!
నీవేయిట్లన మారాడగ గల ♦ నే శ్రీరఘురామా!
పెద్దయాసతో వచ్చితి నీవది ♦ పెడచెవిబెట్టితివి
వద్దన్నను యీరాజ్యభారమును ♦ వహింప బల్కితివి
బద్ధుడ నేనీయాజ్ఞకైన నీ ♦ పాదుకలను బూని
శ్రద్ధతోడ సింగాసనమున సం ♦ ప్రతిష్ఠించి వాని
న్నీ మారుగనే రాజ్య మేలెదను ♦ నీవు వచ్చువరకు
రామా పదునాల్గేండ్లు గడపి వడి ♦ రావలె నయోధ్యకు
అంతవరకు నే నందిగ్రామము ♦ నందు జడలదాల్చి
శ్రాంతనై వశించెద జపియించుచు ♦ సతతము నినుగూర్చి
గడువుదాటి మరుదినమున నీవగు ♦ పడని యెడల నేను
విడచెద యసువుల తడవోసరింపక ♦ విను నాశపథమును
ఇదిగో బంగరుపాదుక లన్నా ♦ ఇమ్ము తొడిగి నాకు
భవత్ప్రసాదంబుగ నవిజూచుచు ♦ పరిపాలించుటకు"
అనుచు పాదుకులనొసగిన రాముం ♦ డవ్వి తొడిగి విడచి
అనుజానకొసగెను యాశీస్సులతో ♦ అతని భక్తిమెచ్చి
అప్పుడు భరతుడు రఘురాముని పా ♦ దాబ్జంబుల కెఱగి
అప్పావల తనశిరమున దాల్చెను ♦ అనుపమానత్యాగి.
ధరణిజతో శ్రీరామలక్ష్మణులు ♦ గురునకు ప్రణమిల్లి
పరిదేవనములతో మ్రొక్కిరి మా ♦ పురతల్లుల గొల్చి.
అటుపై సీతారామలక్ష్మణుల ♦ అనుజ్ఞలను వడసి
కలకటబడుచును కన్నులనీరోడ ♦ కదలి అచటబాసి

జననీత్రియ యామాత్యజన వశి ♦ ష్టాది పరివృతుడై
అనుజుడు శత్రుఘ్నుండు గొల్వగా ♦ అరదాధిష్ఠుండై
భరద్వాజ గుహుల సత్కారంబుల♦ బడయుచు మార్గమున
శిరమున పాదుక లొప్పుచుండగా ♦ భరతుడు విభవమున
అడవు లాశ్రమంబులు గంగా తమ ♦ సాది నదులఁదాటి
వెడలి యయోధ్యకు; అచట నందరను ♦ వడివడి దిగబెట్టి
జని నందిగ్రామంబట సింహా ♦ సనమున పావలను
యునిచి రాజ్యమేలగ జొచ్చెను రా ♦ మునికి మారుతాను.
పరమభక్తుఁడై రాజ్యభారమును ♦ పాదుకలందుంచి
పరిపాలించుచునుండెను ప్రజలను ♦ భరతుడు ధృతిమించి
భరతునికన్నను భ్రాతృభక్తుడిల ♦ పరికింపగలేడు
ధరలో రామునికన్నను మరియొక ♦ ధర్మజ్ఞుడు లేడు.
అచ్చట పర్ణకుటంబున రాముం ♦ డవనిజ లక్ష్మణులు
ముచ్చటించుకొనుచుండ నొక్కదిన ♦ మున కొందరు మునులు
వచ్చి రాఘవుని ఆతిథ్యముగొని ♦ వచియించిరి యిటుల
"ఇచ్చట ఖరుడను రాక్షసుండుగల ♦ డితడు మమ్ము చాల
వేధించుచుండెగావున మేమిక ♦ వెడలుదు మిటనుండి
బాధించును మిముగూడ నాతడిట ♦ పయనమయ్యెరండి
వేరొకవనమున కేగుద మిచ్చట ♦ మీరుండుటతగదు
వీరుడవైనను నీవిటనుండుట ♦ వివేకంబుగాదు
అనయాస్పద మివ్వనంబు రామా ♦ వినుమా హితంబులు"
అనుచు హెచ్చరిం చిరొకవనమున ♦ కరిగిరి యామునులు
అంతట శ్రీరఘురాముం డసురకు ♦ లాంతకుండు శౌర్య
వంతుండయ్యును అమ్మునుల హిత ♦ వచనంబుల కియ్య
కొని సీతాలక్ష్మణులఁగూడి య ♦ వ్వనకుటములబాసి
జనుచు దండకాటవికి మార్గమున ♦ గనెనొకచో తపసి

మిన్న అత్రి యాశ్రమంబంత భూ ♦ మిజ ననుజుల గలసి
కన్నన రాముండేగి యత్రినిం ♦ గని మ్రొక్కిన తపసి
అత్రి వారి శిరమూరసి యొసంగె ♦ ఆశీర్వాదముల
అత్రిమహర్షితో రాముడు ముచ్చట ♦ లాడుచుండ, నేల
చూలి, అత్రిసతి, సాధ్వీమణి అన ♦ సూయ వద్దకుజని
ఓలగించె, తను సీత రాముని ♦ ల్లాలని దెలుపుకొని.
అవనిజ ననసూయ ప్రేమతో గా ♦ రవించి యనెనిటుల
"అవ ! నీ వందరవిడచి రాఘవుని ♦ యనుసరించి యిటుల
అడవుల నిడుమలబడుచు వచ్చితివ ! ♦ ఆహా నినుజూడ
విడును పాపపుంజములెల్ల నీ ♦ విధమునుగొనియాడ
తగరు మా, యుమా, శారదలైనను ♦ ధర నీచరితంబు
యుగ యుగములువరకుండు ననుచు ఘన ♦ సూక్తులనేకంబు
దెలిపి సీత నైదవతనమున ♦ వర్ధిల్లగదీవించి
పలువిధ సొమ్ముల చీరల నొసంగి ♦ బంపె హెచ్చరించి
అంతట రాముడు లక్ష్మణయుతుడై ♦ అత్రియాజ్ఞవడసి
చెంతనున్న దండకవని కరిగెను ♦ సీతతోడగలసి.
ఇంతవర కయోధ్యాకాండంబిది ♦ యెవరైనను దీని
స్తతతంబు విన, వ్రాయ, చదువ మో ♦ క్షంబుగల్గు భువిని.
"రామరామ శ్రీసీతారామా ♦ రామరామయనుడి
రామయనెడు తారక మంత్రామృత ♦ రసముగ్రోలి మనుడి
శ్రీరామహరే, రఘురామహరే ♦ సీతారామహరే
తారకనామ హరేరామహరే ♦ దశరథరామహరే"



(అరణ్యకాండము)

శ్రీరాముండట దండకాటవిని ♦ సీతానుజయుతుడై
చేరి యచ టచటయున్న తాపసుల ♦ సేవించినవాడై
వారికి మొ్రొక్కుచు వారల యాశీ ♦ ర్వాదంబులగొనుచు
కారుచిచ్చులను గిరులవాహినుల ♦ కందరముల గనుచు
వారణ వారువ కిరిహరి మొదలగు ♦ వనచరముల గనుచు
కారడవినిబడి కంటకవథముల ♦ దారిజేసికొనుచు
అరుగుచుండ నొకచోట కొండవలె ♦ యగుపడు కాయుండు
విరాధుడను యొకరాక్షసాధముడు ♦ వికృతరూపుండు
సూకర శార్దూలాదిమృగంబుల ♦ శూలంబున గుచ్చి
కేకరించుచును కేడించుచు కడు ♦ కింకిరియై వచ్చి
వట్టి జానకిని చంకబెట్టుకొని ♦ బహుచును చీకాకు
ఇట్టులనియె శ్రీరామలక్ష్మణుల ♦ కెవ్వరు మీారిటకు
వేలవచ్చితిరి నను విరాధుడని ♦ ఎరుగరె మిమ్మిపుడు
చీలి చెండి మ్రింగెదనని పైబడ ♦ శ్రీరఘురాముండు
తమ్మునిగని యిట్లనియె లక్ష్మణా ♦ తల్లి కైకవలన
ఉమ్మలమగ చాట్లిట్టుల గల్గుచు ♦ నున్నవి ధరలోన
ఆమెకోర్కెలీడేరెను నాకిక ♦ అదృష్టముతోలగె
భూమిజాత సీతను నయమౌ గో ♦ ల్పోతి నథముగలిగె
నామనోహారిణి లేకున్నను యిక ♦ నాకీబ్రతుకేలా
ఏమిచేతు ననుచుండ లక్ష్మణుడు ♦ రామునకనె నిటుల
'దీనునివలె బల్కగ బాడియె యిటు ♦ ధీరుడవగు నీకు
ఏనొక్కండనె జాలుదు విను మీా ♦ దానవు జంపుటకు'
నావిని రాముం డేడుశరంబులు ♦ నారియందు యునిచి
ఆ విరాధుపై వేసిన నాతం ♦ డవనిబడుచు లేచి

సీతను నచ్చటవిడచి లక్ష్మణుని ♦ శ్రీరామునిబట్టి
చేతుల నిడుకొనిపోవదొడంగెను ♦ చివ్వున చెరబట్టి
అదిగని జానకి భీతినిజెందుచు ♦ అడలుచుండచాల
అదనుగాంచి వడి రామలక్ష్మణులు ♦ అసురుని హస్తముల
దునుమ విరాధుడు విగతహస్తుడై ♦ ధరమునబడినేల
దునుకొందుచు మీరెవరనరాముం ♦ డనె విరాధుకిటుల
'ఏనురాముడను, లక్ష్మణుఁడీతఁడు ♦ ఇంతిపేరుసీత
కానలందు గుమ్మరుచుంటిమి జన ♦ కాజ్ఞవడయుచేత'
నావిని విరాధుడనె రామునకిటు ♦ నమస్కరించి మును
దేవా! తుంబురుడను గంధర్వుడ ♦ శిట్టధనదుడు, నను,
రాక్షసుండనైబుట్టి విజయునకు ♦ రామా నీకొరకు
వీక్షించుచుంటి అదియేమనిన కు ♦ బేరు డవుడునాకు
శాపముదీరును రామలక్ష్మణులు ♦ జని భుజములునరుక
ఆపర్యంతంబిట్లుండగమనె ♦ అద్దిజరిగెగనుక
నను బూడ్చుండిట నేనరిగెదనిక ♦ నాలోకంబునకు
జనుడు మీరలిట నుండతగదు వడి ♦ శరభంగునికడకు'
అనిన రాము డనుజునిచేనటనొక ♦ అవటముద్రవ్వించి
దనుజుకళేబరమందుబూడ్చి యా ♦ తని దివికంపించి
శరభంగుని యాశ్రమంబునకువడి ♦ జనకజానుజులతో
అరగి మునివరున కెఱగిన యాతం ♦ డనెనిటు రామునితో
'రామా యిపుడిపుడే యిచ్చటకు పు ♦ రంధరుడేతెంచి
తామరసాసను లోకమేగ నను ♦ దయతోడను బిలచి
అరిగెగాని నినుజూడకుండనే ♦ నజునిలోకమునకు
అరుగనైతి నీదర్శనభాగ్యం ♦ బయ్యె యిపుడునాకు
ఇనకులవర నను ధన్యుఁజేసితివి ♦ యిచటికేవుచచ్చి'
అనుచుమువ్వ్యారగ అర్ఘ్యపాద్యఫల ♦ హారంబులనిచ్చి

స్తుతిజేయుచు వారలు ముువ్వురు జూ ♦ చుచుండ చితిజొచ్చి
చతురాననుని లోకంబున కేగెను ♦ శరీరంబు విడచి.
అంత రాముకడకరగి బల్కి రి ♦ ట్లచ్చటి మునివరులు
ఎంతయొ మము శ్రమబెట్టుచునున్నా ♦ రిచ్చటి దానవులు
అపఘనముల వికలము జేయుచు మా ♦ తపము విఘ్నబరచి
అపకృతిసల్పుచునుండిరి మాకిట ♦ ఆశ్రమంబుజొచ్చి
అష్టకష్టముల బడుచున్నారము ♦ అయోధ్యా మముజూడు
శిష్టపోషణము దుష్టరక్షణము ♦ జేయుము గాపాడు.
అటవి నుండినను అయోధ్యనుండిన ♦ నధిపతి వీవెనుమా
ఎటులమమ్ము బ్రోచెదవో రామా ♦ ఇనకులాబ్ధిసోమా."
అను దీనోక్తుల విని శ్రీరాముడు ♦ అసురుల శిక్షించి
మునులను రక్షించెదనని అభయం ♦ బొసగి నిర్గమించి
సతియును తమ్ముడు వెంటనంటి రా ♦ శరచాపధరుండై
సుతీక్ష్ణమునిగని మ్రొక్కుచు యాశీ ♦ స్సులబడసినవాడై
జనుచుండగ జానకి రామునితో ♦ "మునులతోడ నీవు
దనుజులహరించి మునులనుబ్రోవ శప ♦ థంబుచేసినావు
మనకపకారము జేయనివారిని ♦ దునుమతగదు గాన
అనుమానముగల్గెను నీవెట్టుల ♦ అభయముదీర్తు" వన
జనకజతో తన అభయంబు సమం ♦ జసమని రాముండు
వినిపించెను తద్విషయంబునగల ♦ విజ్ఞానంబపుడు.
అంత ముువ్వురును ధర్మభృతునికడ ♦ కరిగి వహాసికెఱిగి
వింతనుగొల్పెడు మండకర్ణముని ♦ వృత్తాంతబెరిగి
జనుచును పంచాప్సరస్సరోవర ♦ మున, కచ్చటిమునుల
గని వారల యాతిథ్యంబుగొను ♦ చును తత్ప్రాంతముల
యున్నమునుల యాశ్రమంబులకు క్రమ ♦ మొప్ప తిరిగివహాని
మిన్నలగని మ్రొక్కుచు యవ్వారల ♦ మన్ననలొంది జని

మాస మొక్కట మాసార్థంబొక్కట ♦ మాసద్వయ మొకట
మాసత్రియ మొక్కట నాల్గైదా ♦ ర్మాసము లొకటొకట
వత్సర మొకటో గడుపుచు నిటు పది ♦ వత్సరములు జెల్ల
ఉత్సాహముతో జేరిరి సుతీక్ష్ణు ♦ డున్న తావుమరల.
మువ్వురు కొన్ని దినంబులుండి యట ♦ మునియాజ్ఞను బడసి
దవ్వునగల కుంభసంభవుంగన ♦ తరలె కలసిమెలసి
దారిమధ్యమున శ్రీరఘురాముడు ♦ తమ్ముల కమ్మాని
చారిత్రంబును ఆతడు మును, భా ♦ స్కరునకు యపకృతిని
సమకట్టిన వింధ్యుని గర్వంబును ♦ శకల మొనర్చుటయు,
క్షమను విశ్వకర్ముండ పూజ్యుడవ ♦ శాపంబిచ్చుటయు,
సర్పము గమ్మని నహుషునకు న్ఘన ♦ శాపం బొసగుటయు,
దర్పమణచి వాతాపినిల్వ లను ♦ దనుజుల జంపుటయు
ఉదధిని యాగ్రహమున యాపోసన ♦ మొనరించినవిధము
మొదలగు వృత్తాంతంబులు విదితం ♦ బొనరిచె ననేకము
జని యటు నగస్త్యభ్రాత యాశ్రమం ♦ బునను విశ్రమించి
మునికి మ్రొక్కి మునియాశీస్సులగొని ♦ మువురు నిర్గమించి
అగస్త్యమునియాశ్రమం బరిగి సం ♦ యమినట దర్శించి
మిగులభక్తితో మ్రొక్కిన తాపసి ♦ ముగురను దీవించి
తగు సత్కారాతిథ్యము లొసగుచు ♦ దాశరథిం బిలచి
ఖగచాపంబులు ఖడ్గతూణములు ♦ కరుణతో డనిచ్చి
ఆవనమందున వారిమువ్వురకు ♦ అనువగు యొకమంచి
తావునుజూపగమన, పంచవటీ ♦ తటమును జూపించి
ఆదరించుచుండగ నామువ్వురు ♦ అచట నిద్రజేసి
మోదముతో మరుదినమున నగస్త్య ♦ ముని యాజ్ఞనుబడసి
కరికిరి హరి భీకరమై యొప్పెడు ♦ కాననంబుజొచ్చి
అరుగుచు నటనొక వటవృక్షముపై ♦ అగొకసముగాంచి

తదగొకసమును జటాయువునిగా ♦ దశరథమిత్రునిగ
అదితివంశజునిగా, వినతాసుతు ♦ డరుణుని తనయుని గ,
గనుగొనియాతని కొనర్చిపూజలు ♦ కదలిముందుకరిగి
జనిరా ప్రాంతపు పంచవటీతట ♦ మున వశింపజెలగి.
రామునాజ్ఞనటనొక పర్ణకుటీ ♦ రంబు లక్ష్మణుండు
నేమముతో నిర్మింప నందరట ♦ నివశించిరియపుడు
కొంతకాలమచ్చట ముప్వురు యే ♦ కొరంతయును లేక
సంతసిల్లుచుండగ నొకనాడు ని ♦ శాచరిశూర్పణఖ
వచ్చి పర్ణకుటీజొచ్చివక్కానిటు ♦ వరించి రాఘవుని
'ముచ్చటయ్యెమిముజూడగ మీరెవ ♦ రిచ్చట యివ్వనిని
కాపురముండగ కారణమేమీ ♦ కాంతామణియెవరు
తాపసులా ? మిముబోలినవారలు ♦ ధరయెందునులేరు
మీపేర్లెయ్యవి' యని వదరెడు గా ♦ మినిగని రాఘవుడు
"ఈమెసీతనాసతి నేరాముడ ♦ ఇతడులక్ష్మణుండు
తరణికులోద్భవులగుదుము మేమిల ♦ దశరథతనయులము
అరుదెంచితిమిట జనకునిపనుపున ♦ నయోధ్యవాసులము"
అనుచుబల్కనిట్లనియెను నయ్యాసు ♦ రాంగనరామునకు
'వినుము చుప్పనాతని పిలుతురునను ♦ విశ్రవసునికొడుకు
రావణుచెల్లల చూడవచ్చితిని ♦ రసికుడవని నిన్ను
భావజబాణములకు గురినైతిని ♦ పాలింపుము నన్ను
ఒకరికొకరు తగియుంటిమిరామా ♦ యుర్విలోనమనము
ఇక సీతనువిడనాడుమురా మా ♦ ఇచ్చటసుఖింతము'
నావిని రక్కసికనె హేళనతో ♦ నగుచురాఘవుండు
తావివిల్తురూపుండుజూడు నా ♦ తమ్ముడు లక్ష్మణుడు
పిన్నవయసువాడాతడుగననిను ♦ ప్రేమాబ్ధినిముంచు
యున్నదిసతినా కతనికిలేదిట ♦ నిన్నుస్వీకరించు

జనుమాతడు నినువరించి నీవని ♦ చక్కజేయు నిపుడు
అనవిని అది లక్ష్మణుకడ కేగిన ♦ అనెనిటు లక్ష్మణుఁడు
అయ్యయ్యో నాకాలియేలనే ♦ అమాయకవు నీవు
ఇయ్యెడవారల కూడిగ మొనర్చు ♦ హీనుడ ననుగనవు
నన్ను గట్టికొన ఫలమే మున్నది ♦ మన్నుతే డతండు
అన్న నెవరింపు మతనికి నీకును ♦ అగును ఈడుజోడు
ఇతడని అతండు అతడని ఇతండు ♦ ఇటుల దానితిప్ప
కతమును గ్రహింపనేరక రాముని ♦ కడకువచ్చి చుప్ప
నాతిమరల ప్రార్థించుచు ననెనిటు ♦ నరవర నినుతప్ప
నేతని నే నిలవరించి బొందగ ♦ నెంత మాత్రమొప్ప
సతిజానకి గలదని యేమాత్రము ♦ సంశయంబువలదు
అతివ నిపుడెమ్రింగెద మన కాసతి ♦ అడ్డమేమిలేదు'
అనుచు సీతనుంగదియజనెడు శూ ♦ ర్పణఖను బట్టుకొని
అనుజుని రాముడు హెచ్చరింపగా ♦ అతడసి నొకటిగొని
రక్కసి ముక్కులు శ్రవణంబులును క ♦ రుక్కున తెగనఱుక.
వెక్కివెక్కి యేడ్చుచు "ఖరు" నింగన ♦ వెడలెను శూర్పణఖ
చుప్పనాతి యట్లరిగి ఖరునిగని ♦ చూపి ముక్కుచెవులు
చెప్పదొడగె నిటు వినుమన్నా నీ ♦ చెలియ నొందుపాట్లు
పర్ణకుటీరమునందున యుండిరి ♦ పంచవటిని ముగురు
పర్ణిని యొక్కతె సీతయనగ మగ ♦ వారలు మరిద్వరు
రామలక్ష్మణులు రవికులజులు దశ ♦ రథ నృపునకు సుతులు
కామమునను నను బట్టి యొల్లమిని ♦ ఖండించిరి యిటులు
అసురుల వధించి మునుల బ్రోతుమని ♦ అభయం బిచ్చిరట
పసపడునే వారిని జంపగ నీ ♦ పస జూపుము యచట
అనెడు శూర్పణఖ పలుకులు విని ఖరు ♦ డాగ్రహంబుతోడ
కనులనిప్పులను గ్రక్కుచువడి రా ♦ ఘవులను దునుమాడ

దనుజవీరులను పదునాల్గురు శూ ♦ ర్పణకను జతయిచ్చి
పనుప వారు శూలంబులధరించి ♦ పంచవటిని జొచ్చి
రామలక్ష్మణుల నచట నెదుర్కొని ♦ రజ్జులాడుచుండ
రామచంద్రు డనుజుని నియమించుచు ♦ భూమిజకడనుండ,
శర చాపంబులబూని రక్కసుల ♦ చంప నిచ్ఛలేక
దుర మొనర్పవలదని వారించిన ♦ దుర్మార్గులువినక
పదియునాల్గు శూలంబులు రాముని ♦ పై విడువగ యతడు
పదియునాల్గు శరములు కార్ముకమున ♦ పట్టివిడచెనపుడు.
బాణములా శూలంబుల హరించి ♦ పైగా దానవుల
ప్రాణములను గొన పదియునల్గురురు ♦ బడిరి చచ్చి నేల.
గని యా దృశ్యము చుప్పనాతి వడి ♦ ఖరునికడకు నేగి
దనుజుల మరణము దెల్ప ఖరుడు విని ♦ తాచువలెను రేగి
నింగికెగసి దిగి యాక్రందించుచు ♦ మిన్నింగివైతుననుచు
సంగర మొనరిచి రామలక్ష్మణుల ♦ సంహరింతు ననుచు
అమ్ములు బాణాసనములు అసి తూ ♦ ణమ్ములు దెప్పించి,
తమ్ముడైన దూషణుదెచ్చు యరదమ్ము నధిష్టించి,
స్థూలాక్ష మహాకపాల త్రిశిరులు ♦ దూషణప్రమాదులు
వేలకొలది సైన్యంబుల నడుపగ ♦ వినువీధిని సురలు
చోద్యమరయగా భేరీకాహళ ♦ వాద్యంబులు మ్రోయ,
సాధ్యాసాధ్య వివక్షత తెలుపక ♦ సామర్థ్యము వెలయ,
చెలియ శూర్పణఖ వెంటనంటిరా ♦ చేతును సూచించుచు
పలుదుశ్శకునంబులు గలుగగ నవి ♦ పాటింపక నగుచు,
ఖరవీరాక్షుడు, మేఘమాలియును ♦ కాలకర్ముకుండు
బరుషుండుడు, మరి మహామాలి స ♦ ర్పాస్యుడు, దుర్జయుడు
రుధిరాశర, శ్యేనగామి యజ్ఞశ ♦ త్రులు, విహంగముండు
పృథిగ్రీవులను పన్నిద్దరు బహు ♦ పేరు బడసియుండు

వీరవరులు నిరుపార్శ్వంబులజన ♦ వెడలెపంచవటికి
శ్రీరాముండదిగని తమ్మునకిటు ♦ జెప్పె బిలచిదరికి
"కంటివెలక్ష్మణ అసురసైన్యములు ♦ కదియుచుండెమనల
కంటుగల్గెశూర్పణఖను విరూపి ♦ గావించుటవల్ల
కుంటిగాముజాలక నాపై పగ ♦ గొనిరి, వీరినేడు
ఒంటరినయియే సంహారించెదను ♦ యుద్ధంబునజూడు
ఇంట సీతగాపాడుచునుండుము ♦ ఇపుడెవత్తుననుచు,
వింటినారిటంకారము జేయుచు ♦ విజయముదలంచుచు
బూని ఖడ్గశరచాపతూణముల ♦ పుడమినిండియుండు
దానవసైన్యంబులను నెదుర్కొనె ♦ దశరథతనయుండు
ఖరాదులకు రామునకు యుద్ధమని ♦ గరుడయక్షసిద్ధుల్
సురలునుసాధ్యులు గంధర్వులు కిం ♦ పురుషకిన్నరాదుల్
ఆకసమందునయుండిరామునకు ♦ చేకురవిజయంబు
కాకలియొనర్చుచుండిరెల్లరును ♦ గాంచుచుచోద్యంబు.
అంతట భేరీకాహళదుందుభు ♦ లతిశయించిమ్రోగియ
చెంతకరుగుచును కొందరుదనుజులు ♦ చేరిరవములెగయ
పరశుచక్రవజ్రక్షురికాము ♦ ద్గర కుఠారశూల
కరవాలపట్టసప్రాసముసలతో ♦ మరాభిండివాల
కుంతగదాద్యఖిలాయుధంబులను ♦ గుప్పించుచునొకట
సంతసమొందుచునుండ వారిగని ♦ జనకజపతివింట
పెక్కుబాణములనుంచి వారిపై ♦ నొక్కమారెవైచి
ముక్కలొనర్చుచు నాయుధంబులను ♦ ఉక్కణంచిమించి
రథగజతురగపదాతుల చెండుచు ♦ రణభీకరుడగుచు
ప్రధనమొనర్చెను ఒంటరియైతన ♦ ప్రజ్ఞనగబర్చుచు
ఎక్కడజూచిన పుర్రెలుప్రేవులు ♦ ఎముకలు బడియుండె
లెక్కకెక్కుడగు రక్కసుశవములు ♦ నక్కలుదినుచుండె.

కంకగృధ్రములు, రక్తమాంసముల ♦ కతికి పీకుచుండె
కొంకులు కొరకుచు నరముల నమలుచు ♦ కుక్క లరచుచుండె.
అంత ఖరునితమ్ముండు దూషణుం ♦ డాగ్రహంబుతోడ
దంతి తురగ రథ సైన్యంబులతో ♦ దర్పం బుట్టిపడ
కాలరుద్రువలె యరిగి రాముపై ♦ కరవాలంబులను
శూల శైలవృక్షంబులు వజ్ర ♦ క్షురికాశరములను
ఒక్కమారు గురిపించిన రాముం ♦ డుగ్రుండై వడిగ
ఎక్కుపెట్టివిలు గాంధర్వాస్త్రము ♦ ఏసెను అతిగురిగ.
దాన, శరశతంబులు యుద్భవమై ♦ దావానలమువలె
దానవులెల్లరజుట్ట బలంబులు ♦ దగ్ధంబై కూలె.
రథములు విరిగెను కరితురంగములు ♦ రజముగ్రిక్కి చచ్చె
రుధిరముబారెను ప్రధనరంగమున ♦ రోదనములు హెచ్చె
ఎక్కడజూచిన రామబాణములు ♦ పిక్కటిల్లియుండె
రక్కసులెల్లరు శరములగని నలు ♦ దిక్కుల బర్వాలిడె.
అపుడు దూషణుడు మరలసేనలతో ♦ అంకభూమి కరిగి
అపవచనంబుల నాడుచు రాముని ♦ అదలించుచు రేగి
శరవృక్షశిలాదుల గుప్పించుచు ♦ దురమొనర్చుచుండ
శరవరంపరలబరపుచు రాముడు ♦ సామర్థ్యముతోడ
ఘోర యుద్ధమొనరించి రథంబుల ♦ గూల్చుచు తురగములు
సారథులను చతురంగబలంబుల ♦ సంహరించి, సురలు
మెచ్చ దూషణునికరములు నరికిన ♦ మేదినిబడె యతడు
హెచ్చురోషమున తమ్ముని అపజయ ♦ మెరిగి వడిగఖరుడు
స్థూలాక్షత్రిశిరాసురాదిఘన ♦ శూరుల బంపించి
ఆలమొనర్పగజేసిన రాముం ♦ డందరను హరించి
విజయుం డగుట గ్రహించి వివశుడై ♦ వివేకశూన్యుండై
గజరథతురగపదాతుల పలుగొని ♦ గర్వించినవాడై

అరదమెక్కి సకలాయుధములతో ♦ ఆజియందు నిలచి
శరములుగుప్పించిన రాముడు త ♦ చ్ఛరముల ఖండించి
రథిని సారథిని సంహరించి ఖరు ♦ రథ మునుగ్గు జేసి
వధియించెను తక్కంగల వీరుల ♦ వాడితూపులేసి.
ఖరుని రాఘవుడు, రాముని ఖరుండు ♦ శరముదిట్టుకొనుచు
దురమొనర్చుచుండిరి ఘోరంబు గ ♦ దునేదారులగుచు
ఖరరాముల యుద్ధంబునుగని కడు ♦ కంపితులై సురలు
ధరణిజపతి విజయుండవ, జేసిరి ♦ కరతాళధ్వనులు
అంతఖరుడు శ్రీరాముని విలు, సా ♦ యకము లేసి ద్రుంచి
'అంతమొందితివిరా రామా'యని ♦ యమ్ము లేదువైచి
కవచమొలచి శ్రీరాముని వక్షము ♦ గాయ మొనర్చెనెడ
రవికులాన్వయుడు తద్గాయంబుల ♦ రక్తమొలుకుచుండ
యొప్పుచు పూచినమోదుగవలె మరి ♦ యొక కార్ముకముగొని
ఉప్పసాగె బాణపరంపరలు ఖ ♦ రుని వక్షముపైని
ఖరు డాశరముల ఖండించుటయును ♦ తిరిగి రాఘవుండు
సురపతి దత్తంబైన యొక్కఘన ♦ శరము బెరికి నేడు
"నీకు చావునిక్కవము ఖరుండా ♦ నిలువు"మని వచించి
ఊకొనివేసిన అద్దినాటి ఖరు ♦ డుర్విబడెను జచ్చి.
గరుడులు యక్షులు గంధర్వులు కి ♦ న్నరవిద్యాధరులు
సురలు సిద్ధసాధ్యులును యొనర్చిరి ♦ కరతాళధ్వనులు
ఖరదూషణులను వదియునాల్గువే ♦ ల రక్కసుల చెండి
విరాజిల్లు రామునిపైగురిసిరి ♦ విరులు మింటనుండి;
మునులు గుంపులైవచ్చి రాఘవుని ♦ వినుతించుచు జనిరి;
జనకజతో లక్ష్మణుడువచ్చి రా ♦ ముని సన్నిధిజేరి
మ్రొక్కి, మువ్వురును పర్ణకుటికి జని ♦ మోదముతోనుండ
రక్కసు డొక్క డకంపను వాడతి ♦ ఉక్కసంబుతోడ

లంకజొచ్చి లంకేశురావణు ♦ న్గాంచిపల్కెనిటుల
"అంక మొనర్చుచు ఖరదూషణ త్రిశి ♦ రాది వీరులెల్ల
అసువుల బాసిరి పదియునాల్గువే ♦ లసురగణంబులతో
ఉసురుతోడనే మిగిలితి దీనిని ♦ ఊటించగ నీతో
రామచంద్రుడట దశరథసుతుడట ♦ రాజ్యము విడనాడి
భామిని భ్రాతలతోడవచ్చి యట - పంచవటినియుండి
యొక్కడె వీరినిజంపె' ననగవిని ♦ రక్కసనాథుండు
ఉక్కడంతునే రాము నిపుడెయని ♦ యుగ్రుండవ యతడు
రావణునిన్గని రాక్షసోత్తమా ♦ రాముని జంపుటకు
నీవల్లను గాదైనను రాముడు ♦ జీవము బాయుటకు
గలదొకయుపాయ మదియేదన రా ♦ ఘవునియాలి సీత
కలికికంతు విలుమొలికి లోకవి ♦ ఖ్యాత గుణోపేత
ముల్లోకంబుల నామెకు సరియగు ♦ ముదిత లేదుయిపుడు
కొల్లగొట్టి యామెను దెచ్చితివా ♦ కుములుచు రాఘవుడు
మరణించును అదివినిన లక్ష్మణుడు ♦ మడియుటనిశ్చయము
ఖరాదులను జంపినట్టిపగ యీ ♦ గతిని దీర్చుకొనుము
ఆమెనుపొందని నీదుజీవితము ♦ అనుపయోగ మిలను
రాముడింట లేకుండజేసి యా ♦ రమణిని తేనగును."
అను యకంపనునిబంపి రావణుం ♦ డరద మధిష్టించి
జని మారీచునితోడ ఖరాదుల ♦ చావును వినిపించి
జనకజనుం తానపహరింపగా ♦ సాయము రమ్మనిన
అనుమతింపకను, మారీచుడు రా ♦ వణునకు రాము ఘన
పరాక్రమంబును తా, మునుబొందిన ♦ పరిభవమును దెల్పి
మరలగజేసెను లంకకు రావణు ♦ మనోవృత్తిమాన్పి.
రావణుడట్టుల లంకనుండశూ ♦ ర్పణఖ వచ్చినిలచి
దేవురుతో దశకంఠునకు న్తన ♦ స్థితిని గానబరచి

ధరణిజాత దశరథాత్మజుల వృ ♦ త్తాంతము వినిపించి
ఖరదూషణత్రిశిరాదులమృతి యవ ♦ గాహన మొనరించి
రామ లక్ష్మణులతోడను బోరగ ♦ రాదని వారించి
భూమిజ నెత్తుకొరమ్మనమనె దు ♦ ర్బోధన గావించి.
చుప్పనాతి పల్కులకు రావణుం ♦ డుప్పతిల్లి చాల
ముప్పుగల్గునను మారీచుని హిత ♦ ములను మరచి మరల
మారీచునికడ కేగుతెంచి తన ♦ మనోద్గతము దెలిపి
కోరె యాతనిసహాయము సీతను ♦ కొల్లగొట్టపాపి.
అదివిని మారీచుడు రావణునకు ♦ అనెనిటు దిగులొంది
"ఉదియమానుముదిలమొందెదవు యం ♦ దున్నది వినురంధి,
రామునిబలమెరుగ వాతనితో వై ♦ రంబు తగదు వినుము
రాముని గెల్వగలే రజరుదేవ్రం ♦ ద్రాదులైన నిజము.
ఆతడు విశ్వామిత్రుని శిష్యుడు, అస్త్రి, మహాబలుడు
ఆతని కగ్గికి ఆజ్యముతోడగు ♦ నటు లనుజుడుగలడు
మున్నాతని బలమును చవిగొంటిని ♦ ముచ్చిచ్చాతండు
నిన్నును నీవంశంబును దున్రించును ♦ నెలతనుగొన, యతడు.
మును నే మాయామృగమై యడవుల ♦ మునులజంపుచుండ
ననుగొట్టిన నేపారివచ్చియు ♦ న్నాను భీతితోడ
చిన్ననాడె తాటకను హరించెను ♦ జన్నము రక్షింప
నన్నుగొట్టెను సుబాహునిజంపెను ♦ నరవరుండు తలువ,
చావుతప్ప దాతనికడ కేగిన ♦ సాధ్వి నీకువలదు
ఆవిషయంబున నను మాత్రము సా ♦ యంబు కోరతగదు".
అనిన రావణుడు మారీచుని గని ♦ యాగ్రహంబుతోడ
జనకజనుం గొనిపోవగనాతడు ♦ తనతోరానియెడ
ఖండితమైతునని పైబడమారీ ♦ చుండు వితర్కించి
ఖండితముగ రావణుచే మరణము ♦ గల్గుననుచు దలచి

ఉసురు రాఘవుని చేతులవిడచుట ♦ యుత్తమమని యెంచి
అసురాధిపుతో పంచవటికిజనె ♦ అరదమధిష్టించి.
ఒకచోనిద్దరు రథముడిగ్గి యొక ♦ యుపాయమునుబన్ని
వికుర్వాణులవ, మారీచుడు మరు ♦ వేషంబును బూని
స్వర్ణ మేనుగొని మాయలేడియై ♦ చంగుచంగుమనుచు
పర్ణకుటీరముచెంగట దుముకుచు ♦ వచ్చికలం దినుచు
చిత్రగతులనొప్పుచు దిరుగాడగ ♦ సీత దాని జూచి
కృత్రిమమృగమని దెలియక అది నిజ ♦ కురంగమని దలచి
పట్టియిమ్మనుచు రాము వేడ యతఁ ♦ డట్టులెయని దాని
న్బట్టబోవ యది దొరకక త్రిప్పలు ♦ బెట్టుచుండుటగని,
పట్టుదలతో తత్సారంగంబును ♦ పట్టబోవుచుండ
ఇట్టులనియె లక్ష్మణుడన్నకు ఇది ♦ ఇక్కిగాదు జూడ
ఇట్టిదాని నే కనివినియెరుగను ♦ ఇది మారీచుడగు
చిట్టమృగంబని దోచెను దీనిని ♦ ముట్టరట్టు గలుగు
పట్టబోకుమన్నా యన రాముడు ♦ భయంబులేదనుచు
కట్టియ కార్ముకములగొని దానిని ♦ పట్టిదెత్తు ననుచు
జానకినింగాపాడుచుండ ల ♦ క్ష్మణుని నియోగించి
పూనికతో యాలేడివెంట జనె ♦ పొసగుననుచు యెంచి
కాని యాకురంగంబు టక్కుచును ♦ గంతులు వేయుచును
కాననమెల్లను త్రిప్పుచు రాముని ♦ కందకుండగాను
కడుదవ్వరిగిన రాముడలసి యా ♦ గ్రహమొందుచు దాని
న్మడియజేతునని శరమొక్కటిగొని ♦ మార్వియందు బూని
విడువ తచ్ఛరము తగిలి కురంగము ♦ బడిధరపై, నగుచు,
తొడగువిడచి మారీచునిగా, గను ♦ బడుచు, బొబ్బలిడుచు,
"హా సీతా" "హా లక్ష్మణ"యనుచును ♦ అసువులువిడనాడ,
మోసముగ్రహించి రాఘవుండు, త ♦ మ్ముందును తనయాధ

మారీచుని యార్తారవమునకే ♦ మని దలతురో యచట
వారు, యిద్ది నారవమని భ్రమించి ♦ వత్తురేమొ యకట
తమ్మునిపల్కుల పెడచెవిపెట్టితి ♦ తప్పొనరించితిని
ఇమ్మారీచుం డెగ్గుజేయ న ♦ న్నిత్తావునకు గొని
వచ్చెను గాబోలని తలచుచు వడి ♦ పర్ణకుటికి మరలి
వచ్చుచుండె. యట జానకి, దీన ♦ ధ్వని విని కడుకుడలి
సౌమిత్రిని గని యనెనిటు "మరదీ ♦ శబ్దము వింటివిగా
రామునకే కీడుమూడకను త ♦ ద్రవంబుజేయుడుగా !
ఏవనమందున యెచట యుండెనో ♦ ఏగుము, గనుగొమ్ము
నీవుజనుము రామునకు సహాయము ♦ నిలువక వడిపొమ్ము
కానల తన కేసాయము వలయునో ? ♦ గాక నిన్ను నన్ను
దీనతతో బిల్చునా" యనగ విని ♦ దీర్ఘాలోచనను
జేసి లక్ష్మణుండనియెను యిట్టుల ♦ సీతతో "యిది యసుర
మోసముగానీ రామున కపాయ ♦ మొక్కనాటికిని రా
దదియేమన నేనెరుంగుదును యా ♦ తని భుజబలశక్తి
వదినా ! మనకెగ్గొనర్ప దనుజులు ♦ పన్నిరి యీయుక్తి
ఆతనినాదము గాదది తల్లీ ♦ అసురుని దైయుండు
ఆతని కేబాధలు గల్గవు భువి ♦ అద్వితీయబలుడు
జింకకొరకు నేగిన మాయన్నకు ♦ చేటు దలపబోకు
జంకకు వదినియ ! యాతడు వచ్చును ♦ సత్వరంబు నిటకు
రక్షణమేటికి రామునకు జగ ♦ ద్రక్షకు డాతండు
రక్షస్సుల సంహారించి త్వరలో ♦ రాగలం డతండు.
నీకుసాయమై యుండగ రాముడు ♦ నియోగించెనన్ను
నే కదలగజాలను యెచ్చోటకు ♦ నిన్నువిడిచి పోను."
నావిని జానకి యనెనిటు లక్ష్మణు ♦ నకు నాగ్రహమొంది
"నీవిధ మతిచోద్యంబు రాఘవుడు ♦ నిర్వ్యాధనమునొంది

పిలచిన బోవక నిచ్చటనుండుట ♦ భీరలక్షణంబు
తలచితివో యది గాకనునీవె ♦ ద్రైనను ద్రోహంబు
అడవి నిడుమలను బడియెడి యన్నకు ♦ యపవే సాయంబు
చెడుగుదలంతువె అన్నకు నీవిట ♦ చేరి దారుణంబు
అపహరింపగాదలచితివో న ♦ న్నాతడు మృతినొంద
అపాత్రుడా అధి గంతవగుదువే ♦ అట్టిభ్రమను జెంద
సీత నీకు వశమౌనని యెన్నడు ♦ చిందిలిపడవలదు
ఆతని కపాయమయ్యేనేనినే ♦ ననలంబున బడుదు.
తమ్ముడవని నినునమ్మియుండె యా ♦ దశరథతనయుండు
నెమ్మనమున యిటు విషముధరించిన ♦ నీచుగ తలపండు
నమ్మి నిన్ను గొనివచ్చేకూడ నీ ♦ నటన దెలియలేక
పొమ్ము పొమ్మ"నుచు ఏడ్చుచు యతికఠి ♦ నమ్ముగాను బలుక
'హరి' 'హరి' పాపంబుపశమింపుగా ♦ కనుచు లక్ష్మణుండు
ధరణిజనుం గని "తల్లీ యిట్లన ♦ తగునె రాఘవుండు
నీకు కాపుయుండగ నన్నిచట ♦ నియోగించుచేత
పాత్రులాడితిని యింతగ నీకీ ♦ పలుకులేల మాత!
ఇచ్చటి రాక్షసమాయల నెరుగక ♦ నిట్టుల బల్కితివి
తుచ్ఛునిగా నన్నెంచి హృదయమును ♦ తునియలొనర్చితివి
జననీ నాయెడ పాపముతలపకు ♦ జనెద రాముకడకు
వినజాలను నీ కఠినవాక్యములు ♦ వింతగొలిపెనాకు
నీ యోగక్షేమంబును దలచియె ♦ నే వెడలకయుంటి
మాయామర్మము లేదు నమ్ము రా ♦ మాజ్ఞ మీరకుంటి
అసురమాయలను దెలియగ నేరని ♦ అమాయకవు గాన
అసిబోవక జాగ్రతగానుండుము ♦ అరిగెద నీయాన"
అనుచు నచటి తరు గిరి మృగంబులను ♦ ఐదుభూతములను
జనకజనుం గాపాడుచుండుమని ♦ జనెను రాముగనను.

అంతవరకు నచటిచటఁ బొంచుచు ♦ న్నట్టి రావణుండు
అంతరువును విడనాడి వచ్చి సం ♦ యమివేషంబొందు
బూని, పర్ణకుటీముంజని నిలువగ ♦ జానకి యాతఁడొక
మానివరుండని పూజింపగ యతి ♦ మనసు నిలువలేక
అనెనిటు "తన్వీ! యెవ్వరిదానవు ♦ అమ నీపేరేమి?
వనములయందున వాసమేమి యె ♦ వ్వాడు నీకు సామి?
పసిదానవు నీ వయోరూపలా ♦ వణ్యము దిలకింప
అసదృశమైయొప్పెడు నీవొంటిగ ♦ అడవిని వశియింప
తగునా" యను యామాయతాపసికి ♦ ధరణిజయిట్లనెను
"ముగురముంటి మీ పర్ణకుటంబున ♦ మగడు, మరది, నేను;
మగడు రాఘవుడు మరది లక్ష్మణుడు ♦ మామదశరథుండు
జగములోన నను సీతయంద్రు నా ♦ జనకుడు జనకుండు
పితృవాక్యపరిపాలనకై నా ♦ ప్రియుడు వచ్చియుండె
శత్రువులెవ్వరైన నెగ్గుచేసిన ♦ సంహరించుచుండె
అయోధ్య మాయది పదమూడేండ్లుగ ♦ అటవినుంటిమయ్యా
భయములేదు మాకేమియు నిచ్చట ♦ బాములు లేవయ్యా."
అనుచు సీత యాతపసికి తమకథ ♦ నామూలాగ్రముగ
వినిపించిన యాతండు సీతకనె ♦ "వినుమిది విపులముగ
విరించి వంశోద్భవుండ నేనా ♦ విశ్రవసుని సుతుడ
పరంతపుడ రావణ నామాఖ్యుడ ♦ పంక్తికంధరుండ
లవణసంద్రమున అవాచినింగల ♦ లంకకు యధిపుండ
అవితుండ నవక్షయరాహిత్యుడ ♦ అసురనాయకుండ
రవి ననుగన్నను గాయు వెరయు వా ♦ యువు వీవగ వెరయు
భువి నభోదశంబులు చెప్పినచొ ♦ ప్పున మెలంగవలయు
నవగ్రహంబులు రాసులదిరుగవు ♦ నా యానతిలేక
దివిజుల గెలిచితి దిక్పాలుల మొ ♦ త్తితి నంతియెగాక

సురాసురస్త్రీలను దెచ్చితి నా ♦ సురతక్రీడలకు
తరుణీ నినుమోహించి మమతతో ♦ తరలివచ్చితిటకు
కొమ్మరో ! నినుగొనిపోయెద రమ్మిక ♦ గోపము చాయకుము
నమ్ముము నినురాణి జేతులంకకు ♦ నామాటను వినుము"
అనుచు పేలుచున్నట్టి రావణున ♦ కనియె జానకిటుల
'దనుజాధమ నీబుద్ధిని విడువుము ♦ తగదు యిటుల పేల
పరసతికై యిటుభ్రాంతిని జెందుట ♦ బాడిగాదు పలువా
ధరణిజయన నేమిగ దలచితివో ♦ దౌర్భాగ్యుడ, తులువా
పొగరున సింగపుకోరలు బెరుకగ ♦ బూనిన విధమగును
గగనరత్నమును గొగలింప జను ♦ కరణిగాను యగును
అనలంబును మూటగట్టి నట్లగు ♦ నపేక్షింప నన్ను
జనుదెంచిన, శ్రీరామలక్ష్మణులు ♦ సంహారింతురు నిన్ను
అనుచు రావణుని మందలించి తన ♦ ఆత్మేశుని కొరకు
కనులు చిల్లివడ జూచుచుండ, రా ♦ వణు డంతటిపరకు
పూనియున్న ముని వేషము విడచుచు ♦ పూర్ణమైన తనదు
దానవరూపును, ఇరువది కరములు ♦ తలలైదును అయిదు
జూపిన జానకి మూర్ఛ నొందిబడె ♦ క్షోణీతలమందు
పాపిరావణుండంత జానకిని ♦ పట్టికరములందు
రథమున నిడుకొని అంతరిక్షమా ♦ ర్గంబున వలకడకు
పరిధావించు నెడమూర్ఛ దెలసి భూ ♦ పట్టి మదిని తనకు
విధి గల్పించిన పాటుదలంచుచు ♦ విభుని రాకకొరకు
అధోదృష్టితో జూచుచు మరదిని ♦ ఆడిన పల్కులకు
వ్యథనొందుచు రావణునిం దూరుచు ♦ వాపోవుచు నుండ
పథినిగల జటాయువు యదిగని రా ♦ వణాసురుని తోడ
'ఓరీ' నీచా! జనకజయొంటిగ ♦ యున్న వేళ నీవు
నారి నెత్తుకుని పోవుచుంటివా ♦ నన్నిచ్చట గనవు

నినుబోనిచ్చెద నని యెంచితివా ♦ జనకజ నిట విడుము
దనుజాధమ రామునితో వైరము ♦ తగదు మగుడిజనుము
ఘనవిక్రమదుర్వార బలుడు రా ♦ ఘవుడు పరాత్పరుడు
వినలేదా ఖరదూషణాదులను ♦ దునుముట యాతండు
ఇంటికి చిచ్చంటించుకొనిన య ♦ ట్లీమెను గొనిపోవ
తంటదెచ్చుకొనుచుంటివి రావణ ♦ ధర్మమగునె భడవ!
అనుచు నెన్నియోవిధములజెప్పిన ♦ వినక రావణుండు
జనుచుండ జటాయువు క్రుద్ధుండై ♦ తనకు గల్గియుండు
దరమహాఘ్రాణంబులతోడను రా ♦ క్షసునితో బోరాడి
అరదహయంబుల గూల్చుచు యాతని ♦ శిరములపైనుండి
కిరీటంబులన్దన్నుచు పోరిన ♦ గినిసి రావణుండు
ధరణిజనొకచోనుంచి ఖగేంద్రుని ♦ తాకెను క్రూరుండు.
అంతనిర్వురును, యుద్ధము ఘోరం ♦ బవగ జుట్టుకొనుచు
అంతరిక్షమున కెగయుచు దిగుచును ♦ అవనిపైని బడుచు
రక్తధారలొలుకంగ గొట్టుకొని ♦ రణనము గావించి
యుక్తిప్రయుక్తులను వెదజల్లుచు ♦ యుద్ధంబొనరించి
ఒక్కరినొక్కరు ప్రతిఘటించుకొను ♦ చున్న యట్టియపుడు
పక్కిఱెక్కల కరుక్కననరికెను ♦ రక్కసనాథుండు
జటాయువంతట, విలవిలదన్నుకొ ♦ క్ష్మనుబడుట జూచి
కటకట బడుచునుజానకి ఖగేంద్రు ♦ కడకుడాయవచ్చి
తన్ను బ్రోవనరు దెంచినందుకు కృ ♦ తజ్ఞతవచియించి
కన్నులనీరిడి ఏడ్చెను యతనికి ♦ గల్గినపాటెంచి
రావణాసురుండటు విజయుండై ♦ రక్తసిక్తుడగుచు
పోవుచుండె నాకాశమార్గమున ♦ భూమిజనుంగొనుచు
సిగముడివిడి నందలి పుష్పంబులు ♦ క్షితిపైనను రాల
జైవడగా హారము వగలూడగ ♦ దీనయగుచు చాల

అటుల తననుగొని లంకాపురమున ♦ కరుగు రావణునకు
ఇటులబల్కె జానకి శోకింపుచు ♦ "హేరావణనీకు
కాలముతీరెనుగాబోలును అటు ♦ గాకున్నను యిట్లు
ఏలదెచ్చితివి, రాముని శౌర్యం ♦ బెరుగవుగాబోలు
వినలేదా నీదాయాదులరఘు ♦ వీరుడుజంపినది
సునిశితశరమున నొక్కమారుద్రుం ♦ చును నీతలలు పది,
సప్తసాంద్రముల నింకజేయగల ♦ సామర్థ్యండతడు
లిప్తలో భువనములెల్లను నిర్మూ ♦ లింపగల్గుఘనుడు
సృష్టిస్థితిలయ కారణభూతుడు ♦ దుష్టనిగ్రహుండు
శిష్టపాలకుండతనితో వైరము ♦ చేటుగానయిపుడు
మనగదలంచిన శ్రీరామునకు స ♦ మర్పింపుమువన్ను
కనికరుండు శ్రీరాముడు తప్పక ♦ క్షమియించునునిన్ను"
ఎన్నివిధంబుల యిట్లుతెలిపినను ♦ ఏమియువినకుండ
కన్నడతో రావణుడు యంతరి ♦ క్షమున బోవుచుండ
"రామ, రామ" యని యేడ్చుచు తన చీ ♦ రను చీలిచియందు
భూమిజ తన యాభరణములెన్నను ♦ మూటగట్టి క్రిందు
వానరపంచక మొక గిరిపైగని ♦ వారిమధ్యవిడచి
దానవనాథుని దూరుచునుండెను ♦ తద్దయుచింతించి.
వీనికి యాయువుమూడె ననుచుఁజని ♦ విరించియదిగాంచి.
జానకిపాటునకై చింతిల్లిరి ♦ చదలసురలుమించి.
అంతట రావణుడవనిజతో లవ ♦ ణాంబుధిలంఘించి
సంతోషస్వాంతుండై లంకకు ♦ జని సీతను డించి
దనుజాంగనలౌ త్రిజటాదులకా ♦ తరుణినొప్పగించి
తనకామెను స్వాధీనమొనర్పగ ♦ మనుచును నియమించి
తనకు యున్నధన కనకవస్తు వా ♦ హనములజూపించి
అనెనటు జానకి కెదురుగనిలచుచు ♦ "అతివా నినువలచి

ఇంతటి సాహస కృత్యమొనర్చితి ♦ హీనమైన యువనీ !
ఇంతీ యీలంకయంత నీయది ♦ ఈవొప్పితివేని
రాము డల్పజీవుండు నరుండును ♦ రాలేడిచ్చటకు
భామిని ! నీవాతండు వచ్చునని ♦ భ్రాంతి జెందబోకు
ననుగెల్వగ లేడతడు వచ్చినను, నమ్ముము నామాట
నను ధన్యునిచేయుము కాదంటివ ♦ నడదిట నీయాట"
అనవిని జానకి యొక్కకుశంబును ♦ అడ్డుగాను బెట్టి
అనెనిట్టుల రావణునకు యోరీ ♦ "అధమా నీవిట్టి
పరదారాహరణ బుద్ధి విడువుము ♦ పాపము నొందకుము
శరణా గతివేడుము ననురాముని ♦ సన్నిధి గొనిపొమ్మ
దుష్టులజంపగ రాముడు బుట్టెను ♦ దునుము నిన్నతండు
నష్టి యొనర్చును నినునీవంశము ♦ నారాయణు డతఁడు;
తనకట్టుల జానకి యెదురాడగ ♦ దశకంఠుండలిగి
అనెనిటు త్రిజటాదులతో 'మీరీ ♦ యతివనుగొని యేగి
ప్రమదావనమం దుంచుచునాశోక ♦ సమ, యయ్యేడులోన
సమగొల్పుడు నయభయముల జెప్పుచు ♦ జానకి నెట్లైన;
అని యాతడు జన, వారలుసీతను ♦ గొని తద్వనమందు
యునిచి బోధనల జేసిరి రావణు ♦ కొనగూర్పగ పొందు.
ఇచ్చట సీతయిటుండ; రాముడట ♦ ఇంటివైపుమరలి
వచ్చుచు లక్ష్మణునింగనియు నెనిటు ♦ వదినను అటవదలి
వచ్చితివేలను తమ్ముండాయన ♦ వచించె నతడిటుల
అచ్చట "హా లక్ష్మణ "హా సీతా ♦ యని నీవనినటుల
రవ మొక్కటి వినవచ్చిన నీకట ♦ రాటు గల్గెననుచు
అవనిజ భయపడి నన్ను బొమ్మనెను ♦ అటువునీ దెయనుచు
అదియొక రాక్షసమాయెగాని నీ ♦ దయ్యి యుండదనుచు
వదిన కెన్నియో విధములజెప్పితి ♦ కదల జాలననుచు,

అందులకాయమ నమ్మిక కనలుచు ♦ అనవినరానటుల
నిందలు పలుకగ నరుదెంచితినే ♦ కుందుచుమదిచాల"
అంతరాము డనుజునితో భయమున ♦ అవనిజ యేమయెనో?
జంతువులేమైనను మ్రింగెనొ ? రా ♦ క్షసులచేత బడెనో ?
అని పలుదుశ్శకునంబుల గాంచుచు ♦ అరిగి పర్ణకుటికి
జనకజ నందులగానక చింతిలి ♦ వనమెల్లను వెతకి
వేసరి యెందును గానక ధరపడి ♦ వెక్కి వెక్కి యేడ్చి
హా సీతా నీవెందుబోతివో ♦ అయయో మమువిడిచి
క్రూరమృగంబుల నోటబడితివో ? ♦ క్రూరరాక్షసుల కా
హారమైతివో ? యేమైతివో ? నా ♦ కగుపడవా ? అలుకా ?
అయయో లక్ష్మణు నేలపంపితివి ♦ అతనిమాట వినక,
వియోగంబు భరియింపగ జాలను ♦ వేడెదనిను పలుక,"
అనుచుతమ్మునింగనియోలక్ష్మణ ♦ అవనిజ గ్లోల్పోతి
మనగజాల నీవయోధ్యజనినా ♦ మాతకు నాదుగతి
దెలుపుమనుచు అతి దీనుండవ యిటు ♦ పలికెను లక్ష్మణుడు
"విలపింపగ వలదన్నాయింకను ♦ వెతకవలయు కాదు
అబలలవలె యిట్లడలగతగునే ♦ అని యిర్వురుగలిసి
వనితాన్వేషణ మొనర్చుచుండిరి ♦ పర్ణకుటెనిబాసి
తరువులందు తీర్థంబులందుగో ♦ దావరి తటమందు
దొరువులందు పూపొదలందును మరి ♦ తుంగంబుల యందు
వెదకి వెదకి వేసారియొక్కచో ♦ వీక్షించిరి తుదకు
సుదతి సీత హారంబును సొమ్ములు ♦ క్షోణిని, యచ్చటకు
సమీపమందున గనిరి రక్తమాం ♦ సంబులు అరదమును
పరిమథిత తూణశరాసన ఖగములు ♦ పడిన జటాయువును
అంతట రాముండా జటాయువే ♦ అవనిజాత నచట
అంత మొనర్చెను గాబోలనియొక ♦ అంబుగూర్చి వింట

విడువదలంచిన జటాయువనె నిటు ♦ వినుడు రావణుండు
పుడమిజనుం గొనిపోవుచుండనే ♦ పోరిన యాతండు
రెక్కలు నరుకగ కొనయూపిరితో ♦ నిక్కడపడి యుంటి
నిక్కము రామా నన్నువధింపకు ♦ నేనెజచ్చుచుంటి
అనుటయు రాముడు రావణునైనం ♦ బంతజెప్పుమనిన
వినిపింపక యే, జటాయు వసువుల ♦ విడచెనంతలోన
అంత రామలక్ష్మణులు జటాయువు ♦ కంత్యక్రియజేసి
చింతతోడ సీతాన్వేషణమును ♦ జేయనచట బాసి
పోవుచుండ నరుదెంచి యయోముఖి ♦ పుంశ్చలిరాకాసి
త్రోవమధ్యమున నిలచి లక్ష్మణుని ♦ తోడ బాసజేసి
తన్నుగూడమని నిర్బంధింపగ ♦ అన్ననన్న దెలసి
మున్నుబోలె లక్ష్మణుడా రక్కసి ♦ ముక్కుచెవులగోసి
తన్నిపంపగా రక్కసిజనె; యం ♦ తట నిర్వురు గలసి
ఎన్నితావులో వెదకుచు జానకి ♦ నెచట గనక యలసి
ఘోరాటవినిం బోవుచు నొకచో ♦ కొండవలెను యుండు
కూరరాక్షసుని గనిరొక నాతని ♦ పేరు కబంధుండు.
శిరములేక యోజన దీర్ఘగంబగు ♦ కరములతో నుండె
యురమున యొక కన్నుండె యాతనికి ♦ యూర్పులులేకుండె
కబంధుండు శ్రీరామలక్ష్మణుల ♦ గాంచి ఒడిసిబట్టి
కబళింపగ నెంచిన వారాతని ♦ కరముల దెగగొట్టి
విముక్తులవ, మీరెవరు దెలుపుమని ♦ వేడి కబంధుండు.
కమనీయంబగు రామలక్ష్మణుల ♦ కథనము విని యపుడు
చెప్పదొడంగెను తన వృత్తాంతము ♦ శ్రీరామున కిటుల
"తప్పు క్షమింపుము రామా నే మును ♦ దనువను వాడనిల
ధాతవలన దీర్ఘాయువు నొందుచు ♦ దర్ప మొరదిచాల
భీతిగొల్పు ఘోరాకారంబున ♦ బెదరింపగ మునుల

స్థూలశిరుండను తపసి కోపమున ♦ క్షోణిని నన్నిటుల
కాలక్షేపము జేయ శపించెను ♦ కరుణాకోడ పురల
ధర నాభుజములు రామలక్ష్మణులు ♦ దరిగి గాల్చినపుడు
హరియించును నాశాపం బనియెను ♦ అదిగా కొకప్పుడు
సురపతి నెమరింపగయాతడు నా ♦ శిరముచు యూర్వులను
జొరగనణచె నాయుదరములోనికి ♦ సునిశితపవిత్రోను
అయురయోనేనటు లెటుజీవింతును ♦ యనిమొరలిడ యతడు
దయతో మీరలు నాదుకరంబులు ♦ దరిగి కాల్చినపుడు
శాపహారణమగానె యటు మీరలు ♦ చండిరి హస్తముల
పాపముతొలగెను"యన రాముండు క ♦ బంధునకనె నిటుల
రావణుండు జానకినిహరించెను ♦ రమణినివెతకుచు నీ
త్రోవనువచ్చితి మాతడుయుండెడు ♦ తావుచు జానకిని
ఏవిధముగ గాంచగనగునో మా ♦ కెరింగింపుమనగ
దేవర ! నేనావిషయ మీస్థితిని ♦ దెలుపజాల సరిగ
నన్నుదహించిన దెలిపెద నన దహ ♦ నంబొనర్చి రతని
మిన్నుకెగసి మరలను "దను"వై యనె ♦ మేదిని రాముగని
'వినుము రామ జానకిచేకూరెడు ♦ విధమును దెల్పెదను
జనుచు మీరలీత్రోవనె జంబూ ♦ వనమును యవ్వాలను
గల పంపావనమును గాంచుచు య ♦ వ్వాలను ఋష్యమూక
శిలోచ్ఛయంబున సుగ్రీవుండను ♦ వలీముఖనాయక
మైత్రిని బడయుడు ఆతడు లంకకు ♦ మార్గముజూపించి
శాత్రవుడగు దశకంఠుని జంపగ ♦ సాయమగును మించి
రావణుహరించి జానకితోజని ♦ రాజ్యమేలగలవు
దేవదేవ ! నీకసాధ్య మిలగల ♦ దే యొసగుము సెలవు"
అనుచు స్వర్గమునకరిగిన రామల ♦ క్ష్మణులు తత్క్షణంబు
జనిజని పంపావనముజేరి యట ♦ శబరియాశ్రమంబు

జొచ్చుచుండ యెదురేగి శబరి యా ♦ సూర్యకులోద్భవుల
హెచ్చుభక్తితో లోనంగొనిచని ♦ ఇచ్చి అర్ఘ్యమవల
దండమిడుచు యిట్లనె శ్రీరామా ♦ ధన్యనైతి మిగుల
దండకాటవిని దిరుగాడుచుకో ♦ దండంబును కేల
బూని యనుజుతో నీవువత్తువని ♦ మునులు బల్కిరి నన్ను
మీనిమిత్తమై యుండుమనిరి యిట ♦ మిము బూజింపగను
పిదప నన్ను దివికేగ నాజ్ఞనిడి ♦ వెడలిరి యామునులు
ఇది మతంగముని వన మిచ్చటగల ♦ వెన్నియొ చిత్రములు
మీకొరకై నేదాచి యుంచితిని ♦ మేలగు ఫలములను
చేకొని భక్షింపుడనుచు వానిని ♦ చెంతనునిచి తాను
పరమానందముతో రాముండవి ♦ భక్షింపగ; చితిని
జొరబడి యసువులవిడచి స్వర్గమున ♦ కరిగెను సమ్మతిని.
అంతరాఘవుండనుజయుతుండై ♦ అచ్చోటును విడిచి
కొంత దూరమేగుచు జానకిం ♦ గూర్చి మదిసివగచి
తమ్మున కిట్లనె "లక్ష్మణగంటివె ♦ తరుగుల్మలతాదుల్
కమ్మియుండె యివ్వనమున వీచెడు ♦ కమ్మని మారుతముల్
ఫలవృక్షంబులు శోభిల్లెడు యీ ♦ పంపాతీరమున
జలజకుముద బకములతో పంపా ♦ జలములుండె నైన
ఇమ్మహి జానకిలేకను నాకివి ♦ యేటికి వ్యర్థంబు
నెమ్మదిలే దీతనువున కెన్నడు ♦ నిత్యము దుఃఖంబు;
అనుచు అడలు రాముని యోదార్చుచు ♦ అనెనిటు లక్ష్మణుడు
వనచరాధిపుండగు సుగ్రీవుని ♦ వడిగ గలసియిపుడు
ధరణిజనుం గొని వత్తమనుచు నిరు ♦ వురును పంపగడచి
తిరుగుచునుండిరి తత్ప్రాంతంబుల ♦ హరివరుగన దలచి
ఇంతవరకు నిది అరణ్యకాండము ♦ యెవరైనను దీని
న్నంతతంబు వినవ్రాయ చదువమో ♦ క్షంబు గల్గు భువిని
"రామరామశ్రీ....మనుడీ॥ శ్రీరామహరే....దశరథరామహరే."

(కిష్కింధాకాండము)

ఋశ్యమూక పర్వతప్రాంతంబుల ♦ ఇనకులజు లనేక
దృశ్యములను గాంచుచు విహరింపగ ♦ దెలసి వారిరాక
ఆనగమందుండెడి సుగ్రీవుడు ♦ హనుమంతుని బిలిచి
దీనవదనుఁడై బల్కెను నిట్టుల ♦ "తిలకింపుము లేచి
నృపులో మానులో నిర్వారిగనుమట ♦ నిలచియుండి రెవరో
అపకృతి సల్పగ వాలి పంపునను ♦ యరుగు దెంచినారో
గాకున్నను వీరిచటకు వచ్చుట ♦ కారణమే మిపుడు
నాకేమియు దోచకున్నద"న విని ♦ నగి, హనుమంతుండు
'వారు వాలిబంపింపగ వచ్చిన ♦ వారు గారనమ్మ
ఆరాతులో మిత్రులో దెలియందగు ♦ అరుగ యానతిమ్మ
ఏనుమూరు వేషంబున యచ్చటి ♦ కేగి విషయమరసి
సానుకూల మొనరింతును మీకిల ♦ సఖ్యమదను దెలసి'
అని సుగ్రీవుని యనుమతి గైకొని ♦ హనుమంతుడు లేచి
అనువగు నొక భిక్షువు వేషముతో ♦ అచటి కరిగి నిలచి
కరముల మొగిడ్చి రామలక్ష్మణుల ♦ కనెనిటు మీవంటి
నరవరులను జూడగలే దెన్నడు ♦ నరయ జాలకుంటి
మునివరులో నృపులో యను సంశయ ♦ ముద్భవించె, మీరు
ధనువసి శరతూణంబులు గల్గియు ♦ మునుల బోలినారు
హరిహరులో ? దేవేంద్రియు పెంద్రిలో ? ♦ అశ్వినులో మీరు ?
తరణి సుధాకరులో ? మరియెవ్వరో ? ♦ ధర మీసరిలేరు
మీరలెవరు మీరిటకు వచ్చి యీ ♦ శారదవిని తిరుగ
కారణమేమగు ? నేను భిక్షువును ♦ గాను నిశ్చయముగ
రవి తనయుడు సుగ్రీవుడు మర్కట ♦ రాజకు సచివుండ
పవనసుతుడ హనుమంతుడ యాతడు ♦ పంపవచ్చినాడ.

మిముగని మీతో మైత్రిని బడయుట ♦ మేలని నన్నంప
సమయపడుటకై వచ్చితి ననవిని ♦ సంతసముజనింప
రాముని యానతి లక్ష్మణుడనెనిటు ♦ "రవికులోద్భవులము
భూమీశుండగు దశరథు యనుంగు ♦ పుత్రుల మిర్వరము
శ్రీరాముండత డేను లక్ష్మణుడ ♦ సీతయతని పత్ని
పేరడవికి వచ్చెను యీతడు మా ♦ పితరుని యానతిని
అన్నతోడ యియ్యడవికి సీతయు ♦ నరుగు దెంచుచుంట
అన్నకు వదినకు పరిచర్యలకై ♦ అరుదెంచితి వెంట
పంచవటీతటమున ముగురము రొక ♦ పర్ణకుటిని యుండ
వంచపొంచి రావణుండు మేమా ♦ యంచను లేకుండ
జానకి నెత్తుకపోయిన యానతి ♦ జాడ తెలియరాక
కాననమెల్లను దిరిగియు నీమా ♦ మానిని గనలేక
ఈపరిసరముల వెతకుచుండ రొక ♦ హితము బల్కె "దనువు"
'దావునకరిగిన సుగ్రీవునితో ♦ తప్పక సఖ్యమవు
నాతని సాయంబున దశకంఠుని ♦ హరించి సులభముగ
సీతను బొందగగలమ'నె యందుల ♦ సిద్ధికొరకు రాగ
ఆడబోవ తీర్థంబెదురైనటు ♦ అయ్యా వచ్చితివి
ఏడుల కెల్లర ఏడగు రాముడు ♦ వీడుచు తనశోభి
నేడీరవిసుతు సాయంబునకై ♦ నిరీక్షించుచుండె
తీడిరించు రాముని ముఖకమలము ♦ దీనతతో నుండె"
అనుచు కన్నులన్నీరునింపు ల ♦ క్ష్మణునకు కపివరుడు
అనెనిటు దైన్యమునొందవలదు నే ♦ రవిసుతుతో నిపుడు
మిత్రత్వము సమకూర్చెద తప్పక ♦ మీరు వెంటరండు
మిత్రతనయుడును మీమైత్య్రంబు న ♦ పేక్షించుచునుండు
అన్న వాలిచే వెడలగొట్టబడి ♦ ఆలి సిరులబాసి
యున్నాడాతడు ఋశ్యమూకమున ♦ ఓడియుంట జేసి

మీరలిర్వురిపు డొక్కరి కొక్కరు ♦ మిత్రులైన మొదల
ఎరికైన సాధ్యంబగునే మిము ♦ ఎదిరింపగను నిల'
అనుచు రామలక్ష్మణుల గూడుకొని ♦ హనుమంతుండరిగి
ఇనకులోద్భవుల విషయము సుగ్రీ ♦ వునకు దెలిపె నెఱిగి
అంతట సుగ్రీవుండు రాఘవుల ♦ కంజలి ఘటియించి
సంతసమొదవగ బల్కెను యిట్టుల ♦ సమీపమున నిలచి
దశరథ సుతులారా మిముగనినే ♦ ధన్యతముడనైతి
విశదమొనర్చెను హనుమంతుడు మీ ♦ విషయంబును ఖ్యాతి
మీతోసఖ్యము జేయవచ్చితిని ♦ మిత్రకులజ సోమా !
సీతా రామా ! అభయం బొసగుము ♦ చేతిని చెయ్యిడుమా ?
అనవిని రాముడు సుగ్రీవున కభ ♦ యప్రదాన మిచ్చి
తనదు కరంబాతని కరమందున ♦ యునిచె మైత్రి దలచి
ఒక్కరి కొక్కరు ప్రాణమిత్రులై ♦ యుండెదమని యంత
వక్కాణించిరట నొక్కరి కొక్కరు ♦ వాయుసఖుని చెంత
అప్పుడు శ్రీరఘురామ చంద్రునకు ♦ అవితనూభవుండు
చెప్ప దొడగెనిటు "శ్రీరఘురామా ! ♦ సీతను రావణుడు
ఆకసమార్గమునం గొనిపోయెడి ♦ నట్టి సమయమందు
కోకచీల్చి తననగల గట్టి మీ ♦ కొఱకడలుచు క్రిందు
మామధ్యను బడవైచెను జానకి ♦ ఆమాటను ఉర్వి
ఆమెవగునో కావో గుర్తింపుము' ♦ అనుచు నొసగెనవ్వి.
రామచంద్రుడా తొడవుల గనివి ♦ భ్రాంతచిత్తుడగుచు
భూమినిబడి విలపింపగ దొడగెను ♦ పుడమిజ దలంచుచు
రవితనూభవుం డంతట శ్రీరఘు ♦ రాముని యోదార్చి
వివరంబుగ శ్రీరామునకున్న ♦ విషయంబును గూర్చి
పలుక దొడగెనిటు "వాలినామకుడు ♦ భ్రాతనాకు గలడు
బలవిక్రమ సంపన్నుం డాతడు ♦ వాసవునకు సుతుడు

అట్టివాలి నారమణినిరాజ్యము ♦ హరించినను వెడల
గొట్టిన నేనీఋశ్యమూకమను ♦ కుధరంబున యిటుల
యుంటిని నిడుమలబడుచును నేనిపు ♦ డొప్పు నీదుసఖిత
గంటిని నన్నెటుబ్రోచెదవో భా ♦ స్కరకులసంజాత"
నావిని రఘురాముండనె వానర ♦ నాయకునకు నిటుల
'నీవునేను మిత్రులమైయుండుట ♦ నీదుశాత్రవు లిల
నాకు నరాతులె గావున నీయ ♦ న్నను వధించి నీకు
చేకూర్చెద నీరాజ్యరమణుల ♦ న్చింతింపగబోకు
ఆతనితో వైరం బెటుగల్గెను' ♦ అన సుగ్రీవుండు
సీతాపతి కిట్లనియెను 'రామా ♦ చిత్తగింపు మతడు
దుర్వారబలుండౌ యొకయసురుని ♦ దుందుభియనువాని
గర్వమణచి కాల్దన్ని క్రుద్ధుడై ♦ కడతేర్చెను యతని.
మహిషాకారుండగు యాదుందుభి ♦ మదమున నొక్కతరి
మహోశయునిడాసి ఆజికిని ర ♦ మ్మనగ నతడుబెదరి
హిమవంతునికడకేగి పోరమన ♦ యేగుచు దుందుభుడు
హిమగిరినని జేయగ రమ్మనమన ♦ ఇట్లనె నగవిభుడు
'సమరమొనర్పగజాలను నీతో ♦ జనుము వాలికడకు
సముడాతం డొక్కడె నినుబోరగ ♦ జాలుననగ నిటకు
వచ్చి వాలితో బోరొనరింపగ ♦ వాలి యాగ్రహించి
కచ్చణచుచు కాలందన్నుచు రా ♦ క్షసునిబట్టి వంచి
నేలనుగొట్టిన దుందుభిచచ్చెను ♦ నెత్తురుగ్రక్కకొని.
ఆలోహిత మవనింగప్పగ గని ♦ అలిగి మతంగముని
వాలినిశపించె ఋశ్యమూకప ♦ ర్వతమున యాతండు
కాలిడ శిరంబువ్రక్కలౌ ననుచు ♦ గావున అతడెపుడు
ఈకుధరంబునకు రాజాలడు ♦ ఇక మాకిదృరకు
ఏకారణమున వగగల్గెనో విను ♦ మీదుందుభి కొడుకు

వాలితోడ అని జేయగవచ్చెను ♦ కాలుని చందమున
వాలి తనదు వాలంబును దిప్పుచు ♦ వానినియెదుర్కొన
పోరి రిద్దరును అతిఘోరంబుగ ♦ పుడమిబడుచు లేచి
ఆరవమును విని వాలిజాడగన ♦ నరిగితి, మముజూచి
దానవుండు బారుచు నొకగుహలో ♦ దాగిన మేనుటకు
వానిని దరుముచు పోతిమి యప్పుడు ♦ వాలిట్లనె నాకు
"తమ్ముడయీ దైత్యుండు బిలంబున ♦ దాగెనతని వెతకి
దుమ్ములు దుమ్ముగలిపివడిగ వ ♦ త్తును నీ వెచ్చటికి
నరుగక ఏమరకుండ నుండుమిట" ♦ అనుచు లోనకేగి
దురమొనర్పగా జొచ్చిన నేనే ♦ మరక నచటయాగి
ఒక యేడుంటినిగాని వాలిరా ♦ కుండె బిలమునుండి
వికలమొనర్చెడి దనుజుని నాదము ♦ వినబడి గుహనుండి
క్షతజ ప్రవాహంబులు వెలివచ్చిన ♦ సమరమందు వాలి
మృతిజెందెను గాబోలను భ్రాంతిని ♦ మిక్కుటముగనడలి
ననుగూడను దనుజుండు జంపునని ♦ నగమొక్కటిదెచ్చి
ఉనిచి బిలద్వారంబున కడ్డుగ ♦ ఉనికి కేనువచ్చి
జరిగినవిషయము జెప్పగవినివా ♦ నరులును మంత్రులును
మరణించిన నాయన్న రాజ్యముకు ♦ మంతు వొనర్చెనను
అచ్చట గుహలో వాలిరక్కసుని ♦ అంతంబొనరించి
వచ్చుచు బిలమార్గంబును గానక ♦ వడవున ననుబిలచి
అలికిడి దెలియక బిలమునకడ్డగు ♦ అశ్మము పెకలించి
వెలికివచ్చి కిష్కింధకు జననే ♦ విభ్రాంతిని విడచి
అన్నపాదముల బడి నాతప్పును ♦ అనుగ్రహింపుమని
ఎన్నివిధంబుల వేడిననొప్పక ♦ నేనపరాధినని
అతడు నాపై నాగ్రహమొందుచు ♦ అనెనిటు మంత్రులతో
"ఈతని గుహద్వారంబున యుంచుచు ♦ ఏను రాక్షసునితో

పోరుచునుండగ రాజ్యకాంక్షచే ♦ బోరియు గప్పియిటకు
పారివచ్చె యీ దుర్మార్గుడు నా ♦ పదవిని పొందుటకు
ప్రాణము దీసెదవీని" ననుచు నా ♦ పైబడి మర్దించి
ప్రాణావశిష్టముగ గొట్టుచు నా ♦ భార్య నపహరించి
ఇంటినుండి నను వెడలగొట్ట నత ♦ డీగిరి కరుగడని
యుంటిని నే నీ ఋశ్యమూకమున ♦ యునికిగ జేసుకొని
అవార్య భుజబలవిక్రముండునా ♦ యన్నను యెదురింప
ఎవరికి సాధ్యముగాకుండెను నిల ♦ నింతవరకు తలప
నగముల పెకల్చి నభోతలంబున ♦ కెగురవేయ గలడు
అగసప్తక మొక్కసారి గూల్చిన ♦ అగణిత బలాఢ్యుడు
అట్టి వాడతని జంపెదనని నీ ♦ వభయం బిచ్చితివి
ఎట్టులజంపెదో యనుసందియ ము ♦ య్యెను యెంచగ భావి
ఆతడు జంపిన దుందిభి కాయము ♦ అతడు నేనుతప్ప
క్ష్మాతలమున నింతకు ముం దెవరును ♦ జాలకుండె లేప
ఈ వా కాయం బెత్తి సాలములు ♦ ఏడు, యొక్కమారు
నీవిశిఖంబున గూల్చిన వాలిని ♦ నిక్కంబుగ నెదురు
కొని జంపెదవని నమ్మెదు రామా" ♦ అనుటయు రాముండు
దనుజుని కాయంబెగ జిమ్ముచు ♦ తన ధనువును గొని యేడు
తాలము లొక్కటగూలగ నేసెను ♦ దానశరము యునిచి·
వాలిని రాముడు చంపగలండని ♦ వానరపతి దలచి
రాముని, వడిగా వాలినిహరించి ♦ రమణీ రాజ్యముల
నేమను తప్పక చేకూర్పగ మన ♦ రాముండనె నిటుల
'నీవు వాలితో పోరొనరింపుము ♦ నేచాటున డాగి
ఆవాలిని జంపెద తప్పకనొక ♦ అంబువింట దొడగి'
రాముండట్టుల ధైర్యము బల్కగ ♦ రవిజుడేగి వాలి
ధామము కడ పెనుబొబ్బలనిడగా ♦ తారాపతి కనలి

అని యొనర్పగావచ్చి యిర్వురును ♦ ఆలంబొనరింప
గనుచుండెను మాటునసమరము రా ♦ ఘవుడు వాలిజంప
ఒక్కరినొక్కరు యుక్కురోషముల ♦ అక్కలదన్నుకొని
రక్కుకొనుచు ఖరనఖరంబులతో ♦ రక్తమొలక ధరణి
బడుచు లేచుచును నభమునకెగయుచు ♦ పండ్లికిలించుచును
కడుఘోరంబుగ సమరముసల్పెడు ♦ నెడ వారిర్వురను
వాలియెవడో సుగ్రీవుండెవ్వడో ♦ వైనమరయలేక
కోలవిడచి శ్రీరాముడు వాలిని ♦ కొట్టకుండె; వెనుక
అన్నచే పరాజితుడై అవిసుతు ♦ డచటినుండిపార
వెన్నడిజని రాముండనెనతనికి ♦ "వినుము ప్లవంగవర
నిన్ను మోసపుచ్చితినని తలపకు ♦ నీయుద్ధమున మిమ్మ
గన్న యిర్వురను యొక్కపోలికను ♦ గనుపించిరి నమ్మ
అంగలక్షణంబుల మీరిద్దరు ♦ అచ్చుమచ్చు నొకటి
సంగరతలమున మిము గుర్తింపగ ♦ జాల కూరకుంటి
గుఱుతునొకటిగొని తిరిగివాలితో ♦ దుర మొనర్పు బొమ్మ
గుఱుతుబట్టి నీయన్నవాలిని ♦ గూల్చెదనడి నమ్మ"
అనిసుగ్రీవునిమెడ రాముండొక ♦ హారము వేయించి
తనతో ఇనతనయునిగొని చనుచును ♦ వనమొక్కటి గాంచి
ఆవనవృత్తాంతంబు నెరుంగుచు ♦ అచటి మునులకెఱగి
దీవనలంగొని వాలితావునకు ♦ ధృతితోడను యేగి
తానొకవృక్షముమాటున డాగుచు ♦ తారాపతికడకు
భాను తనూభవునంపె వాలితో ♦ ప్రధన మొనర్చుటకు.
వాలిమరల సుగ్రీవుడు పోరగ ♦ వచ్చుట గనుంగొని
ఆలమొనర్పగ వెలికివచ్చుసమ ♦ యాన నతనిపత్ని
తార నిరోధించుచు నిట్లనె యా ♦ తని కడ్డుగనిలచి
"పోరొనరింపగ బోకుముసుగ్రీ ♦ వునితో దమయుంచి

నీతోడను యిపుడిపుడే పోరుచు ♦ నీకోడిన యతడు
ఈతీరున నిను తిరిగిబిల్చుటకు ♦ హేతువెదియొ యుండు
ఎవరిసాయమును లేక రాడు యీ ♦ రవితనయుడు నిజము
అవగణ మొనరింపకు నామనవిని ♦ అపజయ మొందకుము
తమ్మునకు న్యువరాజ్య మొసగి యీ ♦ తనిని శాంతబరచి
ఇమ్ముగ యుండుట యుక్తము నాధా ♦ ఇక నీపగ విడిచి
అంగదుండు వినినా కనెనొక విష ♦ యంబది వినుమిపుడు
మంగళకరుడగు రాముడు దశరథ ♦ మనుజేంద్రుని సుతుడు
దాంతు డుదారుడు ధర్మపరుడు మా ♦ ర్తాండ కులోద్భవుడు
శాంత విగ్రహుడు సంగరభీముడు ♦ సత్యభాషణుండు
భూరి విక్రముండా శ్రితపాలుడు ♦ పుడమిజా విభుండు
శూరుడు ధీరుడు ఖరదూషణ సం ♦ హారకుండు ఘనుడు
అట్టి రాఘవుడు తమ్మునితో యిట ♦ కరుదెంచిన భాను
పట్టి యాతనితొ మైత్రి నొందెనట ♦ పావకు సాక్షిగను
రాముని సఖులతొ వైరముజెందగ ♦ రాదు హితము గొనుము
రామునిపద భక్తుడవై భూమిని ♦ రహి తోడను మనుము
అటుగా దందువె సుగ్రీవునితో ♦ ఆలంబున కన్న
ఎటకైనను పారుటయే యుత్తమ ♦ మిట్టితెరిని" యనిన
ఆలికినిట్లనె వాసవు తనయుడు ♦ అనుజునితో యిపుడు
ఆల మొనర్పగనే వలయుననే ♦ నందుకు రాఘవుడు
అలుగునె? ఆతని కెన్నడైన నే ♦ న పకృతి సల్పితినే!
తలపకు నాకిలమృత్యు వెన్నడును ♦ తమి జయమున రానె!
నియుద్ధ మొనరింపకనే పారుట ♦ నీతిగాదు నాకు
భయమొందకు తరుణీయని వెడలెను ♦ ప్రధన మొనర్చుటకు
అంత వాలిసుగ్రీవు లొండొరుల ♦ అక్కులు దన్నుకొని
అంత రిక్షమున కెగయుచు బడుచును ♦ అక్కసముల బూని

సాలములన్నొకలించి మోదుకొని ♦ రాలను రువ్వుకొని
కాలన్దన్నుచు కంఠము నొక్కుచు ♦ కరముల గుద్దుకొని
తనువులు పగులగ గొట్టుకొనుచు ర ♦ క్తంబు లొలుకుచుండ
అనుపమ విక్రమపజ్ఞా బలముల ♦ అని సల్పుచునుండ
(శ్రీ)రాముం డటడాగియుండి య ♦ వ్వారియందు వాలి
హార రహితుడగువాడే యను ని ♦ ర్ధారణమును దేలి
గురిజూచుచు నొకశరమును విడిచిన ♦ గూలి వాలినేల,
దరి కరుదెంచిన రాముని గని యనె ♦ తట్టువడుచు నిటుల
"శ్రీరామా నీవెంతటి కూరము ♦ జేసియుంటివయ్యా
సూరవంశజులనిట్టి ద్రోహములను ♦ జూడకుంటినయ్యా
నీ కే యపరాధము జేసితినయ ♦ నిరసింపగనన్ను
నాకు నీకు వైరంబులేదె యె ♦ న్నండు నెన్నమున్ను
పోరుటకై నేవచ్చుచుండనను ♦ పోవలదని తార
వారించిన నే వినకవచ్చి నీ ♦ వాత బడితినోరా !
ఇదియా శౌర్యము శరము వేసితివి ♦ యేరికి నగుబడక
ఎదుటబడిన నినుజంపి యుందునే ♦ ఇన వంశకళంక
రావణాసురుని సంహరింప ను ♦ గ్రీవు సఖతబడసి
నీ విట్లొనరింపగ న్యాయంబే ♦ నియమంబును బాసి
వైరమేల నాతోడను రామా ! వాంఛించినముందు
నీరమణిని యానిశాచరునినే ♦ నిటకు దెచ్చియుందు
నను సుగ్రీవుడుజంపి రాజ్యమును ♦ గొనగనశక్తుండై
నినుబంపెను గాబోలును రామా ♦ నీకు స్నేహితుండై
అనవిని రాముండనె వాలికినిటు ♦ అఘ మొనర్చితీవు
అనుజపత్నియగు 'రుమ'ను హరించిన ♦ అధమాధముండవు
గాకను నీవొక వన్యమృగంబవు ♦ గావున గొట్టితిని
మాకు మృగంబుల దుంచుట న్యాయమె ♦ మాటునయుండుకొని

దుష్టశిక్షణంబొనరించితి నే ♦ దోషినిగా నెపుడు
నిష్ఠురమాడెదవేలను యిట్టుల ♦ నీతిలేని యపుడు'
అనుచు నెన్నియోధర్మంబులు బ ♦ ల్కినవిని యాతండు
అనెనిటు '(శ్రీ)రఘురామా యిక న ♦ న్నాదరమునజూడు
తప్పుగ్రహించితి ఇప్పుడు జ్ఞానో ♦ దయమయ్యెను నాకు
అప్పగించుచుంటిని నాతనయుని ♦ అంగదునిదె నీకు
వానిని నీతమ్మునివలె బ్రోవుము ♦ వాంఛితమిదె నాకు'
అనుచునుండ నటకరుదెంచుచు తా ♦ రంగదునిం గూడి
దునుకనొందు తనప్రియునిం గనుగొని ♦ దుఃఖిలి మూర్ఛబడి
దెలసి యంతలో విభునిపైనిబడి ♦ విలపించెను యిటుల
'వలదని తొలినేవారించిన విన ♦ వైతివి నాగోల
నీకు మృత్యువైవచ్చెను రాముడు ♦ నీకు సఖుడుగాడు
నాకికేమిగతి కనులువిప్పవా ♦ నన్నొకపరి జూడు
ఇదిగోగను నీతనయుడంగదుడు ♦ ఏడ్చుచున్నవాడు"
"సుదతి రుమతో రాజ్యంబేలుముయిక ♦ సుగ్రీవా! యిపుడు"
"ఇనకులోద్భవా (శ్రీ)రఘురామా ♦ ఇదితగునానీకు"
అనుచు వరిపరివిధంబుల బొక్కుచు ♦ అడలెడు ఆయమకు
హనుమంతుడు సాంత్వనవచనంబుల ♦ నాడుచుండ వాలి
కనులువిచ్చి సుగ్రీవునిగని యనె ♦ అనుజా! దయమాలి
నిను బహువిధముల క్రిములనుబెట్టితి ♦ నను కోపముమాని
తనయుడంగదుని దయతోజూడుము ♦ తారను నల్లైగని
వానరరాజ్యము సుఖముగనేలుము ♦ వనిత రుమనుగూడి
మానకు రామునిసేవన మెప్పుడు ♦ మను మాతనివేడి
అనుజా తప్పకయువరాజ్యము నా ♦ తనయున కొసంగుము
గొనుమిదికాంచనమాలిక యిదినీ ♦ కుతుకను ధరించుము

అనుచు మాల సుగ్రీవుని కంఠము ♦ నందుయునిచి సుతుని
గనుగొని యిట్లనె తనయా సుగ్రీ ♦ వుని నావలె నెగని
మనుము సుఖంబుగ యువరాజువువై ♦ అవిజుని కిష్టుడవై
అనయము శ్రీరఘురాముని గొల్వుము ♦ ఆతనిభక్తుడవై
అనుచు రవిజరవికులజుల కంగదు ♦ నప్పగించి వారు
తనయుని యువరాజుని జేసెదమన ♦ విని, విడిచెను యుసురు.
అంతతార విభుపైబడి యేడ్చుచు ♦ అవిజున కిట్లనెను
ఎంతటిదోహం బొనరించితివహ ♦ ఈవు వాలియెడను
మరదీ, యిక కపిరాజ్యంబేలుము ♦ మగువరుమను గూడి,
మరణము నొందెద "నాథునితోనే ♦ మానక నగ్నిబడి"
అనుచు రాఘవుని దేరెజూచియనె ♦ అవనిజేశ రామా
ఇనకులాబ్ధి సోమారఘురామా ♦ అనుపమగుణధామా
ఖగమున నాథునిజంపితివయ్యో ♦ కరుణలేకనాకు
మగడులేని యీహీనబ్రతుకు రా ♦ మాయిక నెందులకు
ననుగూడను యొకతూపున జంపుము ♦ నరవరయనుచుండ
ఇనకులోద్భవుని డాసిబల్కె ని ♦ ట్లిన జుడు వగతోడ
అన్నను జంపించిన హీనుండను ♦ అవివేకుడనయయో
ఎన్నగ నాకీ రాజ్యసంపదలు ♦ ఎందులకేమి ప్రియో
జనమయ్యెయొ, నేనంతమొందెదను ♦ అనలంబునజొచ్చి
అనవిని రాముడు తారను సుగ్రీ ♦ వుని యటనోదార్చి
ధర్మబోధ గావింపుచుండ నం ♦ తటను లక్ష్మణుండు
కర్మసాక్షి సుతుకిట్లనె, వాలికి ♦ కర్మాంతరమిపుడు
జేయవలయు తద్విషయ యత్నములు ♦ జేయింపుము యనగ
వాయునందనుని బిల్చి భానుజుడు ♦ వలసిన పనివడిగ
జేయించుచు నంగదు గూడుకొనియొక ♦ చితియందున వాలి
కాయంబును దహనంబు నొనర్చిరి ♦ కపులతోడ వెడలి

అంతట శ్రీరఘురాముజేరి హను ♦ మంతుండనె నిటుల
'మంతువుగా' జేయగ సుగ్రీవుని ♦ మర్కటముల కెల్ల,
రండుబోవుదము కిష్కింధానగ ♦ రంబెల్ల రమిపుడు
వెండియంగదుని యువరాజునిగా ♦ విదితం బొనర్పుడు'
అనవిని శ్రీరఘురాముండనె నిటు ♦ హనుమంతునితోడ
'జనకునాజ్ఞ పదునాల్గబ్దంబులు ♦ వని దిరుగుచునుండ
వ్రతము బూనితిని గానపురంబున ♦ వదము నిడగజాల
అతులిత విభవముతోడను మీరలె ♦ అవితనయాంగదుల
అభిషేచన యువరాజ్యాభిషేచ ♦ నాదుల జేయించి
శుభముగ నుండుండనుచు బల్కెనిటు ♦ సుగ్రీవుని గాంచి
నీవు సుఖింపుము రాజ్యమొంది సు ♦ గ్రీవా! యిపుడు గన
శ్రావణంబుతో వర్షంబులు ప్రా ♦ రంభమయ్యె గాన
సీతాన్వేషణ సమయముగాదిది ♦ జెల్ల నాల్గునెలలు
కోతులబంపుము వైదేహిని వెత ♦ కుటకు నెల్లదిశలు
అంతవరకు మేమిర్వురంబు యీ ♦ అవి గుహానుండెదము
అంతంబవ నాల్గుమాసములు యిట ♦ కరుగుము తప్పకుము'
అనుచు రామలక్ష్మణులొక వడపున ♦ కరిగి వసింపగను
హనుమదాది వనచరులెల్లరు వడి ♦ అరిగి విభవముగను
అవి తనయుని కిష్కింధకు రాజుగ ♦ అభిషేకము జేసి
యువరాజునిగా జేసిరంగదుని ♦ యుక్తుండని దెలసి
అటులను సుగ్రీవుండు, రుమాంగద ♦ హనుమంతులతోడ
పటుతరముగ కిష్కింధారాజ్యము ♦ పాలింపుచు నుండ
మాసచతుర్థము గడచి వర్షములు ♦ మాని శరదృతువు
బాసెను; అప్పుడు రాము డనుజుకిటు ♦ బల్కెను సుగ్రీవు
డేమిరొ! నాగడువైనను నిచటకు ♦ నేగుదెంచ కుండె
సౌమిత్రీ! జానకిని వెతకుటకు ♦ జాగు, అగుచునుండె

రవితనూభవుడు మరచెనో మనలను ♦ రాజ్యమొంది పాపి
వివరము దెలుసుకొరమ్మ్మి తనికినా ♦ విషయంబును దెలిపి
నామాటలుగా దెల్పు మిటుల ♦ వానరపతితో యనుచు
ఏమేమియొబల్కిన వినిలక్ష్మణు ♦ డెసక్రుద్ధుండగుచు
శరచాపంబులగొని కిష్కింధకు ♦ జనె నింతలోనచట
మరుత్సుతుడు సుగ్రీవునకనె నిటు ♦ మరచితివా మాట
తలపవు శ్రీరఘురాముని యాజ్ఞను ♦ ధరణిజ వెతకుటకు
నెలలునాల్గు గడువొసగె వానలని ♦ నీవిపు డందులకు
తగుయత్నంబుల జేయుమనగ విని ♦ తరణి తనూభవుడు
అగచరముల గూర్పగమనె నీలుని ♦ అంపి దిశలకపుడు.
రామానుజుడటు కిష్కింధకుజని ♦ రవిసుతుకనె నిటుల
రాముడచట ప్రశ్రవణాద్రిని తన ♦ రమణికొరకు చాల
కుందుచుండ నీవేమోసుఖముగ ♦ కులుకుచుంటి విచట
జెందితివిగదా నీవారాముని ♦ స్నేహ మగ్ని యెదుట
కానుపింపవైతివి చిత్రము రా ♦ ఘవునకు యీవెనుక
వానలువెలసియు యత్నముజేయవు ♦ వైదేహిని వెతుక
అన్న నీదు నిర్లక్ష్యంబునుగని ♦ ఆగ్రహించి చాల
నన్నుబంపె నీతోదెల్పగ మా ♦ యన్న పల్కలిటుల
"వానలుదీరినవెనుక వత్తునని ♦ వచించి నీవచట
వానరరాజ్య మదంబున మరచితి ♦ వా జానకిమాట
మోసముదలచితివో గాకను దు ♦ ర్బుద్ధియేలనీకు
బాసజేసితివి సాయమౌదునని ♦ భార్యను వెతకుటకు
పుడమినియేలుచు గుడుచుచు ద్రావుచు ♦ యొడలు మరచినావు
తోడరినిన్ను జంపినపాపములే ♦ దు కృతఘ్నుడవీవు
వాదులేల సీతను వెతకింపగ ♦ ప్రయత్నింప వేని
నీదుఅన్న వాలిని గూల్చిన యా ♦ నిశితశరంబున నీ

శిరము దుంతు”నని, గావున వడిగా ♦ శ్రీరాముని గాంచి
ధరణిజాతనుం వెతకింపుము వా ♦ నరులను బంపించి
అనవుడు వడి, మదిరాక్షి “తార ల ♦ క్ష్మణుని సమీపించి
అనెనిట్లు వినమ్రతతో నాతని ♦ కంజలి ఘటియించి
రామ సోదరా శమదమ సాగర ♦ రాజకుల లలామ
భీమపరాక్రమ దీనపోష సా ♦ మిత్రీ కృపగనుమా
అనాగతము మఱువలేము ఇనజుం ♦ డనఘా నీవిటుల
కనలిన నోర్వగగలమే రవిజాం ♦ గదు యపరాధముల
క్షమియింపుము రామాజ్ఞను నెరువగ ♦ జానకిని న్వెదుక
రమావిభుండిపు డేకపులను గూ ♦ ర్చుచుండె వలదలుక
మఱచునె మీరాతని కొనరించిన ♦ మంచిని యెన్నండు
కరుణింపుడు కోతులతో రాముని ♦ కడకువచ్చు నతడు
అనుచు లక్ష్మణుని శాంతింపగజే ♦ సిన సుగ్రీవుండు
అనెనిటు సౌమిత్రికి నమ్రుండై ♦ అయ్యా దయజూడు
రాముని సేవింపక యుండుట యప ♦ రాధమేను గాని
స్వామిద్రోహ మొనరింతునె పావక ♦ సాక్షిగ మైత్రిగొని
రాముని శౌర్యపరాక్రమ మెరుగుదు ♦ రావణు జంపుటకు
రాముడొకడె జాలును వినను నను ♦ రమ్మనె సాయముకు
చెలిమిననోగాక పరాకుననో ♦ జేసితి తప్పులను
అలుగక నను క్షమియింపు మనము మీ ♦ ఆజ్ఞకు బద్ధుడను.
నీలుని బంపితి కపిసైన్యంబుల ♦ నెమకిటగొనిరాగ
మూలమూలలను వెతకించెదనీ ♦ నేల నెల్ల వడిగ
అను యవసరమున భూమి యీనినటు ♦ లద్రి లెల్లనుండి
వనచరములు కోటానకోట్లుగా ♦ వచ్చెను గుమిగూడి
అంతట రవిజుండంగద హనుమం ♦ తాదులతో రాము
చెంతకరిగి కపులెల్లరతోడను ♦ సేసిన ప్రణామము.

రాముడాగ్రహంబున బల్కెను యిటు ♦ రవితనూభవునకు
"కామవశుడవై మమ్ము మరచితివి ♦ గనబడితివె నీకు
శిరిరాజ్యంబుల గల్గిభామలను ♦ జేరిపడకటింట
మురియుచు నుంటివిగాబోలును ♦ ఇటమరచి నాదుమాట
అనలసాక్షిగా జేసిన ప్రతిజ్ఞ ♦ నాదరించెదవని
అనాగతము జ్ఞప్తికి దెచ్చుటకై ♦ యంపితి లక్ష్మణుని
ఇవుడైనను జానకిని వెతకుటకు ♦ ఎల్లదిక్కులకును
కపులను బంపుము సుగ్రీవా" యన ♦ కపివిభు డిట్లనెను
"రామా నీపదసేవను మరతునె ♦ రౌరవముల బడనా
భూమినిగల కపులెల్లరకొరకై ♦ పుత్తెంచితి గాన
కాలహరణ మయెనంతియెగా నీ ♦ కలనైనను నీదు
మేలుమరతునని తలపగ బోకుము ♦ మిత్రి! అలుగవలదు
వారు వచ్చినంతనె నీదెసరా ♦ వలయు ననుచుయుంటి
వేరువిధంబుగ నెంచకు రామా ♦ వీక్షించుము తొంటి
దయతోడను నను, సీతను వెతుకగ ♦ దశదిశలకు నిపుడు
బయల్వెడల సంసిద్ధులైన కపి ♦ బారులవిగో జూడు
గజగవాక్షదధి ముఖశత బలినల ♦ గవయనీల శరభ
విజయహోత్రి శతగుల్మ కేసరీ ♦ వినతతార ఋషభ
హనుమత్సుషేణ బ్రిజంఘుశతార్చి ♦ అంగదాది వీరుల్
వనచరకోట్లకు నాయకులై యట ♦ వచ్చి నిలచినారల్
కోటికోటిశత సహస్రి కోటుల ♦ కోతులు వచ్చెనిక
వాటిని బంపించెద నలు దిశలకు ♦ వైదేహిని వెతుక"
అనుచు రామునాజ్ఞను గొని రవిజుడు ♦ వినతుని తూర్పునకు
హనుమజ్జాంబవ దంగదాదులను ♦ యామ్యంబరుగుటకు
పశ్చిమంబునకు సుషేణునిన్నత ♦ బలినుత్తరమునకు
నిశ్చయించి వారలగని యిట్లనె ♦ నేలచూలి కొరకు

మీరలెల్ల కపినియంబులగొని ♦ మీమీదిక్కులను
పారావార పృథివీపుష్కర ♦ పాతాళంబులను
వాడలు మేడలు పట్టణంబులును ♦ వాపీకూపములు
కాడులు చెట్టులు పుట్టలు గుట్టలు ♦ కందరములు గిరులు
నిశ్శేషంబుగ వెతకి గన్గొనుడు ♦ నెలదినములు గడువు
నిశ్శోధ్యము యీలోనగానియెడ ♦ నిజము మీకు చావు
ఏతరి రావణు డవనిజనుంగొని ♦ ఎచట దాచినాఁడో
ఆ తాపుఁకుంజని సీతనుగను ♦ నట్టిధీరు డెవడో
చూతము మీమీ-సామర్థ్యంబులు ♦ జూప వేగబొండు
సీతజాడెరిఁగి శ్రీరామునితో ♦ జెప్ప వేగరండు
అనియెడు సమయంబున శ్రీరాముడు ♦ హనుమంతుని బిలచి
తనదు నామ లిఖితంబగు యుంగర ♦ మును యీతని కిచ్చి
అనెనిటు "కపివర ! వే, విక్రమ శౌ ♦ ర్యములకు నీపాటి
ఘనుని జూడ ! నీవే సీతను నను ♦ గలియజేయునట్టి
అనుకరుఁడవు నీవాయామ్యంబున ♦ కరుగుచుంటవలన
జనకజ నీకగుపడవచ్చును రా ♦ వణుని లంకలోన
సతి గన్పించిన ముద్రికనొసఁగుము ♦ సంజ్ఞగ నిదిజూపి
క్షితి మాయసువులు నిల్పుము, హనుమా ♦ సీతకబురుదెలిపి".
అంతట హనుమంతాదులెల్లరును ♦ అవిజు ననుజ్ఞగొని
సంతరించుకొని కపిబలముల దా ♦ శరథికి మ్రొక్కుకొని
సంతోషముతో నియమితదిశల క ♦ నంతంబునకేగసి
జంతుమతీసుత సీతను వెదుకగ ♦ గంతలైరివెలసి
అపుడు రాఘవుడు ప్రస్రవణాద్రికి ♦ నరిగి తమ్మునితోడ
కపులరాకకై నిరీక్షించుచును ♦ కలవరబడుచుండ
శతబలియును వినతుండు సుషేణుడు ♦ జనుచు కపులతోడ
వెతకి వెతకి తమదిక్కులు మూడును ♦ క్షితిజయొక్కజాడ

అరయగజాలక గడువులోపుగా ♦ తరణిసుతునికడకు
తిరిగివచ్చి తద్విషయం బతనికి ♦ తెలిపిరి; వలకడకు
అరుదెంచిన యా హనుమజ్జాంబవ ♦ దంగదాదు లచట
ధరణిజకొరకై వెదకి వెదకి యా ♦ తన్విని గనకేచట
విసిగియుండు సమయంబున నొక ర ♦ క్కసుడు వలీముఖుల
దెసకువచ్చి మ్రింగెదనని పైఁబడ ♦ దెబ్బున తన కేల
చరచి రక్కసుని జంపె నంగదుడు ♦ సహగమనులుబోగడ.
తిరిగి పయనమును సాగించుచు వా ♦ నరవరు లొక్కయెడ
కొండబిలంబున యుండి పక్షిచయ ♦ మొందు వెడలగాంచి
కొండలోన తప్పక నీరంబులు ♦ యుండుననుచు నెంచి
పిపాసపీడితు లాటనెల్లరా ♦ బిలమందున జొచ్చి
అపగమమును సాగించి యందునొక ♦ యామడనగనడచి
కనకమయంబగు పట్టణమును మరి ♦ వనిత నచటగాంచి
జనకజ నట లంకేశుడు దాచెనొ ♦ యనుచును భ్రమియించి
హనుమంతుఁ డిట్లనియెనామెఁగని ♦ "అమ్మా! నీవెవరు?
వనరాణివొ జనకజవో దెల్పుము ♦ వనితా నీపేరు?
తాపసివై యిట దిరుగనేల యీ ♦ తా వెవరిదో చెవుమా
కోపబడకు మా రాకకు దప్పిక ♦ గొని వచ్చితిమమ్మా!"
అను హనుమంతునితో యాయమ యి ♦ ట్లనె విను మొకప్పుడు
దనుజుల కెల్లను విశ్వకర్మయగు ♦ దానవోత్తముండు
త్రిపురాధిపుఁడగు మయుండు, పవిచే ♦ దితమగు యీగుహను
అపలభతో యీపురి నిర్మించుచు ♦ అందున 'హేమ'యను
అచ్చరతో సుఖియించుచుఁ నింద్రుచే ♦ యంతమొందినాడు
నెచ్చెలి నాదును హేమకునే నిట ♦ నిర్జనమిది యిపుడు
స్వయంప్రభనునే వినుఁడు మేరుసా ♦ వర్ణికి తనూజను
భయంబుజెందక గ్రోలుడు మీరీ ♦ పానీయంబులను

వన్యఫలంబుల మీరెల్లరు కడు ♦ పారగడిని నన్ను
ధన్యను జేయుడు దెల్పి మీదు వృ ♦ త్తాంతం బంతయును'
అంతకపులు పండ్లనుదిని పానీ ♦ యములు గ్రోలియుండ
ఇంతి స్వయంప్రభతో హనుమంతుం ♦ డిట్లనె ధృతితోడ
"దశరథతనయుడు రాముడు సతిసీ ♦ తతో వనినియుండ
దశకంఠుం డాయమను హరించెను ♦ తరుణీమణిజాడ
నరయుగ రవిజునిచే బంపగబడి ♦ నగమున గుహగాంచి
అరుదెంచితిమి పిపాసపీడితులై ♦ మాటను యిటనుంచి
వెలుపలికేగగ దారెరుగము మేము ♦ వెలికి బంపవమ్మా
నెలత జానకిని వెతుకగ మాకొక ♦ నెలయే గడువమ్మా
అనిన స్వయంప్రభ కపులనందరను ♦ కనుల మూయజేసి
దనదు ప్రభావంబున వారిని యువ ♦ తలకు జేర్చివేసి
వననిధి ప్రస్రవణాద్రి వింధ్యలను ♦ వారల కగుబరచి
జనె గుహలోనికి నంత అంగదుడు ♦ సఖుల జేరబిలచి
'అయోనిజను గనజాలగమైతిమి ♦ అంత్యమయ్యె గడువు
అయయో జానకిలేదని మకలిన ♦ అగును మనకుచావు
రవిజునికడ కెళ్లగగలము (శ్రీ) ♦ రాముని గనగలమా
పవనసుతా! నేనిచ్చట ప్రాయో ♦ పవేశ మాదునుమా
నాపినతండ్రికి నాపైకోపము ♦ నన్ను బ్రతుకనియడు
పాపి, అనను జంపించినా డతని ♦ భార్య నొందినాడు
జనకజ కారణమున నను జంపును ♦ క్షమను యద్దుదీర
జనుడుమీరు కిష్కింధకు నేరా ♦ జాల ననుచు బెదర
తారుం డొక్క యుపాయము దెల్పెను ♦ వారల కందరకు
పరికి గనుబడకుండ స్వయంప్రభ ♦ యింటనుండ దమకు
ఏయుపద్రవం బిల రాదనియెను ♦ ఎల్లకపులు మెచ్చ
వాయుతనయు డదియొప్పక యనెనిట్లు ♦ వాక్పటిమను హెచ్చ

ఏమైననుసరే, భానుజుకడకే ♦ ఏగవలయు మనము
భూమిజకొరకై యామ్యంబెల్లను ♦ పోయి వెతకినాము
అవనిజ యెందులగానుపింపలే ♦ దని దెల్పిన మనల
అవిజుడు శిక్షించునె? యాతనికడ ♦ కరిగి విషయమెల్ల
నిగదించగనే వలయు; దయాళుడు ♦ నిష్కలుడాతండు
నగబిలమున దాగినంతమాత్రము ♦ నను శ్రీరాముండు
గనుగొనజాలడె అతని శరమునకు ♦ కంపింపదె జగము
వినివర్తనముత్తమంబు తారుని ♦ విహితమనియమితము
అనుచు నెన్నియోవిధముల బల్కిన ♦ అంగదుండు వినక
యొనరించెద ప్రాయోపవేశమని ♦ యుర్వినిబడె; వెనుక
హనుమజ్జాంబవదాదు లెల్లరును ♦ అంగదుతో గూడ
యొనరించిరి ప్రాయోపవేశమును ♦ ఒక్కట ధృతితోడ
అంతలోన నచ్చోటను గలయొక ♦ అగౌకసము కపుల
చెంతకరిగి మ్రింగెదనని సంతో ♦ షించుచుండ చాల
అంగదుండు తక్కుంగల కపులకు ♦ అనెనిటు దిగులొంది
మ్రింగవచ్చె నీగృధ్రము మనలను ♦ మిక్కిలి పసిజెంది
యెన్నికష్టములు యొదవెనొ భువిలో ♦ ఇంతి కైకవలన
మన్నడు గావలసిన రాముడు ల ♦ క్ష్మణునితో విపినమున
దిరుగనయ్యె, ఖరదూషణాదులట ♦ మరణ మొందనయ్యె
ధరణిజ, లంకేశుడు రావణుచే ♦ హరింపబడనయ్యె
వాలిజంపబడె మనమీగృధ్రము ♦ వాత బడగనయ్యె
ఆలికి దశరథు డొసగుట వరములు ♦ అంతకు హేతువయె;
కంటుభావమును బూనెను మనపై ♦ గన నీగృధ్రంబు
కంటిరె మీరీ దాక్షాయ్యంబుల ♦ గలిగిన ఖేదంబు
సీతను రక్షించుచును జటాయువు ♦ జెందెను మరణంబు
సీతను వెదకెడి మనలకు నియ్యది ♦ జేయును ద్రోహంబు

కొందరు రామునకుపకారంబును ♦ కోరుచు నుండమరి
కొందరు యపకారము జేయగతల ♦ కొనుచుండిరి జేరి'
ఆవచనంబుల విని ఖగమిట్లనె ♦ హరులకు దీనతతో
మీావచనంబులలోన జటాయువు ♦ మృతిని వింటి, దయతో
ఆవిషయం బెరిగింపుడు జటాయు ♦ వగు నాతమ్ముండు
ఏ ధముగ నాతండు జచ్చెనన ♦ ఇట్టులంగదుండు
దాక్షాయ్యంబున కనె, 'శ్రీరాముడు ♦ దశరథ తనయుండు
ఆక్షేపింపగ బడిరా జౌటకు ♦ ఆలియు లక్ష్మణుడు
వెంటనంటిరా, వనిని పర్ణతటి ♦ విచ్చేసెను యపుడు
ఒంటిగ జానకి యింటనుంటగని ♦ తుంటరి రావణుడు
సీతను గొనిపోయెను అదిగని ప ♦ క్షీందుృడు జటాయువు
సీతకొరకు రావణుతో యుద్ధము ♦ చేసిన, యాపశువు
నరికి జటాయువు రెక్కలు, పారెను ♦ ధరణిజనుంగొనుచు
ధరబడి నెత్తురు గ్రుక్కుచు ఖగంబు ♦ దాశరథుల గనుచు
ధరణిజ తెరంగు, దెల్పి, జెందెమృతి ♦ తదుపరి రాఘవులు
తరణిజుతో సఖ్యము జేయగ నా ♦ తడు మమునలుదిశలు
సీతజాడగొని రాగబంపె నది ♦ జేకూరమి మేము
ఈతావున ప్రాయోప విష్టులవ ♦ ఇచ్చయించినాము
సీతజాడ నీవెరిగిన దెల్పుము ♦ జేతుము వందనము
ఈతీరున నీవిచట నుండుటకు ♦ ఏమియొ కారణము'
అనవిని గృధ్రము తమ్ముని చావు న ♦ కడలుచు కపులగని
అనెనిటు "నే సంపాతిని మును నా ♦ కాహారంబు గొని
వచ్చుటకై నాసుతుడు సుపార్శ్వుడు ♦ వలకడ కరిగియట
ముచ్చురావణునిచే గొంపోబడు ♦ ముదితను గనియెనట
ఆయమ "హారామా హాలక్ష్మణ" ♦ యనుచు నేడ్చుచుండ
తోయధి గమించి జనెనట దనుజుడు ♦ దోయజాక్షితోడ.

జనకజ నాకూ్రరుండు లంకలో ♦ నునిచి యుండుగాన
వనధిదాటి యటకేగిన గన్పడు ♦ జనకజ త్వరలోన
కడలికడకు నను గొనిపోవుడు ప ♦ క్షములులేవు నాకు
విడువగవలయును జలతర్పణములు ♦ వేగ జటాయువుకు”
అనియెడు గృధ్రమునందు భయంబును ♦ అనుమానము లేక
గొనిపోయిరి సాంద్రంబున కాతని ♦ కోర్కెదీర్ప వెనుక
పులుగులరాయుడు గ్రుంకులాడి కడు ♦ పొక్కుచు తమ్మునకు
జలతర్పణముల నొసర్చి హనుమ ♦ జాంబవదాదులకు
అనెనిటు “వినుడీ జటాయువుకు నే ♦ నగుదును సహజులము
మును మేమిర్వురమును మచ్చరమున ♦ దినమణి మండలము
అంటిరాగ పందెంబుల నిడుకొని ♦ జంటవిడువకుండ
మింటికి నెగయుచునుంటిమి యచ్చట ♦ మింటిపథిని నెండ
అతితీక్ష్ణమువ తమ్ముడు సుడివడ ♦ ఆతనిబట్టుకొని
పతత్రములయం దిడుకొని బారితి ♦ భాస్కరు వేడిమిని
కమిలి నాదు పక్షంబులు గూడను ♦ కనిష్ఠుడును నేను
క్షమపైబడితిమి నేనిచ్చోటను ♦ జటాయువచ్చటను
నే నిట్లిచ్చట శ్రమనుబడగ గని ♦ నిశాకరుం డనెడు
మౌని జాలిగొని యిట్లనె “రాముని ♦ మహిషిని రావణుడు
గొనిపోవగ సుగ్రీవుని పనుపున ♦ క్షోణిజ వెతకుటకు
వనచరవరు లీప్రాంతంబులకే ♦ వత్తురు వారలకు
“సీత రావణుని లంకను యుండుట” ♦ జెప్పితేని నీకు
నూతనముగ రెక్కలు మొలచును యని ♦ నుడివె నిపుడునాకు
పక్షము లివిగో వచ్చుచుండెను సు ♦ పార్శ్వ నంపి యటకు
రక్షస్సుని జంపించి జానకిని ♦ రామచంద్రు కడకు
దెప్పించెదనన కపివరులెల్లను ♦ దెలసి సీతజాడః
ఉప్పుకడలి మేమే దాటుదుమని ♦ యుత్సాహముతోడ

కడలి కడకుజని విడిసిరి; గృధ్రము ♦ కొడుకుతో హిమగిరికి
వెళలెనంత: కపులబ్ధిని దాటగ ♦ జడిసి వెనుకకురికి
యోచించెదునెడ అంగదు డిట్లనె ♦ యుర్విజ నెటులైన
నీచుడు రావణుడుండు లంకలో ♦ నెమకవలయుగాన
కడు భీకరమై వెడదంబగు యీ ♦ కడలిని యెవరైన
తొడరి దాట నే వలయుగాన మీ ♦ రడలక మీలోన
ఎవరెవరెంతగ లంఘించెదరో ♦ ఎవరిశక్తి యెంతో
వివరింపుడన యొకరొకరిటు విని ♦ పించిరి యంగదుతో
పదియోజనడ దాటెదననెగజు, డిరు ♦ వది యనె గవాక్షుడు,
పదులు మూడు యనె గవయుడు, నే నలు ♦ వది యనె శరభుండు
గడుతుననియె యేబది యోజనములు ♦ గంధమాధనుండు,
నుడివెను తా గెంతెద నరువది యా ♦ మడలని మైందుండు
తను డెబ్బది యోజనములు దాటెద ♦ ననియెను ద్వివిదుండు
ఎనుబది యామడలను లంఘించెద ♦ ననియె సుషేణుండు.
అంతయువిని జాంబవంతు డిట్లనె ♦ వానరులారా వినుడీ
ఎంతశక్తివంతుడనో నే మును ♦ ఎరుగరు తొలినుండి
ఎప్పటిమాటలో యిప్పుడు జెప్పిన ♦ యింపుగావు ఐనా,
జెప్పెద వినుడీ "బలి" కాలంబున ♦ శ్రీహరి తనదు ఘన
రూపము ముజ్జగముల నిండించె, ని ♦ రోధింపగ బలిని
ఆ పూజ్యుండగు త్రివిక్రముని బ్ర ♦ హ్మాండమైనవాని
నే నిరువది యొకమారు ప్రదక్షిణ ♦ మెన్నగ జేసితిని
ఆ నాబల, గమనంబులు లేవిపు ♦ డవనిని యెవరికిని.
మున్నొకపర్వత మిందుగ్రినిపైబడు ♦ చున్నయపుడు నేను
తన్నితి దానిని జానువుతో నది ♦ తగులకుండగాను
అపుడు కుంటినైతిని యదిగాకను ♦ ఐతిని వృద్ధుడను
ఇపుడు నేను తొంబది యోజనముల ♦ కెక్కువ పోలేను

శతయోజన విస్తీర్ణముండె యీ ♦ జలధిని దాటుటకు
అతికష్టంబుగ దోచుచుండెనన ♦ అంగదుడనె, నాకు
శక్తిగలదు నూరామడబోవగ ♦ జలధిదాటి మగుడ
శక్తిలేదునే నేమిజేతునని ♦ క్రమను చతికిలబడ
జాంబవంతు డిట్లనియెను అంగద ♦ జాలుదు వీవులవ
ణాంబుధి నిల్లంఘించి వచ్చుటకు ♦ ఐనను నీవు, యువ
రాజువు గావున నిన్నంపింపగ ♦ రాదుగాని యిప్పుడు
యోజనశతములు దాటుసమర్థుం ♦ డుండె ననిలసుతుడు
మరుగునగూర్చొని యున్నాడాతని ♦ మాటనె మరచితిని
మరుస్సుతుని బంపుటయే మనకు స ♦ మంజసమిత్తరిని
అనుచు మారుతినిజేరి బల్కెనిటు ♦ "హనుమంతా నీవు
అనుపమాన బలశౌర్యవంతుడవు ♦ అబ్ధిదాటగలవు
చూచిచూడనటు యివ్విధినుండుట ♦ చోద్యమయ్యె మాకు
యోచనలేటికి లెమ్ము లంకజని ♦ యుర్విజనరయుటకు
గరుడుని గమనము గల్గినవాడవు ♦ గలరెసములు నీకు
మరచితివో నీశౌర్యధైర్యమహి ♦ మంబులింతవరకు
అనిలజ ! నీకెద్దైననుగలదే ! ♦ అసాధ్యమీాధరను
వినుము నీదు జన్మంబును మరినీ ♦ విశ్రిమాదుల, మును
క్రమను పుంజికస్థలయను అచ్చర ♦ శాపమొందుకతన
కొమరితయై "యంజని" యనబుట్టెను ♦ కుంజరుడను వాన
రవరున, కాయమ, యుక్తవయస్సున ♦ రమణుగ కేసరిని
వివాహమై సుఖముండె నంతనొక ♦ దివసము నాతరుణి
శైలమందు నొకనరభామినియై ♦ సంచరించుచుండ
గాలికివస్త్రిము జారిన "వాయువు" ♦ కామాతురతోడ
గాగలించి విడిచిన, అంజనియనె ♦ గాంచి తొట్రుబాటు,
ఓగితమగునే పాతివ్రిత్యము ♦ ఓటొనరింపనిటు

ఓరి ! నీవెవడవగు బడకనైన ♦ న్నొందదగునె యనగ
మారుతమిట్లనె, 'అంజని' ! వినుపవ ♦ మానుడ నినుగనగ
మరులుజెంది నిన్ననుభవించితిని ♦ మానసంబు చేత
తరుణీ అంచుట నీపాతివ్రి ♦ త్యంబునకే కొరత
గల్గదదియు గాకుండగ నీకొక ♦ కపిరూపున సుతుడు
గల్గగ ననుగ్రహించితి యాతడు ♦ ఘనవిక్రమ బలుడు
సకలశాస్త్ర సంపన్నుడుత్తముడు ♦ సద్గుణాన్వితుండు
అకుతోభయుండు జయకలితుడు వి ♦ ఖ్యాత పౌరుషుండు
అనుచు పవనుడేగిన, అంజని గనె ♦ నట్టి సుతుని "నిన్ను"
ఇనుని నీవుపండని బట్టగపై ♦ కెగురగ నినుమున్న
పవితో నిందుృడు బడగొట్టెను భువి ♦ బగులనీదు హనువు
పవనుడంత కోపించి 'వీవ' వన ♦ బ్రహ్మాదులు, నీవు
చిరంజీవివై అస్త్రబాధలను ♦ జెందకుండునటుల
వరంబు లొసగిరి; వారధి దాటగ ♦ వడి లెమ్మన" మిగుల
సంతసించి హనుమంతుఁడనె నిటు ♦ జాంబవతునితోడ
"చింతింపకు డబ్ధిదాటి లంకకు ♦ జేరి సీతజాడ
గని వచ్చెద"నని, జాంబవదాదుల ♦ కంజలి గావించి
ఘనమహేంద్రగిరి యందు నిలచె లం ♦ ఘనము నుద్యమించి
ఇంతవరకు కిష్కింధాకాండము ♦ యెవ్వరైనను దీని
స్వాంతతంబు విన, వ్రాయు, చదువ, మో ♦ క్షంబుగల్గు భువిని
"రామ రామ శ్రీ సీతారామా ♦ రామ రామ యనుడి
రామ" యనెడు తారకమంత్రామృత ♦ రసముగ్రోలి మనుడి,
శ్రీరామహరే, రఘురామహరే ♦ సీతారామహరే,
తారక నామహరే రామహరే ♦ దశరథరామహరే.

(సుందరకాండము)

"రామరామ శ్రీ సీతారామా ♦ రామా రఘురామా !
రామా రవికులసోమా తారక ♦ నామా శ్రీరామా !
రామా రామా రామా రామా ♦ రామా రఘురామా !
రామా రామా రామా రామా ♦ రామా శ్రీరామా !
రామ రామ" యని పలుమారులు శ్రీ ♦ రాముని స్మరించుచు
సామీరి మహేంద్రాద్రి నిల్చి భా ♦ స్కరునివలె భాసిలుచు
పవనుని నమించి, అజరుద్రేంద్రుల ♦ భజించి ధృతిమించి
లవణోదధి లంఘించి రావణుని ♦ లంకకు నే తెంచి
జానకి జాడ దెలిసి గాంచి నే ♦ జనుదెంచెద ననుచు
వానరవీరుల కెల్లరకు వారల ♦ వద్ద సెలవుగొనుచు
త్రివిక్రమునివలె పెరిగి వానరులు ♦ దిగ్భ్రమించుచుండ
దివికినెగసి బర్వెను జలనిధిపై ♦ దివిజులెల్ల బొగడ.
హనుమంతుండంతట వాయువేగమున ♦ అబ్ధిదాటుచుండ
వననిధి, మైనాకున కనె నిట్టుల ♦ 'హనుమంతుడు జాడ
గను, లంఘించుచునుండె లంకలో ♦ గనగ సీతజాడ
అనిలజు కాశ్రయ మొసగుము వెలువడి' ♦ అనిన ముదముతోడ
వనధినుండి వెల్వడి మైనాకుడు ♦ వాయు తనూభవుడు
జనెడు మార్గమున కడ్డైనిలచిన ♦ శైల మానె నతడు
అంతట మైనాకుండనె నిట్టుల ♦ హనుమంతునితోడ
కొంతతడవు నాపై విశ్రాంతిని ♦ గొనుమో కపివరుడ
ఉదధియు రాముం డొకేవంశమున ♦ యుద్భవించినారు
ఉదధియిపుడు రామున కుపకారం ♦ బొనర్పయిట, పారు
నీకు ఆశ్రయం బొసగ బంపెనను ♦ నిలచిపొమ్ము అదియు
గాకను, నేనున్నిందున్ని వాడికి ♦ కలుగుచుండ వాయు

విచ్చటనను పాంద్రింబున దాచెను ♦ ఇంద్రుభయము బాపి
విచ్చేయుము నేమైనాకుండను ♦ వేడెదననగ, కపి
వరుడా మైనాకునిపై హస్తము ♦ వాల్చి సెలవుబడసి
అరిగెను తానట నిల్వజాలనని ♦ ఆకాశమున కెగసి.
మరుత్సుతున కటుసేవ యొనర్చిన ♦ మైనాకుని మెచ్చి
మరుత్వంతు డరుదెంచి వెడలె తన ♦ మైత్ర్యమున వెలిబుచ్చి.
సురలంతట మారుతి బలవిక్రమ ♦ శుమ్మంబుల నరయ
"సురస" నంపె రక్కసి రూపంబున ♦ మరుత్సుతుని డాయ
అంతసురస హనుమంతుని మ్రింగెద ♦ నన విని యాతండు
ఇంతిసీతకై యేగెదు తనకే ♦ యంతరాయ మపుడు
గలిగింపగ వలదనుచు జానకిని ♦ గాంచి వచ్చెదాక
సెలవొసంగుమని వేడియు నది ని ♦ ష్ఫలమవ, గొనికినుక
పదియోజనములు పొడవు వెడల్పులు ♦ పవనజుండు బెరిగె
అదియు నిరువదామడవక్త్రిముతో ♦ హరిని మ్రింగనరిగె;
అప్పుడు ముప్పదియామడ బెరిగెను ♦ హరి యంతట సురస
ఒప్పెను నలుబది యామడ నోటితో ♦ నొక రొక్కరువరుస
హరియేబది యాయమఅరువది వా ♦ నరుండు డెబ్బదియు
సురసమరల ఎనుబదియు సమీరణ ♦ సూనుడు తొంబదియు
తెదుపరి రక్కసి నూరామడయును ♦ తనువువక్త్రిములను
పదశంబుగ బెంచిన సూక్ష్మ్రుండై ♦ పవనజుడంతటను
ఆయమవక్త్రిము జొచ్చి వెలికిజన ♦ అభ్రిమొంది సురస,
వాయుసుతుని కిట్లనియె నీదుబల ♦ పరాక్రిమ ధైర్యసా
హసములు మెచ్చితి, పోనిని నరయుగ ♦ అంపిరినను సురలు
ఏసురసను, ఇకనీకు జయంబగు ♦ నేగు మనగ చదలు
అంట పవనజుం డెగురుచుండె వడి ♦ యాతని నీడగని
వెంటనంటి దానింబట్టెను ఘోర ♦ విచిత్రిమగు తరుణి

ఆయమ 'సింహిక' యను ఛాయాగ్రిహ ♦ మటుల నీడబట్ట
వాయుసుతుం డెటుకదలలేక ది ♦ గ్భ్రమజెందెను మింట
అంతట నాసింహిక యొకపెనుభూ ♦ తాకృతితోడ హను
మంతుని మ్రింగదలంప నతడు సూ ♦ క్ష్మంబగు రూపమును
గొని సింహికగర్భంబున జొరబడి ♦ కోశంబునుజీల్చి
జనుదెంచినవెలి యాపెనుభూతము ♦ జలధిపిబడె జచ్చి.
మరల లంఘనముసాగించుచు హను ♦ మంతుడు క్రమముగను
శరనిధియంతయుదాటి యువ్వలకు ♦ జనెను సంధ్యబడను
ఆవలిగట్టునుజేరి పవనజుడు ♦ అవలోకించెనట
రావణు పురప్రాకారంబులు మరి ♦ రాణమొప్పు కోట
పతాకంబులును ధ్వజములు గోపుర ♦ ప్రాసాదంబులును
అతియున్నతమగు సౌధపంక్తులును ♦ హర్మ్య మొత్తములును.
పవనజు డదియే లంకాపురియని ♦ అవనిజ నయ్యెడల
అవలోకింపగ సాధ్యంబగునను ♦ ఆశజెంది చాల
చీకటిపురుగున చిన్నరూపమును ♦ జెంది ప్రహరిదాటి
లో కాలిడునెడ "లంక" కపిని యవ ♦ లోకించుచు 'నిచటి
కేలవచ్చితివి మర్కటమా ! నీ ♦ వెవరవు దెల్పుమన
ఆలంకకు నిట్లనియెను మారుతి ♦ అమ్మా లంక గన
అరుదెంచితి నీవెవరవు పేరె ♦ య్యది ననుబోనిమ్మా
మరలివచ్చెదను పురశృంగారము ♦ నరసి మాటనమ్మా
నావిని ఆయమ బల్కె-నిటుల వా ♦ నరునకు నేగాన
రావణాజ్ఞచే లంకాపురి సం ♦ రక్షించెదుదాన
లంకయందు నాపేరు విడువజా ♦ లను నెవ్వారినైన
లంకలోన కరుగంగ కపివరా ♦ పంకమునొంద కన
మారుతి యామెను మరల మరల బ్రతి ♦ మాలెగొని లంకే
ద్వారినివిడువక అరచేతను యా ♦ తని చఱచెను, కినుక

అంతట హనుమంతుం డాగ్రహించిన ♦ ఆమె నోడిసిబట్టి
ఇంతియనుచు శంకించి, చంపకను ♦ ఎడమరొమ్ము ముష్టి
చేతను బొడిచిన లంకి మూర్ఛబడి ♦ జెందితెప్వి పిదప
వాతాత్మజునకు నిట్లని బల్కెను ♦ "వానరవర కోప
మూనకు నాపై సారసాసనుడు ♦ మున్ను బల్కె నిట్టు,
"వానరు డొక్కడు రాముని పంపున ♦ వచ్చి నిన్ను గొట్టు
అపుడీ లంకకు చేటుగల్గి యీ ♦ ఐశ్వర్యము తొలగి
అపక్షయంబగు రావణువంశము" ♦ ఆర్యా నీ వేగి
నీపని జేసుకొ బొమ్ము జయంబగు ♦ నెమకుము జానకిని
పాపిరావణుడు బంధించెను యా ♦ పడతిని యిప్పురిని".
అంతట హనుమంతుండు తనదు వా ♦ మాంఘ్రి లంకనునిచి
అంతరాయ మేమియులేకను లో ♦ నరిగి పురము జూచి
వాడవాడలును పైడి మేడలును ♦ వజ్రపు గోడలును
వైడూర్యోజ్వల ద్వారంబులును ప్ర ♦ వాళ కంబములును
కనకగోపుర ప్రాకారంబులు ♦ కాసారంబులును
వనవాపీ కూపతటాకంబులు ♦ వసుకోశంబులను
చతురంగ బలంబులును నిశాచర ♦ చయములనుం గనుచు
అతిగహ్వరమగు తావులన్నిటికి ♦ ఆకృతితో జనుచు
అతివల పెక్కురగాంచుచు నెచ్చట ♦ నవనిజ గనలేక
వెతుకజొచ్చె వైదేహిని, విసుగుక, ♦ విరామమును గొనక
అట్టుల సీతాన్వేషుండగుచును ♦ హనుమంతుడు లంకా
పట్టణముల గల గృహములు వీధులు ♦ పరికించిన వెనుక
సకల విభవముల వెలయు రావణా ♦ స్థానంబును జొచ్చి
అకరణి నొందెను అచ్చట జానకి ♦ యగు బడమిని హెచ్చి
ప్రహస్త, సారణ, కుంభకర్ణశుక ♦ వక్రశఠ, సుమాలి
మహోదరతికాయ, విభీషణ ధూ ♦ మ్రాక్ష, జంబుమాలి,

విద్యుద్రూప చూడకంప వింధ్రజి ♦ ద్విరద వజ్రదంష్ట్ర
విద్యుజ్జిహ్వ వసుభ స్మిర్కే ♦ ప్లోటు ధూమ్రదంష్ట్ర
మొదలగు రాక్షసప్రముఖుల సదనం ♦ బులను వానరసత్తముడు
వెదకివెదకి జానకి నెటగానక ♦ వెడలి రావణునకు
యుండు నిశాంతంబునకు నరిగి యచం ♦ దున్న పుష్పకంబు
నొండుగనుంగొని యుండు రావణుం ♦ డొక దివ్యతల్పంబు
నందున మండోదరితో నిద్రించు ♦ చుండుచుంట గాంచి
కొందలమొందెను యామండోదరి ♦ క్షోణిజయని యెంచి
అంతలోన తన విభ్రమ మెరుగుచు ♦ యామెకాదని యిట్లనుచు
'కంతుకేళిని స్ద్రేలుచు రావణు ♦ కౌగిలియందుండు
ఈనారీమణి సీతగాదు యది ♦ యేమన రాముసతి
మానినీమణి పతివ్రత యెంతయునె ♦ జానవు నీరీతి
శ్రీరామునికై వగచుచు నిద్రా ♦ హారంబులు మాను
నారీమణి యిటు రావణుకౌగిట ♦ నందించునె ధరను ?
పొరబడితిని నేనీపె మరెవ్వరో ♦ పుడమిజ గాదనుచు
మరలివచ్చుచుఁ విగతవస్త్రలగు ♦ మగువల నటగనుచు
వారల నాస్థితినిం గనినందుకు ♦ వగచుచు వడినడిగ
వారియందు వెతకెను కడుశ్రద్ధతో ♦ వైదేహిని గనగ.
సీతజాడనేమియు దెలియక కపి ♦ శ్రేష్ఠుండత్తరిని
ప్రాతి భాసికస్థలములెల్ల గనె ♦ పట్టుదలనుబూని
ఐననుజానకి గానుబడగదయె ♦ అంతట పవనజుడు
దీనవదనుడై యిట్లుతలచెను ♦ జానకి నసురుండు
ఎచ్చోడదాచెనో గానమైతి నే ♦ నేమిజేతు నకటా
ఇచ్చోటలంగల వాడలు మేడలు ♦ ఇండ్లు దొడ్లు కోట
తోటలు చప్పరములు వనక్రీడా ♦ తుంగంబులు గుహలు
ఘోటక రథగజ పాకశాలలును ♦ కూటస్థానములు

వెతకి వెతకి వేసరితి యత్నములు ♦ వృథయయ్యెను యివుడు
ప్రతివర్తనమే మేలని దోచెడు ♦ పాపి రావణుండు,
సీతను జంపెనో లేకను యీయమ ♦ జెందెనో మృతి గాక
చేతరికంబామె కేమిగల్గెనో ♦ సీతజాడ గానక
ఏనేగిన నిస్పృహను రాఘవుడు ♦ మృతిజెందుట నిజము
దాన లక్ష్మణుడు జచ్చునంత భర ♦ తాదులమృతి ధ్రువము
అంగదసుగ్రీవాది వానరులు ♦ అంత నంత మొందు
ఇంగలమున బడిజచ్చుట యుత్తమ ♦ మేనేగగ తగదు
అటసంపాతి వచించిన పల్కులు ♦ అవపురిత్త్ర, గాన
ఎటులనైన జానకిని వెదకియే ♦ నేగెద గాకున్న
లంకనెత్తుకుని లవణాబ్ధిని నే ♦ లంగనం బొనర్చి
పెంకెరావణుని రాముని ముంగట ♦ బెట్టెదనని లేచి
ఎదురుగ గనుబడు అశోకవనమున ♦ కేగి సీతనచట
వెదుకజొచ్చె హనుమంతుడు ధృతితో ♦ విధేయజ్ఞుడౌట.
నారికేళ ఖర్జూర జంబు జం ♦ బీర చూతతాళ
నారద శారద పనస నాగపు ♦ న్నాగ కుటజ వకుళ
క్రముక కురంటకకపిద్ధ దాడిమ ♦ కౌశిక చాంపేయ
కుముదశింశుపాశోక పాటలీ ♦ కుందెన హారిప్రియ
బదరీచిఞ్చాకూట శాల్మలీ ♦ మదననక్తమార
విదుల మృదుత్వక్కింగు దీప్రియక ♦ కదర సింధువార
సాలసుపార్శ్వక అమృతాది వృ ♦ క్షంబులతో నిండి
మాలతీ సహామల్లిక సువహా ♦ మరువక మిసిభణ్ణీ
వికసా, కిణిహీ, ప్రత్యక్ఛ్రేణీ ♦ బృహతీ మొదలైన
సకల సుమవనౌషధులతో వెలయుచు ♦ చాషచటకశ్యేన
శుకపికాది పక్షులతోడను మరి ♦ సూకర ఖడ్గహరి
వృకశార్దూల సృగాల శల్యమృగ ♦ ఋక్షప్లవఙ్గకరి

మొదలగు మృగములతోడను యొప్పెడు ♦ తద శోకవనంబు
వెదకుచు కపివరుఁడొక్క శింశుపా ♦ వృక్షలతాగ్రింబు
నెక్కి యాతరువు మూలమునందున ♦ రక్కసాళినడుమ
చెక్కిలి కరమున జేర్చి వగచుచును ♦ చిన్నబోవు వామ
నొక్క తెఱంగని ఆయమ తప్పక ♦ యుర్విజయని యెంచి
అక్కజమున యిట్లని తలపోసెను ♦ ఆమెస్థితిని గాంచి
యీమహిళామణి జానకియే యగు ♦ నెంచి జూడగాను
మామధ్యను బడవైచిన నగలీ ♦ మానినివే యగును
యీమె పుట్టపుచీరంగే యానగ ♦ తెల్లగట్టబడెను
నే మును విన్నట్లున్నది యీసతి ♦ సిక్కంబుగ ధరను
అందచందములు అంగసౌష్టవము ♦ లమరిన సుకుమారి
సందర్శనమున పాపపుంజములు ♦ సమయు నొక్కసారి
ఈయమ కున్సరియగు నారీమణి ♦ ఎచట గానబడదు
బాయగలడె శ్రీరఘురాముండీ ♦ పడతినెపుడు యెందు
పతిని విడువకను వనముల దిరిగిన ♦ పరవర్ణిని యీమె
పతివ్రత, ద్వితీయ; రావణుండుచెర ♦ బట్ట రాముడీమె
కొరకుగదా వధియించె విరాధుని ♦ ఖరదూషణుల నని
స్థిర మొనర్చి రావణుతో జటాయువు ♦ మరణించెను వనిని
నరపతి యీసతికై గద వానర ♦ దొర రవిజునితోడ
పరిచయంబుగనె; వాలిని జంపెను ♦ పంపె నీమెజాడ
నరయగ కపులను నలుదిశలకు యీ ♦ యమసద్గుణశీల
పరమసాధ్వి అనఘవ్రత యివ్విధి ♦ బడుచుండెను శ్రమల
ఎంతటి దుర్దశ జనియించెను యీ ♦ యింతికి రాఘవుని
చెంతనుండి సుఖ మనుభవించుచును ♦ చెలగెడు యీతరుణి
ఉపవాసంబుల గృశియించుచు నిట ♦ యున్నది మృగివలెను
అపశదుడౌ రావణుడు హరింపగ ♦ నలయుచుండె నిటను;

అతివరో సమస్త భోగంబుల నిట ♦ ననుభవింతు వీవు
హితమాలింపుము మాకు నెల్లరకు ♦ ఈశ్వరి వవగలవు
నామనోరథం బీడేర్చెదవని ♦ నమ్మి వచ్చితిపుడు
భామము జెందక ననుగ్రహియింపుము ♦ భామరో దయజూడు
వరదారా గమనంబు ధర్మమగు ♦ పడతీ దనుజులకు
మరులు జెందితిని నినుగని నంతనె ♦ మరుమాటనబోకు"
అట్టుల వదరెడు రావణాసురుని ♦ కడ్డంబుగ సీత
బెట్టుచు నొకతృణ మిట్లనె నీవిక ♦ కట్టిబెట్టు ఘనత
వాచాలత్వము మానుము రావణ ♦ వశ్యమవను నీకు
నీచా ! నీదుర్వృత్తిని విడువుము ♦ నిష్ఫలనంటబోకు
పరభామల నీతల్లులవలె మది ♦ భావించుట యొప్పు
అరిది నాదుపొందెంచకు మది మ ♦ ర్యాదగాదు తప్పు
వెలుతురు సూర్యుని వెన్నెల చంద్రుని ♦ విడువకుండు నటుల
కలయందైనను రాముని విడువను ♦ గావున యోచపల
చిత్త నన్నుకోరకు మా రాముడు ♦ శీఘ్రంబుగవచ్చి
మొత్తి నిన్ను ననుగొనిచను గావున ♦ ముందుగ నన్నిచ్చి
రాముని శరణము వేడిన యాతడు ♦ రక్షించును నిన్ను
కామ ముడుగు మటగాకున్నను నీ ♦ కాయువంత్యమగును
మాతృభావముతో వల్కుచుంటి విను ♦ మాతృఘ్నను విడుమా
పాతుడవై మెలగుము శ్రీరాముని ♦ ప్రాపుగోరి మనుమా
రాముడిచ్చటికి రాగలండు వా ♦ రాశి నింక జేసి
నామానము గాపాడగలడు నిను ♦ నాశనంబు జేసి
నను నీవనరానట్టి వల్కులను ♦ అనుచుంటివి గాన
నినుః నీరుగ జేయగల్గుదును గా ♦ నీ నాపతి యాన
లేదుగాన యిపుడూరకుంటి నో ♦ లింపాకుడ నీతో
వాదమేల నీవెవ్విధమున సరి ♦ వత్తువు రామునితో

మదగజమా శ్రీరఘురాముం డిల ♦ మశకమౌదు వీవు
ఉదారమగు కల్పవృక్షమాతడు ♦ ఉమ్మెత్తవు నీవు
నీదు భాగ్య భోగంబుల గని నే ♦ నీకు వశ్యురాల
నౌదునని యెడి దుర్భ్రాంతిని విడువుము ♦ అరుగుము దుశ్శీల"
అనవిని రోషకషాయిత లోచను ♦ డగుచు రావణుండు
జనకజను వధించెద నని నిస్త్రిం ♦ శంబుదీసి పోడు
గరచుచు కావలివారల కనెనిటు ♦ గడువు నెలలు రెండు
ధరణిజ నాలోపున నెట్లైనను ♦ మరులుగొల్పి తెండు
అప్పటికిని జానకి నొప్పనియెడ ♦ ఆపెను ఖండించి
తప్పక భుజింతునని వెడలెను యా ♦ తావు నవుడె విడిచి.
అంతట నేకజట ప్రఘసా ద్యసు ♦ రాంగన లవనిజను
ఎంతయొ తర్జనభర్జన జేయుచు ♦ పలిక రావణును
వరింప నిర్భందించిన యాయమ ♦ వారల కిట్లనెను
'పరంతపుండగు రాముదక్క నే ♦ పరుల దలపబోను
అటుసూర్యుండిటు ఉదయించిననూ ♦ అబ్ధులు యింకిననూ
కుటిలరావణుని జేరను రాముడు ♦ గూల్చునతని త్వరను
వామపాదమున నైన ముట్ట రా ♦ వణుని నన్ను యేల
బాములబెట్టెద రిట్టుల మీ దు ♦ ర్భాషలు వినజాల"
నావిని వికట అజాముఖులను దా ♦ నవాంగనలు మరల
ఏవగించి బాధింపగ జానకి ♦ ఎదబడి మదిచాల
చింతించుచు గన్నుల నీర్గార్చుచు ♦ శింశుపలత బట్టి
అంతమ మగుటయె యుత్తమమని మెడ ♦ కుంతలములజుట్టి
ఇట్టుల విలపింపంగదొడంగెను ♦ "ఇనకులాబ్ధిచంద్ర
ఎట్టులబోయితివో వేరెదిక్కు నా ♦ కెవరు రాఘవేంద్ర
చిక్కితినే నీరక్కసనాథుని ♦ చేతుల నీవెటుల
ఇక్కడికరిగెద వెవ్వరివల్ల నీ ♦ వెరుగుదు వీగోల

నాజాడను నీవెరుగనైతివో ♦ నన్ను మరచినావో?
ఆజటాయువట జెప్పగలేదా ♦ ఆగ్రహించినావో?
అంబుధి దాటగ లేకపోతివో ♦ అయోధ్య కరిగితివో?
అంబరీషమున రావణుగ్రమించగ ♦ నాలసించినావో?
అయయో నేనీరక్కస బాధల ♦ ననుభవింపజాల
దయగొని ననుగాపొమ్ము రాఘవా ♦ తడవుజేయనేల!
రామా నిన్నెడబాసి బ్రతుక నే ♦ రను ననుకరుణించి
సౌమిత్రితో జనుదెంచి బ్రోవవే ♦ జలధిని లంఘించి
ఎక్కడిరాముం డెక్కడిలోకము ♦ ఏమిజేతు నకటా!
దిక్కులేక నే జావవలయునా ♦ దీననగుచు నిచట?”
అని పరిపరివిధముల బొక్కెడు సమ ♦ యంబునందు త్రిజట,
దనుజ విభునితమ్ముండు విభీషణు ♦ తనయ వడిగనచట
కరుదెంచుచు నక్కావలి వారల ♦ కనె నిటుజానకిని
వరుసములాడకు డాయమకరుణకు ♦ పాత్రులగుదు గాని
ఆ యమవల్లనె లంకనాశనం ♦ బగునేమన యిపుడు
కాయమెల్ల కంపింపగ నేనొక ♦ కలగంటిని వినుడు
శుభాశుభ మిళితమై యుండెను యది ♦ శుభము రాఘవులకు
అథమగు మనరావణునకు లంకకు ♦ అవసానము మనకు
రామలక్ష్మణులు అంతరిక్ష మా ♦ ర్గంబుగ లంకజని
భూమిజతో ద్విరథంబునెక్కి యుట ♦ పొలయుట జూచితిని
ఆముప్ప రెనిమిది మొద్దులుగట్టిన ♦ అరదం బెక్కుటయు
భూమిజ రామాంకంబునుండి ఇన ♦ సోముల ముట్టుటయు
ముగురు పుష్పకంబెక్కి యుత్తరం ♦ బున కరుదెంచుటయు
అగబడె నాకాస్వప్నము నందున ♦ అంతేగాక మరియు
రావణానుజుడు రక్తమాల్యా వ ♦ స్త్రంబుల ధరియించి
ద్రావుచు తైలము యామ్యదిశకు గ ♦ ర్థభము నధిష్ఠించి

బోవుచుండుటయు మరియాతడు తన ♦ పుష్పకంబునుండి
జీవను ద్రోయగబడి నటనొకసతి ♦ చేతను యీడ్వబడి
అవాచికిం గొనిపోవబడుటయును ♦ అవలోకించితిని
అవమానితుడౌ కుంభకర్ణుడుం ♦ యటులనె జూచితిని.
కుంభకర్ణుడుపుత్రింబు, రావణుడు ♦ కోల మింద్రజిత్తు
కుంభీరంబును యెక్కి యామ్యమున ♦ గ్రుమ్మరిలు విపత్తు
కలగాంచితినో చెలులారా యది ♦ గాక యునుకులెల్ల
రలము కొనుచు తైలంబును పంకము ♦ యామ్యమరిగి నటుల
కడగి మర్కటంబొం డీలంకను ♦ గాల్చినట్లు గంటి
కడలియందు మనలంక పెల్లగిలి ♦ బడినటు గనుకొంటి
విభీషణుడుఛత్రధరుండై యొక ♦ వెల్ల గజంబెక్కి
విభవంబుల నోలలాడ గంటిని ♦ విజయము జానకికి
వాకులేల రాక్షసకుల నాశము ♦ వచ్చెను గన్గొనుడు
నాకలనిక్క మమోఘము దానిని ♦ నమ్మిన నమ్మెండు
సీతాదేవిని శ్రమలను బెట్టిన ♦ చేటుగల్గు మనకు
నీతిగల్గియుండుండున వాఱలు ♦ నిర్వైరబడి తమకు
ఏమిముప్పు వాటిల నున్నదోయని ♦ యెంచుచు నిద్రించె
భూమిజ వామభుజాకువనయనం ♦ బులు నదరగ జొచ్చె.
ఇట్టిశుభ నిమిత్తంబులు జానకి ♦ ఎన్నియొగనె గాని
కట్టడి రావణుడామెను బెట్టెడు ♦ కలతలు దలచుకొని
చింతించుచు తన కాత్మహత్యయే ♦ శ్రేష్ఠమనుచు నెంచి
కుంతలములచే బిగింపజొచ్చెను ♦ కుత్తుక, యదిగాంచి
హనుమంతుండా యశోకవృక్షము ♦ యందుననే నిలిచి
జనకజకు స్వనవృత్తాంతంబును ♦ వినిపింపగ దలచి
ఎదురుగనేగిన తన్నుదనుజుసిగ ♦ నెంచు ననెడభీతి
స్పదకంబుగ శ్రీరాముని చరితము ♦ బాడెను యీరీతి.

ధరనయోధ్యయనగల దద్దానికి ♦ దశరథుండు రేడు
బరగ నల్గురు కుమారు లాతనికి ♦ ప్రథముడు రాముండు
రాముడు జగదభిరాముడు సద్గుణ ♦ ధాము డమితయశుడు
కామితవరదుడు కామశతాంగుడు ♦ కారుణ్యాకరుడు
భీమపరాక్రము డనఘుం డినకుల ♦ సోము డుదారుండు
ఆమహనీయుని గుణమెన్నగ నజు ♦ డైనదగడు యతడు
కౌశికుయజ్ఞము రక్షించి యహ ♦ ల్యాశాపము దీర్చె
ఈశునిచాపము విరచి జానకిని ♦ ఇంతిగ గ్రహియించె
పితరునాజ్ఞ విపినంబున కున్నన ♦ ప్రియానుజులతోడ
చతుర్దశాబ్దంబులు గడుపగజని ♦ శౌర్యం బుట్టిపడ
విరాధ ఖరదూషణాదులను జం ♦ పి పర్ణకుటినుండ
ధరణిజ నెత్తుకబోయె రావణుడు ♦ ధవు డటలేకుండ
అంతరాఘవుడు జటాయువుచె య ♦ య్యవనిజ జాడవిని
చింతించుచు ఋశ్యమూకనగమును ♦ జేరి నచట నగ్ని
సాక్షిగ వానరపతి సుగ్రీవుని ♦ సఖ్యముగావించి
అక్షోణిజను న్వెదుకబంపె నను ♦ అటవాలిని ద్రుంచి
రామలక్ష్మణులు జానకికై యా ♦ క్రందించుచు నచట
క్షేమముగనుయున్నారు నేను గాం ♦ చితి సీతను నిచట
రామ రామ శ్రీసీతారామా ♦ రామా రఘురామా
రామా రవికులసోమా తారక ♦ నామా శ్రీరామా
అని మాటాడకయుండిన జానకి ♦ అటునిటు వీక్షించి
హనుమంతుని యా తరుశాఖల నడు ♦ మను యవలోకించి
కనినది వినినది కలయని భ్రమించి ♦ కలవరబడుచుండ
అనిలజు డవనిజకడ దిగి ముకుళిత ♦ హస్తంబులతోడ
అనెనిటు తల్లి కన్నులనీరిడి ♦ యడలుచుంటివేల
జననీ నీనామంబెరిగింపుము ♦ సంతసింతు చాల

ఎవరవీవు వనరాణివో ! వాణివో ! ♦ ఇందిరవో ! యుమవో !
దివస్పతి సతివో ! యే దేవతవో ! ♦ దివాంగనా మణివో !
అబ్జుని నెడబాసిన రోహిణివో ! ♦ అరుంధతీ సతివో !
అబ్జపత్రిలోచనీ ! దెలుపునీ ♦ వవనిని యెవ్వతెవో ?
కతమేమగు నీవొంటిగ నిచ్చట ♦ కాలము గడుపుటకు
పతిని బాసి శోకాబ్ధిని మునిగిన ♦ భాతి దోచె నాకు
దశరథాత్మజుల మోసగించి యట ♦ దండకవనమందా
దశకంఠుం డెత్తుకొని వచ్చిన సీ ♦ తమ్మవు గావుగదా?
అనవిని జానకి హనుమంతున కనె ♦ అగుదు నేను సీత
"జనకనృపాలుండే నాజనకుడు ♦ క్షమయె నాకుమాత
మరది లక్ష్మణుడు మామ దశరథుడు ♦ మగడు రాఘవుండు
ధరను నయోధ్యాపురము కాపురము ♦ తండ్రియాన విభుడు
సౌమిత్రియు నే వెంటనంటిరా ♦ జనెను విపినమునకు
మేమట పంచవటీతటమందున ♦ మెలగుచుండ నటకు
దశరథాత్మజులు యింటలేనియెడ ♦ తపసివేషమూని
దశకంఠుడు నన్నెత్తుకొని వచ్చెను ♦ తగనితలంపుగొని
తదాది నను పలుశ్రిమలను బెట్టుచు ♦ తనకు నశ్యనవగ
బెదరింపుచునున్నాడు ఇకను అను ♦ వది దినములు కాగ
పరాసనంబొనరించును నను లో ♦ బడకుండిన యెడల
మరణము నిశ్చయమిక నాకన" హను ♦ మంతుండనె నిటుల
ఏను రామదూతను హనుమంతుడ ♦ ఇనజుని సచివుండ
మానవనాథుండగు శ్రీరాముడు ♦ మర్కటవిభు దండ
అనుజునితో ప్రస్రవణాద్రిని సుఖ ♦ మైయున్నాడచట
జనని ! నిన్నరయ బంపెను రాముడు ♦ విని నీవిటనుంట
రామలక్ష్మణులు నీదు కుశల మా ♦ రసి రమ్మనెనన్ను
రామాదులకు న్విన్నవింతు నీ ♦ క్షేమము త్వరలోను

అనుచు పవనజుం డాయమసన్నిధి ♦ కడుగు లిడుచునుండ
జనకజ యాకపి రావణుడేయను ♦ సంశయంబుతోడ
అనెనిటు "యోరీరావణ ! కపివలె ♦ అరుగుదెంచినావా ?
దనుజాధమ కామరూపివై నను ♦ తటమట యొనర్తువా ?
ఈవునిజంబుగ రామదూతవన ♦ యేమినిదర్శనము
ఆవనచరపతికిని రామున కె ♦ ట్లయ్యె చెలిమి రాము
యుపయనలక్షణముల దెల్పుము నే ♦ నవుడు నమ్మెద"నన
పవనసుతుడు, శ్రీరామలక్ష్మణుల ♦ బలవిక్రమ సుగుణ
వయోరూపలావణ్యము లనువుగ ♦ వర్ణించుచు వెనుక
అయోనిజనుగానక రాఘవులట ♦ అటవినెల్ల వెతుక
జటాయు వగుబడుటయును జానకీ ♦ జాడను దెలుపుటయు,
అటనము జేయుచు వారు ఋశ్యమూ ♦ కాద్రికి నరుగుటయు,
సవితాసుతుడును శ్రీరాముండును ♦ సఖ్యము నొందుటయు,
అవనిజసొమ్ములమూట రాఘవుల ♦ కవిజుం డిచ్చుటయు,
వాలి నొక్కకోలను శ్రీరాముడు ♦ వధించి కిష్కింధా
పాలన సుగ్రీవునకు గట్టుటయు ♦ పలువానరులను దా
త్రాయణికంతయు సీతాన్వేషణ ♦ కై పంపించుటయు,
తోయధిలంఘించుచు తాలంకను ♦ దోరిచి వచ్చుటయు,
మొదలగు రామునివృత్తాంతం బా ♦ మూలము వినిపించి
పిదప రాఘవుండొసగిన ముద్రిక ♦ పృథ్విజ కర్పించి
అనెనిటు తల్లీ ! రాముడొసగె నిది ♦ యానవాలునీకు
ననునమ్ముము రామునిదూతగ న ♦ న్యునిగ దలపబోకు
నావిని జానకి ముద్రికగొని నయ ♦ నంబుల కద్దుకొని
జీవితేశుని జూచినవిధమున ♦ జెంది ముదము కపిని
వేవేవిధముల గొనియాడుచు తన ♦ విభు డంతటివరకు
రావణువధగావించి తన్నుగొని ♦ పోవక యుండుటకు

పరిపరివిధముల వగవ నామెకనె ♦ పవనజుడిటు జననీ !
"దురపిల్లకు వడివచ్చి రాఘవుడు ♦ దునుమడె ? రావణుని
తల్లి నీకష్టంబులు దీరును ♦ త్వరలో, రాఘవుడు
ఎల్లవేళలను నిన్ను దలచుకొని ♦ ఏకరుచున్నాడు
నిన్ను వెతకి గొనిపోవనాత్రిబడు ♦ చున్నవాడతండు
విన్నవింతునీజాడ వడిగ యది ♦ విన్న వచ్చునతడు
నీవిభుండు వచ్చెడివరకును యిట ♦ నిలువజాలవేని
నావెన్నెక్కి-న నిన్గొనిచనియెద ♦ నాథుకడకు జననీ !"
అనుటయు జానకి యాతడు సూక్ష్మం ♦ బగు రూపముతోడ
తన నెటుగొనిపోవగునను సంశయ ♦ మును దెల్పుచు జూడ
భీకరరూపముదాల్చి పవనజుడు ♦ పృథ్విజ యభ్రిబడ
ఆకశమంటగ బెరుగ నామె యి ♦ ట్లనె మారుతితోడ
మరుత్సుతా నీవెంతటికైన స ♦ మర్థుడవేగాని
అరుగనొల్ల నీతోడ రాముకడ ♦ కదేమందువేని
నీవునన్నుగొని శరధిదాటునెడ ♦ నిశాచరులు జూచి
రావణుతో దెల్పిన తప్పక సమ ♦ రంబగు నటమించి
నిరాయుధుండవు నను మాపునగొని ♦ దుర మొనర్పలేవు
శరధిని నేబడవచ్చు జారి యొక ♦ సమయమందు నీవు
అవజయ మొందినచో నీయత్నము ♦ విఫలమగునుగాన
కపివర నేనన్యులతో వచ్చుట ♦ కన్నను ఆవెనుక
వనధిదాటి శ్రీరాము డరిగి రా ♦ వణుని దునిమించి నన్ను
గొనిపోవుట ధర్మంబును యశమును ♦ కులగౌరవమున్ను
గావున నీవా రామలక్ష్మణుల ♦ కడకు వడిగ నేగి
రావణు వధించి ననుగొనిపోవగ ♦ రం డెల్లరుసాగి.
నాదు పరిణతులను దెల్పి కపివరా ♦ నాథుని దోడ్తెమ్ము
ఆదదీర్చి నన్నాదరింపుమని ♦ యర్థించితి ననుము.

అన ననిలజుడని ఇట్లమ్మా ఇ ♦ మ్మానవాలు యొకటి
నిను జూచిన గుర్తుగ విభుకొసగెద ♦ నీరధి వడిదాటి
నావిభు జానకియనె నిట్టుల వా ♦ నరోత్తమా వినుమా
నావిభునకు కాకాసురకథ యమా ♦ నవాలుగా చెపుమా
మున్నొకతరి కాకాసురు డనియెడు ♦ పురంధరుని సుతుడు
నన్నుగాయబరచెను నావక్షము ♦ తన్ని గోటయపుడు
రాముడలిగి యొకకుశమున బ్రహ్మా ♦ స్త్రం బభిమంత్రించి
ఆమాకలిపై విడిచిన యదది వా ♦ యసమును హింసించి
వెంటాడగనది ముజ్జగములుజని ♦ వేరుదిక్కులేక
తొంటిరాము నేశరణము వేడగ ♦ దొరగి రాముడలుక
కాకాసురుని న్బ్రోచె శరముకొక ♦ కంటిని యిప్పించి
కాక, నొక్కతరి నాదునుదుటి తిల ♦ కంబుమాయ గాంచి
నాథుడు మణిశిల బొట్టుగ జేయుచు ♦ నాకెదురుగ బెట్టి
గోధిపైన ప్రతిఫలింపచేసెను ♦ గుఱుతను మిదియొకటి
ఈచూడామణిగొని నావిభునకు ♦ ఇమ్ము యానవాలు
నాచెఱ విడిపింపుమను మనవను వా ♦ నరవర నీమేలు
నేనొకమాసము కన్నబ్రతుకనని ♦ నానాథునితోడ
ఆనతిచ్చి వడి లంకకు రమ్మన ♦ మను ననుగాపాడ"
అనిన న్మారుతి యిట్లనిబల్కెను ♦ అమ్మా ననుగేరు
ఘన బల విక్రమ యుతులగువారలు ♦ కపులెందరొగలరు
అట్టి వలీముఖ భల్లంబులతో ♦ అవిజుడురాగలడు
బట్టు మోపి కొకమాసములోపునె ♦ వచ్చును రాఘవుడు
జననీ ! మోపునగొనివచ్చెద దా ♦ శరథుల త్వరలోన
అనుజ్ఞనొసగుము పోయెద నబ్ధికి ♦ నావలితీరమున
కాచుకుయుందురు నాతోవచ్చిన ♦ కపు లాతుత్రతతోడ
నేచనిమొదనని కదలి, తలచెనిటు ♦ నేలచూలి జాడ

అరసితిగానీ మ్రుచ్చుపగిది నే ♦ నరుగ భావ్యమగునే ?
సురద్విషేశుని చూడకుండ జన ♦ శూరధర్మమగునే ?
సీతాన్వేషణతో నాదూత్యము ♦ నెంచునె సమాప్తము ?
ఆతని బలాబలంబులు, హృదయము ♦ నరయుట యుత్తమము
నిశాచరుండలుగగ జేసెదనే ♦ నేర మొకటి యనుచు
అశోకవనమును ధ్వంస మొనర్చెను ♦ అసురు లద్దిగనుచు
ధరణిజాతవలనను యాకపి వృ ♦ త్తాంత మరయ లేక
బిగబిర రావణుకడకుంజని విని ♦ పించి రిటుల నొక్క-
వానరంబు, వైశ్రవణుని భటుడో ♦ వాసవు పరిచరుడో !
జానకినరయగ వచ్చిన రాముని ♦ సందేశహరుండో !
వచ్చి యశోకవనంబు జొచ్చి యట ♦ వైదేహిని గాంచి
ముచ్చటించి యేమేమొ రహస్యము ♦ మచ్చరంబు మించి,
ధరణిజ గూర్చునియుండిన శింశుప ♦ దక్క- తద్వనంబు
పొరిగొనె తరుగుల్మలతాదులతో ♦ పోయి తక్షణంబు
వానరమును బంధింపుండాతని ♦ వైనము యొక్కింత
జానకి దెలుపకయుండె ననని శా ♦ చర విభుడత్యంత
క్రోధోద్దీపితుడై వెనువెంటనె ♦ కోతిని బట్టుటకు
యోధుల నెనుబదివేల దానవుల ♦ నొకటబంపె నటకు.
వారలు సకలాయుధములతో తన ♦ వద్ద కరుగగాంచి
మారుతి బొబ్బలనిడుచును యాగ్రహ ♦ మంది తోక బెంచి
వచ్చినదనుజుల మచ్చమూపి యిటు ♦ వచించుచును నిలచె
‘ముచ్చుగాను నేహనుమంతుడ రా ♦ ముడు ననుబంపించె
అయోనిజన్గన వచ్చినాడ లవ ♦ ణాబ్ధి దాటియిటకు
జయమగు సీతారాఘవులకు నిక ♦ చావు రావణునకు;
కింకరుడను శ్రీరామునకు నిక్కి- ♦ ష్కిందావాసుడను
లంక నెత్తుకొని బోయి ముంచెదను ♦ లవణసాంద్రమునను.

వానరపతి సుగ్రీవుని సచివుడ ♦ వాయువు తనయుండ
వానరకోట్లతో రామలక్ష్మణులు ♦ వత్తురు మిము చెండ
ఏనొక్కడనే జాలుదు రావణ ♦ నీల్గజేతు వినుము
వానరులెందరొ గలరింకను నా ♦ వంటివారు కోట్లు.
నావిని చావగ మిగిలియున్న దా ♦ నవులు వడిగనేగి
రావణునకు యిది దెల్పిన యాతడు ♦ రౌద్రంబున రేగి
ప్రహస్తసుతుడగు జంబుమాలిని ♦ న్బంపిన యాతండు
ప్రహరణాయుతుండై వచ్చె నింతలో ♦ పవనకుమారుండు
కులదేవాలయ ప్రాసాదంబును ♦ గూల్చి నందలి కా
వలివారల నూర్గుర నొక్కుమ్మడి ♦ వధించి నిశ్శంక
తోరణ స్తంభంబెక్కి నిలచె నం ♦ తటను జంబుమాలి
మారుతిపై బాణంబులు విడిచిన ♦ మరుత్సుతుడు కనలి
ప్రళయకాల రుద్రుండన నాతని ♦ పైని శిలలు వైచె
కళుకొనర్చె నవ్వానిని దనుజుడు ♦ ఖగ పరంపరలచే;
పవనజుడంతట జంబుమాలితో ♦ పరిఘముచే బూని
ప్రవిదారణమొనరించి కూల్చెనొక ♦ ప్రహారంబున నతని
అదివిని రావణుడలిగి ఏడ్గురను ♦ ఆమాత్యుని సుతుల
సదాగతజు బంధింపగ బంపిన ♦ శరచాపేషుధుల
గొనివారలు చతురంగబలంబుల ♦ గూడి కపినిడాయ
జని యాతనిపై నొక్కుమ్మడిగా ♦ సాయకముల నేయ
వాతాత్మజు డతిక్రుద్ధుండై తన ♦ వాల మెదుగజేసి
ఆతూపుల నన్నింటి ద్రుంచి వడి ♦ యాకసమున కెగసి
వారలపై శైలమువలె నురుకగ ♦ వారలేడ్గు రరద
వారణవాజి పదాతులతోడను ♦ బడి ధారణిమీద
మడసి రద్దివిని రావణుండు తన ♦ మనమున దిగులొంది
అడలుచు ఆకపి బలవిక్రమముల ♦ కాశ్చర్యము జెంది

శ్వాసనాత్మజుని బట్టగ నేవురు ♦ వాహినీశ్వరులను
భాసకర్ణ ప్రఘస విరూపాక్ష యు ♦ పాక్షదుర్ధరులను
బంపుచు చతురంగ బలంబులతో ♦ పలికె వారి కిటుల
'తెంపరియగు యీకపి యెవ్వండో ♦ తెలియకుండె శూల
పాణిబంపెనో ? కేశవుడంపెనొ ♦ వజ్రి బంపినాడో ?
వాణీశుడు బంపించినాడో యీ ♦ వరుణు డంపినాడో ?
యము డంపించెనొ ? యక్షు డంపెనో ♦ యీత డమితబలుడు !
సమర మొనర్పగ బొండువడిగ కీ ♦ శమునుబట్టి తెండు.
నావిని పడవాలు రేవురును వా ♦ నర వరునిం డాసి
ఆవేశముతో శరములనేసిన ♦ హనుమంతుడు గినిసి
ఆశుగముల తుత్తునియ లొనర్చుచు ♦ నాకశమున కెగసి
ఆశరాళిపై దుమికి వారి ర ♦ థ్యంబు నుగ్గుజేసి
కరులతొ కరులను భటులతొ భటులను ♦ తురగంబులతోడ
తురగంబుల గొట్టుచు పడవాలుర ♦ దోర్చె నసురులోడ.
హతశేషులచే తద్విషయము విని ♦ అలిగి రావణుండు
సుతకనిష్ఠు నక్షుని బంపించిన ♦ ధృతితో యీతండు
శరచాపాది ప్రహరణములతో ♦ అరద మధిష్టించి
దుర మొనర్పగా బోయెను హనుమం ♦ తునితో, గర్వించి
అక్షుడంత నాగ్రహచిత్తుండై ♦ అస్త్రత్రయము గొని
వృక్షచరుని శిరమందున నాటగ ♦ వేసె వింటబూని
దాన వానరుడు ప్రీతితుండగుచు ♦ తలపడిపోరునకు
దానవుతో నొనరించె ఘోర ప్రవి ♦ దారణ మందులకు
ధరణివడకె, గ్రహములు తమపథములు ♦ తప్పె దిశలు నదిరె
శరధికలంగెను, మొగ్గె దిక్కరుల్ ♦ సురాసురులు బెదరె
చతురంగ బలంబులు నుగ్గయ్యెను ♦ శవజాలముతోడ
క్షతజమాజిరంగంబు నెల్లెడల ♦ క్షరణ మొందెజూడ.

ఇరువురిటుల పోరెడు సమయంబున ♦ ఇషువుల నక్షుండు
బరపి కపిని గాయం బొనరించిన ♦ పవమానసుతుండు
అక్షుల నిప్పులురాల మండిపడి ♦ ఆకశమున కెగసి
అక్షునిపై లంఘించుచు యాతని ♦ అంఘ్రిద్వయము మొడిసి
బట్టి భూమిపైగొట్టిన యక్షుడు ♦ ప్రాణంబులు వదలె
చెట్టుదిమ్మ రంతటను తోరణము ♦ జేరె నెప్పటివలె.
పిన్నకుమారుని మరణంబును విని ♦ పెద్దగ దుఃఖించి
కన్నుల నిప్పులురాల రావణుడు ♦ కరము నాగ్రహించి
పెద్దకుమారుం డింద్రజిత్తుని ♦ న్పిలచి బలికె నిటుల
"హద్దుమీరి యొక పెద్దకోతి మన ♦ యశోకవనమెల్ల
చెరచి, జంబుమాలి నిస్సంహరిం ♦ చి మంత్రితనయులను
బరిమార్చెను యాపిదప సాహినీ ♦ పతుల నైదుగురను,
అక్షుని వారలసైన్యంబులనూ ♦ అంతమొనర్చె విను
ముత్తాలముగా దోచదు యాతని ♦ యుక్కు జూడగాను
కపులననేకము జూచియుంటినే ♦ గాని యిట్టివాని
నెపుడు జూడకుంటిని యాతండిల ♦ యెవ్వండోగాని
గరుడానిల సమవేగుండాతడు ♦ ఘనపరాక్రముండు
పరబలమును తనబలమును యారసి ♦ ప్రవర్తించువాడు
ఆవానరుడెవ్వరికిని జిక్కడు ♦ అమిత బలుండతడు
నీవు తపోబలసంపన్నుండవు ♦ నీకే సాధ్యుండు
నాతో సముడవు నిర్జరారివియు ♦ నీతి కోవిదుడవు
ధాతవరంబుల చేతను భువి వి ♦ ఖ్యాతి బడసినావు
గాన నీవు ఘన అస్త్ర శస్త్రముల ♦ గరిమం బగు బరచి
వానరాధమును బట్టి తెమ్మ"నిన ♦ వల్లెయనుచు లేచి
జనకుని కెఱగుచు నింద్రజిత్తువడి ♦ సాయుధుడై కపితో
అనిని సల్పగా జనియె నుగ్రుడై ♦ అరదంబున ధృతితో.

అటులవచ్చు యామేఘ నాధుగని ♦ హనుమంతుడు లేచి
పటపట పండ్లనుగొరికి బొబ్బలిడి ♦ ప్రధన భూమిజొచ్చి
దనుజు నెదురొల్కన యాతండిషువులు ♦ వనచరుపై నేసె;
అనిలజుండు విశిఖంబుల దప్పించుచు ♦ ఆకశమున కెగసె;
మేఘనాధు డంతటికో విడువక ♦ మింట కపిని మార్గ
ణోఘముచే నొప్పింపగ మారుతి ♦ యొనర్చినవి పోడిగ
ఒకరి ఛిద్రమొకరెరుగక నిర్వురు ♦ యుత్సాహము మీరి
ప్రకట మవగ తమ బలవిక్రమములు ♦ ప్రధనం బొనర్చిరి
ఇటుల పోరుఘోరంబవ నలయుచు ♦ ఇంద్రజిత్తు కపిని
ఎటుల జయింపగనగునో యని మది ♦ నెంచి ధైర్యమూని
వింటను బ్రహ్మాస్త్రంబుగూర్చి కపి ♦ వీరునిపై నేయ
మంటలు గ్రక్కుచు నయ్యది వెలువడి ♦ మారుతినిం డాయ
నిరోధింపకుండెను దానిని వా ♦ నరవరుడు, విరించి
వరమున తనకాశర యుపద్రవము ♦ పాటిలదని యెంచి
అనిలజు డంతట బ్రహ్మాస్త్ర మహా ♦ త్మ్యంబున మూర్ఛబడి
అవన్త కొరిగిన యింద్రజిత్తు తన ♦ అనుచరులంగూడి
వానరమును వడిగొనిపోయెను రా ♦ వణుని కడకు నంత
వానరవరుండు తెల్విగాంచి యా ♦ దానవిభుచెంత
పండ్లికిలించుచు నిల్వ రావణుడు ♦ ప్లవగంబును గాంచి
కండ్ల నగ్నికణముల గురియుచు యా ♦ గ్రహుడై యోచించి,
ప్రహస్తు ముఖమున తనవైనంబును ♦ ప్రశ్నింపగ నిటుల
గ్రహ మొనర్చె మారుతి రావణుతో ♦ "గ్రహింపు మే ననిల
తనయుడ, సుగ్రీవుని సచివుడ దూ ♦ తను శ్రీరామునకు
హనుమంతుడ, వానరుడ, జానకిని ♦ గనవచ్చితి నిటకు
నినుజూచెడి తలపున నీయశోక ♦వనమెల్లనుదుంచి
దనుజాళిని సంహారించి బ్రహ్మ ♦ స్త్రమునకు దలవంచి

పట్టుబడితి నీకగుబడిపోవుట ♦ భావ్యంబని యెంచి
ఇట్టితరిని నీకొక్క-హితంబును ♦ యెరిగించుట మంచి.
జనకునాజ్ఞచే శ్రీరాముడు ల ♦ క్ష్మణ మహిజలతోడ
వనాగమనుడై పంచవటంబున ♦ వాస మొనర్చునెడ
ఈవు దెచ్చితివి సీతను రాఘవు ♦ లింట లేనియపుడు
ఆవల రాఘవుడావెను వెదకుచు ♦ అధ్వమధ్యమందు
అవిజానితో నగ్నిసాక్షిగా స ♦ ఖ్యతను బడసినాడు
అవనిజనుం వెతుకంగ నన్నిటకు ♦ అంపినాడు యిపుడు
రాముం డవిజాంగదాదులతో నిట ♦ రానైయున్నాడు
ఆమహనీయునితో వైరంబిల ♦ అనర్థకం బెపుడు
కలనైనను నినువిడువడు రాముడు ♦ ఖలమొనర్చితీవు
తెలిసియో తెలియకనో వైదేహిని ♦ దెచ్చి యుంచినావు
రాముని కవనిజ నర్పించుట ధ ♦ ర్మంబు గానీవు
భూమిజనుంగొని రామునకర్పిం ♦ పుము ధర బ్రతికెదవు
అవనిజ నీపాలిటి మృత్యువయని ♦ అరయనైతి వేలా ?
వివేకివై యిపుడైనను యాపెను ♦ విడువు మసురపాలా !
రాముడు నరుడని తలపకు యాతడు ♦ రమావిభుడు ఘనుడు
రాముని గెల్వగలే రజరుద్రేం ♦ ద్రాదులైన యతడు
శరధినినిను మునుముంచిన వాలిని ♦ శరమొక్కటి దునిమె
ఖరదూషణాదులను యొక్కండై ♦ కలిని సంహరించె
సాగరస ప్తక మింక జేయగల ♦ సామర్థ్యండతడు
రాగలండు నీవెచ్చటదాగిన ♦ రణమున నినుచెండు
నేనొక్క డజాటుడు రావణ ని ♦ న్నిల్లజేయగాను
ఐనను హితంబువచింప వచ్చితి ♦ నదివినుము భువిని మను."
అనవిని రావణు డచ్చలమొందుచు ♦ నామాత్యుల బిలచి
వనచరుని వ్యధియింపుమన విభీ ♦ షణుడు యడ్డువచ్చి

దూతగవచ్చిన వానిని జంపుట ♦ నీతిగా దటంచు
కోతిని వికలాంగుని జేయుటయే ♦ కుదుకనగోలనుచు
నచ్చెప్ప విని రావణుండు వా ♦ నర లూమము గాల్చి
రచ్చను ద్రిప్పుండని వాక్రుచ్చెను ♦ రక్కసులను బిల్చి
అంతరక్కసులు కోకలు తైలము ♦ నందున ముంచి హను
మంతుని తోకకుజుట్టి యగ్నినిడి ♦ మంటలెగయగాను
ఆతనిపురవీధులలో ద్రిప్పుచు ♦ నదలింపగ చాల
సీతాసతి యదివిని ప్రార్థించెను ♦ వీతిహోత్రు నిటుల
"ఏనుపతివ్రత నైతినేని నా ♦ యేలిక రాఘవుడు
ఐన నేకపత్నీవ్రతుడును స ♦ త్యసంధుడును యెపుడు
హనుమంతుని యెడ చల్లనివాడవు ♦ అగు మనలా ! యిపుడు"
అనుటయు పావకుడల్లే చల్లన ♦ మైన పవనుజుండు
అనలుండట్టుల తనయెడ చల్లన ♦ యగుటకు వింతబడి
ఇనకులేశు మహిమంబిది యని మది ♦ యెంచి రాముబొగడి,
తన వాలానలమున లంకాపురి ♦ తగులబెట్టనెంచి
తనతో వచ్చిన దనుజుల విదల్చి ♦ తటుకున లంఘించి
పండ్లికిలించుచు తన దువాలమటు ♦ ప్రజ్వలించుచుండ
నిండ్లపైకి నెగయుచును విభీషణు ♦ నిల్లుముట్టకుండ
ప్రహస్త ధూమ్రాక్షతికాయ విరూ ♦ పాక్షకుంభకర్ణ
మహాపార్శ్వ శుకసారణరావణ ♦ మత్తు హ్రస్వకర్ణ
రోమసేంద్రజిత్యాది దానవుల ♦ ధామము లంటించి
సామజ తురగ రథాది శాలలను ♦ జ్వాలనున కర్పించి
వనములు, వాడలు, ప్రాసాదంబులు ♦ వహ్నికి భక్ష్యమవ,
అనిలు డగ్నిహోత్రునకు సాయుడై ♦ అధికంబుగ వీవ,
భగభగమనుజ్వాలలు మిన్నంటగ ♦ బర్వగమిణుగురులు,
పొగలుసెగలు నెల్లెడలు నలముకొని ♦ పొగలగ దానవులు

దురపిల్లుచు రాక్షసులెల్లరు పలు ♦ తోవల పరుగులిడ
సురకిన్నర కింపురషాదులు దివి ♦ చోద్యంబుగజూడ
లంకాదహనం బొనర్చి, వాలము ♦ లవణాబ్ధినిముంచి
శంకింపగదొడగెను యిట్లనిమది ♦ జనకజను గురించి
అయయో కడుయవివేకుడనై నే ♦ నంటించితి లంక,
అయోనిజయు దగ్ధంబవకుండునె ♦ యగ్ని కాకతాక,
రామలక్ష్మణుల కేమనిదెల్పుదు ♦ భూమిజాత జాడ
ఏమొగమున కిష్కింధకు జనియెద ♦ నినజాదులజాడ
కోతిబుద్ధిచే దహనమొనర్చితి ♦ కూడునె కోపంబు
సీతలేక సర్వమువ్యర్థము గద ♦ చెడెనా దూత్యంబు
జానకి చిచ్చునజచ్చె ననగవిని ♦ చావరె యెల్లరును
నేనేజచ్చిన యుత్తమ మిత్తరి ♦ నీరధి బడియెదను"
అని దిగులొందుచు హనుమంతుడు దివి ♦ న్గగెను చారణులు
జనకజ క్షేమంబుగయున్నది యను ♦ కొనియెను వాక్యములు
విని, జానకికడ కరిగి యెఱిగి యా ♦ పె యనుజ్ఞను వడసి
వనధికాటి యవ్వల యంగద జాం ♦ బవదాదుల గలసి;
తానబ్ధిని లంఘించి లంకజని ♦ ధరణిజనుం గాంచి
దానవులను సంహారించి లంకను ♦ దగ్ధంబొనరించి
ఉదధి మరల లంఘించి వచ్చుటయను ♦ మొదలగు విషయములు
వదకముగను విపులంబుగ దెలిపెను ♦ ప్రస్తుతింప కపులు.
అంతటనెల్లరు రాముకడకుజన ♦ యుచ్చోటనుబాసి
అంతరిక్షమునబోవుచు మధువన ♦ మర్గి యందువిడిసి,
అంగదాజ్ఞగొని ఫలములు దేనియ ♦ లారగించి, మసగి,
భంగమొనర్పగజొచ్చిరి వనమును ♦ ప్రమత్తతను గలిగి
వనపాలకు లదిగనుగొని యడ్డుగ ♦ వచ్చిన వారలను
హనుమంతుడు మర్దించి, కపుల దిన ♦ మనియెను ఫలములను.

అదిగని తద్వనమునకు రక్షకుం ♦ డైన దధిముఖుండు
అదలింపగ జనుదెంచిన, నాగ్రహ ♦ మంది యంగదుండు
దధిముఖుని న్ద్రావమోద చేయాతడు ♦ ధరణి బడుచు లేచి
పరిధావించి సుగ్రీవున కనెనిటు ♦ "ప్రభో! కపులువచ్చి
పవమాన తనూభవ యంగద జాం ♦ బవదాదుల గలసి,
అవక్షయం బొనరించిరి మధువన ♦ మంతయునది తెలసి,
వనపాలకు లదలించిన గొట్టెను ♦ వారి ననిలజుండు,
వనుగూడను గొట్టెను నీయగ్రజ ♦ తనయు డంగదుండు
ఫలితము లెక్కచు ఫలముల దినికడు ♦ పారమధువులాని
చెలరేగుచు నున్నారు వనంబున ♦ చెప్పగవచ్చితిని."
అనునపు డీతం డెవడని లక్ష్మణు ♦ డడుగ భానుసుతుడు
అనెనిటు లక్ష్మణ! దధిముఖుడీతం ♦ డగు నామాతులుఁడు.
మనము యామ్యమున కంపిన కపులట ♦ మామధువనిజొచ్చి
తనివిదీర ఫలములదిని మధువును ♦ ద్రావి మత్తుహెచ్చి
వనము జెరచి వనమనుపరియుగు నీ ♦ తనిని గొట్టితిరట,
గన మనవారలు జానకిజాడను ♦ గాంచి వచ్చిరనుట,
ధ్రువమేనున సీతనుగాంచిన సం ♦ తుష్టిని వారటుల
అవగడ మొనరించుచుండె వనమున ♦ అట్లుగాని యెడల,
వత్తురె గడువునుదాటి ధైర్యముగ ♦ వచ్చిరె యొకవేళ
మత్తిలివారలు పరివర్తింతురే ♦ మధువనమున యిటుల!
వాతాత్మజుడే సీత జాడగని ♦ వచ్చెననుచు దోచు
సీతాసతి వృత్తాంతము దెలియును ♦ శీఘ్రమె మన కనుచు
దశరథాత్మజులు సంతసమొందగ ♦ దధిముఖు కనెనిటుల
విశదమయ్యె విషయంబులు క్షమించి ♦ విడిచితి నీకపుల
నీవు వడిగజని వారి నంపు'మని ♦ నియోగింప నతడు
వేవేగంజని కపులకు నిట్లనె ♦ విజ్ఞాపనవినుడు

మిము శీఘ్రంబుగ రమ్మనమనియెను ♦ మిత్రనందనుండు
క్షమియించితి ననె, విని, మీసేతలు ♦ సత్వరముగ జనుచు
అంత యంగదాదులతో మారుతి ♦ అచటనుండి వెడలి
అంతరిక్షమున కెగయుచు ప్రస్రవ ♦ ణాద్రి పైనివ్రాలి,
రవిజ రామలక్ష్మణులకు మ్రొక్కుచు ♦ రామున కనెనిటుల
"అవలోకించితి వైదేహిని లవ ♦ ణాబ్ధి దాటి యవల"
నావిని రాముడు సతి ఎట, ఎటు లు ♦ న్నదియని ప్రశ్నింప
పావని యిట్లనె 'రామ! నేనహం ♦ పతి దాటిన పిదప
రావణపాలితమగు లంకాపురి ♦ ప్రవేశించి సీతా
దేవిని యశోకవనమున రాక్షస ♦ స్త్రీలనడుమ యమిత
ఖేదము నొందుచు కృశించి నిన్నే ♦ కీర్తించుచు రిపుల
బోధనలొప్పక బ్రతికియుండగా ♦ పొడగంటిని యవల
అదనుగాంచి జానకి దరికింజని ♦ అంజలి యొనరించి
విదిత మొనర్చితి మీరాకను నా ♦ విషయము వివరించి
అదియుగాక మీరొసగిన యుంగర ♦ మానవా లొసంగి
అడవద వలదని బల్కిన యాయమ ♦ అదిగొని యుప్పొంగి
కనుల నద్దుకొని నిన్నుజూచినటు ♦ గ్రాలె, యంత నేను
వనధిని దాటించెద నన యొప్పక ♦ వచ్చి స్వయము నిన్ను
గొని పొమ్మనమనె తనను, రావణుని ♦ గూల్చి రణంబునను;
అనుజునితో వడిలంక కేగి తన ♦ యార్తి బాపుమనెను
నీవెన్నడు తమ్మునితో రావణు ♦ నిహనన మొనరించి
బ్రోవగ వచ్చెదవో యని యాయమ ♦ పొగులుచుండె మించి.
అంతట నే మిమ్మువిజాదులతో ♦ నచటకు గొనివత్తు
చింతిల్లగ వలదమ్మా నిను జూ ♦ చినయటు లొకగుఱుతు
నిమ్మన యీచూడామణి యొసగుచు ♦ ఏకదృష్టి మున్న
తొమ్మనదన్నిన విషయము జ్ఞప్తికి ♦ తెమ్మనమనె నన్ను,

అదియుగాక నొకతరి మణిశిల తన ♦ కెదురుగా యమర్చి
నదుట ప్రతిఫలింపగ జేసితివట ♦ ఇదియు జ్ఞప్తిదెచ్చి
వెస మిమ్ములదోడ్కొని రమ్మనమని ♦ విధించెనను యనుచు
యొసగెను చూడామణిని న్దాని ర ♦ ఘూత్తముండు గొనుచు
రవిజానుజులకు దానిజూపి యా ♦ క్రిందన మొనరించి
అవనిజకడకుం గొనిపొమ్మనమని ♦ అంజనిసుతు గాంచి
జనకజ యింకేమేమి జెప్పె నన ♦ అనె ననిలజు డిటుల
అనుజ్ఞయొసగుము యేగెద నన యా ♦ యమ యడలుచు చాల
"నాదు ప్రణతులను దెల్పి కపివరా ♦ నాథుని దోడ్తెమ్మ
ఆదదీర్చి నన్నాదరింపుమని ♦ యర్థించితి ననుము
నేనొకమాసముకన్న బ్రతుకనని ♦ నానాథునితోడ
ఆనతిచ్చి వడిలంకకు రమ్మన ♦ మను ననుగాపాడ
దానవబాధల కోర్వజాల కు ♦ న్నానని వచియించి
వానరోత్తమా చెరవిడిపింపుము ♦ వారలతో వచ్చి"
అని బహుభంగుల దుఃఖించిన నే ♦ నామెను యోదార్చి
గనవలె రావణునని ప్రమదావన ♦ మును నాశమొనర్చి
దనుజుల పెక్కురజంపి జూచి రా ♦ వణుని లంకగాల్చి
జనకజాజ్ఞగొని వచ్చితి రామా ♦ జలధిని లంఘించి."
ఇంతవరకు నిది సుందరకాండము ♦ ఎవరైనను దీని
న్సంతతంబు విన, వ్రాయ, చదువ మో ♦ క్షంబు గల్గుభువిని
శ్రీరామహరే రఘురామహరే ♦ సీతారామహరే
తారకనామహరే రామహరే ♦ దశరథరామహరే
రామరామ శ్రీసీతారామా ♦ రామరామ యనుడీ
రామయనెడు తారకమంత్రామృత ♦ రసముగ్రోలి మనుడీ



# యుద్ధకాండము

పవనజా డిటు రాఘవునకు జానకి ♦ పల్కిన విషయములు
వివరంబుగ దెల్పిన శ్రీరాముడు ♦ విడుచుచు నశ్రువులు
మక్కువ నాతని గౌగలించుకొని ♦ మారుతి కనె నిటుల
"నిక్కము నాప్రాణముల నిల్పితివి ♦ నిన్ను బొగడజాల
ఎక్కడిలంక యపాంపతి వానరు ♦ లెట్లు దాటగలరు
రక్కసులను వధియింపగ నేర్తురె ♦ రణమందున వారు
పక్కద్వయంబె గదువంటివి రా ♦ వణుని విగ్రహమున
త్రొక్కని; చెరవిడిపింపగాను పృ ♦ థ్వీజను, సాధ్యమానా?
దిక్కులేక యట దీనతనుండిన ♦ దేవిని గను టెట్లు
ఉక్కడంపకను రావణాసురుని ♦ యూరకుండు టెట్లు
ఎక్కడి కేగుదు? దక్కునె జానకి ♦ ఎవ్వరు తోడిచట
ఇక్కట్టుల యిటు విధిగల్పించెను ♦ యేమిసేతు నకటా?
అక్కడి విషయము లన్నియు దెల్పుము ♦ ఆమూలాగ్రముగ
ఎక్కడి కెవ్వ డెట్లేగవలయునో ♦ యోగింపుము వడిగ"
నావిని పావని రాముని కనెనిటు ♦ నరవర జడియకుము
రావణు జంపగ గలవొక్కడవే ♦ రణమందున నిజము
ఈమహి నీకు నసాధ్యం బెయ్యది ♦ ఎద నీకెందులకు
సౌమిత్రియు సుగ్రీవులు జాలరె ♦ సమర మొనర్చుటకు
వినను దెలిపెద వినుము రామ న ♦ న్నడిగినావు గాన
ఏనొక్కండనె రావణుగూల్చెద ♦ ఈ విచ్చినయాన
లంకయుండు యామ్యంబున నిచటకు ♦ లవణాబ్ధికి యవల
లంకాపురమును జొచ్చుట కష్టము ♦ శంకరుకైన నిల
కనక గోపుర ప్రాకారంబులు ♦ కందకములు గలవు
వన వాపీ కూప తటాకంబులు ♦ వాగు లందుగలవు

వాడవాడలతో పైడిమేడలతో ♦ వజ్రపుగోడలతో
వైఢూర్య జ్వాలద్వారంబులతో ప్ర ♦ వాళ కంబములతో
అతిగహ్వర దుర్గస్థలములతో ♦ అంతఃపురములతో
చతురంగ బలంబులతోడ నిశా ♦ చర వర్గంబులతో
సకల వైభవాస్పదమై యొప్పెడు ♦ స్వర్గంబన ధరనుః
ఏకమీడగు రావణుండు దానికి ♦ ఇట్టిపురము నేను
ఒక్కరుండనే దగ్ధం బొనరిచి ♦ రక్కస ప్రముఖులను
ఉక్కడంచివచ్చితి శ్రీరామా ♦ ఒత్తిడి జేయు నను.
ననుమించిన కపులున్నారీ వా ♦ నరుల వేనవేలు
ఘనులు సాహసులు ♦ రణధీరులు వి ♦ క్రమ బలకోవిదులు
ఒక్కొక్కండాలంకను పెకల్చి ♦ ఉదధి ముంచగలడు
తక్కిన జాంబవదాదులు లేరే ♦ తరలగ మనతోడు
గజనల మైంద ద్వివిద కేసరీ ♦ గవయ ధూమ్రశరభ
విజయహోత్ర నీలాంగద శతార్చి ♦ వినత తార ఋషభ
పనసనుషేణ బ్రజంఘాదులు తమ ♦ బలములతో యొపుడు
అని కేగుదమని త్వరపడుచుండిరి ♦ అల్లరిగో జూడు
మిమ్మిద్దర గొనిపోయెద వడి నా ♦ మీదను నెక్కించి
రమ్మనుజునితో లంకకు సుముహూ ♦ ర్తంబు విచారించి
వనిధిపైని చెట్టులు గుట్టలతో ♦ వారధినింగట్టి
జని లంకకు యుద్ధమొనర్చి నిశా ♦ చర విభునింగొట్టి
అవని జనుంగొనివచ్చుట యుత్తమ ♦ మనిన సంతసించి
రవిజుని గనియిట్లనె రాముడు మి ♦ త్రమ మాయిదిమంచి
సమయంబుగ దోచెడు దండెత్త ని ♦ శాచర విభుపైకి
సమయించెద రావణాసురుని నే ♦ సమరంబున దాకి
జయముగల్గు తప్పక మ్మనలకు శుభ ♦ శకునము లగుచుండె
అయ్యంబరయుగ ముందుగ కపులను ♦ అంపింపుము నేడె.

గజగవయ గవాక్షాదులు తమ తమ ♦ కపిసైన్యంబులతో
వ్రజనం బవ హనుమ దంగదులపై ♦ వచ్చెద తమ్మునితో
భల్లుకములతో జాంబవదాదుల ♦ బయల్వెడల మనుము
ఎల్లయు సంసిద్ధము జేయుము మన ♦ మేగగ సత్వరము;
నావిని సుగ్రీవుండు తగిన య ♦ త్నంబుల గావించి
త్రోవను అరయుగ వృషభనీలకుము ♦ దుల ముందుగ బంచి
గజ బ్రిజంఘశత గుల్మశతబలీ ♦ గవయార్క సుషేణ
విజయ పనస నల జాంబవ మైంద ♦ ద్వివిదులు మొదలైన
సకల వానరాచ్ఛంబులతో జన ♦ సంసిద్ధుండైన
ప్రకటితంబుగా, రాఘవు లంగద ♦ పవనసుతుల పైన
అధిష్ఠించి పలు శుభశకునంబులు ♦ అరుదెంచుచు నుండ
వృథి వీనిన యటు కపులంతట వ్యా ♦ పించి కదలుచుండ
బరగ దివా రాత్రింబులు వడి వడి ♦ పయనము సాగించి
అ౽గిరి మహేంద్రినగము కడకు స ♦ హ్యామలయముల గడచి.
కడలి కడలులతో నచ్చట నుండుట ♦ గాంచి దాని నెటుల
గడువ నౌనటంచును యాలోచన ♦ గావించుచు, నేల
చూలిని యెన్నడు గనులపండువుగ ♦ జూతునో యనుచు మది
చాలగ యోచించుచు దిగులొందగ ♦ సాగెను దాశరథి.
అచట రావణుడు హనుమంతుని చ ♦ ర్యల మది దలచుకొని
విచారించి తనవారినెల్ల రావించి ♦ దైన్యమూని
అనెనిటు "వీక్షించితిరిగదా యొక ♦ వనచరంబు వచ్చి
వనము చెరచి రక్కసులను వధించి ♦ జనియె లంకగాల్చి.
రవిజుని పంపున వచ్చెను యాకపి ♦ రాముని దూతగను
అవనిజ వృత్తాంతము విని రాముడు ♦ ఆజి యొనర్పగను
వచ్చును లవణోదధిని దాటి వడి ♦ వానరములగూడి
వచ్చిరేని మనమెటుల వారి గె ♦ ల్వగ నగు వచింపుడీ."

నావిని ప్రహస్త దుర్ముఖాది దా ♦ నవవీరులు లేచి
రావణాసురుని శౌర్యధైర్య వి ♦ క్రమముల గణుతించి
శూరాలాపము లాడుచు తామే ♦ సులభంబుగ బోయి
శ్రీరాముని హననంబు జేతుమని ♦ జెప్పిన వినియదరి
విభీషణుండిట్లనె రావణునకు ♦ వినుమన్నా మనవి
అభిలషింపబో కెపుడు రామునితో ♦ యభిమర్దంబు భువి
వినమె రాఘవుడు ఖరదూషణులను ♦ హనన మొనర్చుటయు
వనధి సప్తకంబున నిను ముంచిన ♦ వాలిని జంపుటయు
అట్టి రాముని గొట్టెదమను నవి ♦ వట్టిపల్కు లన్నా
గొట్ట గల్గితిరె రాముని దూతను ♦ కోతిని యేమైనా ?
కామవశుడవై రాము సతిని లం ♦ కకు దెచ్చితివీవు
రాముని గర్పింపుము సీతనువడి ♦ రణ మొనర్ప లేవు
కేవలుడాతడు నిను రక్షించును ♦ కృపా రసముజూపి;
నావిని రావణుడేగె నంతిపురి ♦ నాటికి సభనిలిపి
మరల రావణుడు హితుల బంధుగుల ♦ మంత్రుల రావించి
మరునాడొక సభగూర్చి దానిలో ♦ మహీసుతను గూర్చి
అనుజుండగు కుంభకర్ణునకు దె ♦ ల్పిన యాతడు వగచి
అనెనిట్లన్నా ఎంత జేసితివి ♦ అవనిజనుం దెచ్చి
ఎందుకు దెల్పగ లేదీవిషయము ♦ ముం దెవరికి మాకు
చిందిలపాటున జేసిన పనికై ♦ చింతింపగబోకు
ఏనిపుడే పరిఘుంబును గొనిచని ♦ ఇనజాదులతోడ
మానవేశు వధియింతు నీవు సుఖ ♦ మంద సీతతోడ
అంత మహాపార్శ్వుండనెనిటు యసు ♦ రాధిప నీవేల
ఇంతి సీతతో సుఖయింపక యిటు ♦ చింతించుట మేలా !
కుక్కుటవృత్తిని పొందుము చెలువను ♦ కుజ యొప్పనియెడల;
ఈక్కడకు గలా దెచ్చిన మధువును ♦ యొందని పురుషు డిల,

చేజిక్కిన సతి ననుభవింపకను ♦ చెరనుంచితి వేలా
ఆజివిషయ మెంచగనగు రాముం ♦ డరుదెంచిన యవల
అనవిని రావణుడనెనిటు 'యిందు, ర ♦ హస్య మొందుగలదు
వినుము పుంజికస్థల యను అచ్చర ♦ విహాయసమునందు
నలువను మునుగనబోవుచుండ చా ♦ ననపై తమిజెంది
బలిమిని నేను రమించితి యదివిని ♦ బ్రహ్మ యలుకజెంది
పరభామల నేనెన్నండైనను ♦ బలిమి రమించిన నా
శిరములు పదియును భిన్నంబై జ ♦ చ్చెదననె యదిగాన
అవనిజ నంటగజాల నిపుడు నే ♦ ననిలో రాఘవుని
అవక్షయంబొనరింప, యొసగదే ♦ ఆమెయె సమ్మతిని
ఏనొక్కడనే రామునిగూల్చెద ♦ నెరుగడు నాబలము
మానవుడన నాకెంత రామునకు ♦ మరణము నిశ్చయము"
అంత విభీషణు డన్నకు నిట్లనె ♦ అవనిజాత సీత
నింతిగ దలవకు కాలసర్పమది ♦ యెరుగవు విధివ్రాత
వంశక్షయమగు నీకు జానకిని ♦ వదలిపెట్టవేని
సంశప్తకుడౌ రాముని గెల్వగ ♦ జాల రెవ్వరేని
తరణిజానుజులతో శ్రీరాముడు ♦ తరలిరాకమున్నె
హరివర్గంబులు లంకాపురమును ♦ అటుమింపకమున్నె
రాము సాయకంబుల నీశిరములు ♦ రసన బడకమున్నె
నామరూపములతో దానవు లిల ♦ నశియింపకమున్నె
సీతనుగొని చని రామున కర్పిం ♦ చిన నినుక్షమియించు
ఆతనితో వైరంబువలదు మన ♦ కన్నా యోచించు
అన్నా నీకు దురాలోచన జెపు ♦ చున్నా రెల్లరును
విన్నపంబువిని జానకినిం దిగ ♦ విడిచిన శుభమగును"
నావిని ప్రహస్తు డనెనిటు విభీష ♦ ణా వైరుల బొగడు
పాపివి యెరుగవా అన్నపరాక్రమ ♦ బలధైర్యము లెపుడు

సురగరుడోరగ సిద్ధసాధ్య కి • న్నరయక్షామరులకు
సురద్విషులు భయమొంద రెన్న డిక • క్షుద్రమానవులకు
వెఱువనేల నేనొక్కండనె జం • పెద నారాఘవుల
ఎఱిగియు మాబల ధైర్యస్థైర్యములు • ఇట్లాడుట మేలా?
అందుకు బదులుగ విభీషణుం డి • ట్లనియె వ్రిహస్తునకు
ఎందులకా డెదవీవ్రగల్భములు • యెఱుగుదు నీ బ్రతుకు
నక్కెక్కడ దేవలోకమెక్కడ • నరవరుతో రణమా!
నిక్కకు శ్రీరఘురాముని గెల్వగ • నిటలాక్షుని తరమా!
నీవుగాని దుర్ముఖుండుగానీ • నికుంభుండుగానీ
రావణేంద్రజిత కుంభకుంభ క • ర్ణాదుల యెవరేని
చేరిగాని, యొక్కొక్కరుగానీ • శ్రీరామునితోడ
పోరజాలుదురె యెదుర్రై అభిమర • భూమియందుజూడ
ఖరదూషణ ముఖ్యులు రామునిచే • గడదేరుట వినమా
దురభిమానమును విడువుము రాముని • దూషణ జేయకుమా
అనిన క్రుద్ధుడై పినతండ్రికి ని • ట్లనియె నింద్రజిత్తు
మనుజమాత్రులచె గలుగదు వినుమా • మనకెపుడు విపత్తు
ఈవింతగ భీతిల్లెదవని నే • నెంచగ నైతిని నా
చేవందెలియవా? చేతన్ జిక్కిన • సీత నొసగనగునా
అమరేంద్రాదుల గెల్చిన శూరుడ • నవనీశుండెంత
చమర్తు రాఘవులను దెలియవు నా • శౌర్యంబు నొకింత
అనవుడు భ్రాతీయునకు విభీషణు • డనెనిటు వినవోయి
కనులైనను విప్పని పసికూనవు • గర్వమొందకోయి
బాలకుండ వజ్ఞుండవు దూరం • బాలోచింపక నే
కాలుదువ్వెదవు కలహంబన్నను • కాహళంబువలెనే
పరిహాసంబుగ దోచుమిాకు నా • భాషణంబు లిపుడు
పరవడు ఖగములచే మిాశిరములు • ధరపై బడినపుడు

తెలియు యదార్థము, రాముని ♦ ప్రజ్ఞను దెలసియు నీవిటుల
పలుకబాడియే రాముని గెల్చుట ♦ కల్లనైనను కల్ల
జనకునకు దురాలోచన జెప్పకు ♦ జనకజ నిప్పుడైన
ఇనకులేశు కర్పింపుం డాతడు ♦ యేగుదెంచు లోన.
శరణాగతరక్షకు డాతనితో ♦ శత్రుత్వము వలదు
నరవరుతో సఖ్యంబునొంద మన ♦ వరువేమియు బోదు
అంత రావణుం డాగ్రహంబుతో ♦ అనుజున కనె నిటుల
ఇంతటి వందనటంచు నెరుగ నే ♦ నిస్సి! వాచాలా!
వైరుల బొగడుచు ననుదూరెద వీ ♦ వైపరీత్యమేల
ఓరీ కులపాంసన నాయున్నతి ♦ యోర్వలేవె కూళ.
"జ్ఞాతిశ్చే దనలేనకిం" అనెడు ♦ జనవాక్యము వినమె!
నీతి నీమ యనురాగ శూన్యుడవు ♦ నిను నమ్మగ గలమె!
పంచ జేర్చి యుంచితి తమ్ముడవని  పాపీ! యిట జేరి
వంచనసేయుచు నుంటివౌర నా ♦ వమ్ము మదినిగోరి
నాయన్నము తిని నామాటాడని ♦ నాలిముచ్చు వీవు
మాయావివి దుర్ముఖుడవు నాగృహ ♦ మందుండగ తగవు."
అన్న పరుషముల కలగి విభీషణు ♦ డసురుల నల్వురతో
మిన్నుకెగసి రావణునకు యనెనిటు ♦ మేలుగోరి నీతో
మరల జెప్పుచున్నాడ వినుము నా ♦ మాట శ్రద్ధతోడ
పరివృద్ధుడవు పితృసమానుండవు ♦ భ్రాత వెంచిజూడ
నీహితము నపేక్షించి బల్కినను ♦ నిందించితి వీవు
ద్రోహివిగావే? రాముని పత్నిని ♦ దొంగిలించినావు
ధర్మము దప్పిన నీకడనుండుట ♦ తగదు నాకు గాని
కర్మవశంబున నీకింతట. గా ♦ గలయది దలచుకొని
వగచుచుంటి రాముండువచ్చి యా ♦ శుగముల నీతలల
నెగురవేయ గొబ్బరి పుచ్చులవలె ♦ నీక్షింపగజాల

నినువిడువడు శ్రీరాముడు నమ్ముము ✦ నిధిలో డాగినను
ఇనకులేశు కిపుడైనను సీతను ✦ ఇచ్చిన శుభమగును
దక్కదుజానకి నీకెన్నడు యు ✦ ద్ధంబును జేయకుమా
రక్కసవంశ క్షయమునకై కా ✦ రకుడవు గాకనుమా
మిత్రులవలె గన్పట్టుచున్న యీ ✦ మేటిబలుఁరు నీకు
శత్రువులని గ్రహియింపుమన్న దు ✦ ర్జనుల గూడబోకు
నానుడువులు యిపుడైన విననిచో ✦ నాశము నిశ్చయము
దానవాగ్రణీ సుఖముగనుండుము ✦ ధర్మము దప్పకుము
శుభమాగాకను నేనేగెద నని ✦ సోదరు నెడబాసి
విభీషణుం డబ్ధిదాటి రాముడు ✦ విడిసినయెడడాసి
అచ్చోటను కాపుండిన సుగ్రీ ✦ వాదులతో "నేను,
వచ్చితి లంకాపురమునుండి రా ✦ వణునకు తమ్ముడను
విభీషణుడ మాయన్న మదాంధుడు ✦ వివేకశూన్యుండు
అభీకుండు నుక్కిడు వంచకుడు ✦ అమరకంటకుండు
నీతిబాహ్యు డుత్కటుడు పాతకుడు ✦ నిశాచరవిభుండు
సీత నెత్తుకొనివచ్చి లంకలో ✦ చెఱను యుంచినాడు
పృథివిజ తన్ను నిరాకరింప శ్రమ ✦ బెట్టుచున్నవాడు
ప్రధనంబున శ్రీరామునితో తల ✦ బడనైయున్నాడు
అవనిజ వివశతయై దుఃఖించుచు ✦ అశోకవనమందు
నవయుచునున్నది రామచంద్రుని నె ✦ నమ్మి మనమునందు
పలుమరు సీతను రామునకిమ్మని ✦ పలుకగ మాయన్న
నలుగురిలో పరుషంబులాడి స ✦ న్నవమతించెగాన
ప్రాప్యాభాసములైన పుత్రులను ✦ భార్యను దిగవిడిచి
ఆప్యాయముతో రాముని పదముల ✦ నాశ్రయింపదలచి
జనుదెంచితినని శరణాగత ర ✦ క్షకుడగు రామునితో
మనవిజేయు" డన రవిజుం డనెనిటు ✦ మానవనాథునితో

చపలుడు రావణుతమ్ముండు విభీ • షణుడట సుగ్రీవుచే
అవమానింపగ బడి నీ పదముల • నాశ్రయింపవచ్చె,
యుర్వీజను హరించుట తప్పనుచు స • హోదరు నిందించి
సర్వముత్యజించి వచ్చితిననె నీ • శరణ మపేక్షించి,
ఈ వెరుగని దొక్కింతయు లేదిల • ఇతడు రాక్షసుండు
రావణు సముఖమునుండి వచ్చె శా • త్రవ వర్గీయుండు
మానవేంద్ర యోజింపకుండ న • మ్మకుమీ రక్కసుని
దానవనాథుని గూఢచరుండని • దలంతునే నతని
చెడుగొనరించును తప్పక మనలో • చేరదీయునెడల
వెడలగొట్టుటే యుత్తమమిత్తరి • విభీషణుని యవల"
నావిని రాముండంగదాది వా • నరులను వీక్షించి
యీవిషయంబున మీయుద్దేశ్యము • లెవ్వియొ యోచించి
దెలుపుండన శ్రీరామునితో నిటు • పలికె నంగదుండు
'చెలిమిజేసి మనలో విభీషణుని • జేర్చుకొనుట కీడు
అసురనాయకుండగు దశకంఠున • కనుజన్ముండితడు
అసమయమున నరుదెంచె నల్వురతో • ననుమానాస్పదుడు
తగరగ దోచుచు నున్నాడీతని • తంత్రములో బడకు
అగుణియొ సుగుణుడో దెలిసికొనుట శ్రే • యస్కరంబు మనకు
గుణుగ్యుండవగు నీకు సర్వమిల • గోచరంబె గాని
అణకుడో, అణుకుడో, ఆరాధ్యుండో • అధముడో దెలసికొని
శిష్టుడైనచో శరణ మొసగి నీ • చెంత జేర్చుకొనుము
దుష్టుడైన దరిరానీయకపో • ద్రొబ్బుట యుత్తమము;
అవల శరభుడును, జాంబవంతుడును • అటుపై మైందుడును
అవనిజేసు కంగదువలె తమతమ • యభిప్రాయములను
దెలిపి రవ్విపిని పావని దాశర • థితోడ ననెనిటుల
"వలీ ముఖేంద్రములతో నేకీ • భవింపగా జాల

అరితమ్ముండేగాని విభీషణు ♦ డసురుండేగానీ
శరణాగతుడై నీపదముల నా ♦ శ్రయింప నిత్తరిని
అరుగుదెంచె సర్వంబును త్యజించి ♦ అన్నను నిందించి
దురాదర్ష డీతని సఖ్యము ముం ♦ దున కెంతయుమంచి,
వదన విలాసము దిలకించిన నూ ♦ వైఖరి గాంచిననూ,
ఉదాస్థితునిగను, ఉక్కివుండుగను ♦ యూహింపగలేను
పరదారా హరణం బొనర్చి రా ♦ వణుడు దుష్టుడగుటన్
పరాత్పరుడవును పరాక్రముడవును ♦ పరంతపుడ వగుటన్
మరియు వాలి నొకకోలం గూలిచి ♦ మర్కట రాజ్యంబు
అరుణ తనయునకు నీవొసగుట విని ♦ అట్టి కాంక్షితంబు
మనమున నిడుకొని వచ్చియుండునని ♦ మన మూహింపదగు
ఇనకులోత్తమా ఇట్టివాని గ్రహి ♦ యించుట బహుబాగు."
ఆమాటలు విని రఘురాముం డి ♦ ట్లనియెను కపులగని
మీ మీయుద్దేశ్యంబులు నరయగ ♦ మిమ్ముల నడిగితిని
వినుడిక నానిశ్చిత హృదయంబును ♦ విభీషణార్యుండు
దనుజుడెగానిం డరి రావణునకు ♦ తమ్ముడె గానింకు
సర్వము త్యజించి నన్నేగతియని ♦ శరణు జొచ్చినాడు
నిర్వహింపగను వలదె యిట్టివా ♦ నిని యుర్వీశుండు
గతి నీవేయను శరణాగతులను ♦ గాచుట నావ్రతము
ప్రతిగ్రహించుటయే యీతని ని ♦ ష్పట్ల నాదు మతము
కండు కపోతాదులకథ మీరా ♦ కర్ణింపగ లేదా !
నిండు ప్రపన్నుండై వచ్చిన యిత ♦ నిని బ్రోవగవలదా !
అసురుం డీతనినమ్మట యెటులని ♦ యందురేమొ సకల
అసురుల నొక్కశరంబున దుంచెద ♦ హాని దలచునెడల
ఈవిభీషణుని కథ యిం బొసగుట ♦ యే గాకుండగను
రావణుండు శరణాగతుడైనను ♦ రక్షించెద నేను

విభీషణుడు రావణుని భయంబున • విచ్చేయుట నిజము
అభయంబిచ్చితినని సుగ్రీవా • ఆతని దోడ్తెమ్ము"
అనిన రవిజు డత్యానందంబున • అరిగి విభీషణుతో
మనవిజేసి రాముని అభయము ర • మ్మన యాతడు ధృతితో
వచ్చి రాఘవుని మృదుతరపాదా • బ్జంబులబడి లేచి
హెచ్చుప్రపత్తిని రామునకనె నిటు • లిరుకరముల మోడ్చి
"రామరామ శ్రీసీతారామా • రామా రఘురామా !
రామా రవికులసోమా తారక • నామా రణభీమా !
శరణు శరణు శరణాగతరక్షణ • శరణు దురితహరణ !
శరణో న్నమొనారాయణ భవాబ్ధి • తరణ రమారమణ !
పిన్నతమ్ముడను రావణునకు నా • పేరు విభీషణుడు
అన్నచేత యవమానితుండనై • అరుగుదెంచితిపుడు
అతులిత సుఖసంపదలను సుతులను • ఆలిని విడనాడి
గతినీవేయని వచ్చితి రామా • కరుణతో గాపాడి
నీయాశ్రితునిగ జేసికొమ్ము నను • నిఖిలలోకపాల
భూయో భూయో నమామ్యహం" బన • భూవిభు డనెనిటుల
అభయప్రదాన మిచ్చితి నీవిక • అదవద పడబోకు
విభీషణా ! రిపు బలాబలంబుల • వినిపింపుము నాకు
నావిని విభీషణుండనెనిటు మా • నవేంద్ర ! రావణుడు
కావరుండు వరగర్వితుండు వి • క్రమ బలాన్వితుండు
దివిజుల జయించి దిక్పతులను మొ • త్తినట్టి గండుండు
నవగ్రహంబుల తనయానతిచే • నడుపుచున్నవాడు
కైలాసం బవలీలగనెత్తిన • ఘనపరాక్రముండు
పౌలస్త్యుని యోడించి పుష్పకము • బడసిన వీరుండు
ఇన్నియేల ముల్లోకశూరుల జ • యించినట్టివాడు
చిన్నయన్నయగు కుంభకర్ణు డన • యున్నాడింకొకడు

శైలాభీల శరీరుండును బహు ♦ శౌర్యవంతు డితడు
వేలుపు లాతనితో ననిజేయుగ ♦ వెఱచఱచుదు రెపుడు
ప్రహస్తుడను సచివుండే రక్కస ♦ పడవా లాతండు
మహిత విక్రముడు మాణిభద్రుమును ♦ మట్టుబెట్టినాడు
భ్రాత్రీయుండగు ఇంద్రజిత్తు దు ♦ ర్వార పరాక్రముడు
శాత్రవులకు నదృశ్యుండయి యే ♦ సమితి జేయుగలడు
దుహిణునిచే వరమంది గర్వమున ♦ దొరయుచు నున్నాడు
మహోదరుండును మహాపార్శ్వుడును ♦ మరియు నకంపనుడు
సేనానులు వీరాజిలోన నుగ్ర ♦ సిద్ధి జెందినారు
దానవయోధులు పదియర్బుదములు ♦ తలపడనున్నారు
అమర యక్షగంధర్వాదులచే అంతము లేకుండ
కమలాసనుచే వరంబుగొని యును ♦ గర్వితుడై నిండ,
ఇట్టిబలంబుల గూడి రావణుడు ♦ ఇనకు లేశ నీతో
కట్టుపకాసై యున్నాడనరా ♦ ఘవుడు విభీషణుతో
'వినుమికనాదు ప్రతిజ్ఞ రావణుడు ♦ వననిధి దాగినను
అనన్తమున కెగసినను రసాతల ♦ మందున జొచ్చినను
వరమిచ్చిన యా హిరణ్యగర్భుని ♦ వద్దకు బోయినను
దురమున వానిని సకల రాక్షసుల ♦ తోడ వధించెదను
స్థిరముగ లంకారాజ్యము నీ కి ♦ చ్చెద నిశ్చయముగను
జరుపక నేనీప్రతిజ్ఞన యోధ్య ♦ జనువాడను గాను
అనిన విభీషణు డానందంబున ♦ అనెనిటు రామునకు
అనిని నేను నాశక్తి కొలది సా ♦ యంబొనర్చి నీకు
రక్కసులం బరిమార్చి అన్నతో ♦ రణ మొనర్చువాడ
నిక్కము నీనేస్తంబు విడకనీ ♦ నీడ నిలుచువాడ
అంత రాముడనుజునిచే నిధితో ♦ యంబుల దెప్పించి
సంతసమొదవ విభీషణు కభిషే ♦ చనమును జేయించి

లంకకు రాజుగ నిర్ణయించె ని ♦ శ్శంకతోడ నతని
అంకించిరి కపులెల్లరు దద్విష ♦ యంబున రాఘవుని
అవల నీరధిని దాటుట కుపాయ ♦ మడుగ విభీషణుడు
పవనాత్మజ సుగ్రీవాదుల కిటు ♦ పల్కెను; రాఘవుడు
పవిత్రముల పాయోపవిష్టుడై ♦ వనధిని ప్రార్థించి
లవణోదధిపై సేతువొకటి రా ♦ లతోడ బంధించి
శరధిదాటనగు ననవిని రాముడు ♦ సంతసించి తాను
ఉరుదర్భాస్తరణంబులపై ప్రా ♦ యోప విష్టుడయెను.
అంతట శార్దూలుండను రక్కస ♦ యదార్థ్యావర్ణుండు
అంతరిక్షమునముండి మహోదధి ♦ కవల విడిసియుండు
వానరసైన్యంబులను గాంచి రా ♦ వణునకు ననెనిటుల
'దానవేశ్వరా! రామలక్ష్మణులు ♦ తరీమమున కవల
పవనజ సుగ్రీవాంగదాది కపి ♦ వరులు గొల్చుచుండ
ప్లవగ భల్లచయములు భువియీనిన ♦ పగిది మూగియుండ
విడిసియుండి రనిసేయువారితో ♦ వివేకంబుగాదు
తడవొనరింపక సామదానబే ♦ ధంబులచే ముందు
సాధింపంతగునవిన రావణుడు ♦ సరగున శుకుడనెడు
యోధుని దూతగ బంపుచు నిట్లనె ♦ ఓరీ నీవిపుడు
మర్కట విభునడకుంజని ఇటు నా ♦ మాటగ వచింపుము
"అర్కనందనా! యుంటిమి సోదరు ♦ లటుల నిచట మనము
మహాబలుండవు మర్కటవిభుడవు ♦ మనుజునితో నీకు
సహవాసము తగ దల్పుడు రాముడు ♦ సహాయబడబోకు
వైదేహిని దెచ్చితినని నాతో ♦ వైరము యూహించి
రాదగునే యిటువరులగూడి సమ ♦ రంబు జేయ నెంచి
నీయుగ్రజుడగు వాలియునేనును ♦ స్నేహితులము గాన
న్యాయముగా దనిజేయగ నాతో ♦ నరవరు నిపుడైన

విడిచి సైన్యములతో కిష్కిందకు ♦ వెడలుము, యుత్తమము
కడలి దాటగా జాలరునరులును ♦ కపులెన్నడు నిజము"
అనిన స్వని శుకుడబ్ధిదాటి జని ♦ అనన్త్రమున నిలచి
ఇనజునితో రావణుండు జెప్పిన ♦ హితములు వివరించి
పలుకుచుండ వనచరులు గనుంగొని ♦ పట్టి శుకునిగొట్టి
పలువిధముల బాధించిన శుకుండు ♦ ప్రాణ ముగ్గబట్టి
దాశరథిన్వేడిన విడిపించెను ♦ దయతో రాముండు
ఆశుకుండు మర లర్కసుతునితో ♦ అసుర నాయకుండు
చెప్పిన చొప్పున తిర్గి చెప్ప నిటు ♦ జెప్పెను రవిజుండు
'ఒప్ప నెన్నడును రావణు హితమును ♦ ఊర్కలుం డతండు
రాముని వీడగ జాలనెన్నడును ♦ రావణాసురుండు
నామిత్రుని కిల శత్రువగుటచే ♦ నాకు శాత్రవుండు
అతనితో సంబంధము బాంధవ్యము ♦ అగుబడ దేమియును
జితుడగుమీ రావణుండు రాముని ♦ చేత త్వరితముగను"
అనుచు చెప్పి పంపించుచుండగా ♦ అంగదుండుజూచి
దనుజ నాయకుని చారుం డీశుకు ♦ డని యనుమానించి
రవిజు నాజ్ఞశుకుబట్టిగొట్టె మ ♦ ర్కటులం గూడుకొని
అవనిజేశుడట నబ్ధికి నెదురుగ ♦ పవిత్రములపైని
ప్రాచిముఖుండై దక్షిణహస్తము ♦ పైని శిరమునాని
వాచిక మానస నియమంబులు గల ♦ వాడై బండుకొని
"నాకు మరణమో లేక సాంద్రిత ర ♦ ణంబో నిటగూడు
గాక యనుచు సాగరునా రాధన ♦ గావించుచు మూడు
దినములు గడపెనుగాని సాగరుడు ♦ కనుపింపగలేదు
ఇనకులేశ్వరుండంతట నాగ్రహ ♦ మునను లేచి తనదు
శరచాపంబుల చేగొని యో రీ ♦ సాగరుడా నీవు
సరసమతిని ప్రార్థించు చున్నను ప్రి ♦ సన్నుండవుగావు !

సామముచేతను నీ వెన్నండును ♦ సాధింపగబడవు
సామాన్యునిగా దలచితివా నను ♦ జడతను యున్నావు
అనుచు తూపులనుబరపె నబ్ధిపై ♦ ఐనను సాగరుడు
తన నిజరూపున గనుపింపగలే ♦ దంతట రాఘవుడు
కనుల నిప్పులంగ్రక్కుచు యోరీ ♦ గర్వీనీవేల
కనులకు నగుబడకున్నావిక నే ♦ క్షమియింపగజాల
సురద్విషుల సహవాసివగుట నా ♦ శుష్కంబగు బడను
శరములచే సేతువగట్టెద నీ ♦ సాయమింకవలదు
ఎరుగవు నాసామర్థ్యము నీరా ♦ పిలను మాపుజేతు
శరమొక్కట నిన్నింకజేసి వన ♦ చరులను నడిపింతు
అనుచు నొక్కసాయకముంగొని బ్ర ♦ హ్మాస్త్రము యోజించి
ధనువున సంధించుచు యాకర్ణాం ♦ తంబుగ బిగియించి
వేయబోవ బ్రహ్మాండంబంతయు ♦ ఎడలు వటులదోచె
వాయు వురవడిగ వీచెను గ్రహములు ♦ వక్రగతిని నడచె
లోకంబంతయు చీకటు లలమెను ♦ లులితములయె గిరులు
ఆకశమున నుం డవనికి పతనం ♦ బయె నిర్ఘాతములు
కలతజెంది రమరులు మానులు యు ♦ ల్కలములు జాపట్టె
జలరాసులు ఘూర్ణిల్లె పగలు న ♦ క్షత్రంబులు బుట్టె
అంత సాగరుండబ్ధినదుము గం ♦ గాదినదుల గూడి
అంతన్మనుడై నిజరూపంబున ♦ అగుబడి నెదుటబడి,
కరములుమొగిడ్చి రాముని కనెనిటు ♦ కరుణాకరరామా !
శరణాగతరక్షక నను క్షమించి ♦ శాంతుండవుగమ్మా
కదలకయుంటిని జడస్వభావుడ ♦ గావుననే రామా
ఎడ నన్యవిధంబుగ తలపక నా ♦ హితి మొకింతవినుమా
నేనులోతుగా యుండుట సహజము ♦ నీటిని స్థంభింప
కాని కార్యమది జలచరంబులకు ♦ గల్గు పీడ భూపా !

ఏవిధముగ నినుదాటింపగ మని ♦ యెదవో తెలియలేను
ఈవొక సేతువు గట్టింపుము వడి ♦ ఇందుల్కై నేను
సాయమొనర్చెద చేతనైన యటు ♦ జలచరముల వలన
ఏయుపకృతి కపులకు రానీయను ♦ ఇంకను నాపైన
సేతువనుం గట్టెడు సామాగ్రిల ♦ చెదరకుండ జేసి
సేతువకు న్మార్గంబొడ గూడగ ♦ జేతునదటుబాసి
నావిని రాముండనె నిటు యీబా ♦ ణమమోఘము గాన
తావొక్కటి జూపుము విడిచెద ని ♦ ద్దానికి హారమన
సముద్రుడిట్లనె రామునకుత్తర ♦ జలనిధి మధ్యమున
ధ్రుమకుల్యంబను ప్రదేశంబుగల ♦ దొక్కటి యచ్చట నా
అరివర్గంబులు ఆభీరాదులు ♦ అనేకులున్నారు
శరము వారిపై విడువుము శ్రీరఘు ♦ వరయిదె జోహారు
అంతరాముడాధ్రుమ కుల్యముపై ♦ ఆశుగంబు విడిచి
అంత మొనర్చెను ఆభీరాదుల ♦ అవలరాముగాంచి
నలుడనియెడు శిల్పివిశ్వకర్మకు ♦ నందనుం డొకండు
కలడిందుల వానిచేత వారధి ♦ గట్టింపుము యిపుడు
మునుగకుండనే దాని ధరించెద ♦ ననుచు సాగరుండు
వనధిలోనంతర్భూతుం డయెన ♦ వ్వల యాకపి, నలుడు
వారధిగట్టగ రామునాజ్ఞగొని ♦ వనచరులను బంచి
ఆరణ్యకవృక్షంబుల మరి శై ♦ లాదుల దెప్పించి
ఐదైదామడ వెడల్పుగను నూ ♦ రామడ పొడవుగను
యాదసాంపతికి సేతువు గట్టెను ♦ అహాపంచకమునను
అంత రాఘవులు హనుమదాంగదుల ♦ అధిరోహణజేసి
అంతరిక్ష మార్గంబున సుగ్రీ ♦ వాదులతో గలసి
ముందుగ విభీషణుండు సువేలికి ♦ బోయి కాపు నిలువ
క్రిందుగ వారధిపై గుంపులుగా ♦ కీశంబులు నడువ

బరఁగి జాంబవంతుఁడు భల్లుక ♦ వ్రజములతో గొలువ
శరధిం దాటి సువేలాద్రికి జే ♦ రిరి సంతస మొదవ.
అచ్చట రాముడు దుర్నిమిత్తముల ♦ ననేకములు గాంచి
రచ్చగల్గునని సంతసించి యువ ♦ రజుని సంప్రదించి
అనెనిటు సౌమిత్రీ ; యుత్పాతము ♦ లగుచుండెను గనుము
దనుజ విభునితో యుద్ధము సంప్రా ♦ ప్తంబగు వడి నిజము
కోతుల నెలుగుల కొండముచ్చులను ♦ గూడి లంకజొచ్చి
ఘాతన మొనర్పవలె దశకంఠుని ♦ కదనము గావించి
అదిగో గనుము త్రికూటాద్రిని గల ♦ దాలంకాపురము
వదిన, యందు బంధింపగబడి యు ♦ న్నది, హా! దుర్భరము
గనుగొను టెన్నడో జానకినిన్, దశ ♦ కంఠుని బరిమార్చి
అనుచు కొంతవడి విచారించి సై ♦ న్యముల నొకటగూర్చి
గరుడవ్యూహము బన్నించి శుకుం ♦ గరుణతో విడిపించి
దుర మొనర్ప నాయతు డయె రవిజా ♦ దులతో సంప్రదించి.
కపులచే విడువగబడిన శుకుడు దశ ♦ కంఠుని కడకేగి
తపనసుతునితో, తా, రావణుని హి ♦ తంబు దెలుప నరిగి
అట తా నవమానింపగ బడుటయు ♦ నర్కసుతుడు తనకు
ఎటుల యుత్తరంబిచ్చెనో నదియును ♦ యెఱుగబలికి తుదకు
అనె నిటు, "రావణ! రాముడు నీతో ♦ అని యొనర్పనెంచి
వననిధిపై నూరామడగల యొక ♦ వారధి గట్టించి
సలక్ష్మణుండై సుగ్రీవాంగద ♦ జాంబవదాదులతో
వలీముఖవ్రాతంబులతో మరి ♦ భల్లుకవ్రజములతో
అరుగుదెంచె లవణోదధి గమించి ♦ అవనిజ పతితోడ
దుర మొనర్చి విజయుండ వౌదువని ♦ దోచ దెంచి జూడ
గావున జానకి నాతని కొసగుట ♦ కర్తవ్యం బ"నిన
రావణు డగ్లెన్నుండు జేయునని ♦ రక్కసచరుడైన

సారణునకు శుకునిం దోడిచ్చుచు ♦ చపలులతో గలసి
ఆరాతుల సేనరేవరెల్లున్నా ♦ రను విషయంబరసి
రమ్మన వారలు వేగబోయి మ ♦ ర్కట రూపంబులతో
గొమ్మతిమ్మరుల గూడియుండ గను ♦ గొని శ్రీరామునితో
ఆవిషయంబును దెల్పె విభీషణు ♦ డంత రాఘవుండు
అవ్వేగుల వారల కిట్లనియెను ♦ అరిగి మీరలిపుడు
దశకంఠునితో అనుడిటు "కపి సము ♦ దాయంబుల గూడి
దశరథాత్మజుడు లంకాపురబే ♦ దంబుపైన దాడి
సలిపి రణంబున నినుగూల్చు నిశా ♦ చర నికరము తోడ
తలలు పదియు నిల బడిదొర్లుచు యొక ♦ కలంబంబుతోడ
అనుభవింపవలె ఫలంబుసీతను ♦ హరించి నందులకు"
అనుచు వారలను విడిచిపుచ్చ వా ♦ రరిగి రావణునకు
తామేగుటయును, సువేలాద్రికడ ♦ తామొందిన యట్టి
బాములనూ మరి రాముడు తమతో ♦ పలుకమన్న యట్టి
ఉదితములను విన్నవించి రామున ♦ కుర్వీజనొసగు మన;
వదలనెన్నడును జానకినని రా ♦ వణు డున్నతమైన
ప్రాసాదంబున కెక్కుచు శుకసా ♦ రణుల జేరబిలిచి
ఆసువేలగిరి నున్నరాముసై ♦ న్యంబుల వీక్షించి
అందెవరెవరున్నారో వారికట ♦ అర్హత లెట్టివియో
ఎందరు సేనాపతులో వారల ♦ యెత్తుగ డెట్టిదియో
మొదలగు సమస్త విషయంబులు నా ♦ మూలము దెలసుకొని
పదపడి శార్దూలాదిచారులను ♦ పంపి సువేలిజని,
రామలక్ష్మణుల సంచలనంబులు ♦ రవిజుని యత్నములు
ఏమైనను తమ కార్యసాధనలో ♦ నెరిగెడి విషయములు
డెలసుకొ రమ్మన, వారందరు ముం ♦ గేది వచ్చుచరుల
వలెనె బోయియట బంధితులై విడు ♦ వగ వచ్చిరి మరలః

వారిలో శార్దూలుండనె నిటురా ♦ వణునకు మేమేగి
చేరిచేరకుండగనే వానర ♦ సేనలో మమ్మెరిగి
విభీషణుడు బట్టించెను గానీ ♦ విషయము వినిమమ్మ
అభినిర్ముక్తులజేసె రాఘవుడు ♦ అభివర్యుడు నమ్మ
గరుడ వ్యూహముబన్ని యుండె మ ♦ ర్కట సైన్యంబులను
చొరశక్యముగా దెవ్వరికిని యట ♦ శరచాపంబులను
బట్టి రాఘవులు నిలచియుండె ద ♦ ర్వార బలురఘునులు.
తట్టున నిలచెను రవిజుడు వీరల ♦ చుట్టి వలీముఖులు
అనయము కావలిగాచు చుందురట ♦ కనురెప్పల యటులు
హనుమజ్జాంబవ దంగద నల నీ ♦ లాది వీరవరులు
ఎందరోగల రసమాన విక్రములు ♦ ఇట్టి శత్రుబలము
నందున నీకపజయంబు తప్పదు ♦ అందువలన మనము
రామునితో సఖ్యంబు నొందుటే ♦ రాజనీతి వినుము
భూమిజ రాముని కొసగుటయే యి ♦ప్పుడు శ్రేయస్కరము
రామునితో పగవలదాతని వి ♦ క్రమంబు వినలేదా
ఆమహనీయుడు ఖరదూషణులను ♦ అంతమొనర్చెగదా
మును నిను నీరధిముంచిన వాలిని ♦ హననంబొనరించె
వననిధిపై నూరామడగల యొక ♦ వారధిగట్టించె
నీతమ్ముండు విభీషణుడాతని ♦ నీడజేరినాడు
ఆతడు మనకెదురై నిలచుట ధృవ ♦ మాజియందు నిపుడు
కలహంబున శ్రీరాముని గెలుచుట ♦ సులభముగానిపని
తెలిసినదేదియొ దెలిపితి తలపకు ♦ చులకనగా దీని.
అంతరావణుడు వారినంపి తన ♦ యామాత్యుల బిలచి
మంతనమున వారితో నేమేమో ♦ మాయల యోచించి
విద్యుజ్జిహ్వుండనియెడు మాయా ♦ వేదిని రప్పించి
మిథ్యగ రాముని శిరమును కార్ముక ♦ మిషువుల జేయించి

సీతకడకు వానిం గొనిపోవుచు • జెప్పె నామె కిటుల
"ఏతనికై నీవేడ్చుచుంటివో • ఇయ్యది అతని తల
పుడమిరేడు నీరాముఁడు కపులతో • కడలి దరికి వచ్చి
బడలికచే నటఁ బండియుండ మా • ప్రహస్తుండు జూచి
దానవసైన్యంబులతో జని ప్రవి • దారణం బొనర్చి
నీనాథుని సంహరించె వానర • నికరంబుల గూల్చి.
హనుమ జ్జాంబవ సుగ్రీవాంగద • వనచర నాయకులు
హననము గావింపగబడి ధరబడె • హతశేషులు కపులు
అడవులపాలై పోయిరి నీవిక • ఆరాముని గూర్చి
అడలుకొనక నావశవర్తినివై • అలరుమ"ని వచించి,
మాయాశిర శరచాపంబుల నట • మహీజకడనె యుంచి
పోయెను; అంతట మాయాశిరసును • పుడమి పుట్టుగాంచి
కనులు, కూర్చములు, కనీకంబులును • కర్ణకపోలములు,
హనువాననోష్ఠ్రరదన ఘోణములు • అలకాలికములు
రామునవేయని విభ్రమించి "హా • రామరామ" యనుచు
భూమినిబడి మూర్ఛిల్లి, తెలివిగని • బోర బాదుకొనుచు
"హారామా! హాజీవితేశ్వరా • హా సద్గుణరాశి!
హారఘుకుల కలశాబ్ధిచంద్రమా • అయయో నను బాసి
పంచత్వము నొందితివా నాతో • పలుకవె యొకమారు
వంచకుచేతిలో జిక్కితి నా కె • వ్వారు దిక్కుగలరు
కైకకోర్కె యీడేరెను యాయము • కండ్లు జల్లబడెను.
నా కీదుర్గతి ఘటిల్లె భువిలో • నాథ! బ్రతుకలేను
చిరకాలం బిల జీవించెదవని • జెప్పగ వినియుంటి
నరనాథా! యి ట్లౌదువనుచు కల • నైన దలపకుంటి.
నన్ను బ్రోవగా వచ్చి యిచట హాన • నం బైతివి యకటా
నన్నుగూడ గొనిపొమ్ము వచ్చెదను • నాథా! నీవెంట.

సహాగమనంబును నీతోనే నా ♦ చరించెదను యనుచు
బహుభంగుల వాపోవుచుండ న ♦ ప్పడతిని గనుగొనుచు
సరమ, విభీషణుసతి; సాధ్వీమణి ♦ జనకజ కనెనిటుల
"తరుణీ నమ్మకు రావణు పలుకుల ♦ దశరథరాముతల
గా దిది విద్యుజ్జిహ్వుని మాయా ♦ కల్పితమే గాని
ఆదీనవమొందకు మమ్మా నీ ♦ నాథునకే హాని
గలుగలేదు, ముందును గలుగదు దీ ♦ ర్ఘాయుష్మంతుండు
తొలగజేసి నీకీబంధము వడి ♦ తోడ్కొని పోగలడు
రామలక్ష్మణులు కపులగూడి జల ♦ రాశిదాటి యచట
క్షేమముగా యున్నారు సువేలిని ♦ జెందకు మమ! వనట
ఎల్లి రామ రావణులకు యుద్ధము ♦ యొసగవు విషయములు
తల్లి వినుమా భేరీకాహళ ♦ ధ్వానులంటెడు చదలు
అరసివచ్చెదను రావణుని రహ ♦ స్యంబుల మరికొన్ని
పరితపింప"కని పోయివచ్చి యిటు ♦ పల్కె "నతని జనని
కైకేసియు మంత్రియు నతనికి, త ♦ క్షణంబు నినువిడిచి
కాకుత్స కులోద్భవునితోడ స ♦ ఖ్యంబును గావించి
సుఖియింపగమని రైన నాతడా ♦ సూక్తుల వర్జించి
ముఖరులతో సంప్రదించుచుండె స ♦ ముదయంబు గురించి
అనుచు ధైర్యవచనంబు లాడి జనె; ♦ నచట రావణుండు
తనమంత్రులతో నాలోచించెడు ♦ తరి మాతామహుడు
మాల్యవంతుడను వా డనెనిటు "విను ♦ మా, మన కిపు డాను
కూల్యము గావు పరిస్థితులందున ♦ కోలు తలలమాను
ఆన్వీక్షకి త్రయివార్త దండనీ ♦ త్యాది శాస్త్రములను
అన్వయించియే రాజ్యపాలనం ♦ బాచరించ వలెను
రాముడు దనుజవిరాముడు సంగర ♦ భీము డధికబలుడు
రాముని తమ్ముడు లక్ష్మణుండు దు ♦ ర్వార విక్రముండు

హనుమత్సుగ్రీవాంగదాదులా ♦ తనికి గలరుతోడు
ఇనకులోద్భవున కెవడు సమరమున ♦ ఎదురు నిల్వగలడు
ఖరదూషణులను యొక్కండే యని ఖండింపగ లేదా
శర మొక్కటి కపివిభుడగు వాలిని ♦ జంపుట వినలేదా
కపిబలంబులధికంబు దానవుల ♦ కన్నయనుట నిజము
యిపుడు రామునితో సంధి యొనర్చుట ♦ యేనా యింగితము.
బలియులతో సంధికి నెద్దైనను ♦ బహుమాన మొసంగ
వలయుగాన రాముని కర్పింపుము ♦ వైదేహిని వడిగ
శరనిధి బంధన మొనర్చె నాతని ♦ శక్తి నరసిజూడు
నరుడని యెంచకు శ్రీరఘురాముని ♦ నారాయణు డతడు
సురగరుడోరగ సిద్ధాదులచే ♦ మరణము లేకుండ
వరము వడసితివిగానీ నరవా ♦ నరులచేత గూడ
చావులేదనుచు తలవకు రాముడు ♦ సంహారింపగలడు
కావుననే వానరుడై యెలుగుల ♦ కపుల దెచ్చినాడు
అదియుగాక యుత్పాతము లెన్నియొ ♦ నగుచుండెను గనుము
ఎదియొ కీడురానున్నది దానిని ♦ ఎరిగి మసలుకొనుము."
నాపిని రావణుడనియెను యిట్టుల ♦ నను దూషించుటయు
ఏ వేళను యామానవాధముని ♦ యే భాషించుటయు
గన నీ యనూన యవివేకము లవ ♦ గాహన మయెనిపుడు
జనకజ నొసంగజాల రాఘవుల ♦ సంహారింతుజూడు
వారధిగట్టిన మాత్రంబుననే ♦ వీరుడుగాడతడు
దారా రాజ్యసుఖంబులు తొలగిన ♦ దరిద్రుడల్పుండు
కోతుల నెలుగుల యుద్ధంబునకై ♦ కోరిదెచ్చినాడు
చూతువుగా నాసామర్థ్యము సం ♦ స్ఫోటంబున యిపుడు
అనిన మాల్యవంతుండిక దెల్పుట ♦ అనుచితమని యెంచి
జనియె; నంతమంత్రులతో రాక్షసే ♦ శ్వరుడు సంప్రదించి

ప్రహస్తేంద్రజిత మహోదర విరూ • పాక్షసారణశుక
మహాపార్శ్వులను దానవ నికుర • మ్బంబులతో లంక
కన్ని దిశలయందును గుల్మంబున • అవితులుగా నుంచి
కన్నోటొండక బోయెనంతిపురి • కావరంబుమించి.
అచట సువేలిని రాముడు విభీష • ణాంగద పవనసుత
ఖచరనందన సుషేణ శరభ నల • గవయ జాంబవంత
గజగవాక్షమైంద ద్వివిదాదుల • గాంచిబల్కె నిటుల
అజితంబై యొప్పెడు లంకాపురి • అదియె గనుడు మోల
రజనీచరపతి యుండట యతనితో • రచ్చకు త్వరబడుడు
విజయకాంక్షులై వలయు కార్యముల • విచారింపు డిపుడు
అనవిని విభీషణుండు రామునితో • అచట లంక కేగి
అనల శరభసంపాతి ప్రఘసులను • ఆమాత్యులు తిరిగి
వచ్చిరచటి ముచ్చటలారసి య • వ్వానిని వినుమనుచు
ముచ్చటింప నారహస్యములు రా • ముడు విని బాగనుచు,
తదనుగుణ్యాముగ తానును కపివా • తంబుల గొన్నిటిని
పదిలబరచె నల్గడల రక్కసుల • ప్రతిఘటింప బూని.
అవలరాఘవుడు సలక్ష్మణుండై • అవిజాదులతోడ
సువేలశిఖరం బెక్కిలంకలో • సొబగు జూచుచుండ
రావణుడగు బడె సింహాసనమున • రాణితోడ నచట
భూవిభునకు యాతండటు నెదురుగ • భోగించుచునుంట
గనుగొని రవిజుండోర్వలేక యా • కాసంబున కెగసి
ఇనకులోద్భవులు గాంచి యుభ్రపడ • దనుజ విభునిడాసి
మనుజాసన విభుయురమునం బొడిచి • మకుటంబును దన్ని
అనెనిటు యోరీ! రావణ నిను ము • న్నఖ్ఖుల నన్నిటిని
ముంచిన కపివిభుడగు వాలికి త • మ్ముడ సుగ్రీవుడను
ఎంచుము కిష్కింధకు వానరులకు • ఏలికగా నన్ను

రవి తనయుడ శ్రీరాముని దాసుడ ♦ రక్ష్యతుడవు గావు
అవనిజనుం గొనివచ్చిన ఫలమిదె ♦ అనుభవింప గలవు
అనుచు మరల తాడన మొనరించిన ♦ అసుర విభుండలిగి
ఇనజుని తాకెను నియుద్ధమునకై ♦ యిరువురంత పెనగి
ఒక్కరినొక్కరు ప్రహార మొనర్చుచు ♦ యుర్విని బడిదొరలి
అక్కుల ముష్టిం బొడిచి నఖంబుల ♦ రక్కసొనుచు కెరలి
బోరుచునుండగ రవిసుతుండు క ♦ ర్బుర విభునించమరి
తారాపథమున కెగసి గంతులో ♦ శ్రీరాముని జేరి
నిలచిన రాముండనె నిటు మిత్రమ ♦ నీవొంటిగ నేగి
పలల విభునితో కలహ మొనర్చుట ♦ భావ్యమె యిబ్బంగి
అపాయమొద్దెనను నీకచ్చుట ♦ అయ్యోయుండెనేని
విఫలంబుగదా నాయీ యత్నము ♦ పృథ్వినీవు లేని
నేనును నాసర్వస్వంబును యిల ♦ నిరర్థకంబనిన
భాను నందనుం డనెనిటు నేనా ♦ దానవ విభుడున్న
స్థితిగని రోషావేశ గొట్టివచ్చితిని ♦ శిక్షార్హుండతడు
మితి దప్పితి నను క్షమియింపుము యన ♦ మేదినీశ్వరుండు
రవిజుని గాగిటజేర్చి కనుల హ ♦ ర్షాశ్రువులను విడిచి
అవరజు కనెనిటు దుర్నిమిత్తములు ♦ అగుచుండెను మించి
రిపుల వినాశము తప్పదు రణమొన ♦ రించుట నిశ్చయము
కపిబలములతో లంకాపురి యని ♦ కట్టగలయు మనము
అనుచు సువేలాగ్రంబు డిగ్గి వడి ♦ వనచరయూథముల
గొనిచని లంకానగరమునకు నా ♦ ల్గు ప్రతీహారముల
నరికట్టెను దానవులకు హృద్బే ♦ ద్యంబవ, నిపుణతతో
ధరయీనిన యటు కపులు ప్రబ్బిరట ♦ తరు శైలాదులతో
అవలరాఘవుడు విభీషణాదుల ♦ నాలోచన జేసి
ప్లవగవరుం డంగదుకనె నిటు రా ♦ వణుని నీవు డాసి,

పలుకుమిటుల మద్భాషణంబులుంగ ♦ 'పాపీ, పలుగాకీ
కులపాంసన, దుర్మదాంధ నీవా ♦ నలువవరము జిక్కి-
గర్వితుండవై సురగరుడోరగ ♦ గంధర్వాదులకు,
యుర్వీసురులకు, మునుల కెగ్గు జే ♦ యుచుంటి వందులకు
దండార్హుడ వదిగాక జానకిని ♦ దండకవనమున మే
ముండకుండ గని దెచ్చియుంటి వది ♦ యును యొక మొగతనమే !
దెలసియు దెల్వికనో దెచ్చిన వై ♦ దేహిని మాకిచ్చి
ఇలను సుఖంబుగ బ్రతుకుము అటుగా ♦ దేని రణమొనర్చి
నిశితమార్గణంబులచే నేనిను ♦ నిహనన మొనరింతు
దశశీర్షంబుల దుంచి చెండ్లవలె ♦ ధరను దొర్ల జేతు
తనయామాత్య హితాదులతో నిను ♦ తప్పక జంపెదను
విను నీరాజ్యము పినతమ్ముండు వి ♦ భీషణు కొసగెదను."
అనవిని ప్రళయానలచందంబున ♦ అంగదుండు వెడలి,
దనుజవిభునితో "నిన్నబ్ధుల ముంచు ♦ మునిచినట్టి వాలి
తనయు డంగదుడ, రామునిదూతను ♦ నను రాముడుబంప
గొనివచ్చితి సందేశం బొక్కటి ♦ వినుమని యుది దెలుప;
కనలి రావణుడు బట్టించెను యం ♦ గదుని భటులబిలచి
వనచరవరు డంగదు డంతట కరి ♦ వ్యాదులను విదల్చి
పంటవలతి బడదన్ని యున్నత ♦ ప్రాసాదాగ్రముల,
మింటికెగసి జని, నిలచె సువేలిని ♦ మేదినీశు మ్రోల.
అదటనొందుమను యేమియుదోచక ♦ అట రావణుడుండె;
కదనోత్సాహుండై రాముం డిట ♦ కపులతోడ నుండె.
ఇరుపక్షంబులగల సైన్యంబులు ♦ మురమున కాయత్తులై
పరిగొనియుండిరి వడవాలుర యుస ♦ వాద నిరీక్షితులై
రణభేరులు మ్రోగుచుండె లంకను ♦ రణనము చదలంట
గణిల్లుకైవడి కపిగణములు కల ♦ కలమొనర్చె నిచట.

అంతట రాముడు పురంబు దగ్గరి ♦ అవనిజనుం గూర్చి
కొంతతడవు చింతించి కురంగ ని ♦ కురుంబముల జేర్చి
తుములమునకు పురిగొల్పెనంత కో ♦ తులు దనుజుల దాకి
ద్రుమశైలంబులగొని పురప్రాసా ♦ దులపై కెగబ్రాకి,
నగర మల్లకల్లోలం బగునటు ♦ నాశనం బొనర్చి
గగనంబున కెగయుచు దూకుచు ర ♦ క్కసులను హింసించి
పెల్లార్చుచుండిరంత దానవులు ♦ ప్రేరితులై వడిగ
మల్లులపైబడి మల్లాడిరి మద ♦ మాత్సర్యము లెసగ.
పరశు చక్ర వజ్ర క్షురికా ము ♦ ద్గర కుఠార శూల
శరవాల పట్టిస ప్రాస ముసల తో ♦ మరా భిండివాల
కుంత గదా ద్యఖిలాయుధంబులను ♦ గూర్చుకొనుచు తమతో
దంతి తురగ రథపదాతులం గొని ♦ ధైర్యోత్సాహముతో,
తపన ఇంద్రజిత్వజ్రదంష్ట్ర మి ♦ త్రఘ్నులు మొదలైన
క్షపాచర ప్రముఖులు దాకిరి, కపి ♦ చయముల ననిలోన.
హనుమత్సుషేణ గజ మైంద ద్వివి ♦ దాంగద గవయ నల
ఇనతనయ జాంబవంత విభీషణ ♦ ఋషభ శరభ నీల
వినతాదుల గూడుకొ రాఘవు లతి ♦ విక్రమమున బోరి,
దనుజవాహినీపతులను పెక్కుర ♦ హననం బొనరిచిరి.
ఎక్కడజూచిన రామబాణములు ♦ పిక్కటిల్లియుండె,
నక్కలు పులుగులు గృధ్రంబులు యట ♦ నడయాడుచు నుండె.
ప్రవిదారుణ మతిఘోరంబై భువి ♦ పారె శ్రోణితంబు
అవని నిండె గూలిన పరిగమితో ♦ అంతట రాత్రింబు
అవగ, రక్కసులు ఇనుమడి బలధై ♦ ర్యంబులు పెంపొంద
ప్రవిదారుణ మొనరించిరి కపులతో ♦ దివిజు లభ్రమొంద.
అంగదునకు నింద్రజిత్తునకు నపు ♦ డనుపమానమైన
సంగరమున విరథుండై రావణి ♦ చదలకు నెగసి ఘన

ములు, మరుగున నేరికిగాన్పింపక ♦ నిలచి కపులపైన
కలమ్ముంబులను వర్షించుచు నా ♦ గాస్త్రంబులు విలున,
బెట్టి రాఘవులగొట్టి బల్కెనిటు ♦ యెట్టిదిట్టలైన
కట్టువడక తప్పించుకొనగ శ ♦ క్యంబుగాదు గాన
యమపురికంపెద మిము లని పరుషము ♦ లాడుచుండునంత
క్షమనొరిగిరి శరబంధితులై దా ♦ శరథులు వివశ్యత.
రావణి యట్టుల పుడమిని యొరిగిన ♦ రాఘవులను విడిచి
పావనిమైంద ద్వివిద్దాంగద శర ♦ భాదుల గురిజూచి
నిశితబాణములవైచి కపుల నలు ♦ దిశల బారద్రోలి
దశగ్రీవుకడకరిగె; నంతనిట ♦ తరణిసుతుం డడలి
రామలక్ష్మణుల పాటునకై యా ♦ క్రందింపుచు నుండ
ధీమంతుండు విభీషణు డనెనిటు ♦ స్థితినిబట్టిజూడ,
మరణమొందినటు లేదు రాఘవులు ♦ శరబంధితులగుట
ధర మూర్ఛన్బడి రందుకేమిజెం ♦ దకుమన్నా వనట,
అనుచు ధైర్యవచనంబులు బల్కుచు ♦ అవిజాదులగూడి
యొనర్చెనట శైత్యోపచారములు ♦ యుర్విని గూలబడి.
అచ్చట రావణి జనకుని సాన్ని ♦ ధ్యమున కరిగి తాను
రచ్చను నాగాస్త్రంబువైచి శ్రీ ♦ రామలక్ష్మణులను
ధరబడగొట్టిన విధంబుదెల్పిన ♦ దశకంఠుం డలరి
నరవరు లని మృతిజెందిరనుచు జా ♦ నకికి దెలుపగోరి
రజనీచరులచె సీతకటుల కబు ♦ రంపి సత్వరమున
త్రిజటను దోడుగనిచ్చి జానకిని ♦ దివ్యపుష్పకమున
అనిపిన జానకి రణరంగంబున ♦ అవనిన్బడియున్న
ఇనకులోద్భవుల గాంచి వారలట ♦ నింద్రజిత్తువల్ల
నిక్కవముగ సంహారింపబడిరని ♦ నిశ్చేష్టిత యగుచు
మిక్కిలి విలపించుచుండగా భూ ♦ మిజను త్రిజటగనుచు

శరబంధితులై రామలక్ష్మణులు ♦ ధరబడిరేగాని
మరణమొందలేదని యూరార్చుచు ♦ మహిజను మరలగొని
జనియె; నచట సంగ్రామరంగమున ♦ జాంబవదంగదులు
హనుమత్సుషేణ నల నీలార్యము ♦ జాది వనేచరులు
ధర శరబంధితులై బడియుండిన ♦ దశరథ నందనుల
దరినిజేరి వగచుచు తచ్ఛర బం ♦ ధముల బాపుటెటుల
యని యోచించుచు నుండగ వినతా ♦ తనయుడు గరుడుండు
జనుదెంచెను, యట కంత రామల ♦ క్ష్మణుల జుట్టియుండు
పన్నగంబు లిరువురను వీడి వడి ♦ బారెను నలుగడల
పన్నగాసనుని శ్రీరఘురాముడు ♦ ప్రస్తుతించె మిగుల.
దశరథసుతు లటు నాగపాశ బం ♦ ధవిమోచను లగుట
దశకంఠుడు విని ధృతిచెడి రఘువం ♦ దనులతో పోరాట
మొనర్ప ధూమ్రాక్షుండను వానిని ♦ దనుజ బలములిచ్చి
అనిపిన యాతడు రథారూఢుడై ♦ ఆజి భూమిజొచ్చి
ఘోరయుద్ధ మొనరించి పావనిచే ♦ గూల్పబడెను యంత
చారులచే తద్విషయమెరింగి ని ♦ శాచరపతి కొంత
సేనతో బంపెను వజ్రదంష్ట్రుడను ♦ వాని ననికి మరల
వాని నంగదుడు వధించె నదివిని ♦ దానవపతి కనుల
నిప్పులుగ్రక్కుచు అకంపనుండను ♦ నిశాచరుని బిలచి
చెప్పెను యిటు నీవేగి వానరుల ♦ జేరి రణమొనర్చి
రామలక్ష్మణుల సంహరించి వడి ♦ రమ్మన నతడేగి
సామీరిని యుద్ధంబున దాకిన ♦ శ్వసన సుతుండలిగి
ధరణీధరమును పెకల్చి దనుజుని ♦ తలపై బడవైచె,
సురద్విషుండా గిరిని శరంబున ♦ చూర్ణం బొనరించె.
క్రమముగ రాక్షసునకు మారుతికిని ♦ తుముల మధికమవగ
ద్రుమమొం డనిలజు డకంపనుని తల ♦ తుత్తునియలుగాగ

బడవైచిన ధరబడె నకంపనుడు ♦ బాయుచు ప్రాణముల
కడుభీభత్సంబై గన్పడె సం ♦ గ్రామరంగమెల్ల
పావనినిం బొగడిరి రాఘవులును ♦ ప్లవగంబులు మిగుల.
రావణు డకంపనుని మృతివిని యా ♦ గ్రహమునొంది కనుల
అనలము గ్రక్కుచు మంత్రులతో యో ♦ చనములు గావించి
దనుజబలంబుల లంకాపుర మం ♦ తటను వృద్ధిబరచి
మహితవిక్రముండును సేనానియు ♦ మంత్రివరుండైన
ప్రహస్తునింరావించి బల్కెనిటు ♦ ప్లవగులగెల్వ మన
సేనల నెవ్వడు జాలకుండె యీ ♦ స్థితినీవు గమించి
వానరసేనల నదల్చి దశరథ ♦ సూనుల నోడించి
రమ్మన ప్రహస్తు డట్లేయని సం ♦ గ్రామరంగ మేగి
కమ్మికొనెను పరిగమితో కపియో ♦ ఘంబుల నదియెరిగి
కపులు నిశాచరులందాకిరి వృ ♦ క్షాశ్మంబులతోడ
క్షపాచరులకును చపలులకును అటు ♦ సమరమగుచునుండ,
ప్రహస్తు సచివులు నల్వురు గూలిరి ♦ ప్లవగంబులవలన.
విహస్తుడగుచు ప్రహస్తుం డంతట ♦ విజృంభించి వన
చరులపైని వర్షించెను శరములు ♦ స్యందనమున నిలచి
దురము తీవ్రమయె నిరుకక్షలలో ♦ పరి లెక్కకుమించి
హతమయ్యెను పీనుగుపెంటలతో ♦ అవని నిండియుండె
క్షతజము పాఱెను రంగము భీభ ♦ త్సంబు గొల్పుచుండె
దండిప్రహస్తుం డట్టుల పైబడి ♦ దండధరునిరీతి
చెండుచుండగా కొండదిమ్మరులు ♦ జెందె రెదలభీతి.
అత్తరి నీలుడు ప్రహస్తుపైబడి ♦ అరదంబును గూల్చి
సత్తువకొలదిని విసరె నతనిపై ♦ సాలంబు పెకల్చి
దాన క్రిందబడి లేచి రౌద్రమున ♦ దండితూపు లేసి
వానరోత్తముని గాయబరచె తీ ♦ వ్రంబుగ పలలాసి.

శరతాడితుడై నీలుండొడలున • క్షతజ మొలుకఁజుండ,
తరువొక్కటి బడవైచెను ప్రహస్తు • ధనువిడ విరిగిబడ
నిశాచరుండంతట ముసలముగొని • నీలుదాకె నపుడు.
విశసనమొనర్చె ప్రహస్తుసం దా • లిశమున నీలుండు.
విని విద్రావితులగు భటులచే త • ద్విషయము రావణుడు
మనమున భయశోకాగ్రహములు పెన • గొన కొల్వుననుండు
దనుజ ముఖ్యులంగని యిట్లనె యు • ద్ధంబున మనవారు
వనచరముఖ్యుల గెల్వలేకసట • వధింపబడినారు
మానవ మర్కటులకు యొడుట యా • దానవు లిలలోన
నేనే స్వయముగబోయి రాఘవుల • వానరులను కలన
హనన మొనర్చెద జూడుండని యొక • యరద మధిష్టించి
తనయానీక ధ్వజనీపతులతో • జనియెను ధృతిమించి,
అట్టులవచ్చెడు దనుజుడు రావణు • డని రాముండు విని,
చెట్టునట్టులను హెచ్చరించి నిల • చెను కార్ముకమూని
అంతరావణుం డనీకరంగము • నందుజొచ్చి కపుల
నంతమొనర్పగ జొచ్చెవిడిచి నిశి • తాస్త్ర పరంపరల
రవిజుండది గని కడురోషంబున • రాక్షస విభుపైన
అవినొక్కటి బడవైచిన రావణు • డలిగి పృషత్కమున
ఆ యచలంబును చూర్ణంబొనర్చె • హరీశు నెదనాట
సాయక మొక్కటి విడిచిన మూర్ఛిలె • సవితానుతుడకట.
అది గని గజ నిభ ఋషభాదులు వృ • క్షాద్రులతో నదరి,
యెదిరించిన రావణుండలిగి వా • రెల్లరతో బోరి
గ్రావసాలముల గూల్చి కపుల సుృ • క్కడచు చుండె నంత
కావవేయనుచు కపులేగిరి భూ • కాంతు రాముచెంత,
రాముడంత విలుగొని పయనంబవ • రావణు బోరనని
సామి తేరిగెను సహజు నాజ్ఞగొని • శరచాపము లూని.

అంతట హనుమంతుండు క్రుద్ధుండై ♦ అసురవిభుని డాసి
"సంతసించుచుంటివి మృతిలేదని ♦ స్రష్టవరము వడసి,
కోతులచే మృతిలేని వరంబును ♦ కోరనైతి విస్సీ!
ఘాతమొకట నినుఘాతించెద"నన ♦ కర్బురపతి గినిసి,
హనుమంతునియెద ముష్టిం బొడిచిన ♦ ఆతడు దశముఖుని
ఘనముగ ముష్టిం బొడిచెను రొమ్మున ♦ కాచుకొమ్మనమని
రావణు డంతటసోలి సొక్కి రౌ ♦ ద్రమున ముష్టిబట్టి
పావనివక్షము బొడువనతడు బడె ♦ ప్రాణమున్నబట్టి
పావని యటుబడినంతనె నీలుని ♦ పై శరపంక్తులను
రావణుండు గుప్పించె నద్దిగని ♦ గ్రావద్రుమములను,
దశగ్రీవుపై వైచెను నీలుడు ♦ దానవ విభుడంత
విశిఖసప్తకంబున నవిపొడి గా ♦ వించె నేర్పుచేత
నీలునకును రావణునకునట్టు య ♦ నీకంబగుచుండ
నీలుడు హ్రస్వశరీరుండై రజ ♦ నీచరు డదరిబడ
పావనియును మనుజేసుల బ్రిపడ ♦ ప్లవగు లెల్లను నగ
రావణు శరాసనధ్వజ మకుటా ♦ గ్రముల, చమత్కృతిగ
దుముకుచు లేచుచు నుండెను యేమియు ♦ దోచక పలలాసి,
అమోఘమగు నాగ్నేయాస్త్రంబును ♦ ఆతనిపై నేసి,
క్షమను మూర్ఛబడగొట్టి, అనిని రవి ♦ జాదుల వారించి,
"చమరుతు నిను జిక్కితివని"యెను ల ♦ క్ష్మణుని సమీపించి.
రామానుజు డిట్లనియె క్రోధుడై ♦ రావణునకు, పావి!
మేమువనిని లేకుండజూచి భూ ♦ మి జనుం దెచ్చితివి
పలుక కతిశయోక్తుల నెరుగుదు నీ ♦ బలపరాక్రమముల
నిలచిపోరుమన రావణుం డలిగి ♦ నిశిత మార్గణముల
బఱపెను, లక్ష్మణుడవ్వానిని తీ ♦ వ్రంబగు బాణముల
విఱిచెను నడిమికి రావణుడదిగని ♦ విశిఖ పరంపరల

గుప్పిన వాటిని ద్రుంచి లక్ష్మణుడు ♦ కులిశతుల్యమైన
గొప్పగొప్ప బాణంబులవైచెను ♦ కోణపపతిపైన
ఖరశరములచే రావణుండు త ♦ త్ఖగముల ఖండించి
హిరణ్యగర్భుడు మును తనకొసగిన ♦ ఇషువును సంధించి
విడిచె లక్ష్మణు లలాటమునకు గురి ♦ వెట్టి దాసమూర్ఛ
బడి లక్ష్మణుడంతలోన తెల్విని ♦ బడసి రావణుని చా
పము ఖండించెను బాణమొకట మరి ♦ పత్రిత్రియమేసి
క్షమను మూర్ఛబడగొట్టె రావణుని ♦ సంజ్ఞ నతడు దెలసి,
రక్తముగ్రక్కుచు రౌద్రుండై చతు ♦ రానన దత్తమగు
శక్తిని జేకొని బ్రయోగింప ల ♦ క్ష్మణుండు యుగ్రమగు
ప్రదరమేసి తచ్ఛక్తిని గొట్టగ ♦ ప్రయత్నించెగాని
అదివిడువక లక్ష్మణునెదదాకెను ♦ భిదురకము కరణిజని
ఆ తాకునకు స్రుడెను మూర్ఛితుం ♦ డై లక్ష్మణు డవని
యాతువట్టి లక్ష్మణుగొని యరిగెద ♦ నని కదగెను గాని
కదల్పజాలక పోయె లక్ష్మణుని ♦ అదిగని సామీరి
ఎదన్బొడిచె దశకంఠుని పిడికిలి ♦ యెత్తి రట్టుమీరి
అంతట రక్తముగ్రక్కుచు మూర్ఛిలె ♦ అవని రావణుడు;
అంతరిక్షమున అమరేంద్రాదులు ♦ సంతసించిరపుడు.
శ్రీరామునిసన్నిధికి లక్ష్మణుని ♦ జేర్చె ననిలజుండు.
జేరెశక్తి దనుజేసుని; తెల్విని ♦ జెందె లక్ష్మణుండు
ఆశరపతియును మూర్ఛదేరి వి ♦ ల్లమ్ముల చేబూని
కీశముల నదరుముచుండగా గని ♦ గినిసి రాముడనిని
జేయబోవ నిట్లనియెను పావని ♦ శ్రీరాముని డాసి
"ఆయోధనమొనరింపు స్వామి న ♦ న్నారోహము జేసి"
నావిని రాముడు గరుడునివలె పవ ♦ నజు నారోహించి
రావణునెదిర్చి ఘనముగ మార్కొ ♦ రవంబు గావించి

అనె ని "ట్లోరీ దనుజాధమ నా ♦ కప్రియమొనరించి
నను దప్పించుకొ బోనేరవు శమ ♦ న హరేంద్ర విరించీ
అహస్కరనలులు అడ్డమైన నీ ♦ వపక్రమించిననూ
నిహననమొనర్తు రణమున నీచా ♦ నిశ్చయముగనిన్ను
గొట్టితి లక్ష్మణునని గర్వింపకు ♦ గిట్టనొకట నిన్ను
మట్టుబెట్టగల "సీతమ్మచే ♦ గొట్టువడని నేను
గొట్టువడుదునే నీవలనందువా ♦ గొప్పయె! నినుగొట్ట
గొట్టితినెఱుగవా"? ఖరాదులను నొ ♦ క్కొండనె వలదోట
ఈవిశిఖంబుల నీతలలను వది ♦ నిల దున్ళింతు నన
రావణుడుగ్రుండై ముమ్మందుగ ♦ పావనిపైని ఘన
శరములనేసెను, గానీ మారుతి ♦ చలింపడయె నంత
ధరణీశుం డాగ్రహచిత్తుండై ♦ శరములేసి తొలుత
రథాశ్వముల నిలగూలిచి ధ్వజ ఛ ♦ త్రాదుల నుసిజేసి
రథికుజంపి కౌక్షేయకాది యా ♦ యుధముల పొడిజేసి
నూటిజూచి శతకోటితుల్య యా ♦ శుగము సురేశు నెద
నాటగనేసిన దాన న్దానవ ♦ నాథు డమితబాధ
నొందుచు వివశుండై పట్టినవిలు ♦ క్రిందు జారవిడిచి
జెందెమూర్ఛ నంతటరాముం డీ ♦ షిక మొక్కటి వైచి
కిరీటంబు పొడిగావించి దశ ♦ గ్రీవున క నెనిటుల
"అరేరావణా యొనరించితివి భ ♦ యంకర కృత్యముల
మేటివీరులతొ బోరి మేడమున ♦ మిగుల యలసినావు
కూటమునకు బొమ్మిప్పుడు నాతో ♦ పోటొనర్ప లేవు
శ్రమముదీర్చుకొని సాయుధుండవై ♦ స్యందనమెక్కి వడి
అమరిరమ్ము పొమ్మిపుడు వధింపను" ♦ అనవిని లజ్జవడి
భీరుకుడై మతిబోయి దర్పమును ♦ వీడి అధైర్యమున
కోరలుబెరికిన కాకోదరమటు ♦ కుందుచు మదిలోన

రావణుడుదవసితంబున కేగెను ♦ రణరంగము విడిచి;
దేవాదులు గొనియాడిరి రాముని ♦ దివపథమున నిలిచి
శ్రీరాముడు లక్ష్మణవానరులకు ♦ సేదదీర్చ జనెను.
ఆరట మొందుచు రావణుండు గృహ ♦ మరిగి దానవులను
జేరిచి యిట్లనె "మున్నింద్రాదుల ♦ బోరిన తరి నెపుడు
ఈరీతి పరాజయ మొందగలే ♦ దిస్సీ! యొకనరుడు,
నన్నవమానించుటయా రణమున ♦ నగుబాటయె బ్రతుకు
మున్ననరణ్యుం డను ఇక్ష్వాకుల ♦ భూమీశుడు నాకు
ఒనరగ 'నా' వంశీయుండగు వా ♦ డొక్కరుండు బుట్టి
హననమొనర్చ గలం డనిలో ని ♦ న్నని శపించె నట్టి
పురుషుడితండై దశరథ సుతునిగ ♦ బుట్టెను గాబోలు
మరియు నొక్కతరి వేదవతనియెడు ♦ మగువపైన మరులు
గొనినే బలాత్కరింపగ యాయమ ♦ కోపగించి మిగుల
అనెని "ట్లోరీ రాక్షసాధమా ♦ ఆగు మచిరకాల
మున లంకన్జొరి నీవంశ క్షయ ♦ మొనరించెద నేను"
జననమయ్యెగాబోలు వేదవతి ♦ జానకి యనధరను,
సురగరుడోరగ సిద్ధసాధ్య కి ♦ న్నరాదులచె నాకు
మరణములేకుండగ ధాతను వర ♦ మడుగనొసగి 'నీకు
నరునిచె మాత్రము చావుగల్గు'ననె ♦ నన్నటు వధించెడు
నరుడు రాముడే యగు యదిగాకను ♦ నందికేశ్వరుండు,
అపర్ణ, రంభా పుంజికస్థలలు ♦ శపియించిరి నన్ను
ఇపు డిందరి శాపంబులు గూడెను ♦ ఏదినాకు తెన్ను
మీరీశాప స్వరూపమంతయు ♦ నారసి మెలగుండు
పోరొనరింపగ కుంభకర్ణు బం ♦ పుట యుత్తమమిపుడు
నీతము లేకను దీర్ఘకాలములు ♦ నిదురబోవువాడు
ఆతడుబరుండి తొమ్మిది దినములె ♦ యయ్యెగాన నేడు

లేవుడతని వడిమేల్కొని శత్రుల ♦ రూపుమాపగలడు
శాపగ్రస్తుడవ లేడాతడు నా ♦ చందము నెన్నండు
కాలముగాదిపు డాతని లేపుట ♦ కని యోచింపకుడు
కాలహరణ మవమానకారణము ♦ గావున వడిపొండు
అనవిని దనుజులు కుంభకర్ణు గుహ ♦ కరిగి యతనియొద్ద
నునిచి మద్యరుధిరా మిషంబులను ♦ యొడలుపై సుగంధ
పుష్పమాల్యముల గప్పి చెవులకడ ♦ బొబ్బలిడిరి గాని
నిష్ఫలమయ్యెను కుంభకర్ణు స ♦ న్నిధి యత్నములన్ని
ఘోరనిద్దురం జెందుచున్న యా ♦ కుంభకర్ణు లేప
భేరిపటహ శంఖాదినాదములు ♦ వృథయయె నంత క్షపా
చరులొక్కట కుంభకర్ణుపైబడి ♦ సాల శూల ముసల
గిరి ముద్గరగదల ప్రహరించిరి ♦ గెంటిరి అటునిటుల
కొరికిరి, రక్కిరి, గుద్దిరి, పొడిచిరి ♦ కుశముబోసి చెవుల,
శిరోజంబులనుబట్టిలాగి హిం ♦ సించిరి వివిధముల;
ఐన కుంభకర్ణుండు నిషుప్తుం ♦ డవకుండుట జూచి
దానవులాతని దొక్కించిరి ద్విర ♦ దాశ్వకముల దెచ్చి.
అంతకుంభకర్ణుం డించుక నిటు ♦ నటు కదలుచు లేచి
చెంతనుగల రక్తిరలన్గోలి పి ♦ శితంబు బక్షించి
ప్రేవేల్పుల కిట్లనియె నన్నులే ♦ పగ కారణమేమి
రావణుండు కుశలుండేగద యను ♦ రాళిత్రోడ నెలమి
సురాసురల కేమైన మరల సం ♦ స్ఫోటము గల్గెనొకో
నరులెవ్వరైనను లంకాపురిపై ♦ నను దండెత్తిరొకో
అనవుడు యూపాక్షుండను రావణు ♦ నామాత్యుం డెఱిగి,
అనెను కుంభకర్ణునకిట్టుల "ముసు ♦ హనుమంతుం డెసగి,
లంకగాల్చి జనుచెరుగుడు వావల ♦ లవణోదధి గడచి,
లంకకు జనుదెంచిరి రాఘవు లా ♦ లంబొనర్పదలచి.

హనుమత్సుగ్రీవాది కపుల సా ♦ యము గొని రాముండు
దనుజ ముఖ్యులనెక్కుర జంపిన ♦ దానవేశ్వరుండు
దురమొనర్పగా బోయి రాఘవుని ♦ శరముల గొట్టువడి
విరథుండై విచ్ఛిన్నమకుటుడై ♦ విల్లుబోయి, రోడి
భయార్తుడై ప్రాణావశిష్టుడై ♦ భవనంబున జేరి
నియమించెను మము నిను మేల్కొల్పగ ♦ నీసాయము గోరి."
అనిన కుంభకర్ణుండుగ్రుండై ♦ ఆజిని రాఘవుల
హననంబొనర్చి హనుమత్సుగ్రీ ♦ వాది వలీముఖుల
రక్తమాంసముల దృప్తిపరతు యను ♦ రాళిని; రామునకు
వ్యక్తబరచెదను నాదు శక్తియని ♦ వడిగ యన్నకడకు
అరుగుచు నుండెను రాజమార్గమున ♦ ఆతని కపులుగని
దురమునబారిరి రాముడంత కో ♦ దండశరము లూని
విభీషణుని కిట్లనియె "మిత్రమా ♦ వీడెవ్వడో గాని
విభవ మొప్పనీయన్న రావణుని ♦ వేశ్మమేగె నితని
భీకరగాత్రము గాంచి యెవ్వడిల ♦ భీతినొందకుండు
రాకాసియో! భూతంబో! ప రేత ♦ రాట్టగునో వీడు
వినిపింపుము వీని యుదంతంబన ♦ విభీషణార్యుండు
"వినుము రామ! రావణునకు తమ్ముడు ♦ విశ్రవసుని కొడుకు
ఘనుడు కుంభకర్ణుండు వీడు నా ♦ కన్న పెద్దవాడు
అని నింద్రాంతకులను రోడించిన ♦ అమిత బలాఢ్యుండు
క్షుదనీతడు మును జంతువులను మ్రిం ♦ గుచు ఋషులను గొట్టి
త్రిదశాదుల మర్దించి ప్రజల దిని ♦ స్త్రీలను జెరబట్టి,
జీవకోట్ల హింసించు చుండగని ♦ జిష్ణుడలిగి మిగుల
ప్రావేల్పుని ప్రహరించె తనదుభిదు ♦ రంబున మూర్ఛిల్ల.
పిదప నసురు డైరావతదంతము ♦ బెటికి దేవవిభుని
ఎదన్బొడువ నాతడు బడె మూర్ఛిలి ♦ ఎల్ల రడల దివిని,

ఆతని దుర్నయముల నోర్వక నిం ♦ ద్రాదు లేగుదెంచి
ధాతతోడ మొరబెట్టగ విరించి ♦ దనుజుల రావించి
అందు కుంభకర్ణునిగని తాభయ ♦ మంది నతని యవని
యందున "మృతకల్పుడవై నిద్దుర ♦ జెందుచునుందు" వని
శపియించిన కుంభకర్ణు డిలబడె ♦ సరగున నిద్రించి
అవుడు రావణుం దనుజునిపాటున ♦ కడలి అజునిగాంచి
'లోకేశా ! నీ మునిమనుమని ని ♦ ట్లొనరించుటనగునా
ఆకలి దప్పికబాసి బ్రతుకగల ♦ డే కరుణింపు' మన
చతురాననుడనె 'అధమ మారుమా ♦ సమ్ముల కొకనాడు
ఇతడులేచి భక్షించి కుడిచి వసు ♦ మతి న్దిరుగగలడు'.
ధాతశాపవశుడై నిద్రించెడు ♦ తమ్ముని రావణుడు
నీతోననిజేయగ లేపించెను ♦ నిశాటులచె నివుడు
అన్ననుజూడగ బోవుచున్నవా ♦ డతడు బెదురుబొమ్మ
సన్నద్ధుడవైయుండుము ప్లవగుల ♦ జముపుడుపుము రామా !
అనవిని రాముఁడు కపిసేనల వ్యూ ♦ హములుగ దీర్పించి
హనుమదాదులను లంకాద్వారము ♦ లరికట్టగ బంచి
కోలుతలల నొనరించుచుండె; నట ♦ కుంభకర్ణుడేగి
ఓలగమున బంగరుగద్దియపై ♦ యున్న యన్నకెఱగి
అనె నిట్లకాలమున ననులేపగ ♦ అవుసరమేమన్నా ?
అనర్థమేమైన గల్గెనో ? యిం ♦ ద్రాదు లెవ్వరైనా
మనపై దండెత్తిరో లేకను యువ ♦ మానించిరో నిన్ను
అనిని యట్టి దుష్టుండెవడైనను ♦ అంతమొనర్చెదను
అనవిని రావణు డనుజునకనె నిటు ♦ వినుము కుంభకర్ణ !
మునుజానకినిం గొనిదెచ్చితిగద ♦ మోహావేశమున
దానిమగడు రాముండును యాతని ♦ తమ్ముడు లక్ష్మణుడు
వానరసేనల గూర్చుకొ లంకకు ♦ వచ్చి రదిగొజూడు

దానవులెందరో జచ్చిరి వారిచే ♦ తలబడి యుద్ధమున
జానకి విభునితో బోరినేను యువ ♦ మానమొంది కలన
బ్రతికివచ్చితిని వేగిరబడి యి ♦ ప్పట్ల నీవుదక్క
గతిలే రెవ్వరు ననుబ్రోవుకు మరి ♦ గాపాడుము లంక
అనుజా నీ వని కేగి రాఘవుల ♦ హననంబొనరించి
వనచరముఖ్యుల వధించి రమ్మిక ♦ వడి విజయము గాంచి
అనుచు దీనుడై బల్కుచున్న తన ♦ యన్నను వీక్షించి
అనెను కుంభకర్ణుం డిట్లన్నా ♦ అవని జనుహరించి
ముప్పుదెచ్చితివి, అనుభవింపకను ♦ తప్పునె తత్ఫలము
నిప్పును దాకిన దహింపకుండునె ♦ చెప్పెద వినుహితము
అరికన్నను తాబలీయుడైనచో ♦ ఆహవ ముత్తమము
సరిబలులైనచో తాను నరాతియు ♦ సంధియె మధ్యమము
తనకన్నను రిపుడధిక బలుండగు ♦ తరి నరి సన్నిధికి
జనవలె దానముచే నది అధమము ♦ సచివులతో వివేకి
యీకర్మత్రయములు యోచింపక ♦ ఎన్నడు జేయ డని;
గాక కాలనియతులు పాటింపక ♦ కాముకుండవై, నీ
వన్ని శాస్త్రములు దెలిసియు మూర్ఖుడ ♦ వై యున్నావకటా!
అన్నా దుర్నీతులు దెల్పిరి నీ ♦ కామాత్యులు మొదట
తమ్ముడు విభీషణుండు దెల్పినట్లు ♦ దాశరథికి నీవు
అమ్మహిజను అర్పించుటయే యిప్పు ♦ డైనను నాహితవు
అనిన న్వినిరావణుడాగ్రహమున ♦ అనుజున కనెనిటుల
అనుశాసించెదవేల నోరి నా ♦ కాచార్యుని యటుల
దెలిసియొ దెలియకో, జేసినదానికి ♦ దెప్పగ వలదిపుడు
నిలచి యుద్ధమున నన్నును లంకను ♦ నిలబెట్టగ జూడు
ఆలోచించెదు కాలముగాదిది ♦ ఆలంబగుచుండె
ఆలమొంద కాపత్సమయంబున ♦ అడ్డు బడెదువాడె

వరయు బాంధవుడు, నాకు తమ్ముడవు ♦ పరమాప్తుడ వీవు
కరుణింపుము యిత్తరి నీవే మము ♦ కావ సమర్థుడవు
అనిన కుంభకర్ణుం డిట్లనియెను ♦ అన్నా ! నెయ్యమున
నిను నిందించితి కోపగింపకుము ♦ అనీకరంగమున
రామలక్ష్మణుల సంహారించి మ ♦ ర్కటులను హింసించి
క్షేమము గూర్చెద నీవు సుఖింపుము ♦ చింతలెల్ల విడిచి
నేనా రామునిచేత జచ్చెనెడ ♦ నిజము చావునీకు
నేను జత్తునని భయపడనెంతయు ♦ గాని వగతునీకు
హరి హయ యమ పావక వరుణానిల ♦ యక్షేశుల నైనా
పరాసనం బొనరించెద నరవా ♦ నరులకు వెఱచెదనా !
భూమిని వ్రక్కలుజేసెద చూర్ణం ♦ బొనరించెద గిరుల
సోమసహస్రాంశుల బడగూల్చెద ♦ చుక్కలతోడ నిల
కడలి జలంబుల ద్రావివైతు ది ♦ క్కరులను మ్రింగుదు
కడగొని యెద ముజ్జగముల నీకు సు ♦ ఖంబును జేకూర్తు
కన్నోటొందకు జానకి వశమగు ♦ గాంతువు వాంఛితము
అన్నా నేనిదె నిరాయుధుడనై ♦ యరిగెద సెలవిమ్మ
అనవిని మహోదరుం డనెనిట్టుల ♦ అన్న నపహసించి
మనుజేంద్రుండగు రాముని మానవ ♦ మాత్రునిగా నెంచి
అతిశయోక్తులను బల్కుచు నుంటివి ♦ అవనిజావిభుండు
హతమొనర్చె ఖరదూషణాది క్రి ♦ వ్యాదుల నొక్కండు
వదరుచు నీవొక్కండ వేగి రఘు ♦ పతిని గెల్వలేవు
క్షుధనొందిన పులిమీసము బెరుకగ ♦ గోరుచు నున్నావు
యుక్తము గాదిపుడేగ రామునితో ♦ యుద్ధ మొనర్చుటకు
యుక్తి యొకటి గల్యంతర మిత్తరి ♦ నుర్విజ నొందుటకు
అనుచు రావణుని సంబోధించుచు ♦ యానతిచ్చె నిటుల
అనికి కుంభకర్ణ ద్విజిహ్వ సం ♦ హ్రాది వితర్దనుల

నన్నునుబంపుము అవలమేము వా ♦ నరులను రాఘవుల
మన్నగొంటిమని జాటింపుము పుర ♦ మందున నెల్లెడల
అదివిని జానకి భర్తజచ్చెనని ♦ అగు నీవశ్యంబు
నిదురించెడు సర్పంబును లేపుట ♦ నృపునితో యుద్ధంబు
అంతకుంభకర్ణుండు మహోదరు ♦ కనెనిటు కోపమున
ఇంతచేటువాటిల్లెను మీమీ ♦ మంతనముల వలన
దురమున రామునిబోర వెఱచి తం ♦ తరముల నేనొల్ల
అరయక నాబలధైర్య స్థైర్యముల ♦ నాడుచుంటి విటుల
అనుచు నగ్రజునకెఱిగి బల్కెనిటు ♦ అన్నా ! యనికేగ
అనుజ్ఞయొసగుము బోయి రాము సం ♦ హరింతు నొంటరిగ
నావిని రావణుడనె నిటు తమ్ముడ ♦ నను దరిజేర్చుటకు
ఈవె సమర్థుడ విట్టితరిని నా ♦ కెవరుగలరు దిక్కు
ఈమహోదరుని యుక్తులకేమిలె ♦ రాముని వధియించి
క్షేమముగూర్చుము సబలంబులతో ♦ శీఘ్రమేగు దెంచి
అంత కుంభకర్ణుండు శూలధరు ♦ డై పరిగమిశోడ
అంతకుడోయన బయల్వెడలెనని ♦ కనురులు గొనియాడ
వెడలువునూరును పొడవార్న్నరుల ♦ విండ్లుపట్టు యొడలు
బెడిదమౌ అనశ్చక్రములంతటి ♦ పెద్దపెద్ద కనులు
గలిగి కుంభకర్ణుం డటుగిరివలె ♦ కదలివచ్చుచుండ
పలుదుర్నిమిత్తములు దోచెను బడె ♦ స్వరువులు నుల్కలిడ
సారదిదిశలు కావిరులుగప్పెను వ ♦ సుంధర కంపించె
అరుణుడు కాంతినిదక్కెను విముఖుం ♦ డై వాయువుపీచె
గోమిలుగూసెను గ్రద్దలుదిరిగెను ♦ కుణపం బెదురయెను,
వామనయన భుజనులు కంపించె న ♦ వార్యమాణముగను.
అపశకునంబుల పాటింపక యత ♦ డనికేగుచునుండ
కపులాతనిగని బరుగులిడిరి నలు ♦ గడల భీతితోడ

అపు డంగదు డట్లపక్రమించెడు ♦ కపుల హెచ్చరించి
క్షపాచరుని తాఁకఁగ బురిగొల్పిన ♦ చపలు లురువడించి
కుంభకర్ణుపై దలపడ యాతడు ♦ క్రుద్ధుండగుచు మద
కుంభికరిని చెలగి కపులపై ♦ కురుక; కపులువసుధ
భిన్నగాత్రులై కూలిరి కొందరు ♦ పెన్నిద్రితులైరి
కన్నోటునపలుగుండ్రు నిశ్చలా ♦ కంబులకుం జనిరి.
మరల గంధమాధన పవనాత్మజ ♦ మైందఋషభ నీల
శరభగవాక్ష సుషేణ కుముదగజ ♦ శతబలిద్వివిద నల
తారపనసవినుతాదికపులు ప్ర ♦ స్తరద్రుమగిరులూని
పోరొనరించిరి కుంభకర్ణునితో ♦ ఘోరముగా గాని
కుంభకర్ణు డిసుమంతచలింపక ♦ గోలాంగూలముల
కుంభినిగూల్చెను మ్రింగిపెక్కురను ♦ క్రుద్ధుండై మిగుల
అంత టనిలజుం డాగ్రహమొంది మ ♦ హాస్వనం బొనర్చి
అంతరిక్షమున కెగసి శైల తరు ♦ లసురునిపై వైచి
నొప్పించిన కర్బురుండు రోషము ♦ నొంది శూలమొండు
అప్పవనినెద నాటగనేసెను ♦ అంత ననిలజుండు
క్షతజము గ్రక్కుచు నేల మూర్ఛబడె ♦ క్షపాచరులు మెచ్చ
ప్రతిఘ మొంది నీలుం డపుడొక ప ♦ ర్వతమును రజనీచ
రునిపై బడవైచిన దానిని క ♦ ర్బురుఁడు నుగ్గొనర్చి
వనచరముఖ్యుల పెక్కుర ధరబడ ♦ వైచె నద్దిగాంచి
వాలినందనుం డాగ్రహమున క్ర ♦ వ్యాదుపై వలాసి
శైలము లేసిన వాని దానవుడు ♦ శూలముతోడ నుసి
జేసి యంగదుని ముష్టింబొడిచిన ♦ జెందెనొల్లమతడు
కీశవిభుండంతట నాగ్రహమున ♦ గిరిశిఖరంబొండు
కొరికి కుంభకర్ణుని కభిముఖుఁడై ♦ పటువుల ననె నిటుల
మరమున ప్రాకృతకపుల కొందరను ♦ ద్రుంచితివని మిగుల

గర్వింపకు చాతనైన నాతో ✦ గావింపుము సమితి
యుర్వింగూల్చెద కాచుకొమ్ము యని ✦ యుపల మతని నెత్తి
పై నేసిన నద్దాని కరంబున ✦ పట్టి దానవుండు
వానరేశ్వరుని పరుషములాడిన ✦ ప్రతిఘ మొంది యతడు
దానవు వక్షమునందు వైచె నొక ✦ తాలిశంబు మరల,
గాని రొమ్మునకు దగిలి చూర్ణమయె ✦ కడిది శైలమవల
సోకుడలిగి వడి నిశితశూలమును ✦ సుగ్రీవునిపైన
ఊంకొని వేసిన దానిని పావని ✦ యొడిసిబట్టి భిన్న
భిన్నములొనరిచె యూరుపర్వముల ✦ బెట్టి కపులు మెచ్చ
క్రిన్నన దానవు డలిగి మలయశృం ✦ గము బెరికి జగచ్చ
క్షువు తనయుని నెదనేసిన నాతడు ✦ క్షోణి మూర్ఛబడెను.
ప్లవగులు బెదరిరి, ముదమొందిరి యా ✦ తవు లమితంబుగను.
ప్రావేల్పుండటు మూర్ఛబడిన సు ✦ గ్రీవుని నెత్తుకొని
వేవేగను లంకామార్గము గొని ✦ పోవ పావని గని
మనమువనిటు చింతించె నక్కటా ✦ మర్కటవిభునితడు
గొనిపోవుచు నున్నాడె? వీని నని ✦ గూల్చి రవిజునిపుడు
విడిపించినయగు యశోహాని కపి ✦ విభునకు నదిగాక
విడుచునె యూరక దనుజు నతడు తె ✦ ల్విని గాంచిన వెనుక
అనుచు మర్కటుల జడుపుడుపుచు యు ✦ న్నంత ప్లవగవిభుని
దనుజు డెత్తుకొని రాజమార్గమున ✦ గొనిపోయెడి తఱి
పురవాసులు సమ్మోదమొంది యా ✦ పుణ్యజనునిపైన
సరససుమాక్షత ఆజోదకములు ✦ జల్లి రట్టి కతన;
తెలివినొంది సుగ్రీవుండత్తఱి ✦ తిమురుకొనగ నెంచి
పలలుని ఖరతర నఖరంబుల నిరు ✦ వక్షంబులజీల్చి
బలముగ ముక్కుం జెవులను గరచిన ✦ ప్లవగున్ పలలాసి
యిలబడవైచెను అట్టి యుదనుగని ✦ ఇనజుడు పైకెగసి

రామలక్ష్మణుల కడవ్రాలెను మ ♦ ర్కటు లెల్లరుబోగడ
ఏమరిల్లి యటు యొడలెల్లనులో ♦ హితము గారుచుండ
కుంభకర్ణు డొక ముద్గరముంగొని ♦ కోపంబుప్పతిల
అంబరీష మొనరింపగాను యట ♦ కరుదెంచెను మరల
వచ్చి యటుల ప్రత్యర్థిసైన్యముల ♦ జొచ్చి వలీముఖుల
యచ్ఛములను బక్షింపుచు నుండిన ♦ యడలి కపులు మిగుల
రాముని కడకుంబారి రాక్షసు దు ♦ రంతం బెరిగింప,
సౌమిత్రిం డాగ్రహమున జనియెను ♦ సమరంబొనరింప
గుప్పెను శరపంక్తులను లక్ష్మణుడు ♦ కుంభకర్ణుపైన,
దప్పికొనుచు దనుజుండు రాముని ♦ న్దాకగ నెదురు జన
రాముడు కోదండంబు బూని రౌ ♦ ద్రాస్త్రము సంధించి
ఆమిషాసనునిపై నేసెను హృద ♦ యంబును గురిజూచి
శరతాడనమున చలనం బొందె ని ♦ శాచరుండు మిగుల
యురుగద చేజారిబడె, సకలా ♦ యుధములు బడెనేల
అట్టుల నిరాయుధుండై యాగ్రహ ♦ మంది మర్కటముల
బట్టి ముష్టినిం బొడుచుచు, మోదుచు ♦ బక్షించుచు నొడల
నల స్రవింపగావచ్చి రాముపై ♦ శిలోచ్ఛయం బొందు
బలముగనేసిన రాఘవుండు త్వర ♦ విలున శరములేదు
కొట్టెగొట్ట గిరిధరపైబడె, ప్రా ♦ వేల్పు డాగ్రహించి
ఇట్టుల బల్కెను శ్రీరామునితో ♦ ఎదుట వచ్చినిలచి,
"నేను కబంధుడగాను విరాధుడ ♦ గాను వాలిగాను,
గాను ఖరుండను; కుంభకర్ణుడను ♦ దానవవీరుడను
సామాన్యుండని యెంచకునను నా ♦ శక్తి నెరుగవీవు
నామాటకు ముజ్జగములు వడకును ♦ నరుడ వెంతనీవు,
కాచుకొమ్ము కడతేర్తు"ననుచు ము ♦ ద్గరమును పైకెత్తి
వైచెను రాముడు సునిశిత శరములు ♦ వానిమీద నంత

దానవుండు తచ్ఛరముల తన ము ♦ ద్గరమున ఖండించి
వానరులను బక్షింపుచు పైపై ♦ వచ్చుట గమనించి
వాయువ్యాస్త్రము శ్రీరాముడు క్ర ♦ వ్యాదునిపై విడచె,
సాయకంబు ముద్గరము గొన్న హ ♦ స్తంబును ఖండించె
విగత హస్తుడై కుంభకర్ణుడా ♦ వేశుండై వడిగ
అగమం బొక్కటి బెరికి రాఘవుని ♦ కభిముఖుడై రాగ,
జానకీ ధవుండైంద్రాస్త్రంబు ని ♦ శాచరుపై వైచి
వానిబాహువును ఖండించిన క్ర ♦ వ్యాదు డాగ్రహించి,
కరములు ముక్కుంజెవులు బోయి ర ♦ క్తంబుగార నొడల,
బిరబిరవచ్చెను రామునిపై బడ ♦ పెల్లార్చుచు మిగుల.
నరనాథుడు రెండర్ధ చంద్రబా ♦ ణంబు లేసి వాని
చరణద్వయమును ఖండించిన రా ♦ క్షసుండు బడెనవని.
మొండి కుంభకర్ణుండంతట రా ♦ ముని మ్రింగ దలచి
చండకరునిపై రాహువు జనియెడు ♦ చందము నోర్దెరచి.
యెదురేగగ శ్రీరాముడు సునిశిత ♦ ప్రదరంబుల నతని
వదనము నిండగవైచి చాపమున ♦ వాడి విశిఖమూని,
పోలి బ్రహ్మదండంబును భాస్వర ♦ పూష సన్నిభంబై
కాలదండసమమై కాలాగ్ని జ్వా ♦ లాభీలంబై
అశని కల్పమై యొప్పుచున్న యైం ♦ ద్రాస్త్రము యోజించి
నిశాచరునిపై బడవైచిన యది ♦ నెవ్వడి జనుదెంచి
కుంభకర్ణు కుత్తుక ఖండించిన ♦ గూలెనతడు భువిని
కుంభినిబడె వేరై యాతనితల ♦ కుతరముకై వడిని
లోకాతీతుడు లోకబాంధవుడు ♦ లోకారాధ్యుండు
సాకేత పురీశుడు శ్రీరాముడు ♦ జానకీధవుండు
లోకకంటకుండైన కుంభక ♦ ర్ణుని సంహారింప
రాకాసులు వ్యాకుల మొందిరి మ ♦ ర్కటు లానందింప.

పరాశరులు ప్రస్తుతిగావించిరి ♦ సురలు సంతసిలిరి,
గరుడ యక్షగంధర్వ, సిద్ధ కి ♦ న్నరులు హర్షబడిరి.
విద్రావితులగు దనుజులు కొందరు ♦ వెడలి రావణునితో
అదురుచు దెల్పిరి కుంభకర్ణు డె ♦ ట్లని శ్రీరామునితో
పోరికడకు హతుడగుటను; అదివిని ♦ పొగలుచు రావణుడు
ధారుణిబడె మూర్ఛితుడై; దేవాం ♦ తకుండు, త్రిశిరుండు
అతికాయుండు, నరాంతకుండు తమ ♦ పితృభ్రాతు డనిని
మృతి నొందెనటంచును విని వగచిరి ♦ మిక్కిలి, సోదరుని
మరణంబునకై మహాపార్శ్వుడును ♦ మహోదరుడు చాల
పరితపించి రంతటిలో రావణుడు ♦ సొరుగు నెత్తికొయిటుల
విలపించెను హాకుంభకర్ణ ! హా ♦ వీరా ! సహోదరా !
యిల నన్వీడి యమాలయంబునకు ♦ నేగితి విదిమేరా
నీవులేని నాబ్రతు కేటికి యిక ♦ నిర్జరసంహారా
దేవతలను నేమున్న జయించుట ♦ నీవు యుంటగదరా
జానకి యేటికి, లంకేటికి, రా ♦ జ్యం బేటికినాకు
నానిమిత్త మనువుల బాసితివా ♦ నరునొకనిచె కడకు
విననైతిని నేతొలుత తమ్ముడా ♦ విభీషణుని హితము
అనుజా, మననిల ! భరియింపగ జా ♦ లను నీవియోగము;
అని బహుభంగుల దురపిల్లుచు ను ♦ న్నట్టి రావణునికి
తనయులైన త్రిశిరాదులు నల్వురు ♦ ధైర్యోక్తుల బలికి,
రామచంద్రు నవలీలగ ప్రవిదా ♦ రణమున జంపుటకు
తామేగెద మన రావణుండు సం ♦ తసించి రక్షణకు
మహోదర మహాపార్శ్వుల నిచ్చి కు ♦ మారుల వనికంప,
బహువిధ శస్త్రాస్త్రంబుల గైకొని ♦ పరిగ మనుసరింప
నలువురు దేవాసుర దర్పఘ్నులు ♦ నలువు రార్జస్వలులు
నలువురు బహుమాయావులు ధీరులు ♦ నలువురు దుర్జయులు

నలువు రేంద్రతర సములు సాంయుగీ ♦ నులు, శూరులు, ఘనులు
నలువు రభ్యమితేర్యులై జనిరి ♦ అలుకునొంద కపులు.
అతికాయుండును, త్రిశిరుండును ఘన ♦ శతాంగముల నెక్కి
మత్తగజంబగు సుదర్శనంబును ♦ మహోదరుం డెక్కి
బరగు చ్చైశ్రవసమమగు తురగము ♦ నరాంతకుం డెక్కి
పరిఘముగొని దేవాంతకుడు మహా ♦ పార్శ్వుడు గదనూకి
అంబరీష తలమందు సింహనా ♦ దంబుల గావించి
అంబులన్విడిచి మరల బట్టుకొని ♦ అలరిరి ధృతిమించి
రావణాత్మజుల క్ష్వేడితంబులును ♦ రథనేకుల రొదలు
ప్రావేల్పుల కోలాహలములు గు ♦ జ్జంబుల హేషములు
కరుల బృంహితంబులు గలయగ యా ♦ కాశము దద్దరిలె
హరి చయమరాతి బలముల దాకగ ♦ నాయతమై వెడలె
అటు లాడంబరముగ జిసిరాక్షసు ♦ లరిబలముల జొచ్చి
తుటుముల విజృంభింప జేసి కపి ♦ స్తోమంబుల గూల్చి
భీకర రణ మొనరించుచున్న తరి ♦ పిరదీయక రిపుల
తాకిరి తుములంబవగ వానరులు ♦ చేకొని గిరితరుల.
పోరు ఘోరమయె నిరుక క్షలగల ♦ పుణ్యాజనులు కపులు
హేరాళంబుగ జచ్చుచుండె లో ♦ హిత శైవాలినిలు
బారె రణస్థలినందు మృతకళే ♦ బరములు తేలాడె
ఫేరవములు చరియించెను పిశాచ ♦ భేతాళములాడె
అత్తరి నరాంతకుడు బహుయుద్ధుం ♦ డై యంతకుజాడ
అత్తల ముంగొని కపులను జంపుచు ♦ అరుగు దెంచుచుండ
అరుణాత్మజు పేరిరుడై యంగదు ♦ డాగ్రహమున వెడలి
నరాంతకుని కెదురేగి పరుష ములు ♦ నాడ నతడు కనలి
శూలమంగదుని యెదనేసిన యది ♦ నేలబడెను నుసిగ
వాలిజుడంతట నాగ్రహ మొందుచు ♦ వాడెక్కిన తురగ

శిరము భిన్నమవ తలమున యడచిన ♦ క్షితిబడెనది చచ్చి,
పరిభవింపబడి నరాంతకుం డ ♦ వ్వగిది యాగ్రహించి
బొడిచె తీవ్రముష్టిని నంగదు శిర ♦ మును ధీరతమించి
పిడికిటిపోటున కంగదుండు ధర ♦ బడి మూర్ఛిలిలేచి
పడిగ నరాంతకు యురమున, ముష్టి ♦ ప్రహారము గావింప
బడె నరాంతకుడు వక్షము భిన్నం ♦ బై నల్లస్రవింప
రావణుసుతుడు నరాంతకుడటు ని ♦ ర్యాణమొంద త్రిశిర
దేవాంతక యుద్ధోన్మత్తులు యా ♦ ధినొంది క్రుధమీర
అంగదుపై దలపడిరి ముువ్వురును ♦ హరివరుడదిగాంచి
అంగదనొందుచు క్ష్వేడితమొనర్చి ♦ నింగికెగసి నిలచి
శిలలను మహీరుహంబులగొని వ ♦ ర్షించె రిపులపైని
శిలీముఖంబులనేసి గొట్టి వై ♦ చెను త్రిశిరుడు వాని
నక్కలంబంబులనువేసి త్రిశిరు డం ♦ గదుని గప్పుచుండె
పొలుపుగ సురాంతకుండు పరిఘము ద్రి ♦ ప్పుచు తలబడుచుండె
వారణంబుతో మహోదరుడు స ♦ ర్వాలల నేయుచుండె
పోర ఘోరముగ యంగదు డాము ♦ వ్వురతో నొక్కండె
ఒక్కరికొక్కరు యణుమాత్రంబును ♦ యోడిబోవకుండ
ఉక్కడీడులై పోరుచుండె రణ ♦ మొత్తరమగుచుండ
సామీరియు నీలుం డంగదునకు ♦ సాయంబుగవచ్చి
ఆమహోదర సురాంతక త్రిశిరుల ♦ త్రోమేదము బొడిచి
అసురమొత్తముల కూల్చుచు నుండిన ♦ ఆగ్రహించి ముపురు
వెస కపిముఖ్యుల దాకిరి ముద్గర ♦ విశిఖములతో; పోరు
అతితీవ్రత జెందెనట్టి తరి మా ♦ రుతి దేవాంతకుని
హతమొనర్చె నొకముష్టి ఘాతమున ♦ యవల మహోదరుని
నీలుడు నిహనన మొనరించెను ♦ యొక ♦ శైలము బడవైచి
కోలలంత పావనిపై త్రిశిరుడు ♦ గుప్పెను గురిజూచి;

త్రిశిరునిపై మారుతి గురిపించెను ♦ దృషత్తులను వడిగ
విశిఖంబులచే వానిని గొట్టెను ♦ నిశాచరుడు తిరుగ
కపివరుడాతని హయముల జంపె న ♦ ఖరములచే జీల్చి
క్షపాచరుం డనిలజుపై వైచెను ♦ శక్తిని కోపించి
పావని తనపైవచ్చుశక్తిని న్బట్టి ♦ విరచివైచె
ప్రావేల్పు డంతనొక ఖడ్గముగొని ♦ పవనజు నెదబొడిచె
కపివరు డాగ్రహమంది త్రిశిరు వ ♦ క్షము తలమున జరచె
క్షపాచరుడు మూర్ఛిలి ధరబడి ఖ ♦ డ్గంబు జారవిడిచె
ముష్టిని బొడిచెను త్రిశిరు డనిలజుని ♦ మూర్ఛదేరి యపుడు
రిష్టమనిలజుడుగొని ఖండించెను ♦ త్రిశిరు తలలమూడు.
దనుజులు త్రిశిరుండీల్గుటగని వి ♦ ద్రావితులై రడలి
ఘనముగ క్ష్వేడితములు గావించిరి ♦ కపులు సంతసిల్లి
నరాంతకుండును సురాంతక మహో ♦ దరులు త్రిశిరులటుల
పరివర్జితులవ మహాపార్శ్వుడొక ♦ పరిఘమూని కేల
వృక్షచరుల దునుమాడుచు వచ్చిన ♦ వృషభు డాగ్రహించి
రక్షసుదాకిన వాడావృషభుని ♦ వక్షము లక్షించి
పరిఘంబున గొట్టిన వృషభుండెద ♦ బగిలి స్రవింప నల
ధరమూర్ఛిలి తెప్పరిల్లి ధైర్య ♦ స్థైర్యము లుప్పతిల
మత్తునిపైబడి గదనుబెఱికి కొని ♦ మహిత విక్రమమున
యెత్తి బిరబిర ద్రిప్పి మొత్తె నా ♦ మత్తుని శీర్షమున
దంతనేత్రములు వ్రెళ్ళ దానవుడు ♦ ధరన్బడియెజచ్చి
అంతట యున్మత్తుండు గవాక్షుని ♦ యంతికమున నిలచి
పరిఘ మొకటిగొని పైబడనుండ గ ♦ వాక్షు డలుకబూని
గిరి నొక్కటి దానవుపై వైచెను ♦ కీనాశుడు దాని
గ్గుదియుతో భిన్న మొనర్చి గవాక్షుని ♦ గొట్టె నెదను కనలి
రుధిరముగార గవాక్షుండించుక ♦ స్రుక్కి తెప్పరిల్లి

ప్రితలంబున యున్మత్తుని జరచిన ♦ బడెనతఁడిలజచ్చి.
అతికాయుం డంతట చాపముగొని ♦ అరద మధిష్టించి
క్ష్వేడ మొనర్చుచు పలుమరు తన పే ♦ ర్జెప్పుకొనుచు కపుల
వాడితూపుల నొప్పించుచు వడివడి ♦ వచ్చిన గని మరల
కుంభకర్ణుడే బ్రతికివచ్చెనని ♦ కోతు లదరి బాఱి
కుంభినీధవుండగు రామునికడ ♦ కుం జని మొరలిడిరి.
సరసర వచ్చెడు నసురునిగని వి ♦ స్మయమునొంది కపుల
న్వెరువకుఁడని శ్రీరాముడు బల్కెను ♦ విభీషణుని కిటుల
"రాక్షసోత్తమా! అదె వచ్చెడు యా ♦ రాక్షసునింజూడు
ప్రేక్షణీయు డత్యున్నతగిరి సమ ♦ భీకర విగ్రహుడు
దినకర తేజుడు ధీరోదాత్తు డు ♦ ధృఢు డుగ్రముఖుండు
కనకపృష్ఠ కోదండధరుం డు ♦ త్కట బాహాబలుడు
శణ ఘన తోమర ఖడ్గచర్మ ప్రా ♦ సాది శస్త్రధరుడు
మణిమండల కాంచన రత్నాంగద ♦ మకుటభూషితుండు
సహస్రహయములతోడ తేజరిలు ♦ శతాంగంబుపైన
అహమిహమికనుడై వచ్చుచునున్నా ♦ డాతండెవ్వ" డన
విభీషణుడు శ్రీరామున కనెనిటు ♦ వీ డతికాయుండు
అభిశస్త దశగ్రీవునకును ధా ♦ న్యమాలికిని కొడుకు
వృద్ధశేవి సర్వాస్త్రవేది త్రిది ♦ వేశకంటకుండు,
యుద్ధకోవిదుం డుక్కరి యుద్ధతు ♦ డూర్జస్వలుడు ఘనుడు
పరమేష్టిని మెప్పించి తపంబున ♦ సురాసురులవలన
మరణములేని వరం బీ రథవ ♦ ర్మాస్త్రంబులు గొనిన
పరాక్రముం డితనిచె రక్షింపగ ♦ బడుచుండెను లంక
సరిసమానుడీతండు తండ్రితో ♦ సమరంబున గనుక
ఈతండింకను కపిసైన్యంబుల ♦ హింసించకమున్నె
ఘాతించుము శ్రీరామా యీ యతి ♦ కాయునివడి యనెను.

అంతలోన అతికాయుడు కపివ్యూ ♦ హంబుల బరిగొనుచు
అంతకునలె యనుకామినుండై ♦ అరుదెంచుట గనుచు
శరభకుముదమైంద ద్వివిదాదులు ♦ సాలశైలములతో
గరాసుకొన్నాకిరి వాడంతట ♦ కంకపత్రములతో.
వాటిని నుగ్గొనరించి వానరుల ♦ బట్టికొట్టి తనతో
పోటు సల్పుమని రామునివద్దకు ♦ బోయెను దర్పముతో.
రామానుజు డపుడాగ్రహుడయ్యె శ ♦ రాసనంబు బూని
జ్యామొరయించిన దిక్కులు ఘూర్ణిలె ♦ చలమొందెను యవని
రతనపుగనులు కలంగె రాక్షసులు ♦ పరిదారితులైరి
అతికాయుం డాశ్చర్యమగ్నుడై ♦ అననిటు సౌమిత్రి!
బాలకుండ వల్పుడవు పరాక్రమ ♦ శాలివి గావీవు
ఏల ప్రాణముల బాయుదు వనినా ♦ కెదురు నిల్వలేవు
శితశిఖవేగము నోర్వగజాలవు ♦ బ్రతుకదలచితేని
మతిమంతుడవై మరలిపొమ్ము నా ♦ హితంబు వినవేని
ఒరిమార్చెద నినుగాచుకొమ్ము యని ♦ ప్రదర మొకటిదీసి
శరాసనంబున నునిచినిల్వ ల ♦ క్ష్మణుడు మిగులగినిసి
అననిట్లోరీ! రాక్షసాధమా ♦ ఆత్మస్తుతి తగునా
నినునిర్జింపగ నేను జాలనా ♦ నిక్కుకు గుణహీనా
శూరులు వ్యర్థము లాడరుశక్తిని ♦ జూపింతురు క్రియల
పోరుము నీచేతైన నాదు శర ♦ మున ఖండింతు తల,
నావిని యాశరుడేసె శరంబును ♦ నరవరుపై గినిసి
ఆవిశిఖంబును గొట్టె లక్ష్మణుం ♦ డర్ధచంద్రమేసి;
వీరి యుద్ధమును జూచువేడ్క విను ♦ వీధిని దేవగరు
డోరగ ఋషియక్షాదులు నిలచిరి ♦ యుర్వీరువురి పోరు
శరముగ్రింబయె, అతికాయుడు ల ♦ క్ష్మణుపై లక్షించి
శరము లైదునైచిన వాటిని ల ♦ క్ష్మణుండు ఖండించి

సునిశిత సాయకమొక్కటి బాణా ♦ సనమున యోజించి
దనుజుని ఫాలము దాకగనేసెను ♦ దానవ్వలియించి
నుదుట రక్తముం జిమ్మతికాయుడు ♦ మదిలో జింతించి
ప్రదిరపరంపర లేసె లక్ష్మణుని ♦ పైన నూటిజూచి
నరవరుడా శరపంక్తిని నడుమనె ♦ నఱికె ఖగములేసి
గరాసుండు తనశరములు నిరర్థ ♦ కంబౌటను దెలసి
కోపోద్భటుడై తీక్ష్ణంబగు నొక ♦ కోలను గ్రహియించి
చాపమునన్సంధించి వైచె ల ♦ క్ష్మణునెద గుఱిజూచి
క్షతజశిక్తుడై జ్వలితుండై యా ♦ గ్రహమున సౌమిత్రి
అతికాయునిపై వైచెను యాగ్నే ♦ యాస్త్రమంత రాత్రి
చరుడేసెను లక్ష్మణుపై సౌరా ♦ స్త్రంబు వింటబెట్టి;
ధరబడియెను భస్మంబై రెండును ♦ దాకుచు నొకటొకటి.
అతికాయుం డైషికాస్త్రమేసిన ♦ ఐంద్రమేసె నితడు
అతడు యామ్యమేసిన వడివాయ ♦ వ్యమేసె లక్ష్మణుడు
రావణాత్మజుడు వైచెడు దివ్యా ♦ స్త్రంబుల ఖండించి
పావక ప్రతిమానములగు తూపుల ♦ బరపె నాగ్రహించి
ఆవిశిఖంబుల కబేధ్యమయ్యెను ♦ అసురుని కవచంబు
ప్రావేల్పుండొక్కించుక యైనను ♦ బడ డాభీలంబు
అతికాయుడు క్రూరాహిరూపముగల ♦ అంబునొకటి వైచె
క్షితిపతి సుతుడది దగిలించుక మూ ♦ ర్ఛిల్లి వడిగలేచె
వేయి శరములేసెను లక్ష్మణు డతి ♦ కాయునిపై మరల
సాయకంబులన్నియు వ్యర్థంబయె ♦ క్షపాచరుని యెడల.
అత్తరి వాయువువచ్చి లక్ష్మణున ♦ కతికాయుండు విధి
దత్తవరుడు గావున బ్రహ్మాస్త్రము ♦ దక్క యితరమొద్ది
జంపజాల దాతని యన విని ల ♦ క్ష్మణుడు తీక్ష్ణమైన
అంపమొకటి బ్రహ్మాస్త్రము నభి మం ♦ త్రింపగ నభ్రమున

సోమ సూర్యగ్రహములు తలడిల్లిరి ♦ చుక్కలు రాలెనిల,
భూమి తీవ్రముగ కంపించెను య ♦ బ్ధులు ఘూర్ణిలె మిగుల
రామానుజు డపుడాశరమా క ♦ ర్ణాంతంబుగ దీసి
ఆమిషాసనునిపై విడచిన గని ♦ అతికాయుడు గినిసి
శరపంక్తుల గుప్పించెను పదపడి ♦ నిరోధింప దాని
స్వరతు ప్రాస ఘనశక్తి గదాదుల ♦ ప్రతిఘటించె గాని
ప్రళయకాల దావాగ్నితుల్యమగు ♦ బ్రహ్మాస్త్రము వాని
గళము నుత్తరించిన మృతుడై అతి ♦ కాయుడు బడె నవని
మృతు డవ రావణి, అడలుచు బారిరి ♦ మిగిలిన రాక్షసులు
జితకాశి సుమిత్రా తనయుని పూ ♦ జించిరి వానరులు
ద్రావితులచె యని అతికాయాదుల ♦ చావును విని వగచి
రావణు డనెనిటు పరిదేవనముల ♦ రాక్షసులం జేర్చి,
'శత్రుభయంకరు లజేయులును శ ♦ స్త్రాస్త్రవేదులైన
పుత్రులు మిత్రులు భ్రాతలు ప్రసిద్ధ ♦ పుణ్యాజనులు కలన
మడిసిరి సేనలు పెక్కు హతంబయె ♦ మానవమాత్రులచే
పుడమిజావిభుడు, రాముడు హరియే ♦ భూమి నవతరించె
రాముని మహిమంబరయుగ నైతిని ♦ రాక్షసుడెవ్వండు
ఆమహనీయుని జంపలేడు భువి ♦ ఆత డజేయుండు
స్వబాహాస్త్రబలంబులచే నతనికి ♦ సాటిలే డెవండు
ప్రబలులు లక్ష్మణ రవిజాంగద హ ♦ నులతనికి తోడు
గాక తమ్ముడు విభీషణుడాతని ♦ కాశ్రితుడెడ కాడు
నాకేమియు పాల్పోవకుండె"నని ♦ శోక మొందియుండు
తరిని నింద్రజిత్తుండు వచ్చియట ♦ తండ్రితో ననెనిటుల
"ధర నేనుండగ తండ్రి నీవిటు ♦ నరుల కడలనేల
శోకభయము లుడుగుము రాఘవులను ♦ సుగ్రీవాదులను
ప్రకటముగ సంహరించి వచ్చెద ♦ ప్రధనంబున నేను"

అనుచు నింద్రజి త్శరములు గట్టిన ♦ అరద మధిష్ఠించి
జనియె ననికి; రాక్షసవీరులు శ ♦ స్త్రంబులు ధరియించి
గూడనేగి రరదంబు లేనుగులు ♦ గుర్రంబుల నెక్కి
దాడివెడలి వడివచ్చి ఇంద్రజి ♦ త్తభిమర్దస్థలికి,
నిలచి యొక్కచో రథము డిగ్గి య ♦ గ్నిని యచ్చట నిలిపి,
ఆలరయాభిచారక హోమంబును ♦ ఆగమవిధిసలిపి,
అనలదత్తహయ రథ ధను శర బ్ర ♦ హ్మాస్త్రంబుల బడసి
కనుబడకుండగ నిలచె మేఘముల ♦ వినువీధికి నెగసి
అవుడాతనిపరిగమి, తోమర గద ♦ కృపాణఘనములతో
కవులపై గదియ, తరులగిరులుగొని ♦ చపలులు వలలులతో
డీకొని నియుద్ధమొనరించిరి యట ♦ ఆకసమున నిలచి
చీకాకొనర్చె కవుల నింద్రజితు ♦ చిలుకుల గుప్పించి.
దానవులును వానరులును జచ్చిరి ♦ వేనవేలు కలిని
గాని యనీకము క్రమముగ తీవ్రత ♦ గాంచెను అత్తరిని
చపలు లింద్రజితుపైనను రువ్విరి ♦ సాలశైలములను
కుపితుండై రావణి కోతులపై ♦ గుప్పెను శరములను
క్షపాచరులు; చపలులచే చపలుల ♦ కపులు; క్షపాచరుల
క్షపాచరులచే, గొట్టి రస్త్ర శ ♦ స్త్రచల తరులుగూల.
రణరంగము భీభత్సంబయె రుధి ♦ రంబుబారుచుండె
కుణపములందున దేలెను పిశాచ ♦ గణములు నడయాడె.
రావణివిధిద త్తిషువుల బ్రహ్మ ♦ స్త్రం బభిమంత్రించి
ప్రావీణ్యంబొప్పగ వైచెను కపి ♦ ప్రవరుల గురిజూచి
గవయ కుముద, మైంద, ద్వివిదాంగద ♦ గంధమాదన, నల,
గవాక్ష, దధిముఖ, జాంబవ, కేసరి ♦ గజ, సుషేణ, నీల,
పనస, ఋషభ, సుగ్రీవ, శరభ, పా ♦ వకాక్షహారిలోమ,
హనుమ, జ్యోతిముఖ, వేగదర్శి సూ ♦ ర్యాననాదులు క్షణము

స్పడిరి విసుగులై యవల ఇంద్రజిత్తు ♦ బ్రహ్మాస్త్రము మరల
కడిమితో బ్రయోగించె రాముల ♦ క్ష్మణులు మూర్ఛిల్ల
రావణియట్టుల రాఘవులను మ ♦ ర్కటుల రణస్థలిని
వైవశ్యతనొందించి పురికిజనె ♦ బ్రధనంబును మాని
అభియాతిచె దాశరథులు హరులి ♦ ట్లభిప్లవ మొందగని,
విభీషణుం డభిశోచన మొందుచు ♦ వెసనొక రొక్కరి,
అభిదర్శించుచు నూరార్చుచు యు ♦ న్నంతను సామీరి
అభినిర్ముక్తతగాంచి రిపుని బ్ర ♦ హ్మాస్త్రంబున; నలరి
ఒకరికొకరు తోడై కొంజివులుగొని ♦ ఉపలక్షించు తరి
వికలాంగ వలీముఖుల నెందరినొ ♦ విగ్రహస్థలి గనిరి
సురద్విషుని త్రిముహూర్తకాల సం ♦ స్ఫోటంబున కపులు
అరయగ నరువదియేడు కోట్లు హతు ♦ లవ్వగ రాక్షసులు
ఒక్కచోనుంచిరి తత్శవముల తమ ♦ లెక్కకు గాబోలు.
మిక్కిలి వగచిరి శవముల గని సా ♦ మీరి విభీషణులు
రక్కసులేరికి తమ నష్టంబులు ♦ లెక్కకు రాకుండ
మక్కిన దనుజులవైచిరి మందిర ♦ మం దగుబడకుండ
అకారణమున నెక్కడజూచిన ♦ రక్కస కుణపంబు
ఒక్కటి యున్నను బడలే దుభయుల ♦ కక్కడ చోద్యంబు
మక్కెలతో మాంసాదులతో యు ♦ సురికు బొఱుచుండె
కుక్కలు వృకములు కంకు గృధ్రములు ♦ నక్కలు దిరుగాడె
పెక్కుషువులు కాయాత్ముల దగులగ ♦ భిన్నాంగుండగుచు
దృక్కానక కపులస్థితి నెరుగక ♦ స్థిర పీడితు డగుచు
ఒక్కచోట ప్రాణావశిష్టుడై ♦ యున్న జాంబవతుని
మక్కువతో బిలచె న్విభీషణుడు ♦ మారుతి గూడజని.
ఎలుగున భల్లవిభుండు విభీషణు ♦ నెఱిగి బల్కెనిటుల
దెలుపు విభీషణ! మారుతిక్షేమమె! ♦ ధీరుడతనివల్ల

బ్రతుకగలము మేమెల్లరమన విని ♦ ప్రీణితుండై వాత
సుతుడనె నిటు "హనుమంతుడ వచ్చితి ♦ బ్రతికి యుంటె తాత!
పావని నాశీర్వదించి యిట్లనె ♦ భల్లుకేశ్వరుండు
రావణి బ్రహ్మాస్త్రంబున కీడ్పడె ♦ రాఘవులటుజూడు
చచ్చినవారును, ధరపైమూర్ఛి లి ♦ జావనున్న యట్టి
అచ్ఛభల్ల గోపుచ్ఛములన్నను ♦ మదె కరువలి పట్టి!
ఇందరి బ్రతుకుల కాధారుండవు ♦ ఈవే యిత్తరిని
సందేసించెదనే నిను వీరల ♦ సంరక్షణ బూని
నినుబోలిన ఘనధైర్యపరాక్రమ ♦ నిపుణులైనవారు
హనుమంతా! నిక్కంబుగ భువిలో ♦ గననెందును లేరు
ఉత్తరదిక్కున హిమాచలము కడ ♦ యున్నది కైలాస
మత్తావుననే యుండు ఋషభగిరి ♦ ఆరెండింటి దెస
మందుమొలం బొక్కటిగల దందున ♦ మందాకులు గలవు
అందు వెదకి వలసినయవి దేగల ♦ యట్టి సమర్థుడవు,
యీావుదక్క మాకెవరు లేరు ది ♦ క్కిత్తరి నది గాన
సావర్ణ్యంబు విశల్యము మృతసం ♦ జీవియు సంధాన
కరణులవడి గొనిదెచ్చి రాఘవుల ♦ కపులను భల్లముల
సొరగుదీర్చి బ్రతికింపుము, మృతులను ♦ దిరుగగ యిల మరల,
మనుపగ దేమ మెల్లర నీసా ♦ మర్థ్యము జూపించి
అనఘా ధన్యుడవగుము రాము కా ♦ ర్యము కొనసాగించి"
నావిని పావని క్ష్వేళితమొనర్చి ♦ నరవరులకు మ్రొక్కి
పావనమై రాజిల్లెడు త్రికూట ♦ పర్వతాగ్రమెక్కి
వంచివెన్నును ముడించి శ్రవణముల ♦ వక్త్రంబును దెరచి
అంచితవాలము బెంచి ద్రిప్పి కు ♦ ప్పించి దోలజాచి
చదలకెగసి యుత్తరాభిముఖుడై ♦ సముద్రమును దాటి
నదులు గిరు లరణ్యంబులు గమించి ♦ నగములలో మేటి

యగు హిమవంతముజేరి యచట ది ♦ వ్యాశ్రమములగాంచి
ప్రగుణమైన కైలాస ఋషభ ప ♦ ర్వతముల వీక్షించి
అందు మందుమల జూచి యోషధుల ♦ నంద వెదకివెదకి
ఎందునుగానక నేమియు దోచక ♦ మందుమలనె పెకలి
చేతబట్టి లంకాభిముఖుండై ♦ శీఘ్రంబుగ మరలె.
వాతాత్మజు డటు వచ్చుచు నలరె ది ♦ వంబున ద్యుమణివలె
శౌరిచేతి చక్రంబు కరణిరో ♦ షధగిరి చేబూని
మారుతివచ్చెడు తరి యోషధ పరి ♦ మళ మహిమచె నవని
న్బడియున్న వనేచరులు లేచి సం ♦ భ్రమముతో మారుతిని
బొడగాంచి నుతించి రంత పావని ♦ పుడమి వ్రాలి గిరిని
త్రికూట పర్వతమున నిడి నమస్క ♦ రించి వృద్ధకపుల
వీకతోడ వడి కౌగలించుకొనె ♦ విభీషణుని యవల,
దశరథ తనయులు రాఘవులోషధ ♦ తావాఘ్రాణించి
విశల్యులై రాజిలిరి, రాక్షసులు ♦ వెఱగొందిరి మించి,
అంతట తద్దివ్యౌషధాద్రిగొని ♦ హనుమంతుండు హిమ
వంతము కడకిడి వచ్చినిలచె కపి ♦ వ్రాతంబుల నడుమ.
అప్పుడు సుగ్రీవాజ్ఞను హనుమం ♦ తాది కపులుబోయి
నిప్పుబెట్టి లంకాపురిగాల్చిరి ♦ నిర్దయ నారేయి
గోపుర ప్రాసాదోక సౌధములు ♦ కోటలు కుడ్యములు
సోపానవితర్దిక పటలంబులు ♦ శుద్ధాంతట్టములు
గోపానసి ప్రప జనాశ్రయాదులు ♦ గూలిబడెను నేల;
కోపోద్దీతుడై రావణుడంతట ♦ కుంభకర్ణ సుతుల
కుంభ నికుంభుల బిలచి రాఘవుల ♦ కోతుల రణమున, ని
శుంభన మొనర్చి రండనితోడుగ ♦ శూరు లకంపనుని,
శోణితాక్షుని, బ్రిజంఘుని, యూపా ♦ క్షుని, బంపెను ననికి
రాణువతో సాయుధులై వారలు ♦ రణస్థలికి నురికి,

ఘోరతుముల మొనరింప వానరులు ♦ కోప మొందిమిగుల
పోరిరెపుర్గొని ధైర్య స్థైర్యం ♦ బు లుప్పతిల రిపుల.
ప్లవగవరులు మైందద్వివిదాంగద ♦ భానుసుత సుషేణ
పవనాత్మజ వేగదర్శులును మరి ♦ భల్లుకపతియు రణ
మున బాల్గొని తదాక్షసమట్కం ♦ బున యొక రొక్కరిని
అనీక మొనర్చి నిహానన మొనర్చి ♦ రందు ప్రజంఘునుని
నకంపనుని నకడ తేర్చి నంగదుడు ♦ కౌసల్యంబొప్ప.
చంపె శోణితాక్షుని ద్వివిదుం డతి ♦ శౌర్యముతోడ యూపా
క్షుని మైందుండును, కుంభ నికుంభుల ♦ సుగ్రీవనిలజులు
హానన మొనర్చిరి కపులబ్బురబడ ♦ అడలగ రాక్షసులు
ద్రావితులచె యకుకంభినికుంభుల ♦ చావునువిని వగచి
రావణుండు ఖరకుమారుడగు మకర ♦ రాక్షునిరప్పించి
"సుతుఁడా! నీ వని కేగి రాఘవుల ♦ సుగ్రీవుని కపుల
హత మొనర్చి రమ్మ"న మకరాక్షుం ♦ డసురానీకముల
గూడి స్యందనం బెక్కి కదల నిల ♦ గూలె కేతనంబు
ఊడిబడెను సవ్యేష్టుప్రతోదం ♦ బిల తదశ్వంబు
గొంకుతో నడచుచు గార్చెనశ్రువులు ♦ క్షోణి నెగసె ధూళి
శంకింపక మకరాక్షుండా దు ♦ శ్శకునములకు తరలి
రామచంద్రు డున్నట్టివైపుజని ♦ రణస్థలిని నిలువ,
ఆమిషాసనుని దాకిరి కపిసై ♦ న్యంబు లంతపడవ
కడుతీవ్రంబయె; పలువు రుభయప ♦ క్షంబుల మృతులైరి
కడ కసురులతో బోర లేక మ ♦ ర్కటులు ద్రవితులైరి
అత్తరి రాముడు కపుల వెరువకుం ♦ డని విలుగొని యసుర
మొత్తంబుల వారించె విడచి య ♦ మ్ముల నంతట మకరా
క్షుం డుగ్రుండై రాముని కనెనిటు ♦ "చూచితివుడెనిను, నా
తండిరి ఖరునిఁ జంపితివటమును ♦ దండక విపినమున

అది మొదలుగ నిన్వెదకుచు నుంటిని ♦ అగుబడితివి కడకు
గదాయుద్ధమో పరిదరయుద్ధమో ♦ గాక యెటులనీకు
అభ్యస్తంబో అటుల బోరుము త ♦ దనుగుణముగ నేను
అభ్యామర్ధమొనర్చి వైరని ♦ ర్యాతన మొందెదను
నిలునిలు రామా! శక్తిగల్గుచో ♦ నియుద్ధ మొనరించి
బిలుకుమార్తు నన్నన శ్రీరాముడు ♦ పలికెనిటు హసించి
"దూరీ! రాక్షస! వ్యర్థవచనములు ♦ నుగ్గడింపనేల
పోరసమర్థుడవైన నిలచి జూ ♦ పుము బలశౌర్యములు
నాచే ఖరదూషణులాదిగ పది ♦ నాలుగువేల రజ
నీచరు లీల్గుట వినియు నచ్చితివి ♦ నీచావిపుడు నిజ
మను" నంతలో మకరాక్షుండా గ్రహ ♦ మంది రాముపైన
ఘనతరాంబకము లేసిన రాముడు ♦ ఖగముల తద్బాణ
ములను దుంచి గుప్పించె తీవ్రశర ♦ ముల నసురునిపైన
పలలుండును ఖండించె రామురో ♦ పను లీచందమున
కలహము క్రమముగ మోపయ్యెను రా ♦ ఘవ మకరాక్షులకు
నిలచి రాకసంబున యమరాదు ల ♦ నీకను జూచుటకు
ఒక్కరికొక్కరు నిపుణత నేమియు ♦ నూరబోవకుండె
ఎక్కడజూచిన వారలతూపులు ♦ పిక్కటిల్లి యుండె
రాముడత్తరిని నూటిజూచితీ ♦ వ్రాంబకములు వైచి
ఆమిషాసనుని రథసారథి ర ♦ థ్యంబుల నిలగూల్చి
విరథుండగు మకరాక్షుడు తనపై ♦ వేయ శూలమొకటి
ధర దానిన్బడగొట్టె విలున శర ♦ త్రయమును బెట్టిగొట్టి
విఫలుండై యటు ముష్టిబట్టి పా ♦ రి వెల్వడు రాఘవుని
అపఘాతం బొనరింపగ పైపై ♦ నరుగుదెంచు తరిని
రామచంద్రుడాగ్నేయాస్త్రంబు శ ♦ రంబున యోజించి
ఆమకరాక్షునిపై వైచిన యంత ♦ దవనిన్బడె జచ్చి.

సురలుమింట గొనియాడిరి వానర ♦ వరులు సంతసిలిరి.
ఖరసుతయూపాక్షాదుల మరణము ♦ క్రివ్యాదులు బాత్రి,
దశగ్రీవునకు దెలుపయాత డ ♦ త్యంతంబు తపించి
దశరథాత్మజులనని జంపగ నిం ♦ ద్రజితుని నియమించి
బంపిన రావణి వేదికడకుజని ♦ ప్రతిష్టించి నగ్ని
జంపిభగలమును, హోమంబొనర్చి ♦ జ్వాలను ప్రసత్తిగొని
అతిధృతియై పృతనావృతుడై ది ♦ వ్యాయుదధారణుడై,
అతులిత శరచాపధరుండై బ్ర ♦ హ్మాస్త్రపాలితుండై,
అంతర్ధానము నొందు శక్తిగల ♦ యురద మధిష్టించి
అంత రిక్షమార్గంబున జని యరి ♦ కగుపింపక నిలచి
ఖరతరశములు వర్షించెను రా ♦ ఘవుల కవులపైన
హరులు జర్ఝరీకాంగులైరి బా ♦ శరథులు సంహాసన
ములు నల్లసరివింపగ శితమార్గణ ♦ ములు బరపిరిగాని
అలోకితుం డింద్రజితుని కడ వృధ ♦ యయ్యె నవ్వియన్ని
తారాపథమున దాగియుండి యిం ♦ ద్రజిత్తు డిటుమాయా
పోరిత మొనర్చుచుండ లక్ష్మణుడు ♦ పూర్వజుకనె నిటు యా
తువులనెల్లరను బ్రహ్మాస్త్రంబున ♦ దునింతు, గాని యెడల
అవక్షయం బొంద డింద్రజిత్తుం ♦ డన రాముండిటుల
బలికెతమ్మునకు, ఒక్కని కొరకై ♦ బ్రహ్మాస్త్రం బేయ
పలువురకును మృతి గలుగు నట్లొన ♦ ర్పంగవలదు దివ్యా
స్త్రంబుల జంప బ్రయత్నింతము యిం ♦ ద్రజిత్తు నెట్లైన
అంబర త్రిదశాలయము భూపాతా ♦ ళాదుల నెందున్న
విడువక జంపెదనన రావణిత ♦ ద్విషయంబు గ్రహించి
వెడలెను లంకకు రాఘవులను భ్రమ ♦ బెట్టగమది దలచి
అవల యింద్రజితు మాయాసీతను ♦ అరదంబున బెట్టి
పవనుజుడని జేయుచున్న పశ్చిమ ♦ ద్వారంబును బట్టి

జనుచుండగ మారుతిరథమందు కృ ♦ శాంగి దీన మాయా
జనకజనుంగని ఆమె నిజము దా ♦ శరథి రాముజాయా
సీతాదేవియె యని దుఃఖితుడై ♦ కోతులగూర్చుకొని
యాతువు నెదిరించిన నింద్రజితుం ♦ డలిగి ఖడ్గమూని
మాయాసీతను నఱకబూన, గని ♦ మారుతి యనె నిటుల
ఆయోధన మొనరింపగదలతువె ♦ అయోనిజను కూళ!
ఘోరా! బ్రహ్మకులంబున బుట్టియు ♦ ఆడుదానిజంపి
ఘోరపాతకంబున కొడిగట్టెద ♦ వేర? క్రూర! పాపీ!
అనుచు నింద్రజితుపై తరులద్రిరు ♦ లను వైచిన యతేఁడు
కనలి వాటిని ద్దునిమి కత్తిగొని ♦ అనిలజుతో "జూడు
మెవతెకొరకు శ్రీరామలక్ష్మణులు ♦ ఇనజాదులుగూడి
ప్రవిదారుణ మొనరువవచ్చిరో య ♦ ప్పడతిని దునుమాడి
మీయత్నము సాగనీయనని నా ♦ మీరి విభ్రమింప
మాయాసీతను నఱికె యామె "రా ♦ మా" యని విలపింప
పావని యట్టుల జానకి వధింప ♦ బడుటను వీక్షించి
ఆవేశన దుఃఖంబులు బెనగొన ♦ రావణి నెదిరించి
తరుగిరిపాషాణంబులేయ యిం ♦ ద్రజిత్తుఁ డీషికల
బరపి జర్ఝరీ కాంగులనొనర్చె ♦ ప్లవగానీకముల
రావణి ధాటికి నిల్వలేక యా ♦ హవము చాలించి
పావని జనె రాఘవ రవిజుల సం ♦ ప్రదింపగాదలచి
రావణి యట్టుల మారుత్యాదుల ♦ భ్రమియింపగ జేసి,
భూవిభుకడ కనుమడుపయనంబై ♦ పోవుటయును దెలసి,
అదియె సమయమని నికుంభిలకుజని ♦ అగ్ని వేల్చి యనురా
భ్యుదయంబునకై, హోమ మొనర్పగ ♦ మొదలిడెనట, శ్రీరా
మునికడకనిలజు డతిదీనుండై ♦ జని యశ్రువులొలుక
అనెని "ట్లింద్రజితుండు దుష్టుడసు ♦ రాధముండనీక

స్థలిని, కృశాంగియు, మలినవస్త్ర ధా ◆ ష్పాకుల లోచనయు
మలదిగ్ధశరీరయు దీనయు "రా ◆ మ" "రామ" యనుచుదియు
చుండిన సీతను రథమందున గూ ◆ ర్చుండబెట్టి దెచ్చి
ఖండించెను యా యమ శిరమున రా ◆ ఘవుండు వినివగచి
విపులంబున బడె నంత రాముదరి ◆ కపిముఖ్యులు జేరి
ఉపచారంబు లొనర్చి సేదదీ ◆ ర్చుచుండు యట్టితరి
అన్నను కరములఁగ్రుచ్చి మెత్తి యి ◆ ట్లనియెను సౌమిత్రి
"అన్నా ! వగవకు విధిదాటగ వ ◆ శ్యమె ? యేరికిధాత్రి,
ధర్మపరుడవు జితేంద్రియుడవు స ◆ త్యసంగరుడ వీవు,
దుర్మార్గుండు అధర్మవర్తనుడు ◆ ద్రోహి దశగ్రీవు
డతనికి ధర్మఫలంబు గల్గుటయు ◆ అపజయమా నీకు !
పితరునాజ్ఞ ధర్మంబని వచ్చితి ◆ వీవు విపినమునకు
ధరణిజ వధింపబడియె ధర్మవ ◆ ర్తన కిల యిది ఫలమా !
పరసతి హారణయు స్త్రీవధలొనర్చు ◆ పాపుల కిలజయమా !
ధరణిని ధర్మ మధర్మ మధర్మము ◆ ధర్మంబయె జూడ
స్థిరన బలంబె సుధర్మముగా దో ◆ చెడి యహా ! అట్టియెడ
ధర్మాధర్మ విచక్షణ యేవల ◆ దనుష్ఠానమునకు
కర్మరుడవవలె, దగినట్లా యా ◆ కాలమునకు, మనకు
ప్రతిక్రియయే కర్తవ్యంబిత్తరి ◆ పరమాత్ముడ వీవు
అఖిలోకుండవు నీబల మెరుగవా ? ◆ అజేయుండ వీవు
శోకింపకు నీకు ప్రియంబొనరిం ◆ చుటయే నాకుపని
నీకు విధేయుడనై నే ననిజని ◆ నిశాచరాధిపుని
వంశక్షయ మొనరించి వత్తునని ◆ వచియించుచు నుండ
అంశుమాలికులజుడు రాముని కడ ◆ కామాత్యులతోడ
విభీషణార్యుండరుగు దెంచి పృ ◆ థ్విజను యింద్రజిత్తు
అభిచర మొనర్చె ననవిని యనెనిటు ◆ అవనిజకు విపత్తు

గలుగు టదబ్బర మారుతి గని నది ♦ కల్పితమగు సీత
దెలియు నాకు మాయసన్నస్వభావము ♦ తలప, డిట్టిగాత
మునునే మాయన్నతో, సీతను రా ♦ మున కర్పింపుమని
వినయ సామ దానంబుల చేతను ♦ విన్నవింప వినని
ఆతండిప్పుడు సీతను వధింప ♦ అనుమతించినాడా?
సీత నింద్రజిత్తుం డిట దెచ్చుట ♦ చెండుటయును జూడ
మోసముగా దోచెడు ఇది రావణి ♦ జేసినట్టి మాయ
జేసి కృత్రిమపుసీతను గావిం ♦ చె నాత డీహత్య
అలవిగాదతని కవనిజనుం దే ♦ నశోక వని నుండి
వలలుని యీపని తనదు కార్య సా ♦ ఫల్యత కే వినుడీ.
నికుంభిలాహోమంబు జేయగా ♦ నిశ్చయించి యతడు
వికల్ప మొనరింప కుండ కపులి ♦ వ్విధము పన్నినాడు
శ్రీరఘూత్తమా సీతకొరకు యిటు ♦ చింతింపకు మతడు
చేరి నికుంభిలయందు హోమమును ♦ జేయుచుండె నిపుడు.
స్యందనమును, బ్రహ్మశిరంబను ది ♦ వ్యాస్త్రము, నశ్వముల
పొందు నింద్రజితు డాహోమంబును ♦ పూర్తిజేయు నెడల.
వరప్రసాదుండట్టులయగు రా ♦ వణిని జయించుటకు
తరమవ దా హోమము జెరచుట క ♦ ర్తవ్య మిపుడు మనకు
గావున రామా! కపుల నిచ్చి ల ♦ క్ష్మణుని న్పంపించి
రావణి హోమము భగ్న మొనర్చిన ♦ రణ మతండొనర్చి
సౌమిత్రి శితాస్త్రంబులచేతను ♦ సంహారింప బడును
రామచంద్ర! విను మిందులగలదొక ♦ రహస్యంబు మున్ను
ధాతవీనికి న్వరంబొసంగెడు ♦ తరి నిట్లనియుండె
"ఏతడు నీ హోమంబు జెరచి ని ♦ న్నెదిరించునో యతడె
నీకు మారకుండగు" ననె గావున ♦ నిక్క మతని చావు
చేకుగు విజయము సౌమిత్రితో జన ♦ మా కొసగుము సెలవు.

అనవిని రాముడు ధైర్యమొంది యి • ట్లనియె లక్ష్మణునకు,
అనుజా ! కపియూథంబులగొని నీ • వరిగి నికుంభిలకు
హోమిరావణి వ్వధించి రమ్మన • యుత్సాహము మిగుల
సౌమిత్రి తనుత్రాణకృపాణ పృ • షత్క నిషంగముల
ధరియించి రఘూత్తము యాశీర్వా • దంబులొంది, గూడ
మరుత్సుతాంగద విభీషణాదులు • మట్టాడుచునుండ
అడవి తిరుగుడుల సేనలు గదలగ • వడిగ నికుంభిలకు
వెడలెను, రావణి యొనర్చు హోమము • విఘ్న మొనర్చుటకు.
అటరావణి కాపుంచిన అరిసై • న్యంబుల జూపించి
ఇటులనె విభీషణుడు లక్ష్మణునకు • ఇషువుల సంధించి
ఈ వరూధినిన్జంపి, వధింపుము • ఇంద్రజితుని యవల
నావిని లక్ష్మణుడేసె నసుర సే • నలపై బాణముల.
కపులు శిలావృక్షంబులగొని రా • క్షసులతో తలబడిరి
క్షపాచరులు వివిధాస్త్రములతో వన • చరుల నెదుర్కొనిరి.
క్రమముగ యుద్ధము తీవ్రతజెందెను • క్రవ్యాదులు, కపులు,
సమసిరెక్కువగ, సౌమిత్రి శితా • స్త్రములకు దానవులు
నిలువలేక వికవికలైపారిరి • నలుగడ లదిగాంచి
అలిగి, హోమమును మాని, ఇంద్రజితు • డరద మధిష్టించి
తరుసమాజమున నుండివచ్చి నిశి • తాస్త్రపరంపరల
బరపి వానరుల బురిగొనజొచ్చిన • పవనాత్మజు డటుల
జనుదెంచెడి రావణిగని పర్వత • సన్నిభుడై తరుల,
న్గొని రక్కసులను మొత్తిన, రావణి • కుపితుండై మిగుల
శితశరములు హనుమంతునిపై వ • ర్షించెను; సామీరి
ప్రతిఘటించి వానిని రావణితో • పల్కెనిటుల యోరీ !
నన్నెరుగవో నాబలమెరుగవో పవ • నాత్మజుండ వినుము
నిన్నిక్కడనే నియుద్ధమందున • నీల్గించెద నిజము.

అనుచు శైలవృక్షంబులగొని రా ♦ వణిపై గుప్పించె,
అనిలజుపై మిక్కుటముగ రావణి ♦ యమ్ముల వర్షించె,
వీర లిర్వురిటుఘోర ఘోరముగ ♦ విభీషణుండుగని
శ్రీరాముని తమ్మున కనెనిటు వీ ♦ క్షించితె! మారుతిని
హనన మొనర్పగ రావణి దలచిన ♦ యట్లగుబడుగాన
అనఘా వధింపు మింద్రజితునివడి ♦ యని యాదరినున్న
వనమొక్కటి చేరంజని యనె రా ♦ వణజుడు హోమంబు
యొనర్చుచోటిదె గనుమాతండట ♦ యున్న యావటంబు
జేరి భూతబలి యొసగక మును పే ♦ జెందుము గానియెడ
ఆరావణి మాయా సమన్వితుం ♦ డై గనుబడకుండ,
అమరేంద్రాదులనైన జయించును ♦ అనవిని లక్ష్మణుడు
అమర్షణుండై నిలచె అమ్ములతో ♦ అంత నింద్రజితుడు
తనతో సమర మొనర్పగ సౌమి ♦ త్రిని దోడ్కొనివచ్చు
పినతండ్రిని దూరుచు ననెనిటు "మా ♦ విగమ ముపేక్షించు
నీతిబాహ్యుడవు స్వజనమువిడి అభి ♦ ఘాతుల గొల్చెదవు
జ్ఞాతిత్వంబును సౌహార్దంబును ♦ జాతిని గనుగొనవు
కుజనులైయైనను ఆత్మీయులతో ♦ గూడియుంట సుఖము
సుజనులైననూ పరులకు భృత్యత ♦ జూడ దుఃఖకరము.
అన్నసుతుడ, నాకపకృతి సల్పుట ♦ అన్యాయముగాదా
నిన్నువధింపక విడుతురె తమపని ♦ నెరవేరినమీద"
అనుచు నిటుల కఠినోక్తుల బల్కెడు ♦ అన్న సుతునకిటుల
అనియె విభీషణు డోరా యెరుగని ♦ యట్లు బల్కెదేలా!
కర్మ కొలదిగ గల్గెను నాకీ రా ♦ క్షసజన్మము గానీ
ధర్మముదప్పను, యొనరింపను దు ♦ ష్కర్మం బెపుడేని
నీతిపరుడ, మాయన్న యొనర్చిన ♦ నీచకృత్యములకు
ప్రాతికూల్యమును జూపివచ్చితిని ♦ సీతా విభుకడకు.

ఐనదేదో గానిమ్ము యిపుడు నీ ♦ వనీకరంగమున
భానుకులజునితో బోరుము ♦ కోల్తల ప్రిజ్ఞగల్గియున్న
కుటిల సమాఘాతం బొనరించిన ♦ యటులగాదు యిపుడు
వటవృక్షము కడకేగనివక నిను ♦ వధించు లక్ష్మణుడు
నీవు నీల్గెదవు లంక నాశమగు ♦ నిశాచరులతోడ
రావణుడత్యయుడవక తప్పదన ♦ రావణి క్రోధతోడ
శర చాప నిషింగాస్త్రింబుల గొని ♦ అరద మధిష్టించి
పరిగమితో ప్రళయకాల రుద్రుని ♦ పగిది యరుగుదెంచి
పినతండ్రిని దూషించుచు మారుతి ♦ వీపున గూర్చున్న
ఇనకులజున కిట్లనియె కపులు విన ♦ ఎటకేగెద విక నా
బాణ పరశు ఘనప్రాసశక్తులను ♦ ప్రతిఘటింపు డిపుడు
ప్రాణములతో బోనీయను మిముని ♦ పరాక్రమము గనుడు
మున్నానిశి యుద్ధంబున నాచే ♦ మూర్ఛిల్లిన నీవు
యున్నావెట్టులో బ్రతికిగాని నీ ♦ కున్నదివుడు చావు
నావిని లక్ష్మణుడాగ్రహమున యన ♦ రావణి కిటుల రణ
కోవిదుడెన్నడు బల్కడు వ్యర్థో ♦ క్తుల, జూపును నిపుణ
త్వము మాయాయుద్ధం బొనరించిన ♦ వాడు శూరుడగునా ?
సమర మొనర్పుము సక్రమముగ వి ♦ క్రమము జూపనున్న
నిస్సందేహము నాచేగల్గును ♦ నీకిప్పుడు చావు
దుస్సహమగునా నిశిత విశిఖము లె ♦ దుర్కొనలే వీవు
అనవిని రావణి, క్రోధోద్దీపితు ♦ డై విలుసారించి
సునిశిత బాణంబులను సుమిత్రా ♦ సుతునిపైని వైచి
దానవిద్ధుండై లోహిత గా ♦ త్రిజ్వలితుండైన
మానవోత్తముని కనెనిట్టుల యా ♦ త్మశ్శరముల వలన
నీకు చావు నిక్కంబు రాఘవుడు ♦ నీదుర్గతి గనును
కాకోలూకాదులు తృప్తిగ నీ ♦ కళేబరము దినును

నావిని లక్ష్మణు డాగ్రహమున బా • ణంబులారు నొకట
రావణి యెద సూటిజూచి వైచిన • ప్రావేల్పుడు వింట
శరత్రయము సంధించి లక్ష్మణుని • యురమందున వైచె;
దురమతిఘోరంబై క్రమముగ భీ • కరమై గాన్పించె
యిద్దరు నానాశస్త్రవిదులు స • న్నద్ధ శరాసనులు
యిద్దరు శరసంధాన నిపుణులు స • మిద్ధ పరాక్రములు
యిద్దరు భాస్వత్తేజోపేతులు • యిరువురూర్జస్వలులు
యిద్దరు అన్యోన్య జయేచ్ఛాయుతులై • యుద్ధస్థలి నిటులు
పోరాడిరి శంబర దేవేంద్రుల • బోలి, హరులవలెను
ఘోరమయ్యె క్రమముగ సంగ్రామము • కొంకక నిర్వురును
ఆశుగ ఖడ్గాదులతో బోరు చు • న్నట్టితరిని క్రూర
ఆశీవిషసమ విశిఖముగొని రా • మావరజుం డింద్ర
జిత్తుకొమ్ము నందాకగ సారిం • చి వేయనాతండు
శత్రురిలుచు వాడినమోముతో ల • క్ష్మణుని జూచుచుండు
తరిని విభీషణు డనెనిట్టుల దా • శరథితోడ జూడు,
శిరి తొలంగినటు గన్పడు రావణి • స్థితి నరయుగనిపుడు
వివర్ణవద నుండైయుండెను శిత • విశిఖ పరంపరల
నవారిగా గుప్పించి వధింపుము • అనవిని భానుకుల
జుడు సౌమిత్రి యశనిసమతీవ్ర • శుగములు రావణిపై
విడిచిన యాతడు శరవిద్ధుండై • బడెను సారసిధరపై.
రావణాత్మజుడు కొంతవడికి మూ • ర్ఛనుండి తెప్పరిలి
భూవిభుసుతునితో అనెనిట్లో రీ • మునస్మదీయ శలీ
ముఖపాశంబుల బద్ధితులై రా • ఘుండును నీవు వలీ
ముఖులడలగ నిడబడినది మరచితె • మూర్ఖ డని నిన్నవలీ
లగ దుంచెద నాశక్తిని ముద్గలి • యుగనైతివి గననీ
శుగము దీరనేటితో నీకిచ్చట • ఎగవును జెందకని,

జ్వలజ్వలన విస్ఫురవిశిఖము లే ♦ డు లక్ష్మణుని వైచి
కలమ్బముల్బది వైచి మారుతిని ♦ గాడజేసి మించి
కసలి మిగుల శతశితమార్గణములు ♦ కార్ముకమున నునిచి
పినతండ్రి విభీషణుపై వైచెను ♦ బిట్టుగ గుఱిజూచి
అదిగని లక్ష్మణుడాగ్రహమంది ద ♦ శాననజుని వాడి
ప్రదరంబుల గుప్పిన యాతని జే ♦ రా బడె ధరయూడి.
ఆమిషాసనుం డంతనుగ్రుడై ♦ ఆశుగములు గుప్ప
సౌమిత్రి యురశ్ఛదం బూడిబడె ♦ శ్రమ నిట్టుల రోప
ములనిర్వురు యొకరొక్కరిపై బర ♦ పుకొంచు విద్ధితులై
నలశ్రమింప బోరాడగజొచ్చిరి ♦ నలుగడ నుక్కరులై
అలయక సొలయక వారలిర్వురిటు ♦ అన్యోన్య జయేచ్ఛ
గలవారై పిడుగులవలె బోరుచు ♦ ఖగములను యదేచ్ఛ
గుప్పుకొనుచునుండిన యాకసమును ♦ క్షోణియు నలుదిశలు
గప్పబడియె తచ్ఛరపంక్తులచే ♦ కలి యుభయులకిట్లు
అతిభీకరమై, తుములమొనర్చిరి ♦ అందు నొకరికొకరు
జితులుగాక నిపుణతతో బోరిరి ♦ జెందక శ్రమ మెవరు.
అత్తరి విభీషణుండు నిశాచర ♦ ముత్తంబులదాకి
మొత్తి పెక్కురను బల్కెనిటుల కపి ♦ ముఖ్యులతో నొక్క
గతి యింద్రజితుండొక్కండే దశ ♦ కంఠున కిత్తరిని
మృతుడేరావణుడని భావింపుడు ♦ ఇతడు జచ్చెనేని.
కుంభ నికుంభులు, ప్రజంఘు, సుప్త ♦ ఘ్నులును, జంబుమాలి,
కుంభకర్ణ, దేవాంతక, యుపా ♦ క్షులును, మహామాలి,
మహాపార్శ్వ, అతికాయ, త్రిశిర ధూ ♦ మ్రాక్ష అకంపనులు,
ప్రహాస్త, యుద్ధోన్మత్త, నరాంతక ♦ ప్రఘాస, కంపనులు
సుపార్శ్వ, విద్యుజ్జిహ్వానిఘ్నులును ♦ శోణితాక్ష, వికట,
తపన జంఘు సంహ్రాది ప్రఘున దు ♦ ర్ధర్షాది నిశాట,

ప్రముఖులు, రావణు నాత్మీయులు తమ ♦ తమ పరిగమితోడ
సమసిరిగద, యితడీల్గిన దిక్కుద ♦ శాననుకెవ్వరిడ ?
భ్రమనొందక ప్రద్రావితులవ్వక ♦ ప్రమత్తులును గాక
సమర మొనర్పుడు సమయంబని ప్రో ♦ త్సాహించుచు బలుక
కపియూథంబులు సింహానాదములు ♦ గావించుచు మిగుల
ఉపలశిలోచ్చయ పాదపముల గొని ♦ రిపుసంఘాతముల
పైసన్గదిసి సమీకమొనర్చిరి ♦ పరాక్రమము మించి
మానవోత్తముని డించి మారుతి ద్రు ♦ మంబును పెకలించి
నిశాచరులపై గదిసి పెక్కురను ♦ విశసించెను నొకచో
స్వసేనలతో జాంబవంతు డసురుల ♦ జంపదొడగె నొకచో
క్షపాచరులు కరవాలపరశ్వధ ♦ ఘనప్రాసాదులతో
కపులను ఎలుగుల నెదుర్కొనిరి వి ♦ క్రమ సాహసములతో.
అంతరావణాత్మజుడు మరల ఘో ♦ రాంబకములు జాంబ
వంతునిపై గుప్పించె విభీషణు ♦ పైని సునిశితాంబ
కములు బరపి లక్ష్మణుని నెదుర్కొని ♦ ఖగములు వర్షించె;
సుమిత్రజుండాతనిపై తూపులు ♦ సూటిజూచివైచె.
నరవానర భల్లాదులకును దా ♦ నవులకు రణమిటుల
మరల తీవ్రమయె, రావణియును ల ♦ క్ష్మణుండు నొండొరుల
శరవిద్ధితులం గావించుచు క్షత ♦ జ గాత్రులై ఘోర
ధరాంబరములును దిశలును నిండెను ♦ శరములతో తిమిర
మెల్లెడలన్గప్పె వీవదయ్యె స ♦ మీరం బనలంబు
అల్లయ్యెను వెల్లువలైబారెను ♦ అవని లోహితంబు.
ఎక్కడజూచిన పీనుగుపెంటలు ♦ పిక్కటిల్లియుండె
నక్కలు కుక్కలు వృకాదు లయ్యెడ ♦ నడయాడుచునుండె.
బహుస్వనములు గూసెను, యమరాదులు ♦ బారిరి గనలేక
మహార్షులును దిగులొంది జగములకు ♦ మంగళమగుగాక !!

యనుచుబల్కి రత్తిరిని లక్ష్మణుం ♦ డాగ్రహించి మించి
సునిశిత ఆజిహ్మాగములు నాలుగు ♦ ధనువున సంధించి
వల్లనిరావణి నాల్గుతురగముల ♦ నాటగ పచరించి
భల్లమొకటి పోదిపెరికి నారిసం ♦ ధిల్లజేసి వైచి
సారథిశిరమును ద్రుల్లజేసెను ద ♦ శానన సుతుడంత
సారథితానై హయముల నడుపుచు ♦ చాపమూని నిశిత
శరపరంపరలు వర్షించుచు సం ♦ గర మొనర్చుచుండు
తరిని ప్రమాదియు గంధ మాధనుడు ♦ శరభుడు రభసుండు
గరాసుయరదము జేరి నాల్గుతుర ♦ గంబుల తలలణచి
అరదము నుగ్గొనరించి లక్ష్మణుని ♦ దరి నిలచిరి వచ్చి.
విరథుండై ధరనిలబడి రావణి ♦ నరోత్తముని మేన
ఖరతరశరముల నేసిన వడి ల ♦ క్ష్మణు డసురునిపైన
చండకాండముల బరపె; నిట్లు ల ♦ క్ష్మణుడును రావణియు
రొండొరులతో గజవృషభము లటులా ♦ యోధనమును జేయు
చుండిరి నేర్పుతో, రాక్షసవానర ♦ తండంబులు రెండు
గండుమిగిలి తుములంబొనరించుచు ♦ నుండ నింద్రజితుడు
దానవసేనల జేరి బల్కెనిటు ♦ భానుడస్తమించె
గానుపింపకుండగ దిక్కులు చీ ♦ కట్లు గ్రమ్మజొచ్చె
కవు లెవ్వరో శత్రువు లెవరో యను ♦ గాహన మవకుండె
రిపులను నేవచ్చువరకు యేమా ♦ రించుచుండు డిపుడె
లంక కేగి రథమెక్కివచ్చెదను ♦ లాంగూలులతోడ
సంకులసమరము గావింపుడు నా ♦ జాడ నెరుగకుండ
అనుచు నింద్రజితుడరిగి లంక జవ ♦ నాశ్వ సమన్వితమై
కనక మణి ధ్వజ విరాజితంబై ♦ క్షుత్తాస్త్రయుతంబై
దనరెడు స్యందనమెక్కి నిశాచర ♦ ధ్వజిని న్గూడుకొని,
జనుదెంచిన వానరవరులు విభీ ♦ షణ లక్ష్మణులు గ,,

ప్రావేల్పుని లాఘవమున కబ్బుర ♦ బడుచు నుండునంత
రావణి క్రోధోద్దీపితుడై మ ♦ ర్కటులపైని నిశిత
శరములేసి భిన్నాంగులజేసిన ♦ చపలు లోపలేక
పరుగులిడిరి సౌమిత్రికడకు బ్రో ♦ వవేయనుచు; యలుక
జెంది లక్ష్మణుం డింద్రజిత్తుపై ♦ శిఖివర్గములేసి
కొందొనర్చె నాతని ధనువును; సో ♦ కుండు మిగులగినిసి
రెండవ కోదండంబును గొన, మా ♦ ర్తాండ కులోద్భవుడు
ఖండించెను దానినేసి సునిశిత ♦ కాండంబులు మూడు
తిరిగి లక్ష్మండేయ తూపులా ♦ శరునెద గురిజూచి
ధరబడెనవి నలతో దనుజుని గా ♦ త్రంబును భేదించి
నల గ్రక్కుచు రావణి వేరొక ధ ♦ న్వము వడిచేబూని
చిలుకులు రామానుజుపై వర్షిం ♦ చిన యాతడు వాని
న్వారించి పృషత్కములను బరపి యు ♦ వార్యవిక్రమమున
స్వారాట్జితు సారథిశిరమును దెగ ♦ టారిచె యదిగన్న
రావణిక్రుద్ధుండై శరములు పది ♦ రామానుజుపైన
వైవ యవ్వి ధరబడె నదిగని క్రి ♦ వ్యాదు డాగ్రహమున
మూడమ్ము లుపచరించె రాముత ♦ మ్ముని ఫాలమునాట
ఏడిషువులు నాటించె లక్ష్మణుం ♦ డింద్రజిత్తు నొసట.
దశగ్రీవ దశరథాత్మజులు యి ♦ ద్దరిట్లు నొకరొకరు
విశిఖ పరంపరలను గప్పుచు విరి ♦ విగ విద్ధశరీరు
లగుచు రక్తమయులై పూచినమో ♦ దుగులటు శోభిలిరి,
ఖగవర్షంబుల మునుగు చొకరినొ ♦ కరు జయింపగోరి
ఘోరయుద్ధ మొనరింపుచుండ సో ♦ కుండమ్ములు మూడు
ఈరసించుచు విభీషణు నొసటను ♦ ఏసిన యాతండు
గదచేగొని వడిభ్రాత్రీయు శతాం ♦ గంబు నలియగొట్టి
విదారించె రథ్యంబుల నదిగని ♦ విరథుండైనట్టి,

రావణాత్మజుడు విభీషణునిపై ♦ రథశక్తిని వేయ
ఆవచ్చెడుశక్తినిగని లక్ష్మణు ♦ డశని తుల్య సాయ
కంబున ధరబడగొట్టెను మరి దశ ♦ కంఠుని తమ్ముండు
అంబులేసెనై దింద్రజిత్తు వ ♦ క్షంబు బగుల నపుడు
రావణియుగ్రుండై మహోగ్రమై ♦ రాజిలుచున్నట్టి
వైవస్వత దత్తాశుగ మొండి ♦ ప్వాసంబున బెట్టి
యుండ లక్ష్మణుడు, దుస్సహమై అ ♦ త్యుజ్వలమై కాల
దండసమంబై ధనద దత్తమై ♦ దనరు చండకోల
శరాసనంబున బెట్టినంత యి ♦ ద్వరు తమశరములను
బరపి రవ్వినొకటొకటిన్దాకిల ♦ భగ్నంబై బడెను.
రామానుజుడంత వారుణాస్త్రము ♦ రావణిపైనేయ
ఆమార్గణమును నివారించి రౌ ♦ ద్రాస్త్రంబున క్రవ్యా
దుండేసెను యాగ్నేయాస్త్రంబును ♦ వెండి లక్ష్మణుండు
చండశరాస్త్రము వైచి దానినట ♦ ఖండించిన, రిపుడు
ఆసురాస్త్రము న్వైచెను దాన ♦ న్నసి ధేనుక ఖడ్గ
ప్రాస శల్య పరిఘాతన ముద్గర ♦ పరసు తోమర సృగ
ములు యొదవిన, సౌమిత్రి మహేశ్వర ♦ మునను నివారించె.
కలహము క్రమముగ తీవ్రంబై భీ ♦ కరమై గాన్పించె.
ఆకసమున సుర గరుడోరగ వి ♦ ద్యాధర యక్షాదుల్
పాకశాసనుతో నిలచి రాఘవుని ♦ ప్రజ్ఞోపాసనముల్
అభినందించుచు సౌమిత్రికి విజ ♦ యంబు జయం బనుచు
అభిగుప్తించుచు నుండిరంత రా ♦ మానుజుండు చిచ్చు
జ్వాలాకలితంబయ్యు దశానన ♦ జాతవినాశంబై
వ్యాళసమంబై దుస్సహమై సక ♦ లామర పూజ్యంబై
మున్ను దేవదానవ సంగ్రామం ♦ బున నింద్రుడు జయము
గొన్నయట్టిదియు అమోఘమైనది ♦ గొప్పదైన శరము

నందిం దాస్త్రము యోజించి సము ♦ ద్యద్ధీరతతోడ
పొందికతో నద్దానిని శింజిని ♦ యుందిడి శ్రవముకడ
కీగి బల్కెనిటు "అవనీశాగ్రణి ♦ ఇనకులజుం డన్న
రాఘవుండు, ధర్మాత్ముడు సత్య ♦ వ్రతాచరణుడైన,
సత్యసంధు డనఘుండు, ఘనుడు బుత ♦ సంగరుడే యైన
ప్రత్యక్షంబుగ యీబాణంబున ♦ ప్రత్యనీకుడైన
రావణి హతుడౌగాక ని"విడిచిన ♦ రగులుచు తచ్ఛరము
రావణికుత్తుక ఖండించిన బడె ♦ రసపై తచ్ఛిరము
పారివేల్పుండటు జచ్చిన వలలులు ♦ ప్రద్రావితులైరి
దేవేంద్ర విభీషణులా సౌమి ♦ త్రిని సంస్తుతించిరి
అచ్చరులాడిరి, యక్షులుబాడిరి ♦ అమరులు కుసుమముల
లచ్చనుపై వర్షించిరి, హనులు ♦ లాంగూలులు మిగుల
ప్రశంసజేసిరి సౌమిత్రిని, జాం ♦ బవ పవనాత్మజులు
దశరథాత్మజుని చేరి స్తుతించిరి ♦ దర్శించిరి కవులు
సౌమిత్రిటులా రావణాత్మజుని ♦ సంహరించి కలిని
సామీరి విభీషణ జాంబవకీ ♦ శాదుల గూడుకొని
క్షతజార్ద్రశరీరుండై రాముని ♦ సన్నిధికింబోయి
నతిజేసిటులనె నిట్టూర్చుచు య ♦ న్నా ! వినుము తవాయి
యుం దింద్రజితు న్వధియించితి నీ ♦ యనుగ్రహము వలన
బొందగల్గితిని నేనీవిజయం ♦ బును రామా ! యనిన
సంతోషముతో శ్రీరాముడు ల ♦ క్ష్మణుని డాయబిలచి
సంతను నిడుకొని ముఖము నిమిరి మ ♦ స్తకమాఘ్రాణించి
కౌగలించి శరపీడితుడగుటచె ♦ కలతతోననె నిటుల
"ఈ గొందితివహా ! తమ్ముడ ! లక్ష్మణ ♦ ఇంద్రజిత్తు నాల
మున నాలంబం బొనరించి మహా ♦ ఘనమగు కార్యంబు
కొనసర్చితివి కరతలామలక మ ♦ య్యెను నిక విజయంబు

సామీరారి విభీషణు లొనరించిన ♦ సాయమమోఘంబు;
భూమిజయశ్వైను; రావణు డికవిని ♦ పుత్రుని మరణంబు
పొగలుచు యుద్ధంబున కేతెంచిన ♦ బూని కార్ముకంబు
తెగవైతును యాతని పదితలలను ♦ ఖగముల నిక్కంబు"
అనుచు సుషేణునిగని అయ్యా! శ ♦ ల్య పీడితుండైన
అనుజున కోషధులిచ్చి స్వస్తచి ♦ త్తునిగ జేయుమనిన
సౌమిత్రికంత సుషేణు డొకయో ♦ షధి వాసనజూప
సౌమిత్రి విశల్యుండై బాసె రు ♦ జను, యాతడు పిదప,
రామునాజ్ఞ, శరపీడితులై రణ ♦ రంగంబున బడిన
లూమములను యాయోషధిచె విశ ♦ ల్యులనుజేసె; దాన
వనాథు సచివులు రావణి మరణము ♦ విని దుఃఖించికడు,
జని రావణుకడ కని రిట్టుల "నీ ♦ తనయు డింద్రజితుడు
చండభుజుండు ద్దండకాండ కో ♦ దండ దండధరుడై
భండనతలమున దండివానరుల ♦ చెండుచు గండుండై,
చండకరాన్వయ మండనాయమా ♦ నుండగు లక్ష్మణుని
చండకాండములతోడ దాకి దివ ♦ సంబులు మూడతని
బెండుబడగజేసియు కడకాతని ♦ పృషత్కంబు నొకట
ఖండితమస్తకుడై ధరబడి యు ♦ త్క్రమణ మొందె నకటా!"
నావిని రావణు డన్నుండై వ్యథ ♦ నంది సుక్కిలేచి
రావణిని మ్మది దలచి దలచి యా ♦ క్రందన మొనరించి
విలపించెను నిటు "హాకుమారకా ♦ వీరా సుకుమారా,
కలగాడు గదా! నీకిల మృత్యువు ♦ గలదటరా ధీరా!
దేవేంద్రునిగెల్చితివి యముని మ ♦ ర్ధించినట్టి దిట్ట
వీవొకనరునిచె హతమై గొంటివ ♦ వీరస్వర్గ మకటా!
సతినిం దల్లిని నన్నును యువరా ♦ జ్యము లంకల విడిచి
మతకమైతివా! మమ్మెల్లర నా ♦ మనస్యమున ముంచి

అనుచు నార్తుడై పుత్రశోకజని ♦ తాగ్రహమున కనుల
అనలాంగజములు గక్కుచు కరచుచు ♦ జొగు ప్రళయకాల
రుద్రుండోయన గద్దెడిగ్గి క ♦ ర్బురులును సచివులును
అద్రిచుండ వొరవెఱికి ఖడ్గమును ♦ అనెనిట్టుల మున్ను
రావణియొక మాయాసీతను మా ♦ రణ మొనర్చెగాని
నే వధియించెద యిపుడె గాంచుడీ ♦ నిజముగ జానకిని
అనుచు సచివ సతి యసురవరులతో ♦ అశోక వనమునకు
జనుదెంచిన యాదశకంఠుని గను ♦ గొని జానకి తలకు
నొంది మిగుల గడగడవడకుచు క ♦ న్నుల నశ్రువులొలుక
కుందుచు నిట్లని తలపోసెను యీ ♦ కుమతి యితని రాక
జూడ నన్ను వధియింపగ గావ ♦ చ్చు, రాముసతి నన్ను
వీడు భార్యగాగోరి విఫలుడై ♦ నాడందుకుగాను
నిరాశుడయె నదియుగాక రావణి ♦ నిహతుడగుట వలన
దురాగ్రహుండై నన్నును దాశర ♦ థుల నిప్పుడు హనన
మొనరించును, సామీరి సూక్తి నే ♦ మును విననైతిగదా
అనిలాత్మజు వెన్నెక్కి బోతె యిపు ♦ డాపదలేదు గదా
నేననాథవలె జావవలయు నే ♦ నిశాచరుని వలన
నానిమిత్తమై రాఘవులును మర ♦ ణంబు నొందుటేనా ?
ఇనకులజుని మరణమునకు కౌస ♦ ల్యెటులనోర్చు యిస్సీ !
అనుమరణములకు మూలంబుగదా ♦ ఆ మందర దాసి
అని విలపించెడు సీతాదేవిని ♦ హత మొనర్ప నెంచి
జను రావణునకు సుపార్శ్వుడను ధీ ♦ సచివు డడ్డువచ్చి
అనెనిట్లు ప్రభో ! సత్కులజుండవు ♦ ధనదుని తమ్ముడవు
తనూద్భవుండవు విశ్రవసువునకు ♦ ధర్మాచరణుడవు
వేదాధ్యయనం బొనర్చి సమస్త ♦ విద్య లెరిగినట్టి
మేధావివి క్రోధమునకు లోనై ♦ మేదినిసుత బట్టి

జంపబోయెదవు స్త్రీవధ కడుమా ♦ న్యంబును అవిధిగదా !
జంపి రాఘవుల జనకజ నొందుట ♦ సాధిష్టం బవదా ?
ఈ నీ కోపము మమ్ముగూడి యని ♦ కేగి దాశరథుల
పైని జూపుము నేడే పయనం ♦ బవగ ప్రయత్నముల
జేయుము రేపే యమవసదినమున ♦ జేకొన విజయంబు

---

సాయుధ రథమున సబలంబులతో ♦ జనుమనిన హితంబు
విని గృహమునకున్ జని దీనుండై ♦ విచారముతో సింగా
సనమున గూర్చొని సేనాధ్యక్షుల ♦ కనెసిటు వినయముగ,
"మీరలభ్య మితీయులు, లంకా ♦ ధారులు, కోవిదులు,
వైరివారసంహారులు, భయదా ♦ కారు లూర్జస్వలులు,
మారిత మొందిరి సచివ సహజ యా ♦ త్మజులని రంగమున
మీరుదక్క దిక్కెవ్వరు నాకిల ♦ లేరుగదా, పవనా
త్మజ సుగ్రీవాది ముఖ్యులను యు ♦ ద్వాసన మొనరించి
కుజపతిని జంపు డదిమీచే గా ♦ కున్న రణ మొనర్చి
భిన్నాంగునిగా జేయుడు రాముని ♦ పృషత్కములముంచి.
మన్నిగొందు నే రేపాతని యభి ♦ మర్ధన మొనరించి"
అనవిని రాక్షసముఖ్యులు వడి స్యం ♦ దనము లధిష్టించి
ఘనతోమర ముద్గర ప్రాసిని పరి ♦ ఘాదుల ధరియించి
చతురంగబలంబులతోడ రణ ♦ స్థలికి గదలి ప్లవగ
తతులపైనిబడి, భీకరముగ యు ♦ ద్ధంబొనరింపంగ
వానరవీరు లనోకహ పర్వత ♦ పాషాణముల గొని
దానవులన్దాకగ తుములము త ♦ ద్దయు తీవ్రంబయి, ని
శాట వనాటుల పెక్కురుజచ్చిరి ♦ క్షతజము బారె నిల
ఘోటక గజ రథములు కుప్పలుగా ♦ గూలి దేలె నల్ల.
కడకు రాక్షసులధాటి కోర్వలే ♦ క, లూమములు బారి
ఎడదాకిరి రాముని 'కావవె' యని ♦ ఇనకులజుడు వారి

కభయము మొసగి కార్ముకమునుగొని రా ♦ క్షససేనల జొచ్చి
అభిమరమొనర్చి పెక్కురాశరుల ♦ నమ్ముల వర్షించి,
అరద గజాశ్వంబులు గూలెను ధర ♦ అయ్యెడ రాముండు
త్వర, బరపెను రిపుబలములపై గాం ♦ ధర్వాస్త్రంబొండు
దానన్మోహితులై కీనాశుల ♦ సేనలు రాఘవుని
గానలేక తమవారినె రాముని ♦ గాగ భ్రమించి, యని
యొనర్చి పెక్కురుజచ్చిరి వధించు ♦ కొని రొకరొక్కరిని,
గనుపడె రాముండొకడె పెక్కురుగ ♦ దనుజుల కత్తరిని.
రథములు నుగ్గయ్యె నేడుకోట్లిరు ♦ వదితొమ్మిది లక్షల్
పదమూడ్కోట్లారార్లక్షల యిరు ♦ వదివేల ఇభంబుల్
పదికోట్లిరువదిలక్షలపై అరు ♦ వదివేల హయంబుల్
వదివదులు న్నాలుబద్దైదుకోట్లెను ♦ బదిలక్షల పదికుల్,
భండనమున ఘడియలు మూడుము ♦ హ్వాతికలోపుగను
చండభుజుండగు శ్రీరఘురాముని ♦ చండకాండమునను
నశించె; శ్రీరఘురాముని సమీర ♦ ణాత్మజ రవిజాదుల్
ప్రశంసించి రట, లంకకేగి రా ♦ వణునకు విదితుల్
అంబరీషమున కరిగిన మూల బ ♦ లంబుల రాముడు నా
శంబొనరించిన విధంబుదెలుప, ద ♦ శానను డావమాన
స్యమునొందెను, తద్విషయమెరింగిన ♦ క్షపాచరస్త్రీలు,
కొమరులు సంస్థితులగుటకు కొందరు ♦ కొందరు తమపతులు
మృతులగుటకు, కొందరు బంధువులు ప ♦ రీతమునొందుటకు,
వెతనొందుచు యిటువిలపించిరి "యీ ♦ విగమము గల్గుటకు
రావణుచెల్లెలు, దుష్టురాలు, శూ ♦ ర్పణఖయెగద వనిని
కావరమున మోహించుటయా యీ ♦ కాముకి రాఘవుని,
ధీరుడు సుకుమారుడు కందర్పా ♦ కారుడు సుజనుండు
శ్రీరఘురాముడు సీతావిభుండు ♦ క్షేత్రియుండుగాడు.

అట్టిమహాశయు వరించి విఫలత ♦ నందు భగినిమాట
బట్టుకొ, రావణు డవనిజనెత్తుక ♦ వచ్చె యక్కటకటా
రామునితో వైరంబు దెచ్చుకొనె ♦ రాష్ట్రమరయలేక
సామాన్యుడుగా డారాముడు సం ♦ గ్రామంబునదాక
చండకిరణకుల మండితుడగు దా ♦ శరథిచే, త్రిశిరుండు
చెండుండు, విరాధుండు, దీర్ఘబా ♦ హుండు, కబంధుండు,
ఖరదూషణ, కుంభకర్ణ, మకరా ♦ క్షాదులు, హతులైరి
గరాసులెందరొ వనమున నభ్యా ♦ గమమున మృతులైరి.
మున్నురావణుని సప్తసాంద్రముల ♦ ముంచినట్టి వాలి
న్మన్నిగొనె న్మరమొక్కట రాముడు ♦ మనీషి, బలశాలి,
రవిజుకొసగె కపిరాజ్యము లంకా ♦ రాజ్యము రావణుని
అవరజుడు విభీషణునకు నొసగును ♦ అన్ననుజింపి యని,
అతనిసోదరుడు లక్ష్మణుడోయన ♦ అన్నకు కొఱబడడు
అతికాయేంద్రజితుల వధియించిన ♦ అనుపమవిక్రముడు
అట్టిరాఘవుల గెలువదరమె క్ర ♦ వ్యాధిపునకు రసన,
గిట్టుట తథ్యము రామునిచె దశ ♦ గ్రీవుండని లోన.
దేవ గరుడ యసురాదులచేతను ♦ చావనట్టి వరము
రావణుండు తపమొనర్చి బడసెను ♦ స్రష్టవలన నిజము
గాని నరునిచే మృతిలేదనుటకు ♦ దాన గానరాదు
దానవనాధుడు మానవనాధుని ♦ చే నిహననమొందు.
శివుడొకతరిని సుమనసులు వేడగ ♦ స్త్రీయొక్కతె బుట్టి
అవసాదంబొనరించు రాక్షసుల ♦ ననియె, నేలపట్టి,
తప్పక హరుండుజెప్పిన వనితయె ♦ తప్పదు మనచావు.
ఒప్పరించెను విభీషణు సూక్తుల ♦ నోగు దశగ్రీవు
డకటా! మనకిక యేది దిక్కనెడు ♦ ఆర్తధ్వనుల విని
అకమొంది దశాననుండు క్రుద్ధుం ♦ డై కర్బురుల గని,

మహోదరాదుల పరిగమితో ర ♦ మ్మనమని కబురంప,
మహాపార్శ్వుడును, విరూపాక్షుడును ♦ మహోదరుండు క్షపా
చర విభుకడకేగిన యనెల్లు ద ♦ శాననుడు హసించి
పరిగమితోడ నక్కదలిరంతః యుం ♦ బరీష మొనరించి,
శరవర్షంబున సామీరిని రవి ♦ జాతుల వధియింతు
సరగున రఘురాముని సౌమిత్రిని ♦ సంహారమొనర్తు
ప్రతిహత మొనర్చినందున తనయుల ♦ భ్రాతల బంధువుల
ప్రతీకార మొనరించెద రణమున ♦ బడిన క్షపాచరుల
ఋణముదీర్చి ధరణిజను గ్రహించెద ♦ రణమున విజయంబు
ప్రణిహితమని దలపుండు రండనుచు ♦ బల్కి స్యందనంబు
అధిష్టించి సాయుధుడై రథ గజ ♦ హయ భటులంగూడి
ప్రధనమొనర్పగ మహోదర మహా ♦ పార్శ్వాదులతోవడి.
పురద్వారమును నిర్గమించిజనె ♦ పుణ్య జనవిభుండు
అరిష్టదాయక దుర్నిమిత్తములు ♦ అనేకంబులపుడు
పొడమెను; సూర్యుడుకాంతి హీనుడయె ♦ పులుగులు దిరుగాడె,
బడెనిల యుల్కలు, చీకటిగ్రమ్మెను ♦ పుడమి యల్లలాడె,
సిడెంబుపై గద్దవ్రాల్చె, అరచెను ♦ శివములు కోకములు,
బిడౌజు డస్రముగురిసె రావణుని ♦ ఎడమకన్నదోలు
అదరెను జంకొందవగను పదేపదె ♦ ఐనను రావణుడు
మది తద్దుశ్శకునములకు సంశయ ♦ మందక రిపులుండు
సమరస్థలి కరుదెంచి రాము పరి ♦ సరము నపేక్షించి,
తమనట్టుల రాక్షససైన్యంబులు ♦ దాకుట గమనించి
కపులెదుర్కొనిరి క్రవ్యాదుల పా ♦ దపగిరి శిలలగొని
చపలుల యసురులు గొట్టిరి ఘనప్రా ♦ సాదులుచే బూని
నియుద్ధ మొనరించుచుండ నిట్టుల ♦ నిశాచరులుం కపులు,
స్వయముగ రావణు డిష్వాసముగొని ♦ చండసాయకములు

గురిసెకపులపై తత్ఫలితంబుగ ♦ కొందరు మృతులైరి.
ధరన్బడిరి భిన్నగాత్రులై కొం ♦ దరు; కొందరు బారి
రామునకెరుంగ బల్కిరి, మర్కట ♦ రాయుడు గుల్మమున
నేమించి సుషేణుని; దాకెను రజ ♦ నీచరులను కలన
క్ష్వేడితమొనర్చి సుగ్రీవుడు ప్రా ♦ వేల్పులపై గిరుల
ఓడికగావర్షించి రక్కసుల ♦ బీడించుచు తుముల
మొనర్చుచుండిన విరూపాక్షుడల ♦ అనేకపంబెక్కి
వనేచరులపై కడరి బాణముల ♦ వానరవిభు దాకి
దురమొనర్చి నొవ్వజేసె నాతని ♦ శరీరంబు నంత
తరు వొక్కటి గైకొని సుగ్రీవుడు ♦ విరూపాక్షు దంతా
వళిని మొత్త నది నిలగూలె విరూ ♦ పాక్షు డాగ్రహించి
ప్రళయకాలరుద్రుండన కృపాణ ♦ ఫలకముల గ్రహించి
భానుజునెదిర్చె నంత కపీశుడు ♦ పాషాణముబూని
దానవముఖ్యుని గొట్టిన యాతడు ♦ దానిని దప్పుకొని,
రవిజుని గొట్టెను ఖడ్గమెత్తి మూ ♦ ర్ఛన్బడ నాతడిల
ప్లవగవిభుం డంతలోన తెల్విని ♦ బడసి గినిసి పాల
సుని నెదబొడిచెను ముష్టిబట్టి రో ♦ షుండై దానవుడు
ఇనజుని కవచంబూడి బడగ గొ ♦ ట్టెను రిష్టితో యపుడు
సుగ్రీవుం డరచేత విరూపా ♦ క్షుని గొట్టెనుగాని
ఉగ్రుడై విరూపాక్షుడు ఘాతము ♦ నొదిగిలి తప్పుకొని,
కడిది ముష్టినిం కంపీంద్రు రొమ్మున ♦ బొడవ నినజుడలుక
వెడద తలంబున ప్రతిఘాతించెను ♦ విరూపాక్షు శంఖ
స్థలి, దాన, విరూపాక్షుడు గోధి బ ♦ గిలి కనుగ్రుడ్లు వెలు
పలి కూడి బడ న్నల గ్రిక్కిల బడి ♦ బాసెను ప్రాణములు.
విరూపాక్షు మరణంబు రావణుడు ♦ వీక్షించి తపించి
దురమొనర్పగా నేమించె మహో ♦ దరుని జేరబిలచి.

హరిసేనలపై మహోదరుడు శిత ♦ శరములు వర్షించి
పరాసనంబొనరించె పెక్కురను ♦ పరాక్రమము మించి
కొందరు భిన్నాంగులైరి చపలులు ♦ కొంద రడలి భాను
నందను కడకేగిరి కర్బురులా ♦ నంద మొందగాను
కోపోద్దీపితుడై సుగ్రీవుడు ♦ కొండను యొకటిగొని
దాపించి మహోదరుపై వైచెను ♦ దానవుండుదాని
న్ఛిదుపలుగా నొనరించెను సునిశిత ♦ శిఖ నొక్కటివైచి
అదిగని సుగ్రీవుండొక యనోక ♦ హంబును బెకలించి
మహోదరునిపై వైచిన యాతడు ♦ మార్గణములనేసి
మహీరుహంబును వ్రక్కలొనర్చెను ♦ మల్లుల దొర గినిసి,
పరిఘ మొక్కటిలగని దానినిగొని ♦ పలలాసుని యరద
తురగంబుల గూలిచె నంత మహో ♦ దరు డిలకురికి గద
గైకొని సుగ్రీవుని దాకిన ప్లవ ♦ గాధిపుండు గుదియ
నూకొనివైచిన గదయుపరిఘ మొక ♦ టొక టిందాకి క్షయ
మాయె నంత యినజుండొక ముసలము ♦ ఆమెడగని దీసి
మాయునిపై గుఱిజూచి వైచిన ♦ మ్మహోదరుడు గినిసి
మరియొక గదగొని విసరివైచె దిన ♦ మణితనయునిపైన
ధరబడె యాముసలంబును గదయును ♦ తాకుకొనుచు నడిన
అంతట నిర్వురు నియుద్ధమొనరిచి ♦ అనీక రంగమున
అంతికమునబడియున్న ఖడ్గముల ♦ అరిగల గొని కదన
మొనరించిరి యన్యోన్య భంగ మ్ము ♦ త్యువులను కాంక్షించి
ఇనజుండత్తరి మహోదరుని రి ♦ ష్టేటు నివారించి
ఖండించె మహోదరుని మస్తకము ♦ ఖడ్గంబున; కపులు
కొండాడిరి కడు సుగ్రీవుని, వ్యా ♦ కులమొందిరి రిపులు
మహాపార్శ్వు డని మహోదరుండటు ♦ మరణించుట గాంచి
బహుళామర్షణుడై తారేయుని ♦ బలంబులనుజొచ్చి

శరపరంపరలు బరపి వానరుల ♦ చమరుచుండ గాంచి
పరికోపంబున తారేయుం డొక ♦ పరిఘంబు గ్రహించి
మహాపార్శ్వుడిల మూర్ఛన్బడునటు ♦ ప్రహారమొనరించె
సహాయ్యంబుగా గవాక్షు డచటకు ♦ జని యొకఘన శిలచే
పలలుని రథహయములగూల్చె మహా ♦ పార్శ్వు డంతలోన
తెలసి మూర్ఛ నంగదుపై సాయక ♦ ములనుగుప్పి బాణ
త్రియము భల్లవతి రొమ్ముననాటి శి ♦ తాస్త్రంబులు చాల
రయమున గవాక్షుపైనేసిన తా ♦ రాత్మజుండు మిగుల
కోపమంది పరిఘంబువైచి సో ♦ కుని కిరీట చావ
రోపంబుల నిలగూల్చి మహాపా ♦ ర్శ్వుని వడి బొలియింప
కరతలంబున నొమ్మెదెను యాతని ♦ కణతపైని యపుడు
పరశ్వధంబెత్తివైచె వాలిజు ♦ పై క్రవ్యాదుండు.
అంగదు డంగదముష్టిని బొడువ మ ♦ హాపార్శ్వుని యెడను
క్రుంగి వ్రక్కలవయక్కు అతండిల ♦ కుణపంబై బడెను.
మహాపార్శ్వుడని జచ్చిన సంతస ♦ మందిరి వానరులు
సహగామమహాత్య త్రియ మృతిగాంచి ద ♦ శాననుండు విల్లు
చేకొని సూతుడు రథము నడుప వడి ♦ జేరి రణస్థలి నా
శీకములన్గుప్పించి వానరుల ♦ చీకాకొనర్చిన
ఆకోలల పెనుధాటకు నిల్వగ ♦ లేక కపులు బారి
కాకుపొంది రాముని జేరిన విలు ♦ గైకొని సౌమిత్రి
సహితుండై శ్రీరాముడు నిలచె ద ♦ శాననునిం దాక;
సహజుతో కోదండధరుండు, మహా ♦ మహుడు, పుండరీక
నయనుడు, మందస్మితవదనుడు, శర ♦ ణాగత వత్సలుడు,
దయార్ద్రహృదయుడు, రణభీముడు, ♦ రిపుదమనుడు, రాముండు;
ఎదురవ గాంచెను రావణు డాతని ♦ ఇనకులజుడు గాంచె;
అదర దశదిశల్ శ్రీరాముడు గొన ♦ యంబును సారించె.

రామచంద్రు నెదురింప డాయజను ♦ రావణునిం జూచి
సౌమిత్రి రఘూత్తము నాజ్ఞనుగొని ♦ జ్యాను టంకరించి
శరపరంపరలు వర్షించె నిశా ♦ చరవిభుపై నతడు
శరములేసి తద్వర్షము నణచెను ♦ జిరా యొకటి కొండు,
మూడింటికి మూడైదింటికి అయి ♦ దేడింటికి యేడు,
వీడుచు లక్ష్మణు నతిక్రమించి ప్ర ♦ వీణత రావణుడు
రాముని కభిముఖుడై సునిశితమా ♦ ర్గణములు పచరించె
ఆమార్గణములు శ్రీరాముడు సా ♦ యకముల ఖండించె
రామరావణులు క్రోధంబున యిటు ♦ రణము సల్పుచుండ
భూమి వ్యోమములు నిండె వారిశర ♦ ములచే నట్టియెడ
తమము గ్రమ్మె రవియస్త మించినటు ♦ సమస్తభూతములు
అమానస్యమొందెను; గన యిర్వురు ♦ అస్త్రశస్త్రవిదులు
యిద్దరు భుజబల సంయుతు లిద్దరు ♦ యుద్ధ విశారదులు
యిద్దరూర్జస్వులు లిద్దరు యోధులు ♦ యిద్దరు నిషంగులు
భండనంబు యిట్లిర్వురు సల్పుచు ♦ నుండ రావణుండు
చండకాండపంక్తిని నాటెను దా ♦ శరధినోసట; నృపుడు
వ్యథనొందక రౌద్రాస్త్రంబున సా ♦ యకములు రావణుపై
న్వదలిన నవి యాతని కవచంబున ♦ బడి జారెను ధరపై
మరల రాఘవుడు తీవ్రతరంబగు మార్గణములనేసి
సురద్విషు న్నొసటన్నాటిన యా ♦ సురవిభుండు గినిసి,
ఆసురాస్త్రమును బ్రయోగించె యా ♦ యస్త్రంబునకోక,
కేసరి శివ శార్దూల ఉలూక బి ♦ లేశ గృధ్ర కంక
శ్యేనాది ముఖంబులు గలమాయా ♦ శిఖులుత్పన్నంబై
మానవనాథునిపై యేతేరగ ♦ క్ష్మాపతి శస్త్రంబై
అలరాగ్నేయాస్త్రము యోజించిన ♦ ఆయస్త్రము వలన
జ్వలన జ్వలితానలములు గలవియు ♦ ఖైవాత్మక తపన

గ్రహ నక్షత్రోల్కాలాది ముఖములు ♦ గల శరములు వెడలి
విహాయసమున న్నివారించె ప్రా ♦ వేల్పుశిఖల దగిలి.
అసురాస్త్రం బాగ్నేయంబున యట ♦ హతమగుటనుగాంచి
అసురవిభుడు రౌద్రాస్త్రము వైచెను ♦ ఆయస్త్రమునుండి
గదలు శూలములు ముసలంబులు ము ♦ ద్గరములు పాశములు
ప్రదరంబులు తోమరములు సృగములు ♦ ప్రాసలు ఖడ్గములు
గలిగి వచ్చుచుండగ గని రాముడు ♦ గాంధర్వాస్త్రమున
సులభంబుగ వాటిని వారించిన ♦ జూచి క్రుధ దశాన
నుడు వైచెను సౌరాస్త్రము దాన ♦ న్బొడమిన చక్రములు
అడరె నభ్రమున, వాసిగొప్పై రా ♦ ముడేసి బాణములు.
రావణు డాగ్రహమున రాముని మ ♦ ర్మస్థానములందు
ప్రావీణ్యంబొప్పగ పచరించెను ♦ ప్రదరము లైదైదు.
ఆశరముల కింతైన చలింపక ♦ ఆశర విభుమేన
దాశరథేసెను. ఆశుగములు బహు ♦ తమికొని యాలోన
సౌమి త్రిషువులనేసి రాక్షసే ♦ శ్వరుని ధ్వజముగూల్చె.
ప్రామి సారథిని కోదండంబును ♦ భగ్నంబొనరించె
అత్తరి విభీషణుం డొకగదగొని ♦ అన్న రథాశ్వముల
మొత్తిచంపిన న్విరథుండై దశ ♦ ముఖుండలిగి మిగుల
తమ్మునిపై నొకశక్తిని వైచిన ♦ దానిని లక్ష్మణుడు
అమ్ములుమూ డడరించి మూడు తుని ♦ యలుజేసిన, రిపుడు
విపులంబగు తన తేజముతోడ ♦ న్విస్తరిల్లునట్టి
రిపు భీకరమై పవిసమమై దు ♦ ర్నిరీక్షమగునట్టి
వేరొకశక్తిని విభీషణునిపై ♦ వేయ దలచుచుండ
బీరముడిగి భయవిభ్రాంతుండై ♦ విభీషణుం డుండ
శరణమొనర్పగ సౌమిత్రి విభీ ♦ షణార్యునిం జూచి
వెరువకుమని ఆతనిముందుకు జని ♦ వీరుండై నిలచి,

శక్తిహస్తుడగు రావణుపై ఘన ♦ శరములు వర్షింప
నక్తంచరవిభు డలుకతో లక్ష్మణు ♦ నకు నిట్లనె, చంప
దలచిన తమ్ముని కడ్డంబైతివి ♦ తగుదుననుచు నీవు
తలపవు నాయీశక్తి మహిమమును ♦ తథ్యము నీచావు
కాచుకొమ్మనుచు ఆశక్తిని ల ♦ క్ష్మణునెద గురిజూచి
వైచెను. మయ మాయానిర్మితమై ♦ జ్వలియించుచు మించి
సౌమిత్రిదెశ న్వచ్చుచున్న యా ♦ శక్తిని వీక్షించి
రాము డనుజునకు మంగళయాశీ ♦ ర్వాదము గావించి
తమ్మునియెడ యమ్మహాశక్తి వ్య ♦ ర్థంబగుగా కనెను.
అమ్మెయిశక్తి వడింజని లక్ష్మణు ♦ రొమ్మునాటి ధరను
బడియె; లక్ష్మణుడు తద్ఘాతంబున ♦ బాళినొంద గాంచి
అడలిరాఘవుడు భాష్పవ్యాకులి ♦ తాక్షుండై మించి
రావణుజంపగ కృతనిశ్చయుడై ♦ భ్రాత రొమ్మువ్రచ్చి
భూవేశనమగు శక్తిని శరముల ♦ పుండ్రగించి విఱచి
రావణ కార్ముకవిముక్త శరవ ♦ ర్షంబున కోర్చుచు సు
గ్రీవాంగద హనుమదాదులతో బ ♦ ల్కెనుయిట్టుల నానా
నుని బహుజాగ్రతతో గాపాడుచు ♦ నుండుడిచట నేను
దనుజవిభునితో తుదిపోరొనర్చి ♦ తెప్పక జంపెదను.
రామరావణుల నొక్కండే యా ♦ భూమి నుండగలడు
రాముని రామత్వంబు నేడు రణ ♦ రంగంబున గనుడు.
త్యజించి రాజ్యము వనిని వసించుట ♦ తండిరి మరణంబు,
కుజహరణంబు, జటాయువు మృతి యువ ♦ రజుని కశ్మలంబు,
వలనగల్గు క్లేశంబు విడుతు రా ♦ వణుని సంహరించి
వలసి యెవనికై వెతకికొనుచు జని ♦ వాలిని వధియించి
రవిజుని వానరరాజుజేసి మ ♦ ర్కటసేనతో వచ్చి
ఎవనితో నని జేయగ వారధి పా ♦ యోరున నిర్మించి

వచ్చితినో నిటకట్టి పాపి రా ♦ వణుండు కంటబడి
ఎచ్చటికేగగలండు యెల్లకును ♦ మెచ్చగ వరమాడి
సంస్థితిచేకూర్చెద నాతనికని ♦ చాపము సారించి
సంస్థాతుండై దశగ్రీవుపై ♦ శరములు వర్షించి
నొప్పింపగ రావణుండు రోషము ♦ నొంది శితాస్త్రముల
న్గుప్పెను రామునిపై అవియొక్కటి ♦ నొకటిదాకి చదల
బడెధర, భగ్నంబై గుణనినాద ♦ బాణఘాతములచే
వడకె జగంబులు అవల రాఘవుని ♦ వాడి బాణములచే
బీడితుడై రావణుండు బయువిడె ♦ భీతినొంది మిగుల.
ఓడగ రావణుడటు రాముండు స ♦ హోదరుజేరి కలా
వన మొందుచు నిట్లనియె సుషేణుని ♦ గని దైన్యంబెసగ
అనుజ లక్ష్మణుడు రావణుశక్తి ఘ్ని ♦ హతుడై ధరసొరుగ
గుండెఝల్లు మనుచుండె శరంబులు ♦ గుణియు జారుచుండె
భండనమును సాగింప మనసు రా ♦ కుండె, దోచకుండె
కనులనీరములు గ్రమ్మియేమియును ♦ గానుపింపకుండె
తనువు దూలుచుండెను చరణంబులు ♦ తరవారుచునుండె
తమ్ముండీల్గిన ధరణిజయేటికి ♦ తనువేటికి రణము
వమ్ముగదాయని పరిపరివిధముల ♦ వాపోవగ రాము
నకు, సుషేణుడనె లక్ష్మణుండు మర ♦ ణంబు నొందలేదు
వికారతను జెందలేదు కాయము ♦ వేడితగ్గలేదు
కరపదతలంబులోలి పద్మరా ♦ గంబు బాయకుండె
అరయగ నుచ్ఛ్వాసంబులుండె హృద ♦ యంబు గొట్టుచుండె
ఇవి సజీవునకు లక్షణములు గన ♦ యీల్గలేదితండు
అవరజుకై దుఃఖింపకితడు దీ ♦ ర్ఘాయుష్మంతుండు
అనుచు రామునూరార్చి బల్కెనిటు ♦ హనుమంతునిజూచి
మునుభల్లుకపతిచెప్పిన యౌషధ ♦ ముల శైలముసంచి

సంజీవనిని సవర్ణకరణిని వి ♦ శల్యాదుల దెచ్చి
సంజీవుని జేయుము లక్ష్మణునన ♦ సామీరి గమించి
మందాకులగిరి జేరి యోషధుల ♦ నందున తడవ తడ
వెందులకని యాగిరి నే పెకల్చి ♦ ఇడికొని చే చండ
వేగముగా మరలివచ్చి కొండను ♦ విడె కపుల నడుమ.
ఆగిరినింగల సంజీవి విశ ♦ ల్యాదులగొని రామా
నుజు నాఘ్రాణింపగ జేసె సుషే ♦ ణుడంత, లక్ష్మణుడు
అజడుండై తెల్వొంది తేజరిలె ♦ అంతలొ రాఘవుడు
తమ్ముని రమ్మని డాయబిలచి ఆ ♦ త్రితతో గాగలించి
క్రిమ్మకనుల బాష్పంబులు అనె ల ♦ క్ష్మణా! నీవు చచ్చి
బ్రతికితివహా నాభాగ్యవశంబున ♦ మృతుడవైతివేని
క్షితిని నాకు బ్రాణంబులు యేటికి ♦ సీతయువలదు; అని
యొనర్చు ఎందులకను రామునితో ♦ అనెనిటు లక్ష్మణుడు
అనఘా నాకొరకైనీవిట్టుల ♦ నందనగునె గోడు
జంపి దశగ్రీవుని లంక విభీ ♦ షణునకు నిత్తునను
ఇంపగు శపథమొనర్చితి వదిపా ♦ లింపగాను వలెను,
అన్నా నీకిల అసాధ్యమెయ్యది ♦ అనుజునికొరకిటుల
కన్నరివై, వదినను విజయంబును ♦ కన్నడింప మేలా ?
నావిని రాముడు ధనువునెత్తి బా ♦ ణంబు లెక్కబెట్టి
రావణుబోరంజనె; యీలోపున ♦ రథమును వేరొకటి
నెక్కి రాక్షసవిభుండు రణస్థలి ♦ నినకులజుని పైన
పెక్కుబాణములు వర్షించెను కో ♦ పించి రాఘవుడు, నా
ళీకము లేసెను సమాహితుండగు ♦ సోకు విభుని పైన.
ఈకరణి నారిముండని నిలబడి ♦ ఇలపైని; దశాన
నుండు రథంబునయుండియు, యొనర్చు ♦ చుండుటగని వాస
వుండా సమరము సరిగాదని రథ ♦ మొండు రామునకు సా

రథి మాతలితో బంపించెను స్వ ♦ ర్గంబునుండి దాని
నృథివికి మాతలిదెచ్చి రాముక ♦ ర్పించి బల్కెనిటు, నీ
కీరథమును, ధనువును కవచంబును ♦ ఇషీకములు , శక్తి
న్నమరాట్టంపెను, దీనినెక్కి కొన ♦ సాగింపుము సమితి"
అనిన రాముడారథమునకు బ్రద ♦ క్షిణముజేసి మ్రొక్కి
అనీకమొనర్చి మాతలి సార ♦ థ్యంబున, రథమెక్కె.
రణము తీవ్రమువజొచ్చె రామరా ♦ వణులకు; యిర్వురును
అణుకులై బ్రయోగించుకొనిరి వివి ♦ ధాస్త్రశస్త్రములను
రావణు గాంధర్వమునకు గాంధ ♦ ర్వంబునె పచరించి
దైవాస్త్రంబడరించిన దానిని ♦ దైవాస్త్రమెవైచి
రాముండు నివారించెనంత నా ♦ గ్రహమున రావణుడు,
రామునిపైని బ్రయోగించెను వడి ♦ రాక్షసాస్త్రమొండు
ఆమహాస్త్రమున బుట్టినట్టి సా ♦ యకములు విషముగల
పాములగుచు నిప్పులుగ్రక్కుచు యా ♦ వరించి దశదిశల
శ్రీరామునిపై కడరుచుండ జూ ♦ చి భయంకరమైన
గారుడాస్త్రమును బ్రయోగించె రా ♦ ఘవుడు దానివలన
నాగాన్తక రూపంబులుగల బా ♦ ణంబు లుద్భవిల్లి
సాగిదిశలు రాక్షసాస్త్రజనిత భు ♦ జంగ రూప ఖేలీ
మొత్తంబును బరిమార్చెను; రాక్షస ♦ ముఖ్యుడస్త్రమటుల
రిత్తవడుటగని క్రోధుండై వ ♦ ర్షించి యాశుగముల
బలరిపు రథ్యంబుల గూలిచి మా ♦ తలిని గాడజేసి
చిలుకొక్కట వైజయంతినిం దు్రం ♦ చిషువులు పెక్కేసి
శ్రీరాముని బీడించుచుండ బృం ♦ దారక గంధర్వ
చారణ కిన్నర సిద్ధ సాధ్య ఋ ♦ ష్యాదులట్లు రావ
ణుండు రాఘవుని నిరసించుటగని ♦ నొగులొందిరిమిగుల,
కొండాడిరి దైతేయులు; విభీష ♦ ణుండు, కపులుచాల

కుందిరి; యుత్పాతంబులు బొడమెను ♦ కుజుడు విశాఖమును
ఇందునకు బ్రియమైనయట్టి రో ♦ హిణిని బోధనుడును
బొందిరి; సాంద్రము పొగలయలలతో ♦ పొంగజొచ్చె; నూరి
మందటిల్లి మాలిన్యమొందె ధూ ♦ మకేతువుతో జేరి
పరుషుండై జూపట్టె పంక్తికం ♦ ధరుడు ధనుర్ధరుడై,
కరంబు లిరువదితో మైనాకము ♦ కరణి భయంకరుడై
నిలచె రణస్థలి; రాఘవుండు కను ♦ బొమలు ముడిచికనుల
కొలదికెంపుగదురంగ వేడిచూ ♦ పులచె కాల్చునటుల
జూపట్టుచు నాగ్రహుడై నిలబడ ♦ క్షోణి దద్దరిల్లె
తాపమొందెను సమస్తభూతములు ♦ తరణితల్లడిల్లె
అట్టి మహోత్పాతములను, రాముభ ♦ యంకర ముఖము గని
దిట్టండయ్యును రావణుడొకింత ♦ దిగులొందెను మదిని.
ఇరువురిట్లు అన్యోన్యపరాజయ ♦ మిష్టించుచు మరల
దుర మొనర్ప సంసిద్ధులగుటగని ♦ సురలు నిలచి చదల
"జయము-జయము" రామా! యనిబల్కిరి ♦ క్షపాచరులు జేరి
"జయము-జయము" రావణా! యనుచు హె ♦ చ్చరించుచున్నతరి
శైలశృంగ సన్నిభమై, శాత్రవ ♦ జన నిబర్హణంబై,
కాలానల సమమై, రౌద్రంబై ♦ ఘంట శోభితంబై,
ఇనుపశంకువులచే వ్యాప్తంబై ♦ ఈశు శూల సమమై,
ఘనమై, వజ్రప్రతిమానంబై ♦ గాంచ భయంకరమై,
యొప్పారుచుయున్న మహాశూలం ♦ బొందు రావణుండు
అప్పళించి క్ష్వేడంబొనర్చి యి ♦ ట్లనె రామా! నేడు
నీకును లక్ష్మణునకు నుత్క్రమణము ♦ నిశ్చయంబు నిలుము
యీశస్త్రంబు నిహింసన మొనర్చు ♦ యీటొందజక మిమ్ము,
కాచుకొమ్ము హతులైన శూర రా ♦ క్షసులతోడ జేర్చి
వైచెదయని శూలంబు రాముపై ♦ వైచెను గురిజూచి.

గణగణయను ఘంటలచప్పుడు ది ♦ క్తటము లెల్లనిండ
కణకణలాడెడు నిప్పుకణంబులు ♦ గప్పుచు దివినిండ
వచ్చెడు తచ్ఛూలంబును, రాముడు ♦ వారింపగ నెంచి
చిచ్చర వీరతరంబుల వడి వ ♦ ర్షించె నేర్పుమించి
శరములెల్ల శూలంబుదాకి భ ♦ స్మంబయె నదిగాంచి
ధరణిజావిభుం డాగ్రహమున మా ♦ తలిచే తొలిప్రీ
నబర్హింబంచిన శక్తి నెత్తిదా ♦ నవవిభు శూలముపై
ప్రబలముతో వైచినయయ్యది బా ♦ డబమటు జ్వలించిపై
కొని పాసంబునుడీకొన, కున్తము ♦ గూలె విరిగి ధరను,
ఇనకులజుండంతటితో విడువక ♦ సునిశిత శరములను
అడరించి వలాహకవిభు రావణు ♦ హయముల నొప్పించి
కడిదితూపులను మూడాతని వ ♦ క్త్రంబు నాటవైచి
వాలుశరంబులనేసె సమస్తా ♦ వయవంబుల పైన
కీలాలంబున దొప్పదోగియె ♦ క్కింత యలరి దాన
వేశుడాగ్రహుండై తీక్ష్ణంబగు ♦ ఆశుగములనేసి
దాశరథినిగప్పిన రాముడు ర ♦ క్తసిక్తుడై మెరసి,
కోపోద్దీపితుడై చాపంబున ♦ రోపంబుల నునిచి,
"పాపీ! రావణ! ముచ్చవోలెనా ♦ పత్నినవహరించి
దెచ్చితివటరా, జనస్థానముం ♦ జొచ్చి సాహసించి
ఉచ్ఛేదమొనర్చియె యుందును మే ♦ మున్నచో నటఛీ! ఛీ!
పౌరుషేయమే? నీవొనరించిన ♦ పని, శూరునివలెను
పోరొనర్ప నిలచితివా నీపది ♦ పుచ్చెల ద్రుంచెదను
ధరనుబడిన నీకాయంబును న ♦ క్కలు కుక్కలు దినును
పర దారాపహరణమునకుం దగు ♦ ఫలమొందుము కలను
అనుచు రావణునిపై వర్షించెను ♦ అంప పరంపరలు
గన శ్రీరామున కిమ్మడించివి ♦ శ్రమ ధృతిహర్షములు,

సకలాస్త్రంబులు ప్రసన్నమయ్యెను ♦ శ్వపాచరవిభుండీ
పికలచె యట్టులగొట్టుపడి విధా ♦ నకముచె మనసుచెడి
ప్రదరంబులు బదులేసి నిలువరిం ♦ పక పట్టక గుణిని
ఎదియును దోచక యుండె వివశుడై ♦ యీదుస్థితిని గని
సారథి మెల్లగ రథముదోలుకొని ♦ సమరస్థలివిడిచి
జేరెనవ్వలికి రావణుడందుకు ♦ చిట్లి సూతుగాంచి
పలికెనిట్లు మూఢా నాతలపుల ♦ దెలియక ననుపంద
వలెను, పరాక్రమ శౌర్యవిహీనుని ♦ వలె, నల్పుని చందా
నను, ధైర్యోత్సాహంబులు లేక ♦ న్నట్టివాని వలెను,
అనుమానించితివా ? దలచితివా ? ♦ అసమర్థుడని నను,
భండన భీరుడననియో విభ్రాం ♦ తుండని దలంచియో
దండిని గాననియో శస్త్రాస్త్రవి ♦ దుండను గాననియో
ఎదిరికెదురుగా దోలకరథమును ♦ ఇటు విద్రావించి
వృధయొనర్చితివి నాదుయశంబును ♦ వృతులకలుసిచ్చి
శతృకైవశంబైతివా గన లం ♦ చంబు స్వీకరించి ?
మిత్రుడవైనచొ రథమును రణభూ ♦ మికివడి బోనిచ్చి
అరాతి కభిముఖముగ ద్రోలుము దా ♦ శరథిని యవలీల
పరాసనంబొనరింతు జూడునా ♦ బలపరాక్రమముల"
నావిని సారథియిట్లనె రావణు ♦ నకు 'మూర్ఖుడగాను,
ఆవిలచిత్తుడగాను, శఠుడగా ♦ నవివేకినిగాను
నీకు మేలొనర్పగ దలచియెని ♦ న్నిటకు దెచ్చియుంటి
నీకిది అప్రియమగుట కెంతయు ♦ న్నిజు కొందుచునుంటి
నీమిత్రుడనై, నీయన్నముతిని ♦ నీకొల్వునయుండి
స్వామి ద్రోహమొనరింతునె రిపు లం ♦ చంబున కాసబడి
తరుచు యుద్ధముల సూతుడు సార ♦ థ్యంబు జేయునెడను
అరయుగవలె నిరుపక్షంబుల బల ♦ హర్ష దుఃఖములను;

అవనిని నిమ్నోన్నతంబులును సమ ♦ యాసమయంబులను
ప్రవీణతలు హయగతిభేదంబులు ♦ ప్రతీపుఛిద్రమును,
అరదము నెదిరికి నెదురుగ దోలుచు ♦ నరుగుటయో లేక
దరికిదోలుటయొ, ప్రక్కనుంచుటయొ ♦ మరలుటయో గాక
ఆచటనె నిలచుటయో మొదలగు విష ♦ యంబులు, యదిగాన
ఇచటికి నినుదెచ్చితి నీవుస్థితి ♦ నెరిగి నీదు యాన
ఎటులైనను యట్లొనరించెద" నన ♦ ఇట్లనె రావణుడు
"కటకటమే యొనరించితివైనను ♦ కదనభూమి కిపుడు
అరదంబును రాముని కభిముఖముగ ♦ మరలింపుము కలన,
నరవరు నని బరిమార్పక నేనిటు ♦ దిరిగిరాను" యనిన
సారథి యుత్తేజుండై వడివడి ♦ స్యతాంగము మరల్చి
శ్రీరామున కభిముఖముగ నడిపిం ♦ చిన రాముడుజూచి
మరల యుద్ధమొనరింపగ వచ్చిన ♦ గరాసవిభు నెటుల
పరాజయం బొనరించుటయా యని ♦ పరిపరివిధంబుల
పరికించుచు యున్నట్టితరిని య ♦ భ్రమమునుండి, క్షితికి
అరుగుదెంచి భగవంతు డగస్త్యమ ♦ హర్షి దాశరథికి
అనెనిటు శ్రీరఘురామా, వినవ ♦ య్యా పరమరహస్య
మును, అఘహరణంబును, మంగళకర ♦ మును, సకలైశ్వర్య
దాయకమును, విజయావహమును, శా ♦ త్రవ వినాశనమును,
ఆయుర్వర్ధనమును, యగు ఆది ♦ త్యహృదయంబు యను
ఉత్తమోత్తమ స్తోత్రంబును నీ ♦ కుపదేశింతు నిది
అత్తపనాంతర్గతుడగు నారా ♦ యణుని గురించినది
ఇత్తరిదాని జపించి రావణుని ♦ హింసనమొనరించి
చిత్తశాంతినిం గనుము విజయ మా ♦ జిని సంగ్రహించి
అనుచు అగస్త్యుండా స్తోత్రము రా ♦ మున కుపదేశించి
జనియె దివికి; రాముడు ముమ్మా రా ♦ చమనము గావించి

పఠియుతుండై ఆదిత్యహృదయమును ♦ భాను సమీక్షించి
నియమముతో జపియించి విల్లుగొని ♦ నిలచెను ధృతిమించి.
ఆదిత్యుడు స్తోత్రింబున సంతు ♦ ష్టాంతరంగుడయి శరీ
వ్యాధధిపుండయిన రావణుని సం ♦ హారణంబును సంగ్రా
హించి, నిలచి దివి, రాముని యుద్దే ♦ శించి "రావణుని వ
ధించుము రామా ! త్వరబడి జయమొం ♦ దెద"వనె; ఇటరావ
ణుం డరదంబున సాయుధుడై శుద్ధ ♦ ధ్ధుండై రానుండ,
చండకిరణకుల మండితుండు రా ♦ ముండు విలును మండ
లాకారంబుగ వంచి మోపి ధర ♦ జ్యాను టంకరించి
లోకభీకరుండై నిలచిన యవ ♦ లోకనంబొనర్చి
రావణు డపసవ్యగతిం గల్గిన ♦ రథమున వడివచ్చి
ఆవేశముతో రామునిదాకెను ♦ అంబులు వర్షించి
దశరథాత్మజుడు మాతలి దెచ్చిన ♦ ధనువును జేబట్టి
దశకంఠునిపై వర్షించె వృష ♦ త్కాంబులు గురిబెట్టి.
ఆ వీరాశంసనమున యిర్వురు ♦ అని సల్పుచునుండ
దేవాదులు పరిగొని తిలకించిరి ♦ దివిని వేడ్కతోడ.
సూచకముగ రాముని విజయము, రజ ♦ నీచరవిభు మృతిని,
దోచె శకునములు రాముండవి గని ♦ తోషించెను మదిని.
రాక్షసవిభు యరదంబుపైన ప ♦ ర్జన్యుడు నల గురిసె,
దాక్షాయణంబులుదిరిగె, చలించెను ♦ ధరణి దుమ్ములెగసె.
ఇరువు రిటుల యొకరొకరిని జయింప ♦ నెంచి సహాయమించి
దుర మొనర్పుచుండిరి ఘనముగ యది ♦ తుదిగా భావించి
తరులు గిరులుగొని కపులును ఆయుధ ♦ ధరులై రక్కసులు
అరుదుబడిరి యా రామ,రావణులు ♦ ఆజిజేయ యట్లు.
జయము తనకు తథ్యంబని మది దా ♦ శరథి తలచిబోరె,
క్షయముగల్గు తనకని యెరిగియు రా ♦ క్షసేశ్వరుడు బోరె.

సందియమొందక వారటుధైర్య ♦ స్థైర్యంబులు మీఱి
ద్వందయుద్ధ మొనరింప గడంగిరి ♦ దానవవిభుడడరి
శితశరములు రాముని ధ్వజము నవై ♦ చినయవి కొట్టువడి
పతాకమున తాకకనే ధరబడె ♦ ప్రతికృతిగా వాడి
అజిహ్మగంబుల వైచిరాఘవుం ♦ డసుర విభునియరద
ధ్వజమవనిన్గూల్చెను అదిగనిరా ♦ వణుండు జెందిక్రుధ
చండకాండములచే రాము రథా ♦ శ్వంబుల వేధించి,
దండి కలంబంబులను దశరథా ♦ త్మజుపైవచరించి,
వాటిని రాముడు సాయకంబుల ని ♦ వారించుట దెలసి,
వాడెరాముపై శైలశృంగదుృమ ♦ ప్రాస శర్వలాసి
పరిఘ శల్య ముద్గర శరవాలిక ♦ పరశ్వధాదులను.
నరవరుడాగ్రహమంది తీక్ష్ణమగు ♦ నాళీకంబులను
గుప్పిన రిపుశస్త్రాస్త్రాదులు ధర ♦ గూలె నడుంగలను,
యిప్పగిదిరువురు శరవర్షము గురి ♦ యించుకొనుచు కలను
కొనసాగింపగ యత్నించిరి రణ ♦ కోవిదులై మిగుల
దనుజ కీశసేనలు గప్పబడె ♦ న్నదాస్త్రశస్త్రముల
నిశాచరుడు పచరించిన శరములు ♦ నిష్ఫలంబులగుట
దశరథసూనుని శరములన్నియును ♦ తనమెడ ఫలించుట
గని రోషుండై రావణుండు పరి ♦ ఘ స్వధితి గదాసి
ఘన సృగప్రాసాదులను మరల రా ♦ ఘవుని పైనగురిసి
అవియు నిరర్థకమాటదెలసి వ్యథ ♦ నంది బోరుచుండె,
అవనిజావిభుండనేక తూపులు ♦ అసురునిపైవీడె
ముహూర్తకాలం బాయుద్ధంబు, తు ♦ ములమై చెలంగె; వి
గ్రహస్థలింగన భయోత్పాతమయె ♦ కంపించెను పృథివి,
రవితేజముబాసెను పన్నగదా ♦ నవులు వ్యథలబడిరి
పవనుడు వీవండయ్యె కలంగెను ♦ పయోదధులు; జేరి

అమరగరుడ గంధర్వసాధ్యులును ♦ యక్షాదులు, ఋషులు
మమతతో శుభమగుగాకను గోబ్రా ♦ హ్మణులకు, లోకములు
స్థిరమగుగాకను, శ్రీరాముండా ♦ జినవడి రావణుని
పరాసనంబొనరించి జయంబును ♦ బడయుగాకను, యని
జపములొనర్చుచు. భయభ్రాంతులై ♦ చదల నిలచియుండె;
ఉపమెయ్యెడ రామరావణుల సం ♦ యుగమునకు లేకుండె.
అత్తరి రాముండలిగి తీక్ష్ణముగ ♦ అజిహ్మగం బొకటి
ఎత్తి ద్రుణంబునదొడిగి రావణుని ♦ కుత్తిజూచి నూటి
అడరించిన యాతని శీర్షం బిల ♦ బడె ఖండింపబడి,
తడవులేక రావణునకు మరియొక ♦ తల మొలచెను; వాడి
శరమున రాముడు తచ్ఛీర్షంబును ♦ నఱికెగాని మరల
శిరము వెలువడెను, ఇట్లు రాముడా ♦ శరుని మస్తకముల
నూటొకమా రుత్తరించి నిష్ఫల ♦ మాటకు చింతిల్లి
తూటొనర్చినను తలలు, చావడు ని ♦ శాటవిభుడు తొల్లి
కబంధ ఖరదూషణప్రముఖ రా ♦ క్షసుల ద్రుంచినట్టి
అభంగమగు ఆసాయకములు క్రి ♦ వ్యాదునెడల వట్టి
వగుట కబ్రబడి, ఎటులజచ్చు రా ♦ వణుండనుచు మదిని
వగచుచు మఱిబహు పృషత్కంబులను ♦ వైచి దశాననుని
నొప్పించెను; రావణుండు క్రోధము ♦ నొంది రాముమీద
గుప్పె శాతశర పరిఘాతన ఘన ♦ కుఠారఖడ్గ గదా
దు లిర్వురకు సర్వరాత్రి మివ్విధి ♦ తుములంబగుచుండ
బలారిసారథి. మాతలి రాముతో ♦ బల్కెనిటుల "చండ
కరకులమండిత రామా! చోద్యము ♦ గావు ప్రమత్తుడవు
మెరిగియు మెరుగని వరుసునయుంటివి ♦ యీ రావణు చావు
నరునిచేగలుగను దేవవాక్య మీ ♦ నాడువచ్చెను ప్రభూ!
త్వరగ రావణునిపై బ్రహ్మాస్త్రము ♦ బరవుమనిన, వరభూ

వరతనయుడు శ్రీరాముండూర్జ ♦ స్వలుడా హితము విని
స్మరణ దెచ్చుకొని ఆదివ్యాస్త్రము ♦ శరనిధినుండి గొని
అభిమంత్రించి గుణంబున దొడిగెను ♦ ఆయస్త్రము మున్ను
బుబుక్షుకొసగెను విరించి సృజించి ♦ ఇంద్రుం డస్త్రమును
జగద్ధితంబుగ నగస్త్యమునికి ♦ సమర్పించె దాని
న్నగస్త్యముని రామున కొసగెనుము ♦ న్నటవినున్నతరిని
అమోఘ్రగరూపంబై తీవ్రంబై, హోద్దీపసారంబై
విమతగజాశ్వహారివిదారణమై ♦ వీరతరాగ్రంబై
యొప్పెడు తద్బ్రహ్మాస్త్రము విల్లున ♦ యుంచినంత తరణి
దప్పెనుగతి, భీతిల్లె సర్వభూ ♦ తములు, వడకె ధరణి,
దివంబదరె, నట్టివేళ రాముడు ♦ పవి విధంబు శరము
నైవిండాయగా నిగ్గి ప్రయోగిం ♦ చెను రావణుయురము
నాట నూటిగా; తద్బ్రహ్మాస్త్రము ♦ నాదించుచుజని, ని
శాటవిభుండగు రావణువక్ష ♦ స్థలమున దూరుకొని
దశాననుని యసువులగొని నెత్తుట ♦ దడిసి వెలికివచ్చి
రసజొరి వెల్వడి సంస్థితిజెందెను ♦ రాముని పొదిజొచ్చి
దశాననుడు, కార్ముకశరములు హ ♦ స్తంబునుండి జార,
అసువుల బాసి రయంబున గూలెను ♦ అరదమునుండి ధర,
సురద్విషుని పాటుజూచి హత శే ♦ షులైన రాక్షసులు
జొరిరి లంకవడి విద్రావితులై ♦ దరుమగ వానరలు
రాముని విజయము, రావణు అపచా ♦ రంబుగాంచి సురలు
రాముని రథమున సుమములు గురిసిరి ♦ రవాళె దుంధుభులు
పురందరాదులు ప్రమోదమొందిరి ♦ మునులు సంతసిలిరి
హారిదశ్వుడు కాంతిశోడ వెలిగెను ♦ స్థిరమయ్యెను ధాత్రి.
మరుత్తువీచెను దిశత్తెలివిగనె ♦ హరుసించిరి కపులు
మరుద్గణంబులు, జాంబవదంగద ♦ మరుత్సు తార్క్యజులు

విభీషణుడు లక్ష్మణుండు రాముని ♦ విజయంబును, అసుర
విభుమరణంబున కలరి ధరణిజా ♦ విభుని జేరి స్తోత్రి
మొనర్చి రయ్యెడ; విభీషణుడు, రా ♦ మునిచేత హతుండై
మనుబడియున్న సహోదరుని గని ♦ మనోవ్యధితుండై
విలపించుచు నిట్లనియెను, "అన్నా ♦ వీరా ! రణధీరా ♦
బలశాలివి రాజనీతినిం వి ♦ ద్వాంసుండవు శాస్త్ర
ముల శిక్షితుడవు, సుప్రసిద్ధుడవు ♦ మొగినిబడితి వకటా !
వల దిలజను రాముసకిమ్మన విన ♦ వైతివి నామాట
అయ్యయో ! పరదారాప హారణమున ♦ అసురవంశమునకు
క్షయముగలిగె గద, అకాలమరణము ♦ సంభవించెనీకు,
నిశాచరపతీ ! అన్నా రావణ ♦ నీవిట్లిల గూల
శశిచీకటి ముగ్గినయ ట్లనలము ♦ చల్లారిన యటుల
ద్యుమణి ధరణిపైబడిన విధంబుగ ♦ దోచె రావణుడను
దుమము రాముడను పెనుగాలిచెబడె ♦ దుమాలుగా ధరను !
రామసింహముచె భూమియందుబడె ♦ రావణ మదగజము!
రామవ్యాఘ్రముచె హతమైగూలెను ♦ రావణుడను వృషము!
రావణదావాగ్నిని జల్లార్చెను ♦ రాఘవ మేఘంబు!
నీవులేని యీలంకయు నిఖిలము ♦ నిజముగ శూన్యంబు"
అని పలువిధముల విలపించు విభీ ♦ షణునకు రాముండు
అనెనిటు, మిత్రమ ! వగవ కిటు ల నీ ♦ యన్న రావణుండు
చండవిక్రముడు శూరుడు సమరో ♦ త్సాహు డధికబలుడు
ఖండనమొనర్చి కాలవశంబున ♦ ప్రాయమొందినాడు
చావెన్నటికైనను తప్పదుగద ♦ క్షపాచరవిభుండు
రావణుండు రణకోవిదుండు వి ♦ క్రముండు ధీరుండు
రణముసజచ్చినవారు వీరస్వ ♦ ర్గము బొందుదురనుట
ప్రిణిహితయుతంబు అద్దానిని రా ♦ వణుండు బడసెనిట.

అన్నకొరకు దుఃఖింపకు" మన యి ♦ ట్లనియె విభీషణుడు
మున్నెన్నడు దేవాంద్రాదులచే ♦ మోసపోనివాడు
నీవల్లను మాయన్న రావణుడు ♦ నిహతుండైనాడు
రావణుండు గన ఆహితాగ్ని క ♦ ర్మఠుడు తపోధనుడు
వేదశాస్త్రసంపన్నుండు ధను ♦ ర్వేద కోవిదుండు
ఆదటతోడ సమస్తభోగముల ♦ యనుభవించినాడు
గురుదైవంబుల బూజించెను పె ♦ క్కు దానములొనర్చె
అరసముతోడ ధనాదులిచ్చి పరి ♦ చరులను బోషించె
మిత్రులకొసంగి సర్వసుఖంబులు ♦ మేలొనర్చినాడు
శత్రులపై బగదీర్చువాడు సం ♦ స్కారార్హుండితడు
భ్రాతనైన నేనొకడ యుంటిగద ♦ బ్రతికి, రావణునకు
ప్రేతకృత్యమొనరింతు యదావిధి ♦ ప్రియమగు నెడనీకు
అనవిని రాముండనెనిట్లు విభీ ♦ షణునకు మీయన్న
యొనర్చినను దోషంబులెన్నియొ స ♦ హోదరుండు గాన
మరణాంతంబున వైరము యుండుట ♦ మంచిగాదు గాన,
సురద్విషుని కంత్యక్రియ గావిం ♦ చుము విధికృతముగ, నా
కది సమ్మతమేయనుచు రాఘవుం ♦ డానతిచ్చె నంత,
విదారణంబున పతిరావణుమృతి ♦ విని రాక్షసకాంత
లవని దుమ్ములంబడి పొరలుచు య ♦ శ్రువులు నిండకనుల
అవిధింబొక్కుచు గుంపులుగా విరి ♦ యబోసికొని తలల,
ఉత్తరద్వారము వెడలివచ్చి సం ♦ యుగస్థలిని జొచ్చి
మృత్యునందు బడియున్న రావణుని ♦ మృతకంబును జూచి
హానాథా! హాప్రాణేశ్వర; యని ♦ ఆర్తులగుచు విభుని
పైనపబడి, విలపించి రధికముగ ♦ పడతి యొకతెయతని
కుత్తుక బిగువుగ గౌగలించుకొని ♦ కుందెను, మరియొకతె
ఎత్తిపట్టి ప్రాణేశు బాహువుల ♦ నేడ్చెను యింకొకతె

ప్రియునిశిరస్సును నొడిఁజుందిడుకొని ♦ విలపించెచు మించి,
దయితయొకతె మూర్ఛిల్లెను అతని వ ♦ దనము జూచిజూచి
మరియు శోకమంత కంత కగ్గల ♦ మువగ పతినిగూర్చి
పరిపరివిధముల దలపోయుచు హా ♦ సురపతి శమనశుచి
వరుణాదు లీతనికి భయమందిరి ♦ ప్రవిదారుణమున, రా
జరాజు పుష్పకమిచ్చి జనెనుగా ♦ జంకితనికి, అసుర
యక్ష సాధ్యకిన్నర ఖగ గంధ ♦ ర్వాదులు తాపసులు,
రక్షసు లెవరికి వెరచెదరో యూ ♦ రావణుండు యిట్లు
నరమాత్రునిచే హతుఁడై విశ్వం ♦ భరమున బడినాడు
తిరస్కరించెను తమ్ముని హితమును ♦ తెలివిలేక నాడు
సీతమ్మను శ్రీరామునకిచ్చిన ♦ చేటు యేలవచ్చు ?
ధాతవ్రాతగాకున్న మనకు నై ♦ ధవ్యమేల యనుచు,
వ్యతికర మొందుచు నున్న యట్టితరి ♦ అందు దశాననుని
కృతసాపత్నిక మండోదరి దుః ♦ ఖించుచు వల్లభుని,
డాసి "మహాభాగా ! ధనదానుజ ♦ అసురవర నాథా !
రోషితుండవై నిల్వనీకెదుట ♦ వాసవ ఋషి విబుధ
భూసురాదులే నిల్వలేరుగద ♦ పుహూంసుడైనట్టి
దాశరథిచె హతుడైతి వకట యు ♦ ద్ధంబున జగజట్టీ!
నిన్నడవిని ద్రిమ్మరెడు నరుండా ♦ నిహనన మొనర్చుట!
కన్న విన్న యబ్బురము గదో చెను ♦ గాక లంకజొరుట,
సామాన్యన కలవిగాదు, ఖరదూ ♦ షణాదులను వనిని
రాముడొకడె వధియించెనో నాడే ♦ భూమిజవల్లభుని
మానవమాత్రుడు గాడని నే నను ♦ మానము జెందితిని,
వానరుడొక్కడు లంకాపురిజని ♦ వధించి లంఖిణిని
లంకగాల్చినపుడే శంకించితి ♦ లాంగూలులు వడి కూ
లంకషంబునకు సేతువొకటి క ♦ ల్పనమొనర్చి యిటకు

వచ్చిననాడే సందేహించితి ♦ వైదేహీవిభుండు
అచ్చముగా మనుజుడు గాడని మది ♦ అటుగానిచో, యముడు
నరరూపుండై యేతెంచెనో నిను ♦ బరిమార్పఁగ; కాక
సురపతియే నరుడయ్యెనో నిన్ను ని ♦ శుంభన మొనర్ప; కా
లామర విభులెన్నడు జంపగ జా ♦ లరు నిను నిక్కముగ,
రాముడు, నరుండు గాడతండు నా ♦ రాయణుండు, భుజగ
శయనుడు డాదిమధ్యాంతరహితు డ ♦ వ్యయుం డచ్యుతుండు,
స్వాయంభువుడు, హరి, సనాతనుడు శ్రీ ♦ వత్స భుజాంకితుడు,
అఖిలచేతనా చేతనాత్మకుం ♦ డా శ్రిత రక్షకుడు,
నిఖిలలోకపాలకుడు, రమేశుడు ♦ నీరజనాభుండు,
వైకుంఠుండిటు నరరూపంబున ♦ వసుధ నవతరించి
ఈకుంభిని కపులై బుట్టిన బ ♦ ర్హిర్ముఖులతో వచ్చి
సకలరాక్షసో పేతంబుగ నని ♦ సంహరించె నిన్ను
అకటా! రామునితో వైరమువల ♦ దంటిని నేమున్న
వినక నాదువాక్యంబులు నాథా ♦ విడిచితివి ప్రాణములు
కనుగొన రోహిణికన్న నరుంధతి ♦ కన్న శ్రేష్ఠురాలు,
సీత భువనవిఖ్యాత సద్గుణో ♦ పేత పతివ్రత, భూ
జాత, పూతచారిత్ర తపస్విని ♦ జగన్మాతను ప్రభూ!
కట్టడివై మోహించి దెచ్చి చెర ♦ బెట్టినట్టి పాపి!
అట్టి సాధ్వి తప మహిమంబుననే ♦ అంతము నొందితివి
వరదారా హరణంబున కుద్దగు ♦ ప్రాయశ్చిత్తమిది;
బరగ పుణ్యునకు పుణ్యఫలము సం ♦ ప్రాప్తంబగు, మరది
విభీషణుడు రాముని నాశ్రయించెను ♦ వివేకియై, యతడు
శుభఫలమొందెను; నీకు ప్రాప్తమయె ♦ ఫలం బీపాటు
మోహావేశంబున నన్ను మరచితివి ♦ మోసము జెందితివి
ఆహా! నీవయె, మాకీవైధ ♦ వ్యంబును దెచ్చితివి

మందభాగ్యనైతిని శోకాంబుధి ♦ యందుబడితి, వ్రాత !
నందను డింద్రునిగెల్చిన ఘనుండు ♦ నాథు డసుర నేత !
మయుడు తండ్రి, నాకేమికొదువ యని ♦ మనమున బొంగితిని,
భయములేదు నాకిలలోయని వి ♦ భ్రాంతినిజెందితిని,
అందరానిఫలమునకై యెందుల ♦ కాశను జెందితివి
అందచందముల సరియగునే నా ♦ కవనిజ యీపృథ్వి ?
సకలభోగముల ననుభవించితిని ♦ స్వామీ నీవలన
అకట నాకుదిక్కేది భువిని అ ♦ య్యయ్యో దశవదన !
నన్ను విడిచి పోయితివా నాథా ♦ నాపై గినిసితివా
నిన్నుబాసి స్థిరనైయుంటిని క ♦ న్నెత్తి నన్నుగనవా ?
కలయో మాయయో; నిక్కము నీయు ♦ త్క్రమణమరయ కుంటి
అలవి యయెనె మృత్యువునకు నినుడా ♦ యగ నోజగజట్టి !
అవరోధంబున నుండుదాన ని ♦ ట్లనిస్థలికిరాగ,
అవమానకరంబని వీక్షించవు ♦ అగ్రహ మొందవుగా !
అభవ మొందెదవు అసురులెల్లరతో ♦ యని నీతోముందు
విభీషణుండన్న పల్కులేవియు ♦ అభావ మవలేదు
మయునిపలుకు, కుంభకర్ణు సూక్తులు ♦ మారీచుని హితవు
నయశాలి విభీషణు సద్బోధలు ♦ నచ్చక చెడినావు,
ఇనుమో రాయియో! వ్రక్కలవదు నా ♦ హృదయము నినుగాంచి
మనజాలను నేవైధవ్యముతో ♦ మహిని నిన్నువిడిచి.
అనఘా ! నన్నిట విడి బోవుట న్యా ♦ యంబుగాదుజూడ"
అనుచు నిట్లు మండోదరి ఘనదుః ♦ ఖావేశముతోడ
పరిపరివిధముల వగచి విభునిపై ♦ బడి మూర్ఛిలె నంత
నరవరుడిట్లనిబల్కె విభీషణు ♦ నకు మిత్రమ, భ్రాత
కొనరింపు మగ్నిసంస్కారంబన ♦ ఇనకులజున కిటుల
అని విభీషణుం డార్యా విను నా ♦ యన్న కంత్యక్రియల

జేయ మనసు రాకున్నది యాతడు ♦ చెడుగుడు, కర్కశుడు,
దాయ, యితుడు నాసహజుండైనను ♦ ధర్మవిదూరుండు,
పరదారాసక్తుండు నృశంసుడు ♦ పాపి దురాత్ముండు
అరయ జనక సముడేయైనను పూ ♦ జార్హుడు గాడితడు,
నావిని రాముండనియె విభీషణు ♦ నకు దరహాసముతో
నీవునాకు ప్రియము మొనర్చినాడవు ♦ నే నీసాయముతో
విజయ మొందితిని, ప్రీతిని జెందితి ♦ విభీషణా నీకు
నిజముగ నేను హితంబుజెప్పవలె ♦ నీవు రావణునకు
ఉత్తరక్రియలను గావించుటయే ♦ యుత్తమ ధర్మంబు
సత్తముడే యాతం డరయగ వా ♦ స్తవముగ దోషంబు
లెన్నగల్గినను రావణుండు గుణి ♦ ఇంద్రాదుల కతడు
ఎన్నండు బరాజయ మొందని వా ♦ డేద్త్రలను, బలుడు
సకల వేద సంపన్నుండు తప ♦ శ్శాలి యాహితాగ్ని
అకుతోభయుండు లోకరావణుడు ♦ అనఘుడట్టివాని
కీవొనరింపుము ప్రేతకృత్యమది ♦ ఇష్టంబే నాకు
రావణుండు నీవల్లను సంస్కా ♦ రంబును బొందుటకు
దగినవాడు, మృతుడైనవానిపై ♦ దగదు విరోధంబు
అగునాతడు బంధువునాకును, నీ ♦ యటులనె; ధర్మంబు
లన్నియు దెలసినవాడవనుచు బ ♦ ల్కగను విభీషణుడు
అన్నభార్యలను బంపుచు సంస్కా ♦ రాను రూపమపుడు
చితయొనర్చి చందనకాష్ఠంబులు ♦ చేరిచి రావణుని
మృతకమందునిచి, క్రమంబుదప్పక ♦ స్మృతి విధించు విధిని
త్రేతాగ్నులుగావించి ఛాగము వ ♦ ధించి పేర్చికప్పె
నేతితోదడిపి దానిని రావణు ♦ నిపై వైచి యవ్వా
డంబర చందన మాల్యాదులతో ♦ నలంకృతుని జేసి
అంబకాంబువులు దోగ ముఖంబుల ♦ అసురులతో గలసి

స్తంబకరీపీలాలను చితిపై • జల్లి సమంత్రముగ
మంబర మొనర్చె, అన రావణుని శ • వంబు దుఃఖమొసగ.
స్నాతుడై పిదప విభీషణుడు కుశ • జలతిల లిలనుంచి,
ప్రేతావాహన మొనర్చి అంకు, కృ • పీట దానమిచ్చి
ప్రణమిల్లి సహోదరునిభార్యలను • బంపి భవనములకు
అణకువతో రవిజానుజ సమేతు • డైన రాముకడకు
వచ్చినిలచి కొలచెను; శ్రీరాముడు • వఱలె సంభ్రమముతో;
రచ్చనుగన దివి వచ్చిన బృందా • రకాదు లరసముతో
మెచ్చుకొనుచు రాముని శక్తిని సౌ • మిత్రి భ్రాతృభక్తి.
మచ్చరీడు రావణుండు విగ్రహ • మందొందిన ముక్తి
అచ్చభల్ల గోపుచ్ఛంబులు జ • న్యమొనర్చిన విధము
పచ్చవారువపు జోదుసుతుని సా • ప్తపదీనపు ఘనము,
ముచ్చటించుకొను చేగిరి నివసన • ములకు; రాముడంత
పిచ్చలించి మాతలిని ఇంద్రరథ • మిచ్చిబంపి, సవితా
పుత్రుని భావం బలరాలింగన • మొనర్చి, అనెనిటుల
మిత్రమ నీసాయంబున విజయము • మేకొంటిని, చాల
శ్రమబడినాడవు కపికులేశ్వరా • సంగరమున యనుచు,
ప్రమదమొసగ కపివరులుగొల్వ శిబి • రంబులకు న్జనుచు
సౌమిత్రిఁగని అనెనిట్లు విభీ • షణుండు నాయందు
ప్రేమయు భక్తియుగల్గి మేలొన • ర్చెను గావున ముందు
అతుల శ్రీసంయుత లంకారా • జ్యాభిషేచనంబు
అతనికి నీవొనరించుము అది నా • కగ్రవాంఛితంబు
అనవిని లక్ష్మణు డానందముతో • హరులను బంపించి
కనకకలశములతోడ సాంద్ర యుద • కంబుల దెప్పించి
అల విభీషణుని కనకరత్నసిం • హాసనంబుపైన
సులగ్నమున కూర్చుండబెట్టి వి • నూర్జిత కుతుకమున

పణవము రజ కాహళ భేరీ ని ♦ ధ్వాన మొసగుచుండ,
ప్రణుతించుచు మంత్రులును క్షపాచర ♦ ప్రముఖులండరుండ,
చేకొని కలశము వేదోక్తం బభి ♦ షేకముగావించి,
ప్రకటముగ పట్టంబుగట్టి జన ♦ భవుకము దీవించి,
ఆ విభీషణుడు లంకారాజ్యం ♦ బటుల స్వీకరించి
పావనాత్ముడై అలరుచు రాక్షస ♦ వరుల సత్కరించి
మంగళవస్తువులంగైకొని రఘు ♦ పుంగవు కర్పించి
రంగమొందె కడు భక్తితో దాశ ♦ రథులను బూజించి,
అంతరాఘవుడు చెంతనున్న హను ♦ మంతుని వీక్షించి
"మంతువు విభీషణుని యాజ్ఞంగొని ♦ మరల లంకజొచ్చి
జనకజరుంగని దశాననుని నే ♦ జంపిన విషయంబు
ఇనజానుజులతో నేను క్షేమముగ ♦ ఇటనున్న విధంబు
జెప్పి సీతసందేశము దెమ్మతి ♦ శీఘ్రంబుగ" యనిన,
అప్పవనాత్మజు డటుల లంకజొరి ♦ అందు వ్యానమున,
ఇరుగుడు తరుమూలంబున రక్కస ♦ పరివృతయై భాష్ప
భరితనేత్రయై తనుసంస్కారము ♦ బాసి రాముదప్ప
అన్నచింతనము లేకుండిన సీ ♦ తాభిరాట్టి జేరి,
తన్నెరుంగగా దెలిపి నిలచె వం ♦ దన మొనరించి దరి.
జానకి మారుతినింగని గుర్తిం ♦ చ జాలకను తొలుత
వానరోత్తముడు హనుమంతుడు మును ♦ వచ్చిన వృత్తాంత
మును జ్ఞప్తికిదెచ్చుకొనుచు సంతస ♦ మొందిన; సామీరి
అనె నిట్లంజలి హస్తుండై కుజ ♦ "కమ్మా! నీపతి శ్రీ
రాముడు లక్ష్మణసుగ్రీవులతో ♦ క్షేమంబుగనుండె
ప్రామిడి రావణుడని రామునిచే ♦ ప్రమథనమొందబడె.
సుగ్రీవాంగద విభీషణాదుల ♦ సుతుల గూడివచ్చి
విగ్రహమున శౌమ్యుండు రావణుని ♦ విశశనమొనరించి,

విజయముగొని తమ్మునితో సుఖియై ♦ వెలయుచున్నాడు.
వృజిన భయాదుల త్యజియించుము దే ♦ వీ భవద్విభుండు
ఈ విషయంబును దెల్పి జెప్పుమనె ♦ ఇవ్విధి సీతోడ
"దేవి ! నాభాగ్యంబునయుంటివి ♦ జీవముతోడ నిడ
నీవులేనిచో నాకీవిజయము ♦ నిష్ప్రయోజనంబు
రావణుని విదారించి సంప్రహా ♦ రంబున రాజ్యంబు
నయశాలి విభీషణునకు నొసగెద ♦ నంటిని తచ్ఛపథ
ద్వయమును నెరవేర్చితి నీవేమియు ♦ భయపడకిక మీద
విభీషణుడు నిను దర్శింపగ త్వర ♦ విచ్చేయును సాధ్వీ
శుభముగల్గునీ" కనియెను మారుతి ♦ సూక్తులవిని పృథ్వీ
సుత పరమానందితయై పలుకక ♦ జూచుచుండ పవన
సుతుడవనిజకనె నిట్టుల తల్లీ ♦ చోద్యము పలుకైన
పలుకక చింతించెదవేలకొ యన ♦ పావనికనెసీత
"దెలిపితివహా నావిభునివిజయమును ♦ స్థితియును తచ్చరిత
మతిమధురంబు, మనోహారంబు, శ్రా ♦ వ్యంబు, తారకంబు
ప్రతీక్ష్యంబు, సుఖదంబు, మంగళ ♦ ప్రదంబు, విహితంబు
అట్టి ప్రియోక్తులవినగ పారవ ♦ శ్యంబునొంది నేను
ఎట్టిసూక్తియందుకు ప్రతివాక్యము ♦ ఎరుగకయున్నాను.
మహోత్కృష్టమగు నీదు ♦ సువార్తకు, మారుబలుకగాని,
బహూకరింపగగాని లేవు పద ♦ పదార్థంబు లవని
న్నాగలోక నాకంబులయందై ♦ నను నాథుని నేను
వేగజూడ కాంక్షించుచుంటినని ♦ విన్నవింపు" మనెను.
నావిని పవనాత్మజుండు పరమా ♦ నందమంది సీతా
దేవికిట్లనియె తల్లీ ! పతివ్రత ♦ నైవిభు విజయవ్రతా
పంబులగోరుచు యున్నయట్టి నీ ♦ పలుకుల మధురిమకు
సంబరమొందితి, వినుమమ్మా నీ ♦ సద్భాషణమునకు

సరియగునే ముజ్జగముల గలయై ♦ శ్వర్య సౌఖ్యములనూ
తరించితిని దర్శింపగల్గితిని ♦ దాశరథిని నేను.
పెన్నిధి పొందినవాడనైతిదే ♦ నే నీ సూక్తి విని,
పున్నదంపతులు మీ కైంకర్యమె ♦ పుడమిని నాకన్ని
ఒక్కవరము నాకొసగుము తల్లీ ♦ చిక్కి రావణునకు
పొక్కుచుపతికై ఇటు నీవుండగ ♦ ఉక్కణంబు కొరకు
పెక్కురక్కసిల నుంచినవారలు ♦ బెట్టెరి నిను శ్రమల
ఉక్కడంతు, హింసింతుచిత్రవధ ♦ యొనర్తు రక్కసుల
బుక్కబుక్కకును నెత్తురుగ్రక్కగ ♦ నక్కల గలబొడుతు
చొక్క పునఖముల ప్రక్కలు డొక్కలు ♦ ప్రక్కలించి వైతు
వింతతనువు లింతింత తునుకలుగ ♦ నెంతయుగావింతు
దంతంబుల రాలగొట్టు ముష్టిం ♦ తలలిల బడ బొడుతు
కరచికరచి చెండాడిచీల్చి జ ♦ ర్జరితాంగుల జేతు
తిరముగ పదములబట్టి దిర్దిరం ♦ ద్రిప్పి జలధి వైతు
కసిదీరగ రక్కసిమగువల కీ ♦ కసముల పొడిచేతు
వెసనఖరంబుల జీలిచి నెత్తురు ♦ దెసలను చిమ్మింతు
నీకపకృతిసల్పిన వీరల మన ♦ నీయరాదుగాన
నాకనుజ్ఞ యొసగుము యనవిని జా ♦ నకి, మారుతివచనా
నైపుణ్యంబును ప్రశంసించి ద్రవి ♦ ణౌదార్య స్థైర్య
స్తూవ ధైర్య గుణ గాంభీర్య నయా ♦ దుల గీర్తించి దయా
రస మొల్కగ బుద్ధగీతమనెడు పు ♦ రాణగాథ దెలిపి
అసుర భామినులు ప్రభునాజ్ఞచె త ♦ న్నేయించుట తప్పి
దంబు గాదనుచు రక్కసులకు ప్రి ♦ త్యపకారము వాంఛి
తంబుగా దనగవిని పావని త ♦ ద్ధర్మంబు గ్రహించి
జనకజాజ్ఞగొని రాముకడకు ♦ జని, అనెనిటు కై మోడ్చి
"ఇనవంశోద్భవ శ్రీరామా నీ ♦ వేయింతి గురించి

గలిపితివో యింతటి ఘనకార్య ♦ బులనిల యావనిత
మలినవసన, దీనానన, భాష్పస ♦ మాకులాక్షి, సీత
శోకతప్తయై పొగలుచుండె యా ♦ సుదతిని గనుగొమ్ము
మీకుశలము విజయమువిని సంబర ♦ మించి మిగులమిమ్ము
జూడ త్వరితముగ నెంతయొ కాంక్షిం ♦ చుచు నున్నానని నీ
తోడ జెప్పుమనె, అనవిని రాముడు ♦ కోప మందిమదిని,
తలపోసెను నిటు రావణునుదపసి ♦ తంబున యున్నట్టి,
ఇలజను నే స్వీకరింప లోకులు ♦ ఏనరయగ వట్టి
కాముకుడందురు అట్లుగాక ని ♦ ష్కళంక సుగుణవతి
భూమిజను నిరాకరింప దోషము ♦ ఏమియొ ముందుగతి
గాసినిజెందిన సతిని మరల నా ♦ యాస పెట్టుటెట్లు?
దోసిగాదనుచు నిరూపించి వెత ♦ నోసరిలుట యెట్లు ?
అనుచు మనస్తాపమునొంది విభీ ♦ షణు నవలోకించి
అనఘా ! నీవువడింజని సీతను ♦ అంబువు లాడించి
అలంకృతను గావించి దోడిదె ♦ మ్మన కీనాశపతి
అలరుచువడి స్వస్త్రీజన పరివృతు ♦ డై శ్రీరాముసతి
సన్నిధికింజని ఇట్లనిపించె త్రి ♦ జటాదులతో, "దేవీ
కన్నులగవ్వకొనంగ దలచిరా ♦ ఘవుండు నిన్నువవి
త్రింబులాడి సాలంకృతవై అం ♦ దలంబునెక్కి త్వరి
తంబుగరమ్మని", గొనిరాబంపెను ♦ దాశరథినిజేరి
శుభమందుము యన, జానకియనెనిటు ♦ విభీషణుని కోడ
"అభినిర్వాణంబొసర్తు యిపుడు ♦ న్నటుల విభుజూడ"
విభీషణుండందుల కొప్పక, నీ ♦ విభుడుజెప్పి నటుల
అభిసారణ మొనరింపవాంఛనీ ♦ యంబన విసినేల
చూలియొప్పె, చెలులంత కుజను కీ ♦ లాలము లాడించి
సాలంకృతగావించి రమ్యమగు ♦ పాలకి నెక్కించి

విభీషణుని వెంటను బంపించిరి ♦ వినయ మొప్పగాను.
అభిగమించియుం దనుకవిభుడు భూ ♦ విభునికిట్లు పృథ్వీజను,
గొనివచ్చితి నదిగో యున రాముడు ♦ కుతుక మొందె మదిని,
వెనకొన దీనతయును రోషంబు వి ♦ భీషణునితో సతిని
సమీపమునకుం దోడ్తెమ్మన రా ♦ క్షస నాథుం డల్ల
క్షమజను గన నటకుమిగూడిన రా ♦ క్షసవానర భల్లా
దులను నవ్వలకు రక్షకభటులచె ♦ దోలింపుచునుండ
దెలసి రాముడట గలిగిన కోలా ♦ హలంబునకు నింత
గినిసి విభీషణునకు నిట్లనియెను ♦ "శ్రీరాముల నటుల
జనకజనుం గననీయక యవలికి ♦ పనుపుట యిలమేలా
గాదావరణము కాంతకు గృహసౌ ♦ ధారంబులు తెరలు
గాదు జనులదోలగించు రాజమరి ♦ యాదలు, వస్త్రములు
గా దరయగ యావరణము వారల ♦ కాచారమెగాని
వైదేహినిగన గలుగనీయక ♦ భ్యంతర మెవరికిని.
వ్యసనంబుల, నాపత్తులయందు స్వ ♦ యంవరములయందు
స్వశస్థలంబుల యజ్ఞంబులలో ♦ పరిణయములయందు
సతు లితరుల కగుపించుటగన దో ♦ షముగా దదిగాన
క్షితిజ రణస్థలి మహాకష్టమున ♦ జిక్కియుండె, పైన
నాసమక్షమున యుండెను గావున ♦ దోసములేదేమి
దీనుకారమ్మన" విభీషణుడు దో ♦ డ్తెచ్చెకుజను; సామీ
రినజ లక్ష్మణాదులు రాముడు వచి ♦ యించిన దంతవిని
జనకజనాతడు విడనాడెడు భా ♦ వన జూపెడు కరణి
పరుషవచనములు బలికెగదా యని ♦ పరితపించుచుండ
ధరణిజ సంకుచితాంగియయ్యు యం ♦ దను గాంచుచు నుండ
సిగ్గుచె వస్త్రము మోముగప్పుకొని ♦ చేరివిభుని, నిలచి
ఉగ్గడించె "నో ఆర్యపుత్ర" యని ♦ ఒడయునిగని యేడ్చె.

వంద స్నేహాశ్చర్యంబులతో ♦ నాథుని వదనార
విందము జానకి సౌమ్యాననయై ♦ వీక్షించెను నెడ రా
ఘవుండు వైదేహిని గనుగొని ప్రతి ♦ ఘంబు మీర యిటుల
వివరింప దొడంగెను "కల్యాణి ♦ విక్రమశౌర్యముల
బవరంబొనర్చి రావణుజంపితి ♦ పౌరుషంబుచేత
అవమానంబును దానినొనర్చిన ♦ ఆరాతిని ఘాత
మొనర్చినాడన గాని నిన్ను బడ ♦ యుటకై గాదు ప్రతి
జ్ఞను జేసితి దానిని పాలించితి ♦ స్వతంత్రుండనైతి
వెలిగినే కృతార్థుండనైతి జే ♦ సిన శ్రమము ఫలించె;
జలధిలంఘనము లంకాదహనము ♦ సామీరియొనర్చె
అట్టి మహాకార్యంబులు శ్లాఘ్యం ♦ బైవర్తించె క్షమ;
వెట్టునట్టులతో సహకరింప వ ♦ చ్చిన సుగ్రీవు శ్రమ
సఫలంబయ్యెను; విభీషణుడు తన ♦ సహజుని దిగవిడిచి
ప్రపన్నుడయ్యె, విభీషణుడనినా ♦ పక్షంబున నిలచి
బడిన ప్రయాసకు గలిగెను యీాస ♦ త్ఫలము సుమీ" యనెడి
ఒడయుని కఠినోక్తులాలకించిన ♦ యుర్వీజ దిగులుబడి
రోదన పూర్ణేక్షణములు గలదై ♦ నాథుచెంత నిలచె;
క్రోధోద్దీపితుడై రాముండు ప ♦ రుష వాక్యంబులచే
ధరణీసుత కిట్లనియెను "మర్కట ♦ దనుజుల మధ్యమున
పరిభవింపబడి దైవకృతంబున ♦ పురుష ప్రయత్నమున
బరిహరించుకొంటిని యవమానము ♦ దుర మొనర్చి నేను
తరుణీ! నేనిట్లొనర్చినది నీ ♦ కొరకై గాదువిను
రావణుండు చేనంటినిన్ను పూ ♦ ర్ణదృష్టితో జూచె
నీవిచ్చట బహు కాలంబుండుట ♦ నిందకు తావిచ్చె
పురుషుడనై రిపు జంపక బోయిన ♦ పురుషత్వముగాదు
పర గృహవాసముచే సందేహా ♦ స్పదమయ్యెను నీదు

చరిత్రంబు, నిను పరిగ్రహింపను ♦ జనుమెచ్చుటకైన
అరయు నేత్రరోగికి దీపంబటు ♦ అగుబడుచుంటివి నా
కిక సీతోడను బనిలే దనుజ్ఞ ♦ నిచ్చితి నీకెటుల
సుకమగునని దోచునో యటుజేయుము ♦ సుమిత్రజు భరతుల
యందుగాని సుగ్రీవుని యందున ♦ నైన విభీషణుని
యందుగాని మనసుంచి వారివశ ♦ మైయుండుము యిది ని
క్కముగ వచించితి పొమ్మన జానకి ♦ కనుల నీరుగార
సముద్వేగ కంపితయై గద్గద ♦ స్వరముతో, "రఘువీరా !
నీవన నేవిన దగని పల్కులిటు ♦ నిగదించుట తగునా !
నీవెటు నన్నుదలంచుచుంటివో ♦ నేనుయట్టి దాన
గానవని ప్రాకృతుండు, ప్రాకృత ♦ కాంతను యన్నటుల
నానడవడి మనసెరిగియు యిట్లన ♦ న్యాయమె! గుణశీలా !
నాచరిత్ర శంకింపకు మోపకు ♦ నాపై యపనింద
నాచే నొక్క ప్రమాణముగైకొని ♦ నన్ను నమ్మునాథా
ఆ రావణుగాత్ర స్పర్శము నా ♦ కయ్యెనంటె వదియు
కోరి నేనతని ముట్టలేదు నను ♦ గొనివచ్చెను మాయ
దరణ్యమున నే వివశనయ్యియు ♦ న్నపుడుగ నా, యట్టి
తరుణమందు నే మనసున నిన్నే ♦ ధ్యానించుచునుంటి.
సహసంవర్ధన సంశ్లేషంబులు ♦ చాలకాలమొంది
సహజము గుర్తెరుగని యట్లుంటివి ♦ స్వామీ, గతియేది
వృత్త శీల భక్తి జ్ఞానంబుల ♦ నెరిగియు నన్నిటుల
ఎత్తిబొడిచివి అబలనగుటచే ♦ ఎంచగ నిదిమేలా
నను మును జూడగ హనుమని బంపిన ♦ నాడే "విడిచితినను"
యనితెల్పిన బాసియుందునేనా ♦ యసువులు యపుడేను
నిన్నెడబాసిన వ్యధబడియుండన ♦ నేనింతటివరకు
యెన్నగ యీశ్రమ గలుగకుండబో ♦ యెడిదిగదా నీకు

రిత్తవో యొగడ ఆప్తులు నీకొన ♦ రించిన సాయంబు
కిత్తిసాక్షిగా మిత్తిసుతను నను ♦ కేల్పట్టితివి ప్రభూ!
నాగుణగణముల దెలసియు యనుమా ♦ నంబునంది నన్ను
చేకొన శంకించుచుంటి విక నే ♦ జేయున దేదిలను
రామా నీవు స్వతంత్రుండవు నే ♦ నేమిజేతు ననుచు
సౌమిత్రినిగని అశ్రుపూర్ణలో ♦ చనయై దుఃఖిలుచు
డగ్గుత్తికతో నిట్లనె యన్నా ♦ లక్ష్మణ వింటివిగా
నిగ్గుపడియగు మీ యన్నమాట ల ♦ న్నింటిని, యేమనగ
నొల్ల నట్టి యపవాదమంది భువి ♦ వల్లభుండు నన్ను
ఎల్లర మధ్యను బరిత్యజించెను ♦ ఏమిజేయగలను.
చితిజేర్పుము దానజొచ్చి నేనిడి ♦ చెద నాప్రాణముల
పతికి నమ్మికను బుట్టింపగ స ♦ త్పథంబు నాకచల
మందు వేరుగతి లేదన విని ల ♦ క్ష్మణు డన్ననుగాంచి
అం. దులకాతడు సుముఖుండేయని ♦ యాన సంగ్రహించి
చితియొకటి నమర్చెను చింతించుచు ♦ సీతకోరినటుల,
పతివ్రత నెపంబులేక జేయు యా ♦ ప్రత్యయమే నెటుల
జూతునటంచు లజ్జొంది మోముపం ♦ చుకొన్న నాథునకు
సీతమొల్లన సభక్తితో ప్రద ♦ క్షిణించి చితికడకు
జేరి దేవతాద్విజులమ్రొక్కి శో ♦ చిష్కేశునకు నమ
స్కారంబొనర్చి బల్కెను యిటు "నే ♦ సంతతంబు నామా
ససము రామునుండితరపురుషు నెడ ♦ నట్టాడని యెడల,
ఆ శేషంబునకు సాక్షిభూతుడగు ♦ కృశాను డిప్పట్ల
నన్ను బ్రోచుగాతా! వాక్కాయ మ ♦ నంబుల రాఘవుని
కన్న డింపకున్నట్లైచో లో ♦ కసాక్షియగు వహ్ని
ననురక్షించునుగాక! భాస్కరుం ♦ డనలుడు, చంద్రుండు,
దినరాత్రులు, ప్రాతస్సాయంబులు ♦ దిశలును, శ్వసనుండు

రస గగనాదులు, నను శుద్ధ చరి ♦ త్రియుగల దానిగా
విసవసించు నెడల లోకసాక్షి కృ ♦ పం బ్రోవనగునా
పాడుగాత ! యని యగ్ని దేవునకు ♦ ప్రదక్షిణ మొనర్చి
వీడి తనువుపై మమకారంబు ప్ర ♦ వేశించెను పెరు ది
చ్చున ముల్లోకంబులును జనంబులు ♦ జూచుచు కలతెందె.
జనకజ యగ్నిం జొరెనయంత యా ♦ జ్యంబు గొన్న దాని
కీలము లాకశమంటెను నుగ్రత ♦ కృశానుడు జ్వలించె
నేలచూలి నరకంబునబడు దివి ♦ నిర్జరసభ వోచె.
జ్వాలనజ్వాలల నడుమనున్న మహి ♦ జను గనుగొని దేవ
వలాసులును గరుడోరగ గంధ ♦ ర్వామరాదులెల్ల
హాహా కారము లొనరించిరి శ్రీ ♦ లా కోసించుచు నై
దేహి సద్గుణోపేత పతివ్రత ♦ ధీమతి; దిధత్తునై
లేనిపోని యపవాదను దా గ ♦ ల్పించె రాఘవుండు
భానుకులాబ్ధి సుధాకరుడను క ♦ మ్మాస భరితుండు
సుగుణస్తోముడు రాముం డనిగద ♦ శ్రితంబట్టె తరిని
తెగడి యగ్నిపాల్జేసెను సీతా ♦ దేవిని, ద్వితీయుని
ఖరదూషణులను ద్రుంచి వాలిని ని ♦ కారణంబొనర్చి
తరణీసుతునితో మైత్రిజేసి ఘన ♦ తరణిని బంధించి
రావణేంద్రజిత ప్రముఖ రాక్షసుల ♦ రణమందున గూల్చి
తావల మొసగుట కున్నారు పరి ♦ త్యజించె దయవిడిచి,
ఇంత శ్రమంతయు వృధయయ్యెగదా ♦ ఇలజను విడనాడ
ఎంత కఠినుడో రాముండనుచు మ ♦ హిళలు పలుకుచుండ,
చింతించుచు నేలంజూచుచు నిల ♦ చెను శ్రీ రాముండు.
అంత సహస్రాక్షుండు, కుబేరుడు ♦ యముండు, వరుణుండు.
హాటకగర్భుండు, హరాదులు వా ♦ హనము లధిష్ఠించి
సూటిగ లంకకుజేరి, తమ్ముల జూ ♦ చుచు కరములమోడ్చి

నిలచు రాఘవునిగాంచి, బాహువుల ♦ నెత్తి యిట్టులనిరి.
"ఓ రఘుండవు, సర్వలోక కర్తవు ♦ అభిజ్ఞుఁడవు, శౌరీ !
స్వామీ ! సర్వజ్ఞుండవయ్యు నీ ♦ వేమి దెలియనటుల
భూమిజ యగ్నింజొచ్చిన యుపేక్ష ♦ బూనియుంట మేలా
విన్ను నీవెరుగకుంటివి దేవా ! నిఖిలలోకపాలా !
మున్ను వసువులలో ఋతుధాముండవు ♦ మొదలీలోకముల
సృష్టించిన కర్తవు, స్వతంత్రుడవు ♦ శేషి వీశ్వరుడవు,
అష్టమ రుద్రుండవు, సాధ్యుల వీ ♦ ర్యవంతుడవు నీవు.
విధు సూర్యు కన్నవగ నశ్వినులు ♦ వీనులైన నీవు,
అధిభు వాదిమధ్యాంతరహితుడవు ♦ అంబుజనాభుడవు,
ప్రతిపాలకుడవు, సర్వశక్తుడవు ♦ చితజొరిసట్టి సతి
క్షితిపుత్రి నుపేక్షింపనేల? ప్రా ♦ కృత మనుజురీతి"
అనవిని శ్రీరాముండనె అజ రు ♦ ద్రాదులతో నిటుల
"మనుజుడ దశరథ తనయుడనుచు నే ♦ ననుకొనుచుంటి నిల
నేనెవ్వడ నేనెవరివాడ నే ♦ నెందుకు ధరబుడితి
ఆనతీయు డావివరంబు"విని ♦ అనెఁటు ప్రజాపతి,
"రామా ! సత్యపరాక్రమ విను నా ♦ రాయణుండవీవు,
శ్రీమనోహరుండవు, పరమాత్మవు ♦ జిష్ణు వవ్యయుడవు,
ఘనమద్భావ వికారశూన్యుడవు ♦ కైటభదళనుడవు,
వనమాలివి, వైకుంఠుండవు, శ్రీ ♦ వత్సలాంఛనుడవు,
శంఖచక్ర శార్ఙ్గధరుండవు ♦ శౌరి వచ్యుతుడవు,
పంకజనాభుండవు, గోవిందుడ ♦ వాదిదైవమీవు,
సృష్టి స్థితి లయ కారణుండవు, హృ ♦ షీకేశుడ వీవు,
విష్టరశ్రవుడవీవు, కృష్ణుడవు ♦ విష్ణు వనంతుడవు,
పురుషోత్తముడవు క్షమమక్షరమవు ♦ బుద్ధివి, సత్వమవు,
నరసింహుడవు, జనార్దనుడవు సే ♦ నానివి, అజితుడవు

నిర్వికల్పుడవు, నిర్వికారుడవు ♦ నిరంజనుడ వీవు,
సర్వేశ్వరుడవు సహస్రాక్షుడవు ♦ సహస్రపాదుడవు,
దమనువు, క్షరుడవు అగ్రణివి, త్రివి ♦ క్రముడవు, స్వయంభువు,
సమదర్శివి, లోకశరణ్యుండవు ♦ సహస్రశీర్షుడవు,
వేదవేద్యుడవు, యజ్ఞరూపుడవు ♦ విష్వక్సేనుడవు,
నాదబ్రహ్మవు, వషట్కారమవు ♦ ఆది వరాహమవు,
సకలభూతముల విప్రగోదిశా ♦ శైలకాననముల
సకలలోకముల నిండియుండియు, పి ♦ చండంబున యఖిల
లోకములను ధరియించిన మూర్తివి ♦ లోకాతీతుడవు,
నీకునేను హృదయంబు, సరస్వతి ♦ నీదుజిహ్వ; నీవు
రెప్పెత్తుటయే పగలు, మూయ రా ♦ త్రియౌను, నీయూర్పు
లుప్పతిల్లె వేదంబులుగా, ని ♦ న్నోలగింప నొవ్వ
నీదుపాప నీకోపం, బమరులు ♦ నీతను రోమములు,
ధారయిత్రి నీధైర్యము, నీదు శ ♦ రీరము జగంబులు
చంద్రుడు నీప్రసాదము. శ్రీవ ♦ త్సంబే నీగురుతు
ఇంద్రుని రాజుగజేసితీవు బలి ♦ యెడల జూపియొత్తు
నీవు మహావిష్ణుండవు, సీతా ♦ దేవి మహాలక్ష్మి,
రావణువధార్థమై నర యవతా ♦ రమెత్తితివి స్వామి !
వచ్చినకార్యము దీరె రావణుని ♦ వధించితివి కలన;
చెచ్చెర వైకుంఠమేగు సంతు ♦ ష్టితో శేషశయన;
రామా నీదర్శనస్తోత్రము వ్య ♦ ర్థంబుగాదు స్వామీ
క్షేమా మోదములెల్ల లోకముల ♦ జేకూరెను సుబ్రహ్మ.
రామా ! నీబల వీర్య శక్తి వి ♦ క్రమము లద్భుతములు
యీమహాస్తవం బెవ్వడైన పఠి ♦ యించిన సుఫలములని
బొందు నయుదిగాకుండగ, గలుగదు ♦ పునరావృత్తి ధర
వందనంబు శ్రీరామచంద్ర నర ♦ వర జగదాధార !"

అజుడిటు రాము నుతించుచుండ హ ♦ వ్యవాహనుండు వడి
నిజరూపముతో సాలంకృతయగు ♦ నేలచూలిని యొడి
నిడుకొని చెల్లాచెదరఁదోˆచి చితి ♦ నిం బహిర్గతుండై
పుడమిజను సమర్పించి రామునకు ♦ నుడివె వినమ్రుండై,
"రామా రఘుకులసోమా తారక ♦ నామా రణభీమా
భూమిజ నిర్మలి పూతచరిత సా ♦ ధ్వీమణి, గ్రహింపుమా
సతి నిర్దోషంబెఱిగియు నీయా ♦ చారమునకు గొరత
గతపడ చితజొప్పించితి వహోహో ♦ సతతము నీకాంత
గతి నీవేయని నమ్మియున్నది త్రి ♦ కరణశుద్ధిగాను
ఇతరపురుషునెడ మనసుంచగలే ♦ దీయమ యెన్నడును
నిరపాయిని సుమి యీయమ, మున్నా ♦ నిర్జనవనమందు
పరవశయై యున్నపుడు రావణుడు ♦ పట్టిదెచ్చి యిందు
చెఱఁబెట్టి, భ్రమబెట్టియు అదలిం ♦ చియు జూచెనుగాని
వెఱువక జానకి నిన్నే నమ్మి జీ ♦ వించియుండె నవని
క్షితిజ సతీత్వంబునకు నేను సా ♦ క్షీభూతుండ సుమా
ప్రతిగ్రహింపుము బమలాడక సా ♦ వని సీతను రామా"
అనవినిరాముడు హర్షమొందియును ♦ అగ్నిని జొప్పించి
జనకజనటు శ్రమబెట్టినందులకు ♦ జాలవిచారించి,
అనెనిటు జ్వాలనున "కనఘా విను నా ♦ కనుమానము లేదు
జనకపుత్రి పాపంబు జేసెనని ♦ జనులు బలుకరెందు
చిరకాలము రావణునింట న్నివ ♦ సించియున్న సతిని,
పరిగ్రహించెను రాముడు కామా ♦ తురుడై యని యవని,
నిందింతురు సత్పురుషు లటంచును ♦ నేనే సంశయము
జెంది యట్టియపవాద నివృత్తికి ♦ జేసితి శోధనము.
సకలలోకములు దెలియుటకై య్యే ♦ జ్వలనము జొచ్చె సతి
అకళంకయు మన్మానస వర్తిని ♦ అనన్యహృదయ క్షితి

సుతయని నేనెరిగియు జనములు యీ ♦ ఋతము దెలసికొనగ
చిత జొరగా జానకిని యుపేక్షిం ♦ చితిని మహాభాగా !
సీత తనను రక్షించుకొని మహా ♦ చితను వెడలివచ్చె
యాతువు రావణుడీమె వివశయై ♦ నప్పుడంటిదెచ్చె,
గాని చంచలత్వంబున ముట్టగ ♦ గలడే? జనకజ వై
శ్వానర జ్వాలగదా ! రావణు నై ♦ శ్వర్యముగోరదు, వై
దేహినన్ను యెడబాయదెవ్వుడు యీ ♦ దిద్యుని ప్రభలీల;
గేహిని సీతనువిడువను ధీమతి ♦ గీర్తిని విడనటుల
తమ హితోపదేశంబులు శుభకర ♦ మమోఘంబు గాన
క్షమజనిదే గైకొనెద నంచు రా ♦ ఘవుండు హర్షమున
పరమేష్ఠి, స్మరహరశక్రాదులు ♦ ప్రశంసింప సతిని
పరిగ్రహించెను ప్రమోదమొందుచు ♦ భర్గుం డత్తరిని
శ్రీరామున కనెనిట్లు "పరంతప ♦ శ్రితజనమందార,
నీరజనయన విశాలవక్షో ♦ ణిని నరావతార
మెత్తి లోకకంటకుడగు రావణు ♦ నుత్తరించినావు,
శత్రుశాపమోచన కారణము గ ♦ శ్రమల జెందినావు,
అత్తరంబు నీవయోధ్యకుంజని ♦ అట నీకై వేచు
ఉత్తముడగు భరతునకు దర్శనం ♦ బొసగి ప్రతీక్షించు
కన్నతల్లి కౌసల్యకుమొక్కి న ♦ కారణముతో వనికి
నిన్నపిన కైకమను, సుమిత్రను ♦ మన్ననతో మొక్కి,
సకలజనము లానందమొంద రా ♦ జ్యాభిషేకమొంది
అకలంకమగు నిక్ష్వాకు వంశమును ♦ అక్షయముగ నబ్ధి
మేఖలందు నెలకొల్పి, మరియు హయ ♦ మేధము గావించి
వైకుంఠంబున కరుగుము రామా ♦ వతారము ముగించి
రామా రఘుకులసోమా సద్గుణ ♦ ధామ యిదిగోజూడు
భూమిని నీకు గురుండును, తండ్రియు ♦ పూజ్యుడు దశరథుడు

విమానమందున వచ్చియుండెను త్రి ♦ విష్టపంబునుండి
కుమారుడవు నీచే నన్నృతదో ♦ షమున తరింపబడి
నాక మొందె దశరథుండు; తండ్రికి ♦ నమస్కరింపు” మన
ఆకారములోనున్న జనకుగని ♦ అమితానందమున,
దశరథునకు రాముడు ప్రణమిల్లెను ♦ ధరణిజానుజులతో
దశరథు డాత్మజుడగు రాముని వ ♦ ద్దకుగొని హర్షముతో
యొడియందున గూర్చుండబెట్టుకొని ♦ నుడివెనిటుల “రామా !
విడచి నిన్ను దివియున్నను సుఖంబు ♦ బడకుంటిని సుమా,
కైకమాటవిని ఆడితప్పలే ♦ కను నిన్నంపి వని
నాకెటు సుఖంబుగల్గును స్వర్గము ♦ నందున్ననుగాని
పితృవాక్యపరిపాలనార్థ మట ♦ వినివాస మొనర్చి
శత్రుసూధన మొనర్చి శిష్ట ర ♦ క్షణమును గావించి
సంతుష్టుడవై యున్న నిన్నుగన ♦ చింతదొలగె నాకు
సంతసించితిని రామా ! జన్మము ♦ సార్థకమయె నాకు
ముని కహోళు డష్టావక్రునిచే ♦ మును తరించినటుల
తనయా నేను తరించితిని యీ ♦ ధరణిని నీవల్ల.
రామ ! నిన్నిపుడు గుర్తెరింగితి పు ♦ రాణ పురుషుడవని
యీమహి నీ యవతార రహస్యం ♦ బెరిగి నిర్జరులు నీ
కప్పుడు రాజ్యాభిషేక విఘ్నము ♦ గావించిరి యనుట
యిప్పుడు విదితమయ్యెనాకు, వడి ♦ యేగు మయోధ్య కట
చుట్టగ తమ్ములు, చూడగతల్లులు ♦ క్షోణిజనోడి వెలయ
పట్టముగట్టుకొ రాజ్యంబును పరి ♦ పాలింపుము సౌమ్యా!”
అనవుడు రాముండనె, తండ్రితో “కై ♦ కమ్మపైని గినిసి
‘నినువిడచెద నీసుతుసతో’ నంటివి ♦ జనకా దయజేసి
అనుగ్రహింపుము కైకమ్మను” యన ♦ అట్లగుగాక యని
అనఘ ! ఆయురారోగ్యసంపదల ♦ నందుము నీవవని

అనుచు లక్ష్మణుని చేరబిలిచి యత ♦ డగ్రజు వెంట వని
కనుగమించి యొనరించిన సేవకు ♦ 'హర్షమొందితి' నని
"సీతారాముల కైంకర్యంబును ♦ జేయుము రాముండు
తాత, భ్రాత, దైవము మానవ యువ ♦ తారుడు మాధవుడు"
అనుటయు లక్ష్మణు డంజలిఘటించి ♦ 'అటుల జేతు'-ననెను.
వెనుక దశరథుడు కోడలుసీతను ♦ గని "సుభ్రూ ! నిన్ను
రాముడు పరిత్యజించితి యనుటకు ♦ రాగము నొందకుము
నీ మేలునకై నీపరిశుద్ధత ♦ నిరూపించి జగము
లందున నీ నిష్కళంక చరితా ♦ లంభనకొరకు, చిత
యందు నీవుజొర మిన్నకుండె రఘు ♦ నందనుండు సీతా !
రమణీరత్నమ, నిన్నెన్న పతి ♦ వ్రతవు. గుణాన్వితవు
సమరసముతో పతి కశ్రాంతము పరి ♦ చరించుచును నీవు
సుమాంగల్యవై, సుపుత్రవతివై ♦ సుఖింపుమిల తల్లీ"
కొమరులకును కోడలి కివ్విధి వా ♦ క్రుచ్చి తేజరిల్లి
విమానమందున దశరథుడేగ త్రి ♦ విష్టపమున కంత
అమరేంద్రుడు సంతసించి రామున ♦ కనెనిటు 'శుభచరితా
రామా ! నీ దర్శనంబమోఘం ♦ బై మాకొదవె క్షమ
నీ మహిమ పరాక్రమ గుణములు వ ♦ ర్ణింపగ మాతరమా
నీవు వరంబొక్కటి వేడుము నే ♦ నిత్తును నిక్కముగ'
నావిని రాముం డింద్రునకనెనిటు ♦ నాయం దధికముగ
నెనరుగల్గించో, నిర్జరాధిపా ♦ నీవనుగ్రహించి,
అనుజ్ఞాతులై దార పుత్ర మి ♦ త్రముల దిగవిడిచి
వానర భల్లాదులు నాకొరకై ♦ వచ్చి రణమొనర్చి
దానవులచె హతులైరి వార లం ♦ దరును బ్రతికి లేచి
వారుతొంటిచందంబున రోగవి ♦ వర్జితులై, బలురై
దార పుత్ర మిత్రాదులతోడ యు ♦ ధాస్థితి గనువారై

యుండ జూడవాంఛించెద వరము ♦ ట్లొసగుము; వనచరులు
యుండుతావులను ఋతు నియమములే ♦ కుండ నదులు ఫండ్లు
కందమూలములు, మధువులు సమృద్ధి ♦ గా నుండెడునట్లు
బృందారకవర ! వరమియ్యవె యన ♦ ప్రీతిజెంది యట్లు
అలుగా కనెను పురంధరు డంతట ♦ వారు లెలుగులు లేచి
ప్రగాఢమగు నిద్రనుండి మేల్కాను ♦ వగిది బ్రతికివచ్చి
సంతసంబుతో రాముని నమ ♦ స్కరించి రెల్లరును.
అంత సకలదేవతలు కృతార్థుం ♦ డై యలరెడు భాను
కులోద్భవుండగు రాముని స్తుతించి ♦ పలికి రిటుల స్వామి
ఇలజ లక్ష్మణులతోడ నయోధ్యకు ♦ యేగుదెంచి అటమీ
రాక నిరీక్షించెడు కౌసల్యా ♦ కైక సుమిత్రలను,
నీకు మారు నీపాదుక లయోధ్య ♦ నిల్పి పాలనమును
జేయుచున్న భరతుని; శత్రుఘ్నుని ♦ జేరి యూరడించి
రాయుడవై ప్రజలనుపాలింపుము ♦ రామా ధృతిమించి
అనుచువారు తమతమ వాహనముల ♦ నధిష్టించి జనిరి.
జనకజ లక్ష్మణ సమేతుడై దా ♦ శరథట యారాత్రి
గడపి మరుదినము తృతీయమందు సు ♦ ఖంబుగ గూర్చుండ
పుకమీశుని కడకుంజని ఓభీష ♦ ణుడు వినయముతోడ
అనెని ట్లంజలిఘటించి రామా ♦ విను నావిన్నపము
నను కృతార్థునింజేయుడు మీరును ♦ ఇనసుతాది కపిము
ఖ్యులను మదర్పిత స్నానాంగ రాగ ♦ కుసుమ భూషవస్త్ర
దులనంది ముదంబును గూర్పుండన ♦ పలికె నిటుల శ్రీరా
ముండు విభీషణునకు సౌమ్యా ! విను ♦ ము భానుజాదులకు
దండిగ వస్త్రాభరణమాల్య గం ♦ ధాదులిమ్ము; నాకు
వలదు స్నానభూషాదులు యేమన ♦ అల భరతుడు నాకై
పలుకష్టంబుల బడుచు సుఖంబుల ♦ బాసి తపస్వియై కై

సీతాదులువిడి నారాకనిరీ ♦ క్షించుచుండె, గడువు
ఆతనికొసగినయట్టి పదియునా ♦ లబ్దము లయిపోవు
చుండెను నే త్వరబోకుండిన భర ♦ తుండు యగ్నిజొచ్చు,
యుండజాల నిట సత్కారంబుల ♦ నొందుచు సుఖింపుచు
రయమున బోవలె భరతునిగన దు ♦ ర్గమ మార్గము నడచి
పయనమయెద యన విభీషణుం డిటు ♦ పలికె; ధనదుగెలిచి
అన్న రావణుడు పుష్పకమను ది ♦ వ్య విమానంబొందు
మున్ను దెచ్చినది యున్నది యందున ♦ బోవగ దినమొండు
జాలు నయోధ్యకు జేర గాన వి ♦ శ్రమించి బోవచ్చు
ఏలుకొనుము నాసత్కృతులని బ్రతి ♦ మాలుకొనగ నగుచు
రాముండనెనిటు విభీషణునితో ♦ రాక్షసేశ్వరా! నీ
వేమియు వ్యాకులితంబొందకుమీ ♦ మేమిట యుండమని
నీవొనరించిన సాహాయ్యంబును ♦ నెఱపిన పౌరుషము
గావె సత్కృతుల్, పూజితుడైతిని ♦ పోవలె సత్వరము
భరతుని శత్రుఘ్నుని యాశ్వాసిం ♦ పగవలె తల్లులను
గురువుల, మిత్రుల, పౌరులజూడగ ♦ గోరుచుంటినేను.
అనఘా! పుష్పకమును దెప్పింపుము ♦ అనిన విభీషణుడు
కనక పద్మభూషితమై పుష్పక ♦ మన శోభిలుచుండు
ధనదుని దివ్యవిమానము దెప్పిం ♦ చినకులజుని మ్రోల
నునిచి అంజలిఘటించి ఆజ్ఞయే ♦ మన రాముడు చాల
నందమంది యిట్లనియెను "విభీష ♦ ణా కపులు రణంబు
నందు సాయమొనరించుటచేగద ♦ బొందితి విజయంబు
ప్లవగుల తోడ్పాటున బొందితి నీ ♦ లంకారాజ్యంబు
అవశ్యంబు వీరలందరకు వ ♦ స్త్రాభరణ ధనంబు
లొసగి సత్కరింపుము సౌమ్యా"యన ♦ యుచితంబగు రీతి
అసురవిభుడు సన్మానించెను కపు ♦ లందరి నట్టితతి

శ్రీరాముడు సతి సీత నంకమున ♦ జేకొని తమ్మునితో
ఆరోహించి విమానము యిర్విధి ♦ నని సుగ్రీవునితో
మిత్రమ నీవరుదెంచి కపులతో ♦ మృధమున సాయబడ
శత్రుసంహరణ మును గావించి వి ♦ జయము బడసినాడ
దయయుంచుము సాకేతమునకు జనె ♦ దను నే సెలవిమ్మ
రయమున కిష్కింధకుజని వానర ♦ రథితో, సుఖంపుము"
అనుచు జాంబవాంగద సామీరా ♦ ద్యఖిల కపులజూచి
అనుపమ బలధైర్యాదులతో నా ♦ కనిని సహాకరించి
శ్రమనుజెందితిరి మీరిక మీమీ ♦ స్థానంబులకు జని
సమస్తసౌఖ్యము లందు"డని విభీ ♦ షణునిం గని "నేనీ
కొసగినరాజ్యం బేలుకొనుము నెన ♦ రుంచుము సెలవిమ్మ"
వెన నేనయోధ్య కేగుదెంచెదను ♦ పీడ్కొనెదను మిమ్మ
నావిని సుగ్రీవ విభీషణ వా ♦ నరులు దాశరథికి
ఆవేదించిరి అంజలిఘటించి ♦ "దేవర విను కోర్కె
మమ్మెల్లర గొనిపొమ్మయోధ్య రా ♦ మనసయ్యెను మాకు
నెమ్మదిగా మెలగెద మచ్చట శ్రమ ♦ నీయము జనములకు
తమ్మచెలికులోద్భవుల నెలవయో ♦ ధ్యను వీక్షించుటకు,
మిమ్మట పట్టాభిక్షిక్తు జేసెడు ♦ మిరగని యులరుటకు,
పిమ్మట యాకౌసల్యాదుల సే ♦ వించియు వచ్చుటకు,
సమ్మతింపుమను" బ్రార్థించిన దా ♦ శరథిటులనె 'నాకు
ప్రియాత్ప్రియతరంబగు మీతో నే ♦ నయోధ్యకుంజనుట
రయముగ పుష్పకమెక్కరండు' యన ♦ రవిజుడును నిశాట
విభుడును తమసేనల మంత్రులతో ♦ విమానమెక్కిరి; భూ
విభునాజ్ఞనుగొని పుష్పకంబు విను ♦ వీధికెగసి, యంబు
భృత్తుల నడుమ నయోధ్యవైపు బో ♦ వెడలెను వేగముగ.
ఎత్తుగ యాపుష్పక ముత్తరముగ ♦ అత్తరముగనేగ,

భూతలదృశ్యంబుల జూపుచు రా ♦ ముఁడు సతికి నెనిటుల
"సీతా ! గనుమదె కైలాసమువలె ♦ చెలువంబగు శైల
మది త్రికూట మననొప్పు తచ్ఛిఖర ♦ మందుగనుము లంక,
కదనరంగమిదె రావణు నిచ్చట ♦ వధించితి ననీక
మున, యిట బ్రహస్తు కుంభకర్ణులను ♦ హననమొనర్చితిని,
అనుజలక్ష్మణునిచేత నిందజితు ♦ హతమయె నీస్థలిని,
హనుమ జ్జాంబవ సుగ్రీవ సుషే ♦ ణాంగదాదు లిచట
దనుజులు ధూమ్రాక్షతి కాయ మహో ♦ దరంపన వికట
మకరాక్ష నికుంభ కుంభ విద్యు ♦ న్మాలి విరూపాక్ష
అకంపనోన్మత్త మత్తప్రఘస మ ♦ హాపార్శ్వాదుల క్ష
ణనంబొనర్చిరి; మండోదరి నా ♦ థునికై సవతులతో
మనికితమొందిన స్థలమిది గను; మే ♦ మానిశీథమున తో
యధినిం దాటి వసించిన స్థలమి ♦ య్యది; జూడుము చెలువా
నిధిపై నే నీనిమిత్తమై నలు ♦ నిచె గట్టించిన వా
రధినిం; జూడుము సగరసుతులచే ♦ ద్రవ్వబడిన యీనీ
రధి అక్షోభ్యమపారమందు కా ♦ ర్త్యస్వరగిరిపైని
పావని మునువిశ్రమించి లంకకు ♦ వచ్చియుండెను; జల
దేవుడు నాకుబ్రసన్నమయ్యె నీ ♦ తావుననే కమలా;
సీతా గనుమిట విభీషణుడు గల ♦ సెను నను శరణొంద;
కోతులదొర సుగ్రీవునెలవు గను ♦ గొనుమిదె కిష్కింధ,
లీల నిచట బలశాలి వాలినొక ♦ కోల గూల్చినాడ"
నేలచూలి యటు రాముడు దెల్పగ ♦ నిట్లనె విభుతోడ
"నాథా యాకిష్కింధానగరము ♦ నందుగల్గు సుగ్రీ
వాదివానరుల సతులతో సీతో ♦ నయోధ్య జన గోరి
కయ్యెనాకు" ననుఁ, రాముం డట్లగు ♦ గాకని పుష్పకము
అయ్యెడ నిల్పినజనితో దెల్పెను ♦ అవనిజ వాంఛితము,

అఖిల కపుల తమసతులతో రమ్మని ♦ ఆజ్ఞాపించె వలీ
ముఖ నాథుడు సుగ్రీవుడంత, గో ♦ పుచ్ఛంబులు వెడలి
తమతమసతులతో జనుదెంచి విమా ♦ నము నెక్కిరి, తారా
రుమలతో సుగ్రీవుడు పుష్పకమా ♦ రోహించెను, శ్రీరా
ముండు మరల పయనంబయి విమాన ♦ మున, కుతుకముమించి
కొండఋశ్యమూకం బదుదానిని ♦ కుజకట జూపించి,
అనెనిటు "రమణీ! సుగ్రీవునితో ♦ నందితి సఖ్యమిట
వనచరవిభుడగు వాలిని వధింప ♦ ప్రతినజేసి తిచట;
గనుమీ పంపాసరస్సు సొంపును ♦ కలికీ! నినుబాసి
వనముల దిమ్మరి మించుదుఃఖమున ♦ వాపోవుచు గాసి
నొంది తిచట; అదె శబర్యాశ్రమము ♦ యోజనభుజుండు క
బంధు జంపితిట; జనస్థానమదె ♦ పడతీ నినువెదుక
రావణుడెత్తుకబోవ జటాయువు ♦ రణమొనర్చి విగత
జీవుడయ్యెనిట నీవృత్తాంతము ♦ జెప్పినాకు తొలుత;
ఖరదూషణ త్రిశిరాది రాక్షసుల ♦ ఘాతించితి నిచట;
వరవర్ణిని! వీక్షించు మదియె మన ♦ వాసము పర్ణకుట
మిచటగాదె నిన్నపహరించెనా ♦ నచరుండు రావణుడు;
సుచరిత్రా! యియ్యదియె గౌతమీ ♦ స్రోతస్విని జూడు;
కువలయాక్షి! వేడ్కను గన్గొనుమిదె ♦ కుంభజు యాశ్రమము;
ఇవి సుతీక్ష్ణ శరభంగాశ్రమములు ♦ ఇంతీ! యీస్థలము
నందు మహాకాయుండగు విరాధు ♦ నిం దునిమితి నాడు;
అందిందాల పదియేండ్లుంటిమి ఋ ♦ ష్యాశ్రమముల జూడు;
అత్రియాశ్రమంబదె దర్శించితి ♦ వనసూయను యందు;
చిత్రకూటమదె గను భరతుడు న ♦ చ్చిన స్థలమదె ముందు;
ఇదె మందాకిని; అదియే యమునా ♦ నది; గను స్వాయంవరా!
అదియె భరద్వాజాశ్రమంబు; గను ♦ మదియె శృంగిబేర

పురమదిగో జూడుము గుహుడచ్చట ♦ పరిచరించె మనకు;
తరుణీ ! తొల్లిట ఇక్ష్వాకులచే ♦ స్థాపితమగు పెక్కు-
యూపధ్వజములచే శోభిలు సర ♦ యూశైవలిని గను;
మాపితరుని రాజ్యంబదిగో; గను ♦ మా సాకేతమును;
మరలి వచ్చితిమి క్షేమముగాను న ♦ మస్కరింపు పురికి
త్వరలో నయోధ్య జేరుదుమన సీ ♦ తాయి పురికి మ్రొక్కె-
ఆనందముతో నుండెను అదివిని ♦ ఆపుష్పకమందు
వానర రాక్షస ప్రముఖులు ఆతృత ♦ తో నయోధ్యయందు
గల గోపుర సౌధప్రాకారం ♦ బుల గాంచగ లేచి
బిలబిలలాడుచు జూడదొడంగిరి ♦ విహర్షమునుమించి
అంతట రాముడు పదునాల్గబ్దము ♦ లానాటితో యవగ
సంతసించి యాచైత్రశుద్ధ పం ♦ చమినాడట మార్గ
మందునగల యాభరద్వాజ ఋ ♦ ష్యాశ్రమమందు దిగి
వందనమొనర్చి భరద్వాజునకు ♦ వచించెనిటు యోగీ
పుంగమ ! భరతుడు తల్లు లయోధ్యా ♦ పురమున సుఖమేనా?
అంగద లొందక జనులెల్లరు సౌ ♦ ఖ్యంబుగ నగరమున
యుండిరె? యన యిట్లనియె భరద్వా ♦ జుండు "రామచంద్ర !
చండకిరణకులమండన దశముఖ ♦ ఖండన గుణసాంద్ర !
దశరథాత్మజా ! క్షేమము నీసో ♦ దరుండు భరతుండు
వశియై జటలను, వల్కలధరించి ♦ వరవై నీకెపుడు,
దీనవదనుడై, పురమువిడిచి నం ♦ దిగ్రామమునందు
నీనిమిత్తముగ నీపాదుకలను ♦ నిల్పి తనకుముందు
ప్రజలనుపాలించుచు నీరాకకు ♦ ప్రతీక్షించుచుండె.
స్వజనులు, తల్లులు, సాకేతంబున ♦ సౌఖ్యముగానుండె.
రామా మును జనకాజ్ఞను నీవు పు ♦ రంబువిడిచి సీతా
సౌమిత్రులతో నటవికిజన నే ♦ జాలొందితిని, సుతా

ఇపుడో నీవని శాత్రవులను వధి ♦ యించి కృతార్థుడవై
పరివృతుండవై మిత్రగణంబులు ♦ పరివేష్టింపగ వై
భవముగ వచ్చుట గని నేనొందితి ♦ పరమానందంబు
భవితవ్యము భవదీయదర్శనం ♦ బగు భవభంగంబు
నేడిచ్చట వసియించి పూజగొని ♦ నీవు రేపుజనుము
కాదన నీవాసంబును అందుల ♦ గలిగిన ప్రమాదము
ఖరదూషణ త్రిశిరాదిరాక్షసుల ♦ ఖండనమును సీతా
హరణము జటాయు నిధనము, కబంధు ♦ మరణము ఖద్యోత
సుతుసుగ్రీవుతో సఖితము వాలి ని ♦ షూధనంబు అవనీ
సుతాన్వేషణము లంకాదహనము ♦ సోమ విభీషణుని
శరణాగతి వారధిబంధము సా ♦ గర తరణంబు నిశా
చరేంద్రజిత కుంభకర్ణ రావణ ♦ సంహారణంబు రసా
త్మజ నగ్నింజొరి సతీత్వంబు ని ♦ ర్ధారణమొనర్చుట
అజ రుద్రేంద్రాదులు ప్రత్యక్షం ♦ బై వరమొసంగుట
మొదలగునవి నాతపోబలముచే ♦ ముందె దెలిసికొంటి
ముదమొందితిరామా! వేడుము నొస ♦ గెద నే వరమొకటి"
నావిని శ్రీరాముం డనెనిటు ముని ♦ నాథ అయోధ్యకునే
బోవు మార్గమున మధువు ఫలంబులు ♦ బూవులుండవలె నే
కాలమునందైనను యన యుల్లే ♦ గాక నె మునివరుడు
సాలంబులు ఫలపుష్పంబులతో ♦ సమృద్ధమయె నపుడు.
అత్తరి రాము డయోధ్యనుదలంచి ♦ హనుమంతునిబిలిచి
అత్తరముగ సాకేతపురంబున ♦ కరుగగ నియమించి
అనెనిటు "పవనాత్మజ! గంగానది ♦ కవల శృంగిబేర
మను పురంబు గల దండున గుహుని ♦ గని కుశలంబార
సి, నాదుక్షేమంబును యీమునికిని ♦ జెప్పి అయోధ్యకు వ
ర్తనియు, భరతువృత్తాంతమెరిగి యా ♦ తనివల్లను, నీవా

భరతుకడకుజని నాక్షేమము దెలు ♦ పంగవలయు నేను
ధరణిజ సౌమిత్రులతో వనమున ♦ తండ్రియాజ్ఞగాను
యుండి సుఖంబుగ దిరిగివచ్చి యిట ♦ యున్నది వినిపించి,
దండకాటవినియుండ రావణుడు ♦ ధరణిజను హరించి
నదియును, సుగ్రీవుని సఖ్యంబును ♦ అంబుధి తరణమును,
విదారణంబును, నేనురావణుని ♦ విదారించుటయును,
మహేశు కృపచే నాకు జనకుని స ♦ మాగమమగుటయును,
మిహిరజ విభీషణులతో వచ్చి స ♦ మీపంబున నేను
నున్న విషయములనెల్లయు విశదం ♦ బొనరింపుము సౌమ్యా!
విన్నప్పుడు భరతుడు నేదెల్పిన ♦ విషయంబులు హృదయ
వృత్తియు, ముఖలక్షణచేష్టలు యె ♦ వ్విధమో నరయవలయు
ఉత్తముడగు భరతుని శోధింపగ ♦ యుక్తముగాదయ్యు
ఆతని నేనే నిటుమీాదట రా ♦ జ్యంబు నేలుమనిన
ప్రీతిని జెందునో లేదో గ్రహించి ♦ ప్రీతుడుగాకున్న
నీవు మరలిరావలదు; వచ్చెదను ♦ నేనెల్లరగలసి".
నావిని పావని మానవరూపము ♦ నంది చదలకెగసి
మంగళకరమగు గంగా యమునా ♦ సంగమంబు దాటి
శృంగిబేరపురమునకుం జని గుహు ♦ నింగని సంతుష్టి
జెంది దాశరథిక్షేమము గుహునకు ♦ జెప్పి భరతుడున్న
నందిగ్రామమున కేగెడు మార్గము ♦ నరసి యతనివలన,
సురవర్త్మంబున కెగసి పయనమును ♦ చురుకుగ సాగించి,
వరశురామతీర్థంబును గనుగొని ♦ వాలుకినిం గడచి,
గోమతిదాటి, యయోధ్యాపురి కొక ♦ క్రోసునగల నంది
గ్రామమునకు నరుదెంచి భరతునట ♦ గాంచెను ముదమొందె.
భరతుం డకటా జడలదాల్చి తా ♦ పస వృత్తిని ధర్మా
చరణుండై దీనుండై కృశించి ♦ గుణుతుంగ శ్రీరామ

పాదుకలను మున్నిడుకొని రాజ్యము ♦ పాలించుచు; అన్న
ఆ దినంబునకు మగిడి వత్తునని ♦ అటుల రానికతన
ఆదీవన మొందుచు "రాముడు రా ♦ డాయెను గడువయెను
మేదిని జీవింపనొల్ల రాముని ♦ వీక్షింపక నేను
తనువును విడనాడెద"నని నిశ్చిత ♦ మనస్కుడైయుండ,
హనుమంతుడు చేమోడ్చి భరతునకు ♦ అనె వినయముతోడ
"అనఘా నీవెవ్వరికై యిట్టుల ♦ అలరెదవో యట్టి
ఘను డినకుల కలశాబ్ధి కళానిధి ♦ కౌసల్యాపట్టి
శ్రీరాముడు తన క్షేమము నీతో ♦ జెప్పగ బంపె నను
గారవముతో నీయోగక్షేమము ♦ లారసి రమ్మనెను
వైదేహీ హరణంబున సుగ్రీ ♦ వాది కపులగూడి
పాథోనిధి దాటి లంకజని రా ♦ వణునిం దునుమాడి
సీతాలక్ష్మణ సహితుండై వ ♦ చ్చెను శ్రీరాముండు
ఆతిథ్యము గొనుచుండె భరద్వా ♦ జాశ్రమమున నేడు".
నావిని భరతుడు హర్షోద్రేకము ♦ నమ్మూర్ఛిలి లేచి
పావని కనెనిటు మానవుండవో ♦ దేవుడవో, వచ్చి
భూవిభు రాఘవు కుశలా గమనం ♦ బులను దెల్పినావు
గోవులు లక్షము, నూరు గ్రామములు ♦ కోమిరెలు పదియార్వు
రనుయిచ్చెద గొను బారితోషికము ♦ రామచంద్రునకునూ
వనాటులకు నెటు సమాగమంబయె ♦ వైనము నంతయును
దెలుపవె యన మారుతి భరతునకిటు ♦ బలుకదొడగె "నీకు
దెలిసిన దేగద రాముని పావలు ♦ దెచ్చుకొన్నవరకు
పిదప రాము డవనిజానుజులతో ♦ వదలి చిత్రకూట
కుధరం బ్రతిని సేవించుచు సం ♦ కుసుకుండై యచట
దండకాటవికి జని శరభంగుని ♦ దర్శించెను పిదప
ఖండించి విరాధుని గాంచి సుతీ ♦ క్ష్ణాదిమునుల, తావ

సుల యాశ్రిమముల పది సంవత్సర ♦ ములనుగడిపి మౌని
కులవర్యుడగస్త్యుని గని తదాజ్ఞ ♦ గొని ముమ్వురునుజని
పంచవటిని యొకపర్ణశాల నియ ♦ మించి యందుల నివ
సించుచుండిరి సుఖంబుగ; నంతట ♦ జేరి యటకు రావ
ణానుజాత శూర్పణఖ రాఘవుల ♦ పైని మమతగొనిన
దాని ముక్కుచెవులంగోసె సుమి ♦ త్రాసుతు డాశతన
ఖరదూషణ త్రిశిరాదులు రాముతో ♦ కయ్యమాడవచ్చి
పరిశరమొందిరి అదిగన్గొని శూ ♦ ర్పణఖ లంకజొచ్చి
అన్నరావణునితో తద్విషయం ♦ బంతయుదెల్పిన వా
డన్నులమి న్నవనిజను హరింపగ ♦ అభిలషించి యొకవా
తాయువురూపున మారీచుని సీ ♦ తాయికడకు బంపె;
మాయలేడినిం గని జానకి దె ♦ మ్మనుచు రాముసంపె.
సౌమిత్రియు రాముని వెదకుచు జన ♦ సరగున రావణుడు
భూమిజ నెత్తుకొ జనె, జటాయువును ♦ బొడిచి రాగ యుద్ధం.
రావణు డట్టుల సీతనుగొని మ ♦ ర్కటులు జూచుచుండ
ఆవేగముతో లంకజొచ్చి యా ♦ యమ నందొశ్కవెడ
యుంచి తననుప్రేమించగ నిర్బం ♦ ధించుచుండె నచట.
పంచవటిని రాఘవు లింటికి జను ♦ దెంచి సీతనచట
గానక వెదకుచు జటాయువును సం ♦ స్కరించి అటనుంచి
కానల బడి దక్షిణదిశ బోయిరి ♦ కరుణంబును మించి;
మహారణ్యముల రాముండటు ల ♦ క్ష్మణునితో జనుచునట
మహాబలుండగు కబంధుని న్దును ♦ మాడి, అతనిమాట
క్రమమున జని ఋశ్యమూకమున గల ♦ కపి సుగ్రీవునితో
సమాగమంబొంది జంపె వాలిని; ♦ సహోదరుని మృతితో
కీశరాజ్యమును బొందగల్గె సు ♦ గ్రీవుం డందులకై
దాశరథికి బ్రత్యుపకారముగా ♦ ధరణిజ వెతకుటకై,

ప్లవగులబంపెను నాల్గువైపుల క ♦ వాచికి నేబోయి
అవనిజను దశాననుండు గొని జనె ♦ నని సంపాతివయి
నము దెల్పగ నేలంక కేగితిని ♦ సముద్రమును దాటి.
త్మజ నందుగని దెల్పి రాముక్షే ♦ మము యథాభూవట్టి
కొసగితి రాముని యంగుళీకమును ♦ కోపముచే లంక
నృసిత మొనర్చితి అశోకవనమును ♦ బాడుజేసి, జనకా
త్మజ పతికిమ్మని యిచ్చిన చూడా ♦ మణినిం గొనివచ్చి
కుజను గాంచివచ్చితినని యాయమ ♦ కుశల మెరింగించి
యొసగితి చూడామణిని రామునకు ♦ యుర్వీధవుడంత
అసురాధిపుడా ఆరావణునితో ♦ వెస యభిసంపాత
మొనరింపగ సంసిద్ధుండై ల ♦ క్ష్మణుడు వెంటనుండ
వనచరసేనలతో సుగ్రీవుడు ♦ అనుగమించుచుండ
యమాశకరుగుచు సహ్యామహేంద్రా ♦ హార్యంబుల గడచి
సముద్రతీరమునందు నిలచె యా ♦ జలధి దాటదలచి.
అసురవిభుని తమ్ముండు విభీషణు ♦ డచటకు యేతెంచి
దశరథాత్మజుని శరణొందెను సో ♦ దరుని పాపువిడిచి.
శ్రీరఘురాముడు నీరధిపై ఘన ♦ వారధి గట్టించి
జేరెను లంకాద్వీపము పారా ♦ వారంబు తరించి
సౌమిత్రి విభీషణ జాంబవ రవి ♦ జాంగదాదులతో శ్రీ
రాముండటు రణమొనర్ప వచ్చిన ♦ రావణుండు అదరి,
దానవముఖ్యుల బంపి శాత్రవుల ♦ దాకెను రణమందు
వానరులును రాక్షసులును జచ్చిరి ♦ వేనవేలు; అందు
కుంభ, నికుంభులు, ప్రజంఘ సుప్త ♦ ఘ్నులును, జంబుమాలి,
కుంభకర్ణ, దేవాంతక, యూపా ♦ క్షులును, మహామాలి,
మహాపార్శ్వ, అతికాయ, త్రిశిర, ధూ ♦ మ్రాక్ష, అకంపనులు,
ప్రహస్త, యుద్ధోన్మత్త, నరాంతక ♦ ప్రఘాస, కంపనులు

సుపార్శ్వ, విద్యుజ్జిహ్వ, నిఘ్నులును ♦ శోణితాక్ష, వికట
తపనేంద్రజిత్తు ల్జంఘ ప్రఘన దు ♦ ర్ధర్షాది నిశాట
ప్రముఖులెందరో సమసిరి; రాక్షస ♦ ప్రభువగు రావణుని
ప్రమథన మొనర్చె శ్రీరఘురాముడు ♦ ప్రతిన మేర కలిని
సీతచేత నగ్నిప్రమాణమును ♦ జేయించి విభుండు
ధాతేశ్వర ఇంద్రాదులచే సం ♦ స్తవముండసి, మృతుడు
దశరథు డటకరుదెంచిన తండ్రిని ♦ దర్శించెను ఘనుడు.
రొసగి విభీషణున కన్నరాజ్యము ♦ ఒదరి రాఘవుండు
ప్రమజానుజ సుగ్రీవ విభీషణ ♦ జాంబవదాదులతో
విమానమునవచ్చి భరద్వాజా ♦ శ్రమమునుండెను; తో
తెంచును రేపిచ్చట కనుచును" సీ ♦ తేశుం డడవిని గా
వించిన పర్యటనంబును; కుజను నా ♦ రించుట నభ్యాగ
మున రాముడు రావణుని వధించుట ♦ మొదలగు విషయములు
వినిపించెను వివరంబుగ, భరతుడు ♦ విని శుభవాక్యములు
సంతోషాన్విత స్వాంతుండై యనె ♦ శత్రుఘ్నున కిటుల
"మంత్రువగ్రజుడు, పూజ్యుడు రాముడు ♦ మహిజాలక్ష్మణుల
గూడివచ్చి భరద్వాజాశ్రమమున ♦ కుశలముగానుండె,
జూడబోవలయు రేపిటకెల్లర ♦ గూడి వచ్చుచుండె.
సరగున సిద్ధమొనర్పుము వలసిన ♦ సంభారముగూర్చి
పుర గో పుర ప్రాకార సౌధ పథ ♦ ముల నలంకరించి
రంగవల్లు లమరంగ వీధులతి ♦ రమ్యంబుగనొప్ప
మంగళవాద్యము లెల్లెడలను పర ♦ మార్థంబును గూర్ప
సురభి గంధపుష్పాదులచే భా ♦ సురమగు చైత్యములు
పరమ సుచిత్రముతో నర్చింపగ ♦ వలయును మానవులు
కర మొప్పగ వైతాళికనూతులు ♦ గణికాసంఘంబు
తరలిరావలెను పొందగ రాముని ♦ దర్శనభాగ్యంబు;

శ్రీరాముం డవతారపూరుషుండు ♦ శ్రీశుడు, విష్ణుండు
ధారయిత్రిసుత సీత లక్ష్మియే ♦ తరింపగను రండు."
అనవిని శత్రుఘ్నుడు భరతాజ్ఞను ♦ అయోధ్యవరకుగల
జనాంతమంతయు నలంకరింపగ ♦ యొనర్చి జనులెల్ల
రను శ్రీరాముని దర్శనార్థమై ♦ రమ్మని దెలిపించె
అనాలస్యుడై అన్నకోరినటు ♦ అన్నియు సమకూర్చె.
భరద్వాజునాజ్ఞంగొని యట పు ♦ ష్పకమున రాముండు
భరతుని త్వరితము గలయగ పయనం ♦ బయ్యెను మరునాడు,
వందిమాగదజనంబులు "జయజయ" ♦ ధ్వనులు జేయుచుండ,
బంధుమిత్రి సామంతపురోహిత ♦ పరిజనములుగూడ,
భూసుర, బాహుజ వైశ్యజఘన్యులు ♦ పొసగి గొల్చుచుండ,
కౌసల్యయు కైకేయి సుమిత్రిలు ♦ కలసి వచ్చుచుండ,
మంగళవాద్యంబులతో, శతాంగ ♦ మతంగ జతురంగ
సంగడములతో, శత్రుఘ్నునితో ♦ సామీరితో, అంగ
రంగవైభవంబులు చెలగంగగ ♦ వంగసవేల్పగు శ్రీ
రంగనిభజించి, శ్రీరఘురాముని ♦ సంగమంబుగోరి,
మహనీయ్య గుణోపేతుండు జటా ♦ మండల మండితుడు
సహోరుః దురుతర తేజుం డుపవా ♦ సకృశుం డనఘుండు
ధర్మకోవిదుడు కైకేయీనం ♦ దనుండు భరతుండు
నిర్మత్సరముతో అన్న పాదుకల ♦ నెత్తినిదాల్చి కడు
భక్తిశ్రద్ధలతో రామునకెదురుగ ♦ బయల్వెడలె నంతే;
వ్యక్తమయ్యెను విమానంబెదురుగ ♦ వచ్చుచున్న మ్రోత
ఆ నినదమువిని పౌరులు కోలా ♦ హలములు గావించె
వానరులు విమానంబున జేయు ర ♦ వంబులు వినిపించె
పుష్కరమార్గంబు గాను వచ్చెడు ♦ పుష్పక మత్తరిని
నిష్కళుండు శ్రీరామునితో గా ♦ న్పించె నందరికిని.

అదిగో రాముడు! అదిగో జానకి ♦ అదిగో లక్ష్మణుడు!
అదిగో శవులని జనములు విహర్ష ♦ మందిరి; భరతుండు
అన్నను పుష్పకమందున గనుగొని ♦ అంజలిగావించి
అన్నా! వచ్చితివా వదునాగ్లేం ♦ డ్లవ యనుగ్రహించి
అనుచు రామునకు బ్రణమిలె బరిశు ♦ ద్ధాత్ముండై; రాము
ననుజ్ఞనుంగొని భూమినివ్రాలెను ♦ అయ్యెడ పుష్పకము.
భరతుండు కుతూహలమున యాపు ♦ ష్పకంబెక్కి అన్న
చరణాబ్జంబులపై వ్రాలిన దా ♦ శరథి కనికరమున
"చిరకాలమునకు నిన్నుగంటి" నని ♦ భరతు లేవనెత్తి
పరిరంభణమొనరించె ప్రమద మొ ♦ ప్పారగ యొడికొత్తి,
సంతుష్టాంత స్స్వాంతుండయె; ల ♦ క్ష్మణుని పూజ వడసి
జంతుమతీ సుతకు మ్రొక్కి భరతుడు ♦ చవలవరుల గలసి
యొకరొకరినిం గౌగలించుకొని ♦ ఉత్సాలంబులకు
ఎకిమీడగు సుగ్రీవునకనె నిటు ♦ లెన్న నీవుమాకు
ఐదవవాడవు సుమ! మానల్గురు ♦ అన్నదమ్ములందు;
నీదుసాయమున గాదె రాము డరి ♦ ని జంపె రణమందు
అనుచు విభీషణుడాసి రాక్షసా ♦ ధ్యక్ష! దాశరథిని
అనుసరించి సాయంబొనరించిన ♦ అనఘుండవు జ్ఞాని
వి, నీదుమిత్రిత్వంబన నెట్టిదొ ♦ విశదమయ్యె మాకు
అనుచు ప్రేమపూర్వకముగ బల్కెను ♦ అంతలొ అన్నలకు
వదినకు శత్రుఘ్నుండు మ్రొక్కె అటు ♦ పై రాముడు లేచి
అదవదనొందెడు ప్రసువా కౌస ♦ ల్యకు నమస్కరించి
సుమిత్రికును కై కేయికిని వశి ♦ ష్ఠుకు వినతిజేసె;
క్షమజ అత్తలకు మ్రొక్కి వారి ఆ ♦ శాసనములు బడసె:
'క్షేమమె రామా' యనుచు జనం బులు ♦ చేతులు ముకుళింప
రాముండు కటాక్షించె నందరను ధయమున భరతుడు, పా

దుకలను భక్తితో దెచ్చి రామచంద్రుని ♦ పదముల జేర్చి
అకల్మషహృదయుండై బల్కెను నిటు ♦ అంజలి గీలించి
"అన్నా నీవరుగుదెంచినాడవు ♦ ఐతి కృతార్థుడను
ఇన్నాళ్లును నేన్యస్తభరుడనై ♦ ఈ నీ రాజ్యమును
రక్షించితి నీకిచ్చుచుంటి నీ ♦ రాజ్యము నీకిపుడు
లక్షణముగ నీవేలుకొనుము ఎ ♦ ల్లర కీవే ఱేడు
వని పల్కెడు భరతుని వాక్యంబులు ♦ విని విభీషణుడును
ఇనజుండును కన్నీరు విడిచి రే ♦ మన, తమయందేటను
అట్టి భ్రాతృభక్తి గలవారలు ♦ అరుదౌటను; అవుడు
తట్టున భరతాదుల గూర్చుండగ ♦ బెట్టి, రాఘవుండు
విమానమందున వడి నందిగ్రా ♦ మమును జేరి పుష్ప
కమును కుబేరుని కడకుంబొమ్మన ♦ గా, నదిజనె, పిదప
అందరు సుఖముగ నందిగ్రామము ♦ నందు గూడుచున్న
సందర్భంబున భరతుండు నమ ♦ స్కరించి రాఘవున
కనెనిట్టుల కైకేయి ప్రీతిబడ ♦ అన్నా గురుయాన
గొని, నాజననికి గల్గినట్టి కో ♦ ర్కెను దీర్పగ, కాన
నంబును దిరుగుచు రాజ్యభారమును ♦ నాపై నుంచితివి
కంబళి మోసెడు భారంబును లే ♦ గదూడ మోయగ పీ
ల్పడునే, ఖరమశ్వంబటు, హంసము ♦ వడువున కాకంబు
పుడమి నెచ్చటైనను గమనించునె ♦ పూజ్య ! నీవిధంబు
వర్ణింపగ నే నెంతటివాడను ♦ వడిగ రాజ్యమునకు
కర్తవుగ నభిషేక మొందుము మన ♦ ఘూ ! దేవా ! నీకు
సమర్పించుచున్నాడ ననగ దా ♦ శరథి ఇయ్యకొనెను
ప్రమదమొంది రాముని సన్నిధిలో ♦ భరతుడు గూర్చొనెను.
క్షూరికులచె శ్రీరామభరత ల ♦ క్ష్మణులకు క్షురకర్మ
పూరగించి భరతుని స్నానంబన ♦ ముందుగ; శ్రీరామ

సామిత్రి శత్రుఘ్నుల తదుపరి ♦ జలకము లాడించి
రామక వస్త్రాభరణాదుల వా ♦ రల నలంకరించి
అవిజ విభీషణ హనుమజ్జాంబవ ♦ దంగదాదులకును
భువనములాడించి యొసంగిరి ఘన ♦ భూషవస్త్రములను.
అపుడు జానకిని అలంకరించిరి ♦ అంబువులాడించి,
కపివనితల తార రుమాదుల జల ♦ కంబుల నాడించి
బహూకరించిరి మాల్యవస్త్ర యా ♦ భరణాదుల నిచ్చి,
మహానందమొంది రెల్లరును రా ♦ మాభిషేకమెంచి.
అచ్చటయోధ్యను రామభద్రప ♦ ట్టాభిషేకమునకు
చెచ్చెర విజయ సుమంత్రి యశోక వ ♦ శిష్టాదులు సమకూ
ర్చిరి వలసిన సంబారంబుల వరి ♦ చరులను బంపించి.
అరదము దేవ సుమంత్రుడు, రాముం ♦ డందారోహించి,
భరతుడు రథసారథియవ, ఛత్రము ♦ బట్టగ శత్రుఘ్ను
డరత లక్ష్మణుడు వ్యజనంబులుగొని ♦ అన్నకు విసరగను
విభీషణుం డొకచామరంబుగొని ♦ వీచుచుండగాను
ఇభములు తొమ్మిదివేలును వాటిని ♦ ఎక్కి మర్కటులును
చపలవిభుడు సుగ్రీవుడు శత్రుం ♦ జయము నెక్కిరాగ
ప్రసన్నులై జనములు మోదక సుమ ♦ ఫలములతో నరుగ
మంగళవాద్యంబులు మ్రోయగ దివ ♦ మం దమరులు బొగడ
అంగ రంగవైభవములు చెలంగ ♦ నరుగుచు, తా, దండ
కాటవిని న్నివసించుట సీతను ♦ అసురవిభుడు గొనుట
పాటిల్లుట సుగ్రీవుతో సఖ్యము ♦ వాలిని వధించుట
క్షమజను వెతకించుట విభీషణుడు ♦ శరణాగతుడగుట
సముద్రమును బంధించుట లంకకు ♦ జని యట సంస్ఫోట
మొనర్చి రావణుని వ్వధియించుట ♦ యుద్విజానుజులతో
జనుదెంచుట యనునవి మంత్రులతో ♦ సంభాషించుచును, తో

## శ్రీరామ పట్టాభిషేకము.

తెంచి యయోధ్యకు, తండ్రిగృహంబున ♦ దిగి, తల్లుల మ్రొక్కి-
పంచెను భరతుని తనస్వగృహమున ♦ నుంచివచ్చుటకు కీ
శేశుండగు సుగ్రీవుని; తదాజ్ఞ ♦ చేకొని భరతుండా
కీశవిభుని గొంపోయి విడచె నా ♦ గృహమున విడిదుండ.
అంతట భరతుడు సుగ్రీవునిగని ♦ అనెనిట్లు కపీశా !
మంతువు రాముని పట్టాభిషేక ♦ మనుష్ఠింపగ, కుశ
ముల దెప్పింపుము అఖిల సరిత్తు స ♦ ముద్రంబులనుండి
కలితన మిందుకు నీకేగలదన ♦ కపీశ్వరుండు వడి
ఘన నవరత్నస్థగిత కాంచన వి ♦ గాఢ ఘటములిచ్చి
ఇనోదయమునకు సకల తీర్థముల ♦ గొని రా శాసించి
గరుడానిల సమవేగులైన నల ♦ గవయ సుషేణులను
మరుమత జాంబవ వేగదర్శులను ♦ యిరువురు ఋషభులను
నాలుగు దిశలకు బంపిన వారిలో ♦ నలుగురు నలుగడల
ఆలాయుంబై పవిత్రతమ మగు ♦ ఐదు నూర్ల నదుల
సలిలంబులదెచ్చిరి మరి నల్వురు ♦ సప్తసాగరముల
ఘనతోయంబులు గొనిదెచ్చిరి ఘన ♦ కాంచనకలశముల.
జలధి నదీ జలములు వచ్చుటగని ♦ శత్రుఘ్నుండలరి
దెలిపి వశిష్టమహర్షికి, బుధులకు ♦ వలసిన సామగ్రి
నంతయు సమగూర్పించెను; ప్రియతుం ♦ డై వశిష్టుడంత
జంతుమతీసురల సమన్వితుడై ♦ జనకజా సమేత
రామభద్రుని వసింపగజేసెను ♦ రత్నపీఠమునను
వామదేవ కాశ్యప వశిష్ట జా ♦ బాలి సుయజ్ఞులును
గౌతమ కాత్యాయన విజయులు నా ♦ గంధజలముతోడ
ప్రీతితో రాముని కభిషేకించిరి ♦ వెనుకను ఆఖండ

లునికి వసువులెనమం డభిషేకం ♦ బొనరించినయటుల.
వెనుక, ఋత్విజులచేతను పిమ్మట ♦ ద్విజులచె, కన్నియల
చే, సచివులచే, పురజనయోధుల ♦ చే, యభిషేకముల
దాశరథికి జేయించిరి; దివమం ♦ దమరులు దిక్పాలా
న్వితులై సర్వౌషధి రసములచే ♦ విహర్షులై సీతా
పతి కభిషేక మొనర్చిరి; తదువరి ♦ పితామహ నిర్మిత
ఘన నవరత్న కిరీటంబెయ్యది ♦ మనువుదాల్చి తలను
మును అభిషిక్తుండయెనో తదాది ♦ ఇనకులనృపు లిలను
వరుసగ నభిషిక్తులైరో ఆపా ♦ వనమకుటము దెచ్చి
బరగ వశిష్టుడు శ్రీరఘురాముని ♦ శిరమందునయుంచి
అభిషేకించెను ఋత్విజఋషులతో ♦ ఆశీశులబల్కి.
శుభ వాద్యరవంబుల సభికుల హ ♦ ర్షోద్ఘుంబుల ధ్వనికి
ప్రతిధ్వానములు చెలంగె దిశల య ♦ వ్వట శతృఘ్నుండు
సితఛత్రం బగ్రజునకుబట్టెను ♦ శ్వేత వ్యజనమొండు
బట్టివీచె సుగ్రీవుడు రాక్షస ♦ పతి చామర మొండు
తట్టున నిలబడి వీచెను దశరథ ♦ వట్టికి, ఇంద్రుండు
చంచత్కనక విరాజమానమగు ♦ శతపుష్కరమాల
బంచిన, వాయువుదెచ్చి రాము క ♦ ర్పించెను; మరియు బలా
రాతి బంపె యొకముక్తాహారము ♦ రాముని గళమునిడ.
సీతారాముం డవ్విధముగ నభి ♦ షేకమొందుచుండ
బాడిరి హాయిగ గంధర్వులు య ♦ ప్సరోజనులు చదల
నాడిరి; ధారుణిఅయ్యె సస్యవతి ♦ అనోకహములు ఫల
వంతములయ్యెను పరిమళించె పు ♦ ష్పములు మనోజ్ఞముగ.
మంతువు శ్రీరాముడు సంతసముతో ♦ మహోక్షజ తురంగ
గో వస్త్రాభరణ హేమములు భూ ♦ దేవుల కొసంగి, సు
గ్రీవుని కాంచనమాలతో బహూక ♦ రించి రత్నభాసు

రంబగు అంగద మంగదు కొసంగె ♦ రాక్షసేశ్వరునకు
అంబుజగర్భుని తిరువారాధన ♦ మై ఇక్ష్వాకునకు
సంభావింపగబడి తదాది దా ♦ శరథియింట సంపూ
జ్యంబగుచుండిన శ్రీరంగవిమా ♦ నంబును రాము డవు
డాదరణంబుగ నిచ్చెను; ముక్తా ♦ హారమొండువిత్ని
వైదేహికొసంగెను మారుతికి ♦ వ్వంగదలచి, దాని
న్ధరణిజ రాముని హృదయంబారయ ♦ హరులను రాఘవుని
మరిమరిజూడగ రాముడు జానకి ♦ మనంబు దెలుసుకొని
అనెనిటు "కాంతా ! నీకెవ్వనికి ♦ వ్వనుగలదో మనము
ఘన మతి బల విక్రమములుగల యా ♦ తని నారసి యిమ్మ"
నావిని జానకి ముక్తాహారము ♦ పావని మెడనునిచె
భూవరుండు తగినటు భల్లూకవి ♦ భుని సన్మానించె,
నల నీల గవాక్ష ద్వివిద సుషే ♦ ణాది కపుల కవుడు
విలువగు వస్త్రాభరణములొసంగె ♦ నలరుచు రాముండు,
తక్కినకపులకు బంధుమిత్రులకు ♦ దాసుల దాసిలను
మక్కువతో గౌరవించె రాముడు ♦ మహిజ స్వయముగాను
తార రుమాది ప్లవంగకాంతలం ♦ దరను ముదము మించి
గారవించె రత్నాంబర శృంగీ ♦ కనకంబుల నిచ్చి.
శ్రీరాముని పట్టాభిషేకమటు ♦ జేయగ వీక్షించి
గౌరవింపబడి రాముని యనుమతి ♦ గని కుతుకము మించి
సతులగూడి రవిజాది మర్కటులు ♦ సాకేతము విడిచి
ప్రతివర్తను లయ్యిరి కిష్కింధకు ♦ రాక్షసవిభుడు సచి
వులతో శ్రీరంగవిమానముగొని ♦ అల లంకాపురికి
అలరుచు వెడలెను. శ్రీరఘురాముం ♦ డంత లక్ష్మణునికి
యువరాజత్వం బివ్వదలచిన ♦ యూర్మిళావిభుండు,
నవదరింప తద్భార మగ్రజుడు ♦ సమర్థు డర్హుండు

భరతుడెగావున తానొల్లనుయని • బల్కె రాముడంత
భరతుని రాజకునింగా యొనర్చి • ధరణిజాత భ్రాతా
న్వితుడై పాలన మొనర్చుచుండెను • హితముగ నెల్లరికి.
పతితపావనుండగు శ్రీరాముని • కత, మునివాల్మీకి
రచించి నవరసములొల్క శ్రీమ • ద్రామాయణ మనగ
మచర్చికంబగు తత్కథనేర్పెను • మాకు ము క్తికలుగ
పరిచారించి రండని బంపెను తా • పస వర్యుడు మహాత్మ
రచనను; బాడితిమయ్యా"యని శ్రీ • రామచంద్రుని సమ
క్షంబున కుశలవు లీరామకథ • న్గానం బొనర్చిరి.
కుంభిని శ్రీరాముడు పదివేల • బ్ధంబులు వెలసి బరి
పాలనమొనర్చి అశ్వమేధములు • పౌండరీకములను
చాలజేసె బహువిధాధ్వరంబులు • సలిపి ధన్యుడయెను.
శ్రీరాముండు దయాళుడు, సుగుణి, యు • దారు డనఘు డేక
దారావ్రతుండు, ఆశ్రితజన వ • త్సలుండు లోకైక
పూజ్యుడు, బలవిక్రమసంపన్నుడు • భూపుడు, రాఘవుని
రాజ్యంబున ప్రజలెల్లరు సుఖులై • రమా యుమా వాణీ
కృపాబాత్రులై రంజిల్లిరి కా • ల్యపి ఫలవంతమయె.
పరిపూతలై యోషిత్తులు వైధ • వ్యంబు నెరుగరయ్యె.
విగతశోకభయరోగులు జనములు • విహర్షమానసులు
తగవులాడ రనృతంబుబల్కరు • ధర్మపరాయణులు
పేతకార్యములు జేయరు వృద్ధులు • పిన్నవారి కెపుడు,
నీతి నీమములు గల్గి మానవులు • నిమ్కలులైయుండు.
రామరాజ్యమునకు సమమైనది • భూమినిలేదెందు,
"రామ రామ" యని కేరలుదురెల్లరు • రామరాజ్యమందు.
ఆదికావ్యమై, వేదోప బృం • హణమై, భవ్యంబై,
ఆదరణీయంబై వాల్మీకి మ • హర్షి విరచితంబై"

కవలలచే శ్రీరామునిసన్నిధి ♦ గాన మొనర్పబడి
స్వవిషయంబై శ్రీరామునిచే ♦ పరిష్కరింపబడి
త్రేతా ద్వాపర యుగములు చెల్లగ ♦ స్థిరమై కలివరకు
ఖ్యాతంబై, పూతంబై మంగళ ♦ కరమై, భక్తులకు
తారకమై, విలసిలు రాముని చరి ♦ తామృతంబు గ్రోల
ఆరోగ్యైశ్వర్యాయుర్వృద్ధుల ♦ నందుదు రెల్ల రిల.
శ్రీరాముని చరితంబు వినిన వ్రా ♦ సిన, పఠియించిననూ
ధారుణికామ్యములంది కడను శ్రీ ♦ ధవు సాయుజ్యమును
బొందుదు రెవరైనగాని పూరుష ♦ స్త్రీ భేదము లేక
కందువులైనను వృద్ధులైన య ♦ గ్రజా యధము లనక.
"రామరామ శ్రీసీతారామా ♦ రామరామ యనుడీ
రామయనెడు తారకమంత్రామృత ♦ రసముగ్రోలి మనుడీ.
శ్రీరామహరే, రఘురామహరే ♦ సీతారామహరే,
తారకనామహరే రామహరే ♦ దశరథరామహరే",
రంగాచార్యుడ, రాముని దాసుడ ♦ రసను కాకినాడ
నుంగాయత్రీ నిలయనివాసుడ ♦ నుం గన అజ్ఞుండ,
రామునికృప రామాయణగానము ♦ వ్రాయగల్గినాడ
ప్రేమనెల్లరును దీనిన్బఠింప ♦ వేడుచున్నవాడ.
మంగళంబు జయమంగళంబు రా ♦ మా రఘుకులసోమా!
మంగళంబు శుభమంగళంబు గొను ♦ మా తారకనామా.

---

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళం.

ఓం శ్రీసీతాలక్ష్మణహనుమత్సమేత శ్రీరామచంద్రార్పణమస్తు.

ఓం తత్సత్

---

" శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్ర నామ తత్తుల్యం రామ నామ వరాననే ".

శ్రీరామపరమాత్మనే నమః

# శ్రీ రామాష్టోత్తర శతనామావళిః

ఓం శ్రీరామాయ నమః
రామభద్రాయ నమః
రామచన్ద్రాయ నమః
శాశ్వతాయ నమః
రాజీవలోచనాయ నమః 5
శ్రీమతే నమః
రాజేన్ద్రాయ నమః
రఘుపుఙ్గవాయ నమః
జానకీవల్లభాయ నమః
జైత్రాయ నమః 10
జితామిత్రాయ నమః
జనార్దనాయ నమః
విశ్వామిత్రప్రియాయ నమః
దాన్తాయ నమః
శరణత్రాణతత్పరాయనమః 15
వాలిప్రమథనాయ నమః
వాగ్మినే నమః
సత్యవాచే నమః
సత్యవిక్రమాయ నమః
సత్యవ్రతాయ నమః 20
వ్రతధరాయ నమః
సదాహనుమదాశ్రితాయనమః
కౌసలేయాయ నమః
ఖరధ్వంసినే నమః
విరాధవధపండితాయనమః 25

ఓం విభీషణపరిత్రాత్రే నమః
హరకోదణ్డఖణ్డనాయ నమః
సప్తసాలప్రభేత్త్రే నమః
దశగ్రీవశిరోహరాయ నమః
జామదగ్న్యమహాదర్ప
దళనాయ నమః 30
తాటకాన్తకాయ నమః
వేదాన్తసారాయ నమః
వేదాత్మనే నమః
భవరోగస్య భేషజాయ నమః
దూషణత్రిశిరోహంత్రేనమః 35
త్రిమూర్తయే నమః
త్రిగుణాత్మకాయనమః
త్రివిక్రమాయ నమః
త్రిలోకాత్మనే నమః
పుణ్యచారిత్రకీర్తనాయనమః 40
త్రిలోకరక్షకాయ నమః
ధన్వినే నమః
దణ్డకారణ్యకర్తనాయ నమః
అహల్యాశాపశమనాయనమః
పితృభక్తాయ నమః 45
వరప్రదాయ నమః
జితేన్ద్రియాయ నమః
జితక్రోధాయ నమః
జితామిత్రాయ నమః
జగద్గురవే నమః 50

ఓం ఋక్షవానరసంఘాతినే నమః
చిత్రకూటసమాశ్రయాయనమః
జయన్తత్రాణవరదాయనమః
సుమిత్రాపుత్రసేవితాయనమః
సర్వదేవాదిదేవాయనమః 55
మృతవానరజీవనాయ నమః
మాయామారీచహన్త్రేనమః
మహాదేవాయ నమః
మహాభుజాయ నమః
సర్వదేవస్తుతాయ నమః 60
సౌమ్యాయ నమః
బ్రహ్మణ్యాయ నమః
మునిసంస్తుతాయనమః
మహాయోగినే నమః
మహోదారాయ నమః 65
సుగ్రీవేప్సితరాజ్యదాయనమః
సర్వపుణ్యాధికఫలాయ నమః
స్మృతసర్వాఘనాశనాయ నమః
ఆదిపురుషాయ నమః
పరమపురుషాయ నమః 70
మహాపురుషాయ నమః
పుణ్యోదయాయ నమః
దయాసారాయ నమః
పురాణపురుషోత్తమాయ నమః
స్మితవక్త్రాయ నమః 75
మితాభాషిణే నమః
పూర్వభాషిణే నమః
రాఘవాయ నమః
అనన్తగుణగంభీరాయ నమః
ధీరోదాత్తగుణోత్తమాయనమః

ఓం మాయామానుష
చారిత్రాయనమః
మహాదేవాదిపూజితాయనమః
సేతుకృతే నమః
జితవారాశయే నమః
సర్వతీర్థమయాయ నమః 85
హరయే నమః
శ్యామాఙ్గాయ నమః
సున్దరాయ నమః
శూరాయ నమః
పీతవాససే నమః 90
ధనుర్ధరాయ నమః
సర్వయజ్ఞాధిపాయ నమః
యజ్వనే నమః
జరామరణవర్జితాయ నమః
విభీషణప్రతిష్ఠాత్రే నమః 95
సర్వాపగుణవర్జితాయ నమః
పరమాత్మనే నమః
పరంబ్రహ్మణే నమః
సచ్చిదానంద విగ్రహాయ నమః
పరంజ్యోతిషే నమః 100
పరంధామ్నే నమః
పరాకాశాయ నమః
పరాత్పరాయ నమః
పరేశాయ నమః
పారగాయ నమః 105
పారాయ నమః
సర్వదేవాత్మకాయ నమః
పరాయ నమః 108

ఇతి శ్రీరామాష్టోత్తర శతనామావళిః సమాప్తా.